# సామ్రాజ్యవాదం

(వార్గా వ్రాసిన అదనపు సమాచారంతో సహా)







రచయిత

లెనిన్



ప్రజాశక్తి కార్యాలయం బెజవాడ

# సామ్రాజ్యవాదం

లెనిన్



●

అనువాదం

మద్దుకూరి చంద్రశేఖరరావు

కంభంపాటి సత్యనారాయణ

(జూనియర్)

●

ప్రజాశక్తి కార్యాలయం

:: బెజవాడ ::

# ముందు మాదొక మనవి

మార్క్సు వ్రాసిన 'కేపిటల్' పెట్టుబడిదారీ విధానాన్ని సాకల్యంగా శాస్త్రీయ దృక్పథంతో చర్చించిన గ్రంథం; అది 19వ శతాబ్దానికంతకు ఉత్తమగ్రంథమని చెప్ప వచ్చును. అలాగే లెనిన్ వ్రాసిన 'సామ్రాజ్యవాదం' పెట్టుబడిదారీ విధానంయొక్క అంతిమదశఅగు 'మానోపలీకేపిటల్' 'ఫైనాన్షియల్ కేపిటల్'ను గురించి శాస్త్రీయ దృక్పథంతో చర్చించుతుంది. పెట్టుబడిదారీ విధానంయొక్క ప్రస్తుతదశలో ప్రపంచంలో జరుగుతున్న ఘటనలన్నిటినీ అర్థంచేసికోడానికి, ఆర్థిక సంక్షోభాలు, యుద్ధాలకు మూల కారణాలను తెలిసికోడానికి యీగ్రంథం ఉపయోగించుతుంది. అందుచే ప్రస్తుత ప్రపంచ గతిని స్పష్టంగా అర్థంచేసికోడానికి లెనిన్ వ్రాసిన 'సామ్రాజ్యవాదం' అత్యుత్తమ గ్రంథ మని చెప్పవచ్చు.

'సామ్రాజ్యవాదం' పుస్తకాన్ని లెనిన్ 1917 లో ప్రకటించాడు. తరువాత 25 సంవత్సరాలు గడిచిపోయాయి. ప్రపంచంలో ఆరవభాగం పెట్టుబడిదారీ విధానాన్ని కూల ద్రోసి సోషలిస్టు సమాజాన్ని స్థాపించింది. మిగతా పెట్టుబడిదారీ ప్రపంచమంతా ఆర్థిక సంక్షోభం, నిరుద్యోగం వగైరాలతో కుములుతూవుంటే, సోషలిస్టుప్రపంచమైన సోవియట్ యూనియన్ నూతన నాగరికతను, ప్రజలందరికి సౌఖ్యప్రదమైన సమాజాన్ని నిర్మించు తూంది. వెనుకబడివున్న దేశాన్ని అత్యున్నతదశకు తీసుకువచ్చింది. గత 20 సంవత్స రాల చరిత్రకూడ 'సామ్రాజ్యవాదం' శిథిలావస్థలోవున్న పెట్టుబడిదారీ విధానంయొక్క అంతిమదశ ఎలాగో రుజువుచేసింది.

అందుచే లెనిన్ వ్రాసిన 'సామ్రాజ్యవాదాని'కి అనుబంధంగా "వార్గా" వ్రాసిన అదనపు సమాచారాన్నికూడా చేర్చి యీ పుస్తకంలో ప్రకటించుతున్నాము. చివర యివ్వ బడిన 'వార్గా' లెఖ్కలు, వివిధవిషయాలు లెనిన్ సిద్ధాంతాలను బలపరచే అదనపు సమాచారమని చెప్పవచ్చు. అవి పెట్టుబడిదారీ విధానంయొక్క అంతిమదశ అయిన సామ్రాజ్యవాదంయొక్క శిథిలావస్థను తేటతెల్లం జేస్తాయి.

ఇలాంటి ఉత్తమగ్రంధాన్ని తెలుగుపాఠకులకు అందజేయడంలో ప్రజాశక్తి ప్రచుర ణాలయం ఒక ముఖ్యమైన బాధ్యతను నెరవేర్చవలసివుంది. తెలుగులో ఆర్థిక—రాజకీయ శాస్త్రాలకు సంబంధించిన గ్రంథాలు బహుఅరుదుగా వున్నాయి. అందుచే ఆర్థికశాస్త్రంలో సాధారణంగా దొర్లే పారిభాషికపదాలు తెలుగులో వాడుకలోలేవు. అనేక ఇంగ్లీషుపదాలకు సరిపోయే తెలుగుపదాలుకూడ లేవు. అందుచే యిలాంటి ముఖ్యగ్రంధాన్ని తెలుగులోనికి అనువదించడంలో అనేక కష్టాలను సహజంగా ఎదుర్కోవలసివస్తుంది. మామూలుగా

వాడబడే పదాలనుతప్ప యితర ఇంగ్లీషు పారిభాషికపదాలను అలాగే తెలుగులోకి దొర్లించితే యింగ్లీషురాని పాఠకునికి అర్థంకాదు. ఇంగ్లీషు పదంయొక్క అర్థానికి సరిపోయే ఏ సంస్కృత పదజాలాన్నో ఉపయోగించినా ప్రయోజనముండదు. అందుచే పారిభాషిక పదాలకు సందర్భానుసారంగా అర్థాన్ని వివరించవలసివుంటుంది. అనువాదకులు అలా చేయడానికి ప్రయత్నించారు.

ఐనప్పటికి సాధారణ తెలుగుపాఠకునికి తెలియని అనేకపదాలు యీ పుస్తకంలో వచ్చాయి. వాటికి అర్థాలను యీ పీఠికలో యిస్తున్నాము. పాఠకులు తెలియనిపదాలను అర్థంచేసికోడానికి యిది ఉపయోగపడుతుందని ఆశింమతాము. పాఠకులకు అనువాదం అర్థం చేసికోడానికి ఇంకా అనేక యిబ్బందులు రావచ్చును. వాటిని మాకు తెలిపినచో రెండోకూర్పులో వాటిని సవరించుతాము. అలాగే ఇంగ్లీషుభాష తెలిసి, కమ్యూనిజంపై అభిమానమున్న మిత్రులుకూడ అనువాదంలో తమకు తోచినలోట్లను, తాముసూచించే సవరణలనుకూడ మాకుతెలిపి సాయపడవలెనని కోరుతున్నాము. వాటిని రెండవకూర్పులో సవరించుకోడానికి ప్రయత్నించుతాము.

ఇట్లు
సంపాదకవర్గం

# పారిభాషిక పదాలు

Capitalism = కేపిటలిజం — పెట్టుబడిదారీవిధానం.

Captitalist = కేపిటలిస్టు — పెట్టుబడిదారుడు — ఇతరులశ్రమనుండి లాభంపొందేవాడు.

Bourgeoisie = బూర్జువాజీ — పెట్టుబడిదారులు.

Bourgeois Economist = బూర్జువా ఎకనామిస్టు — పెట్టుబడిదారీ విధానాన్ని సమర్థించే అర్థికవేత్త.

Banking Capital = బ్యాంకింగు కేపిటల్ } బ్యాంకుల పెట్టుబడి
Finance Capital = ఫైనాన్స్ కేపిటల్ } వడ్డీవ్యాపారానికి వినియోగించే పెట్టుబడి.

Imperialism = సామ్రాజ్యవాదం } పెట్టుబడిదారీవిధానం యొక్క అంతిమదశ.
Imperialists = సామ్రాజ్యవాదులు }

Production = ప్రొడక్షన్ — ఉత్పత్తి - సరకులను తయారు చేయుట.

Means of Production = ఉత్పత్తిసాధనాలు — సరుకులను తయారుచేయడానికి వినియోగించే పనిముట్లు, నాగలి-రాట్నం, యంత్రాలు, మిల్లులు, భూమి వగైరా

Forces of Production = ఉత్పత్తిశక్తులు — ఉదాహరణకు:-యంత్రాలు, కార్మికులు

Production Relations = ఉత్పత్తిసంబంధాలు. అనగా కార్మికులు యజమానుల మధ్య సంబంధాలు.

Free Competetion period = ఫ్రీకాంపిటీషన్‌దశ — స్వేచ్ఛావ్యాపారదశ-పెట్టుబడి దారీ విధానంయొక్క మొదటిదశను యీపేరుతో పిలుస్తారు.

Monopoly Capitalism = మానొపలీ కేపిటలిజం — గుత్తవ్యాపారదశ - పెట్టుబడి దారీ విధానంయొక్క అంతిమదశను యీపేరుతో పిలుస్తారు. దీనినే సామ్రాజ్య వాద దశ అంటారు.

Monopolies, Combines, } మానొపలీలు, కంబైన్లు
Cartels, Trusts, Corporations } కార్టెల్సు, ట్రస్టులు, కార్పొరేషన్సు }
గుత్తవ్యాపార సంస్థలు, అనేక కంపెనీలుకలసి వ్యాపారపోటీ లేకుండా లాభాలు పంచుకోడానికి ఇలా ఏర్పడుతాయి.

Undertakings } వ్యాపారసంస్థలు
enterprises } పారిశ్రామిక సంస్థలు లేక కంపెనీలు

Patentes = పేటెంటులు, నమూనాలు, పరిశోధనద్వారా కొత్తగాకనిపెట్టబడిన పరికరాలు

Technical improvements = టెక్నికల్ అభివృద్ధి అనగా – యంత్రాలు, పనిముట్లలో అభివృద్ధి.

Crisis period = సంక్షోభదశ – ఆర్థికదుస్థితిరోజులు, ఖరీదులు పడిపోయినరోజులు.

Boom period = సుభిక్షదశ – వ్యాపారం లాభసాటిగా జరుగుతున్న రోజులు–హెచ్చు ఖరీదులకు అమ్ముడుపోయేరోజులు.

Inflation = కర్రెన్సీ చెలామణి ఎక్కువై, డబ్బువిలువ తగ్గడం – వస్తువుల ఖరీదు విపరీతంగా పెరిగి డబ్బు విలువ పడిపోవడం.

Super imperialism = అతీత సామ్రాజ్యవాదం– అంతర్జాతీయట్రస్టులు, మానోపలీలు ఏర్పడి ప్రపంచమార్కెట్టును పంచుకొనే విధానం.

Colonies = కాలనీలు ; వలసదేశాలు – బానిసదేశాలు.

# గ్రంథకర్త ఉపోద్ఘాతం

పాఠకులకు అందించుతున్న యీపుస్తకం 1916 వసంతకాలంలో జూరిచ్ నగరంలో వుండగా వ్రాయబడింది. అపుడున్న క్లిష్టపరిస్థితులలో ఇంగ్లీషు, ఫ్రెంచి, రష్యన్ సాహిత్యంలోని కొన్ని గ్రంథాలు నాకు దొరకలేదు. జె. ఎ. హాబ్సన్ సామ్రాజ్యవాదంపై వ్రాసిన ఇంగ్లీషు పుస్తకంలోని విషయాలను జాగ్రత్తగా ఉపయోగించుకొన్నాను.

నిరంకుశాధికారుల సెన్సార్‌షిప్ క్రింద నేను యీ పుస్తకాన్ని వ్రాశాను. అందుచే కేవలం ఆర్థిక విషయాలను, వాస్తవికఘటనలను శాస్త్రీయ దృక్పథంతో పర్యాలోకన చేయడంమాత్రమే సాధ్యమయింది. రాజకీయదృష్టితో పరిశీలించడం తప్పనిసరి అయినపుడు డొంకతిరుగుడు పద్ధతిని అస్పష్టంగామాత్రమే వ్రాయవలసివచ్చింది. జారుప్రభుత్వ సెన్సార్‌షిప్‌ను తప్పించుకోడానికి విప్లవకారులు అలా వ్రాయవలసివచ్చేది.

స్వేచ్ఛా — స్వాతంత్ర్యాలున్న యీరోజులలో సామ్రాజ్యవాదుల సెన్సార్‌షిప్‌ను తప్పించుకోడానికి వ్రాసిన యీ రచనలను చదవడం కష్టంగావుంటుంది. సామ్రాజ్యవాదం సోషలిస్టువిప్లవానికి ఎలా దారితీస్తుందో, సోషలిస్టులమని చెప్పుకొంటూ కొందరు ఎలా జాతీయ దురహంకారాన్ని ప్రోత్సహించుతున్నారో, కార్మికోద్యమంలో చీలికలుకూడ ఎలా సామ్రాజ్యవాద పరిస్థితుల యొక్క ప్రతిబింబమో వివరించడంలోను బానిసలభాష ఉపయోగించవలసి వచ్చింది. అందుచేత యీ సమస్యలను గురించి యింకా తెలిసికోదలచినవారు నేను విదేశాలలో వుండగా 1914-17 మధ్య వ్రాయబడి యిపుడు పునర్ముద్రించ బడిన Against the Stream (ప్రవాహానికి ఎదురీత) అనే గ్రంథాన్ని చదువమని కోరుతాను.

ఇంకో విషయంకూడ తెలుపవలసివుంది. 9 వ అధ్యాయం చివర సోషలిస్టులమని చెప్పుకొంటూ జాతీయ దురహంకార దృష్టితో తమదేశాలు యితర దేశాలను ఆక్రమించుకోడాన్ని సమర్థించిన ద్రోహులను, పెట్టుబడిదారుల కుంటి సమర్థనలను - నేను సెన్సార్‌షిప్‌ను తప్పించుకోడానికి - స్పష్టంగా బట్టబయలు చేయలేదు. ఉదాహరణగా జపానును చెప్పివూరుకొన్నాను. అందుచే పాఠకులు జపాను స్థానే రష్యానువుంచి అన్వయం చేసికోవాలి.

ఈ చిన్ని పుస్తకం ప్రధాన ఆర్థిక సమస్యను అర్థంచేసికోడానికి పాఠకులకు వినియోగించుతుందని ఆశించుతాను. ఈ మూలసమస్యను అర్థంచేసికొంటేనే ప్రస్తుత యుద్ధాలకు కారణాలు బోధపడుతాయి. రాజకీయాలు అర్థమవుతాయి. సామ్రాజ్యవాదం యొక్క స్వభావం తేటతెల్లమవుతుంది.

లెనిన్‌గ్రాడ్
1917 ఏప్రిల్ 17 } వి. ఐ. లెనిన్.

# విషయసూచిక


| | | పేజీ |
|---|---|---|
| ఉత్పత్తి కేంద్రీకరణ | .... | 1 |
| బ్యాంకులు - వాటి కొత్తపాత్ర | .... | 14 |
| ఫైనాన్సు పెట్టుబడి - ఫైనాన్షియల్ పెత్తందార్లు | .... | 28 |
| పెట్టుబడిని ఎగుమతిచేయడం | .... | 40 |
| సామ్రాజ్యవాద గ్రూపులమధ్య ప్రపంచ విభజన | .... | 45 |
| పెద్ద సామ్రాజ్యవాదులమధ్య జరిగిన ప్రపంచవిభజన | .... | 53 |
| సామ్రాజ్యవాదం - పెట్టుబడివిధానంలో ఒక ప్రత్యేకదశ | .... | 65 |
| పరాన్నభుక్కుతత్వం; పెట్టుబడివిధానంయొక్క క్షీణత | .... | 77 |
| సామ్రాజ్యవాదంయొక్క విమర్శనా పరిశీలన | .... | 87 |
| చరిత్రలో సామ్రాజ్యవాదానికిగల స్థానం | .... | 101 |
| ఆధునిక పెట్టుబడివిధానంయొక్క సంక్షోభాన్నిగూర్చి ఆధారాలు, లెక్కలు | .... | 107 |

# ఉత్పత్తి కేంద్రీకరణ — గుత్తవ్యాపారం

పెట్టుబడిదారీ విధానంయొక్క లక్షణాలలో ఒకటి కేంద్రీకరణ. పరిశ్రమలు వృద్ధి పొందేకొలదీ ఉత్పత్తి కేంద్రీకరించబడుతుంది. ఉత్పత్తి క్రమంగా బ్రహ్మాండ మైన వ్యాపార సంస్థల అధీనమవుతుంది. ఆధునిక పరిశ్రమలను గురించిన లెఖ్ఖలను పరిశీలించితే యీ కేంద్రీకరణ ఎంత త్వరగా జరుగుతూందో బోధపడుతుంది.

ఉదాహరణకు జర్మనీని చూదాం. 50 మంది కార్మికులకంటే హెచ్చుమంది పని జేసే వాటిని పెద్ద పరిశ్రమల క్రింద లెఖ్ఖకడదాం. 1882 నాటికి జర్మనీలో వెయ్యి పరిశ్రమలలో మూడు మాత్రమే పెద్దవి. 1895 నాటికి వెయ్యింటికి ఆరు పరిశ్రమలు పెద్దవి. 1907 నాటికి వెయ్యింటికి 9 పెద్ద పరిశ్రమలు అయ్యాయి. 1882 నాటికి దేశంలోని కార్మికులలో పెద్ద పరిశ్రమలు నూటికి 22 మందిని పనిలో పెట్టుకొన్నాయి. 1895 నాటికి నూటికి 30 మంది. 1907 నాటికి నూటికి 37 గురు కార్మికులు పెద్ద పరిశ్రమలలో పనిచేసేవారు. ఈవిధంగా జరుగుతున్న కార్మికుల కేంద్రీకరణకంటే కూడ ఉత్పత్తి కేంద్రీకరణ యింకా తీవ్రంగా జరుగుతోంది. ఏమంటే పెద్ద పరిశ్రమలలో మనుష్యుని శ్రమ మరింత హెచ్చు ఉత్పత్తి చేయగలుగుతుంది. స్టీమ్‌యింజన్లు (ఆవిరియంత్రాలు), ఎలెక్ట్రిక్ మోటార్లకి సంబంధించిన లెఖ్ఖలను చూస్తే యీ విషయం స్పష్టంగా తెలుస్తుంది. జర్మనీలో పరిశ్రమలు అనే పదం విశాలమైన అర్థంలో వాడబడుతోంది. వర్తకం, రహదార్లకు కూడా వర్తించుతుంది.

జర్మనీలో మొత్తం 32,65,623 పరిశ్రమలలోనూ 30588 పెద్దవి అనగా నూటికి 9 పెద్ద పరిశ్రమలన్నమాట. ఈ పెద్ద పరిశ్రమలలో 57 లక్షల కార్మికులు పనిచేస్తున్నారు. మొత్తం కార్మికుల సంఖ్య 1 కోటి 44 లక్షలు. అనగా నూటికి 39.5 కార్మికులు పెద్ద పరిశ్రమలలో పనిచేస్తున్నారన్నమాట. దేశం మొత్తంమీద 88 లక్షల హార్సుపవర్ వినియోగించబడుతూంటే యీ పెద్ద పరిశ్రమలే 66 లక్షల హార్సుపవర్‌ను వినియోగించుతున్నాయి. అనగా నూటికి 75 హార్సుపవర్‌ను పెద్ద పరిశ్రమలు వినియోగించుతున్నాయి. దేశం మొత్తంమీద 15 లక్షల కిలోవాట్ల విద్యుచ్ఛక్తిని వినియోగించుతూంటే అందులో పెద్ద పరిశ్రమలు 12 లక్షల కిలోవాట్లను అనగా నూటికి 80 వంతులు ఎలెక్ట్రిసిటీని ఉపయోగించుతున్నాయి.

జర్మన్ పరిశ్రమల సంఖ్యలో నూరోవంతులేని పెద్ద పరిశ్రమలు మొత్తం స్టీమ్ పవర్, ఎలెక్ట్రిక్ పవర్‌లో ముప్పాతిక భాగాన్ని వినియోగించుకొంటున్నాయి. మొత్తం పరిశ్రమలలో నూటికి 91 వున్న 21 లక్ష 97 వేలు చిన్న పరిశ్రమలు నూటికి 7 వంతులు పవర్‌ను మాత్రమే వినియోగించుకొంటున్నాయి. కొలదివేలు మాత్రమే వున్న పెద్ద పరిశ్రమలముందు లక్షలకొలదీవున్న చిన్న పరిశ్రమలు ఎందుకూ కొరగావు.

1907 నాటికి జర్మనీలో నూరుమందిపైగా కార్మికులు పనిచేసే పరిశ్రమలు 586 వున్నాయి. అవి మొత్తం కార్మికులలో నూటికి 10 మందిచే (అనగా 13 లక్షల 80 వేల మందిచే) పనిచేయించుకొంటున్నాయి. మొత్తం పవర్‌లో మూడవవంతును (నూటికి 32ను) వినియోగించుతున్నాయి. వడ్డీవ్యాపారస్తులు (ఫైనాన్సు కేపిటలు), బ్యాంకులు యీ ఆధిక్యతను మరింత హెచ్చుచేస్తాయి. పెద్ద పరిశ్రమలక్రింద చిన్న పరిశ్రమలు నలిగిపోతాయంటే ఆశ్చర్యంలేదు. లక్షలకొలది కార్మికులు, చిన్నజీతగాళ్ళు, పెద్దజీతగాళ్ళు లక్షలకొలదిమంది కొలది వందల కోటీశ్వరులయిన ధనస్వాములకు హస్తగతమవుతారు.

పెట్టుబడిదారీ విధానం బాగా వృద్ధిచెందిన మరోదేశమైన అమెరికా సంయుక్త రాష్ట్రాలను చూదాం. ఇచట ఉత్పత్తి కేంద్రీకరణ మరింత హెచ్చుగా జరిగింది. 1904 లో యునైటెడ్ స్టేట్సులో 10 లక్షల డాలర్ల విలువగల సరుకును ఉత్పత్తి చేసేసంస్థలు 1900 వున్నాయి. మొత్తం పరిశ్రమలు 216,180 లోనూ నూటికి ఒకటికి లోపు అనగా .9 వున్నాయన్నమాట. మొత్తం దేశంలో వున్న 55 లక్షల కార్మికులలోను యీ పెద్ద పరిశ్రమలలో 14 లక్షలు పని చేస్తున్నారు. అనగా నూటికి 38 అన్నమాట. దేశంలో మొత్తం 1480 కోట్ల డాలర్ల విలువగల సరుకు ఉత్పత్తి అవుతూంటే పెద్ద పరిశ్రమలలో 560 కోట్ల డాలర్ల విలువగల సరుకు ఉత్పత్తి అవుతూంది. అనగా మొత్తం ఉత్పత్తిలో నూటికి 38 వంతులు పెద్ద పరిశ్రమల హస్తగత మయిందన్నమాట. ఐదు సంవత్సరాల అనంతరం 1909 లో లెఖ్ఖలు యీ విధంగావున్నాయి.

మొత్తం 268,491 పరిశ్రమలలో 3060 పెద్దపరిశ్రమలు. అనగా నూటికి 1.1.

మొత్తం 66,10,000 కార్మికులుంటే పెద్ద పరిశ్రమలలో 20,00,000 మంది పని చేస్తున్నారు. అనగా నూటికి 30.5.

మొత్తం ఉత్పత్తి అయిన 2070 కోట్ల డాలర్ల విలువగల సరుకులో 900 కోట్ల డాలర్ల విలువగల సరుకు పెద్ద పరిశ్రమలలో తయారయింది. అనగా నూటికి 43 8 వంతులన్నమాట.

దేశంలోవున్న మొత్తం పరిశ్రమలలో నూటికి ఒకపాలుమాత్రమే వున్న పెద్ద పరిశ్రమలద్వారా యావత్తు ఉత్పత్తిలో సగభాగం కొనసాగించబడుతూంది. అంతేగాక ఈ 3000 బ్రహ్మాండమైన పారిశ్రామిక సంస్థలకు 258 శాఖలుకూడా వున్నాయి. వీటన్నిటినీ

బట్టి ఉత్పత్తి క్రమంగా కేంద్రీకరించబడుతూందనీ, కొలదివ్యాపార సంస్థల చేతుల్లోకి పోయి "మానోపలీ" (గుత్తవ్యాపారం)గా తయారవుతుందనీ స్పష్టపడుతుంది. ఒకవైపున డజన్లకొలది సంస్థలు కలసి పనిచేస్తాయి రెండోవైపున వీటి ప్రాముఖ్యత హెచ్చేకొలదీ వివిధ సంస్థలమధ్య వుండే పోటీ (కాంపిటీషన్) అంతర్ధానమవుతుంది. ఈ విధంగా ఆధునిక పెట్టుబడిదారీవిధానం యొక్క ముఖ్యలక్షణాలలో ఒకటైన 'పోటీ' అంతరించి దానిస్థానాన్ని గుత్తవ్యాపారం ఆక్రమించుతుంది. ఈ నూతన మార్పును ఏవిధమైన పొరబాటుకు అవకాశం లేకుండా జాగ్రత్తగా పరిశీలించుదాం.

అమెరికన్ లెఖ్ఖల పట్టీలనుబట్టి 3000 బ్రహ్మాండమైన పారిశ్రామిక సంస్థలకు 250 శాఖలున్నాయి. అంటే ఏడజను సంస్థలకో మాత్రమే అన్ని పరిశ్రమలకు సంబంధించిన శాఖలున్నాయనిపిస్తుంది. కాని అది వాస్తవంగాదు. ప్రతి పరిశ్రమలోనూ బ్రహ్మాండమైన సంస్థలులేవు. అంతేగాక పెట్టుబడిదారీవిధానం అత్యున్నతదశ యొక్క ప్రత్యేక లక్షణమేమిటి ? 'కంబైన్స్' ఏర్పడడం. పరిశ్రమయొక్క వివిధశాఖలలోవున్న సంస్థలు కలసి కంబైన్'గా ఏర్పడుతాయి. ఉదాహరణకు చూడండి. గనులలోనుంచి త్రవ్విన యినుపమట్టిని కరిగించి ఇనుమును తయారుచేసే సంస్థ ఒకటి వుంటుంది. ఇనుమును ఉక్కుగా తయారుజేసే సంస్థ ఒకటుంటుంది. ఉక్కు వస్తువులను తయారుజేసే సంస్థ ఒకటుంటుంది, ఈ మూడు ఒకదానికొకటి అనుబంధంగా వుండే పరిశ్రమలు. మూడూ కలసి ఒక 'కంబైన్' ఏర్పడుతుంది. అదే విధంగా ఒక పరిశ్రమలో దిగవిడిచిన చెత్తలో నుండి వస్తువులను తయారుజేసే మరొక ఉప పరిశ్రమ వుంటుంది. ఇవిరెండూ కలసి 'కంబైన్' ఏర్పడుతాయి.

ఈ కంబైన్' (కలయిక) వలన వర్తకంలో వచ్చే ఎగుడుదిగుడులకు అవకాశం తగ్గుతుందని హల్ఫర్‌డింగ్ వ్రాశాడు. మొత్తం 'కంబైన్'కు ఒక స్థిరమైన రేటులో లాభం వస్తుంది. (2) అంతేగాక ఒక సంస్థతో మరొకసంస్థ వర్తకం చేసే అవుసరం లేకుండా పోతుంది. (3) టెక్నికల్‌గా అభివృద్ధి చేయడానికి అవకాశాలు బాగా లభించుతాయి. కొత్తలాభాలను కూడా పొందడానికి అవకాశం వస్తుంది. ఈ టెక్నికల్ అభివృద్ధి చేయని సంస్థలకు అట్టిలాభం రాదు. ఈ విధంగా ఏర్పడడంవల్ల 'కంబైన్' యొక్క ఉత్పత్తిశక్తి హెచ్చుతుంది: ఆర్థికదుస్థితి రోజుల్లో అనగా తయారైన వస్తువుల (Manufactured goods) ఖరీదులెంతపడతాయో అంతగాముడి పదార్థాల (Raw Materials) ఖరీదులు పడనపుడుకూడా పోటీకి నిలబడగలశక్తి యీ కంబైన్లకు వుంటుంది.

జర్మన్ బూర్జువా ఆర్థికశాస్త్రజ్ఞుడు 'హేమన్' ఇనుముపరిశ్రమలోని 'కంబైన్లను' గురించి ఒకపుస్తకం వ్రాశాడు. దానిలో "ఒంటరిగావున్న వ్యాపారసంస్థలు ముడిపదార్థాల అధికధరలకు, పారిశ్రామిక వస్తువుల చౌకధరలకు తట్టుకోలేక నశించిపోతాయి" అని వ్రాశాడు. మనకీదృశ్యం స్పష్టంగా కన్పించుతుంది. "ఒకవైపున ఏడాదికి లక్షలకొలది

టన్నుల బొగ్గును తయారుజేసే బ్రహ్మాండమైన బొగ్గు కంపెనీలున్నాయి. అవన్నీ కలసి సిండికేట్లుగా ఏర్పడ్డాయి. మరోవైపున బ్రహ్మాండమైన ఉక్కుకంపెనీలున్నాయి. అవన్నీ ఉక్కు సిండికేటులో ఐక్యమయి బొగ్గుకంపెనీలతో సన్నిహితసంబంధం కలిగి వున్నాయి. ఈ బ్రహ్మాండమైన సంస్థలు సంవత్సరానికి 4 లక్షల టన్నుల ఉక్కును తయారు చేస్తున్నాయి. లెఖ్కలేనన్ని ఉక్కువస్తువులను, చెప్పలేనంత బొగ్గును, ముడియినుమును ఉత్పత్తిచేస్తున్నాయి. 10 వేలమంది కార్మికులు ఫ్యాక్టరీలలోనే పనిజేస్తుంటారు. కొన్ని సందర్భాలలో స్వంత ఓడరేవులను, స్వంత రైల్వేలను కలిగివుంటాయి. జర్మన్ ఇనుము పరిశ్రమ యొక్క పరిస్థితి యిది. కేంద్రీకరణ యింకా మరింత వృద్ధిఅవుతోంది. పారిశ్రామికసంస్థలు మరింత పెద్దవవుతున్నాయి. ఒక పరిశ్రమకుగాని, లేక కొన్ని పరిశ్రమలకు గాని చెందిన సంస్థలు కలసి బ్రహ్మాండమైన 'కంబైన్లు' ఏర్పడుతున్నాయి. వీటిని ఒక అరడజను బ్యాంకులు బలపరుస్తూ తమ యిష్టంవచ్చినట్లు నడిపిస్తున్నాయి. క్రమంగా పెట్టుబడి ఏవిధంగా కేంద్రీకరించబడుతుందో కారల్ మార్క్స్ చెప్పిన సూత్రాలు- జర్మన్ గనుల పరిశ్రమను అవలోకించితే- స్పష్టంగా బోధపడతాయి. జర్మనీ దేశంలో పరిశ్రమలు దిగుమతి సుంకాలచేతను, రవాణా పన్నులచేతను రక్షించబడుతున్నమాట నిజమే. అయినప్పటికి జర్మన్ గనుల పరిశ్రమను ప్రభుత్వం హస్తగతం చేసికోవలసిన సమయం ఆసన్నమయింది." ఈ విషయాన్ని సుహృద్భావం కలిగిన బూర్జువా ఆర్థికశాస్త్రజ్ఞుడే అంగీకరించాడనే సంగతి గమనించవలసివుంది దిగుమతి సుంకాలచే జర్మన్ పరిశ్రమలు రక్షింపబడుతున్నాయి. కాబట్టి జర్మనీ విషయం ప్రత్యేకమైనదని ఆయన అనుకొంటున్నాడు. ఈ దిగుమతి సుంకాలు పరిశ్రమల కేంద్రీకరణను మరింత త్వరపరచాయి: మానొపలీస్, కంబైన్లు, కార్టెల్స్, సిండికేట్‌లు ఏర్పడటానికి దోహదమిచ్చాయి కాని ఇంగ్లండువంటి స్వేచ్ఛావ్యాపార సూత్రా లవలంబించిన దేశంలో కూడ యీ కేంద్రీకరణ జరుగుతుందనే ముఖ్యమైనవిషయాన్ని మనం గమనించాలి. ఇచట కేంద్రీకరణ కొంత ఆలస్యంగానూ, మరో రూపంలోనూ జరుగుతుంది. ప్రొఫెసర్ హెర్‌మన్‌లెవీ "మానోపలీస్, ట్రస్టుస, కంబైన్సు" అనే పుస్తకం వ్రాశాడు. దానిలో బ్రిటిష్ ఆర్థిక అభివృద్ధిని గురించి వివరాలు యిలా చర్చించబడినాయి :—

"గ్రేట్‌బ్రిటన్‌లో పారిశ్రామికసంస్థలు చాలా పెద్దవిగానూ, టెక్నికల్‌గా అభివృద్ధి చెందినవిగానూ వున్నాయి. అందుచే అవి క్రమంగా 'మానొపలీలు'గా ఏర్పడే సూచనలు కన్పిస్తున్నాయి. ఈ కేంద్రీకరణ ఫలితంగా ఒకవైపున ఒక వ్యాపారసంస్థ నిర్మించడానికి బ్రహ్మాండమైన పెట్టుబడి అవుసరమౌతోంది. అందుచే కొత్తసంస్థలను యింత పెట్టుబడితో ఏర్పరచడం కష్టమౌతోంది. మరో ముఖ్యవిషయమేమంటే కొత్తగా నిర్మించేసంస్థ యిదివరకే వున్న బ్రహ్మాండమైన పరిశ్రమలతో పోటీచేయాలంటే ఎంతో విరివిగా వస్తువులను వుత్పత్తి చేయాలి. అలా ఉత్పత్తిచేసిన వస్తుసముదాయాన్ని లాభప్రదంగా అమ్మ

కోవాలంటే ప్రజల కొనుగోలుశక్తి (డిమాండు) వృద్ధికావాలి. లేనిచో వస్తువులు ఎక్కువ తయారవడం వల్ల ఖరీదులు పడిపోతాయి. కొత్తసంస్థకు లాభం గిట్టదు; ప్రాతసిండికేటులకు అంతే.

దిగుమతి సుంకాలచే పరిశ్రమలు రక్షించబడుతున్న దేశాలలోవలే అంత త్వరగా కాకపోయినా ఇంగ్లండువంటి స్వేఛ్చా వ్యాపారమున్న దేశాలలోకూడ సిండికేటులు, ట్రస్టులు, కంబైన్లు ఏర్పడుతున్నాయి. తద్వారా వివిధసంస్థలమధ్య పోటీ తగ్గిపోయి, కేవలం రెండుడజన్ల బ్రహ్మాండమైన సంస్థలుమాత్రమే మిగులుతున్నాయి. ఈ విధంగా పెట్టుబడి కేంద్రీకరణ ఫలితంగా పెద్దపరిశ్రమలలో 'మానొపలీలు' ఏర్పడుట యిచట కూడ స్పష్టంగా కాన్పించుతుంది."

ఏబది సంవత్సరాలకుపూర్వం మార్క్సు కేపిటల్ అనే గ్రంధం వ్రాస్తున్న సమయంలో ఫ్రీ కాంపిటీషన్ (స్వేఛ్చావ్యాపారం) సహజమైన ఆర్ధిక సూత్రంగా చాలమంది ఆర్ధికవేత్తలకు కన్పించింది. మార్క్సు తన రచనలలో పెట్టుబడిదారీ విధానాన్ని చరిత్రాత్మకంగానూ, శాస్త్రీయ దృక్పధంతోనూ పరిశీలించాడు. ఫ్రీ కాంపిటీషన్ ఉత్పత్తి కేంద్రీకరణకు దారితీస్తుందనీ, క్రమంగా కేంద్రీకరణ పెరిగి గుత్తవ్యాపారానికి (మానొపలీకి) దారితీస్తుందనీ తెలియజేశాడు. ఈ రోజులలో మానొపలీ (గుత్తవ్యాపారం) అన్నిచోట్ల వ్యాపించిన వాస్తవికవిధానం అయిపోయింది. ఆర్థిక శాస్త్రవేత్తలు యీ మానొపలీని గురించి అనేక గ్రంధాలు వ్రాస్తున్నారు. 'మార్క్సిజం సిద్ధాంతాలు తప్పినవని రుజువయిందని' వీరు డప్పాలు కొడుతున్నారు. కాని సామెత చెప్పినట్లు సత్యాన్ని మరుగుపరచడం ఎవడబ్బతరం? తమకు యిష్టమున్నా లేకపోయినా వారు వాస్తవికవిషయాలను దాచలేరు. వాస్తవిక విషయాలేమి చెబుతున్నాయి? పెట్టుబడిదారీ దేశాలలో దిగుమతి సుంకాలచే పరిశ్రమలు రక్షించబడుతున్నా, లేక స్వేఛ్చావ్యాపారం అమలులోవున్నా సరే స్వల్ప భేదాలతో మానొపలీ (గుత్తవ్యాపారం) అమలులోకి వస్తూంది. ఉత్పత్తి కేంద్రీకరణం జరిగేకొలదీ మానొపలీల పుట్టుక తప్పనిసరి అనేది ప్రస్తుత పెట్టుబడిదారీ ఆర్ధిక విధానంయొక్క ప్రధాన సూత్రమని రుజువవుతోంది.

యూరపుకు సంబంధించినంతవరకు పెట్టుబడిదారీ విధానంలోని ప్రాతదశపోయి కొత్తదశ 20 వ శతాబ్ద ఆరంభంలో ప్రారంభమయింది. మానొపలీలు ఏర్పడటాన్నిగురించి యీ మధ్యనే ప్రకటించబడిన ఒక పుస్తకంలో యిలా వ్రాయబడింది "1860 నాటికి మానొపలీలు (గుత్తవ్యాపారం)ను గురించిన ఉదాహరణలు అతిస్వల్పంగా కన్పించుతాయి. వీటిలోనే ప్రస్తుతం సర్వత్రా వ్యాపించివున్న మానొపలీల అంకురాలు కనిపెట్టవచ్చును. ప్రస్తుత కార్టెల్సుకు అవి ప్రాచీన అంకురాలు మాత్రమే. కాని ప్రస్తుత మానొపలీ విధానంయొక్క ఆరంభం 1860 సంవత్సరానికి తరువాతనే అని చెప్పాలి. 1870—1890 సంవత్సరాల మధ్యవచ్చిన ఆర్థికదుస్థితి ఫలితంగా అంతర్జాతీయంగా పరిశ్రమ

లకు దెబ్బతగిలింది. తత్ఫలితంగా మానొపలీ (గుత్తవ్యాపారం) విధానం అభివృద్ధి చెందసాగింది." "యూరపుకు సంబంధించినంతవరకు ఫ్రీ కాంపిటీషన్ (స్వేచ్ఛావ్యాపార) విధానంయొక్క అభివృద్ధి 1860—70 సంవత్సరాలమధ్య అంతమయింది. ఆ కాలంలో ఇంగ్లండు పాతపద్ధతిలో (స్వేచ్ఛావ్యాపార) పెట్టుబడిదారీ నిర్మాణాన్ని పూర్తిచేసింది. జర్మనీలో చేతిపరిశ్రమలకు, గృహపరిశ్రమలకు వ్యతిరేకంగా పోరాటం జరిపి పెట్టుబడిదారీ విధానం జయించింది. నూతన రూపంలో తన నిర్మాణాన్ని ప్రారంభించింది."

"1873 లో వచ్చిన ఆర్థికసంక్షోభంతో పెద్ద మార్పువచ్చిందని చెప్పవచ్చు. తరువాత 1880 లో స్వల్పకాలం ఆర్థికదుస్థితి తగ్గినట్లు కన్పించినా, మళ్ళీ తీవ్రమయింది. అందుచే ఈ 20 సంవత్సరాలలో యూరప్‌చరిత్రలో తీవ్రమైన మార్పువచ్చింది. 1889—90 తరువాతవచ్చిన ఆర్థిక సుభిక్షదశలో (బూమ్‌పిరియడ్) కార్టెల్స్ (గుత్తవ్యాపారసంస్థలు) వ్యాపించాయి. కాని యివి సంకుచితపాలసీ ననుసరించడంవల్ల కార్టెల్సులేని రోజులలో కంటే ఖరీదులు పెరిగాయి. అందుచే తరువాతవచ్చిన ఆర్థికదుస్థితిలో కార్టెల్సు నశించిపోయాయి. ఐదు సంవత్సరాలు వర్తకమాంద్యంలో ఖరీదులు పడిపోయాయి. కాని పరిశ్రమలలో నూతనధోరణి వచ్చింది. ఆర్థిక సంక్షోభం ఎలాగూ తప్పనిసరిగా వస్తుందనీ దానితరువాత సుభిక్ష దశ (Era of prosperity) వస్తుందనీ పెట్టుబడిదారులు యిదివరకువలే యిపుడు భావించడంలేదు.

"కార్టెల్సు ఉద్యమం రెండోదశలో ప్రవేశించింది. ఇంక అవి తాత్కాలిక రూపాలు మాత్రమేకాదు. క్రమక్రమంగా ఉత్పత్తివిధానంలో ఒక్కొకభాగంపై కార్టెల్సు అధిపత్యం సంపాదించసాగాయి. ముందుగా ముడిపదార్థాల ఉత్పత్తిపై పెత్తనం వచ్చింది. 1890 ప్రారంభంలోనే బొగ్గుపరిశ్రమలో కార్టెల్సుబలపడి బొగ్గుసిండికేటు' (కోల్‌సిండికేటు)లు ఏర్పడ్డాయి. నాటినుంచి బొగ్గుపరిశ్రమపై యివి పూర్తిఅధికారం చెలాయించుతున్నాయి. 19 వ శతాబ్దం అఖరులో పరిశ్రమలు విపరీతంగా అభివృద్ధిచెందాయి : 1900-1903 మధ్య మళ్ళీ ఆర్థికసంక్షోభం వచ్చింది. ఈకాలంలో బొగ్గు-యినుము పరిశ్రమలు పూర్తిగా కార్టెల్సు పెత్తనంక్రిందనే వున్నాయి. అనగా కార్టెల్సు ఆర్థికవిధానంలో ముఖ్యభాగాలయినాయి. పెట్టుబడిదారీ విధానంలో ఫ్రీ కాంపిటీషన్ (స్వేచ్ఛావ్యాపారం) సూత్రం ప్రాముఖ్యత నశించింది; మానొపలీ (గుత్తవ్యాపార) విధానం ఆచరణలోకి వచ్చింది.

అనగా మానొపలీల చరిత్రను 3 ముఖ్యదశలుగా విభజించవచ్చును: (1) 1860-70 మధ్యకాలంలో ఫ్రీకాంపిటీషన్ (స్వేచ్ఛావ్యాపారం) అత్యున్నతదశలో వుంది. అప్పుడే మానొపలీ విధానంయొక్క అంకురాలు ప్రారంభమయ్యాయి.

(2) 1873 తరువాతవచ్చిన ఆర్థికసంక్షోభకాలంలో, కార్టెల్సు విరివిగా వ్యాపించాయి. కాని వాటికింకా స్థిరత్వం ఏర్పడలేదు; తాత్కాలికమైనవిగానే కన్పించాయి. దీనిని మార్పిడిదశ (ట్రాన్సిటరీదశ) అనవచ్చు.

(3) 19వ శతాబ్దం ఆఖరులోవచ్చిన సుభిక్షకాలం, 1900-1903 మధ్యవచ్చిన ఆర్థిక సంక్షోభకాలం. దీనిని మూడోదశ అనవచ్చును. ఈ దశ ఆర్థికవిధానంలో కార్టెల్సు ప్రధాన రూపాలయ్యాయి. పెట్టుబడిదారీ విధానం సామ్రాజ్యవాదంగా మార్పుచెందింది.

కార్టెల్సు అమ్మకపు షరతులను, డబ్బుచెల్లించే (Payment) నియమాలను నిర్ణయించుకుంటాయి. మార్కెటులను తమలో తాము విభజించుకొంటాయి. ఎంత ఉత్పత్తి చేయాలసిందీ నిర్ణయించుతాయి. ఖరీదులను నిర్ణయించుతాయి. లాభాలను పంచుకుంటాయి. 1896 లో జర్మనీలో 250 కార్టెల్సు వుండేవి. 1905లో 385 వుండేవి. వీటిలో 12 వేల కంపెనీలు భాగస్వాములుగా వుండేవి. కాని యీఅంకెలు సంపూర్ణమైనవి కావు. 1907లో ప్రకటించబడిన జర్మన్ లెఖ్కలను అనుసరించి పైవి ఉదహరించబడ్డాయి. వాటిప్రకారమే 12 వేలకంపెనీలు దేశంయొక్క మొత్తం ఉత్పత్తిశక్తిలో సగానికి పైగా తమ చేతిలో వుంచుకున్నాయి.

అమెరికా సంయుక్తరాష్ట్రాలలో 1900లో 185 ట్రస్టులుండేవి. 1907 నాటికిఅవి 250 అయ్యాయి. అమెరికన్ లెక్కలలో పరిశ్రమలను 3 రకాలుగా విభజించారు. వ్యక్తులకు చెందినవి. ఫరమ్సుకు (కంపెనీలకు) చెందినవి. కార్పొరేషన్లకు (గుత్తవ్యాపారసంస్థలకు) చెందినవి. 1904 లో మొత్తం దేశంయొక్క పారిశ్రామిక సంస్థలలో నూటికి 23.6 వంతులు యీ కార్పొరేషన్ల చేతిలో వుండేవి. 1909 లో వీటిచేతిలో నూటికి 25-9 వుండేవి. ఇవి 1904 లో మొత్తం కార్మికులలో నూటికి 70.6 చేత పనిచేయించేవి. 1909లో నూటికి 75.6 కార్మికులచేత పనిచేయించేవి. ఇవి 1904 లో 1090 కోట్ల డాలర్ల విలువగల వస్తుసముదాయాన్ని తయారుచేసేవి. అనగా మొత్తం ఉత్పత్తిలో నూటికి 73-7 కార్పొరేషన్ల చేతిలోవుండేది. 1909 నాటికి యివి 1630 కోట్ల డాలర్ల విలువగల సరుకును ఉత్పత్తి చేశాయి. అనగా మొత్తం అమెరికా ఉత్పత్తిలో నూటికి 79 వంతులు యీ కార్పొరేషన్ల చేతిలో వుండేది.

ఒక్కొక్కపరిశ్రమలో మొత్తం ఉత్పత్తిలో పదింట 7 లేక 8పాళ్ళు కార్టెల్సు,ట్రస్టుల చేతుల్లోవుంది. రైన్ ప్రాంతంలోని బొగ్గు సిండికేటు చేతుల్లో 1893 నాటికి ఆ ప్రాంతంలో ఉత్పత్తిఅయ్యే బొగ్గులో నూటికి 86.7 పాళ్ళు వుండేది. 1910 నాటికి నూటికి 95.4 పాళ్ళు యీ సిండికేటు చేతుల్లోవుంది.

ఈ విధంగా మానోపలీలు (గుత్తవ్యాపారసంస్థలు) ఏర్పడటం వల్ల విపరీతమైన లాభాలువస్తాయి. అందుచే పెద్ద పారిశ్రామిక సంస్థలు కలసి బ్రహ్మాండమైన ట్రస్టులుగా ఏర్పడుతున్నాయి. స్టాండర్డు ఆయిల్‌కంపెనీ అనే ప్రఖ్యాతిగాంచిన అమెరికన్ పెట్రోల్ ట్రస్టు 1900 సంవత్సరంలో స్థాపించబడింది. " దానిపెట్టుబడి 15కోట్ల డాలర్లు. ఇది 10 కోట్ల సాధారణషేర్లు, 10 కోట్ల 60 లక్షల ప్రిఫరెన్సు షేర్లను యిస్యూచేసింది. (అమ్మకానికి పెట్టింది) ప్రిఫరెన్సు షేర్లు 1 వున్నవారికి 1900-1907 సంవత్సరాలమధ్య నూటికి

40 నుంచి 48 వరకు లాభాలు పంచబడ్డాయి. అనగా మొత్తంమీద వీరికి 34 కోట్ల 10లక్షల డాలర్లలాభం పంచబడిందన్నమాట. 1900-1907 మధ్యస్టాండర్డు ఆయిల్ కంపెనీ మొత్తం 88 కోట్ల 90 లక్షల డాలర్ల లాభం సంపాదించింది, ఇందులో 60 కోట్ల 60లక్షలు భాగస్థులకు పంచారు. మిగతాది రిజర్వుపెట్టుబడికిక్రింద వుంచారు." అమెరికా స్టీల్‌కార్పొరేషన్ క్రిందవున్న పరిశ్రమలలో 210.180 కార్మికులు పనిజేస్తున్నారు. జర్మన్ గనుల పరిశ్రమలో ముఖ్యమైన గెల్సెన్ కిర్చెన్ మైనింగ్ ఫెడరేషన్‌లో మొత్తం 46వేల కార్మికులు పనిజేస్తు న్నారు. 1902 లో అమెరికా స్టీల్‌ట్రస్ట్ 90లక్షల టన్నుల ఉక్కును తయారు చేసింది. అది 1901 లో మొత్తం అమెరికా ఉక్కు ఉత్పత్తిలో నూటికి 66.3 వంతులు తయారుచేసింది. 1903 లో అది నూటికి 56.1 ఉక్కు ఉత్పత్తి చేసింది. ఈ సంవత్సరాలలోనే అది తయారుజేసే ముడి యినుము నూటికి 43.3 నుంచి 46.3 వరకు పెరిగింది.

అమెరికా ప్రభుత్వం ప్రకటించిన రిపోర్టులో ట్రస్టులను గురించి యిలా వ్రాయబడింది: వీటిక్రింద బ్రహ్మాండమైన పరిశ్రమలు వుండుటచేతను, టెక్నికల్ నైపుణ్యాన్ని కలిగివుండుటచేతను ప్రత్యర్థిసంస్థలు వీటితో పోటీచేయలేవు. టొబాకో ట్రస్టు (పొగాకు గుత్తవ్యాపారసంస్థ) ప్రారంభమయినప్పటినుంచి మనుష్యులబదులు, యంత్రాలను ఉపయోగించడానికి కృషిచేసింది. పెద్దమొత్తాలను ఖర్చుపెట్టి పేటెంటులను (కొత్త పద్ధతిలో పనిచేసే యంత్రాలను) కొన్నది. ఇందులో కొన్ని ఇంజినీర్లు ఎంతో మార్పు చేస్తేగాని పనికిరావు. 1906 లో పేటెంటులను కొనడానికి రెండు అనుబంధ కంపెనీలను కూడా స్థాపించింది. అదేదృష్టితో యంత్ర నిర్మాణ ఫ్యాక్టరీలను కట్టింది. బ్రూక్లిన్‌లో వున్న ఒక ఫ్యాక్టరీలో 300 కార్మికులు పనిచేస్తున్నారు. ఇదంతా సిగరెట్లు చేయడానికి, పొగాకును బాగుచేయడానికి, టిన్నులు, కేసులు తయారుచేయడానికి, మనుష్యులబదులు యంత్రాలను ఉపయోగించడానికి చేసే ప్రయత్నం. ఈ ఫ్యాక్టరీలో కొన్న పేటెంటులను తమకు వినియోగపడునట్లు మార్చబడుతున్నాయి."

"ఇతర ట్రస్టులలో టెక్నికల్ అభివృద్ధిచేయడానికి ప్రత్యేకంగా ఇంజనీర్లను నియోగించుతున్నారు. కొత్త పరికరాలను కనిపెట్టడం, ఉత్పత్తి పద్ధతులను అభివృద్ధి చేయడం వారిపని. స్టీల్‌ట్రస్టు యంత్రాలను అభివృద్ధి చేయడానికి, ఉత్పత్తిలో పాడును తగ్గించడానికి కొత్త పద్ధతులను, పరికరాలను కనిపెట్టిన కార్మికులకు, ఇంజనీర్లకుమంచి బోనసులు యిస్తుంది."

జర్మన్ కెమికల్ పరిశ్రమలో గత దశాబ్దాలలో యంత్రాలు పైవిధంగానే అభివృద్ధి చేయబడ్డాయి. 1908 లో ఉత్పత్తి కేంద్రీకరణ ఫలితంగా రెండు మానోపలీ గ్రూపులు తయారయ్యాయి, 2 కోట్ల మార్కులు పైగా పెట్టుబడికలిగిన రెండు జతల ఫ్యాక్టరీలున్నాయి. ఒకవైపున హోల్ట్సవద్దవున్న మీస్టర్ ఫ్యాక్టరీ, ఫ్రాంక్‌ఫోర్టువద్దవున్న కేస్సలీ

ఫ్యాక్టరీ ఒక గ్రూపుగావున్నాయి రెండోవైపునలుడ్ విగ్స్‌షాఫెన్‌వద్దవున్న సోడా ఫ్యాక్టరీ. ఎల్బెర్ ఫెల్డ్‌వద్దవున్న బేయర్ ఫ్యాక్టరీ రెండో గ్రూపుగావున్నాయి. 1905 లో ఒక గ్రూపు. 1908 లో రెండో గ్రూపుమరొక ఫ్యాక్టరీని కలుపుకొన్నాయి. దీని ఫలితంగా 4 నుంచి 5 కోట్ల మార్కులు పెట్టుబడిగల రెండు పెద్ద మానోపలీలు ఏర్పడ్డాయి. ఈ రెండు గ్రూపులు కూడ ఖరీదులువగైరా విషయమై ఒక అగ్రిమెంటుకు రావడానికి ప్రయత్నించు తున్నాయి (1916 జూన్‌లో జర్మనీలోవున్న కెమికల్ పరిశ్రమలన్నీ కలసి బ్రహ్మాండ మైనట్రస్టుగా ఏర్పడ్డాయని వార్తాపత్రికలు ప్రకటించాయి )

పోటీ (కాంపిటీషన్) క్రమంగా పోయి మానోపలీ (గుత్తవ్యాపారం) దానిస్థానాన్ని ఆక్రమించింది. దీని ఫలితమేమంటే ఉత్పత్తి క్రమంగా సమిష్టి ఉత్పత్తి వైపుకుముందంజ వేస్తూందన్నమాట. ముఖ్యంగా కొత్తపరికరాలు కనిపెట్టడం, టెక్నికల్ అభివృద్ధి జరిగే కొలదీ ఉత్పత్తి సమిష్టిగా చేయబడుతుంది.

ఇక పూర్వం మాదిరి ఫ్యాక్టరీ యజమానులమధ్యపోటీలేదు. ఒండొరులతో సంబంధంలేకుండా తాము ఎరుగని మార్కెట్టుకోసం ఉత్పత్తిచేయడం అనేదిలేదు. కేంద్రీకరణ ఫలితంగా ఒకదేశంయొక్క లేదా ప్రపంచంయొక్క ముడిపదార్థాలను అంచనావేయడం సాధ్యమయింది. వీటిఉత్పత్తిని అంచనావేయడమే గాకుండా బ్రహ్మాండమైన మానోపలీలు వీటిని హస్తగతం చేసికోడంకూడా జరుగుతోంది. ప్రపంచంలో మార్కెటుల అవసరాలు కూడ అంచనా వేయబడుతున్నాయి. బ్రహ్మాండమైన ట్రస్టులు యీ మార్కెటులను కంట్రాక్టు పద్ధతిని తమలో తాము పంచుకొంటున్నాయి. నేర్పరితనం గలిగిన కార్మికులను, మంచి ఇంజినీర్లను కూడ యీ మానోపలీలు గుత్తకు తీసికొంటున్నాయి. ట్రాన్స్‌పోర్టు (రాకపోకల) సౌకర్యాలను గుత్తకు తీసికొంటున్నాయి. ఉదాహరణకు అమెరికాలో రైల్వేలను, ఓడ కంపెనీలను యూరపులోనూ, అమెరికాలోకూడ యీవిధంగానే గుత్తకు తీసికొన్నాయి. సామ్రాజ్యవాద దశలో పెట్టుబడిదారీ విధానం ఉత్పత్తిని సమాజపరం చేయవలసిన పరిస్థితికి దగ్గరగా వస్తుంది. పెట్టుబడిదారులు తమ కిష్టమున్నా లేకపోయినా కొన్ని సందర్భాలలో నూతన సమాజిక వ్యవస్థలో ప్రవేశించవలసి వస్తుంది. ఫ్రీ కాంపిటీషన్ (స్వేచ్ఛా వ్యాపారం) దశపోయి సామాజిక (Socialisation of Production) ఉత్పత్తి దశ వచ్చింది. ఉత్పత్తి సామాజికంగా చేయబడుతూంది. వినియోగం లేదా అనుభవం మాత్రం వ్యక్తుల చేతుల్లో మిగిలిపోయింది. సమాజంయొక్క ఉత్పత్తి సాధనాలు మాత్రం యింకా కొలదిమంది స్వంత ఆస్థిగానే వుండిపోయాయి. పేరుకు మాత్రం ఫ్రీ కాంపిటీషన్ ( స్వేచ్ఛావ్యాపార) సూత్రాలు మిగిలివున్నాయి. కొలది మంది గుత్తవ్యాపారస్థుల (Monopolists) అధికారం ప్రజలందరిమీద చలామణి అవుతూంది. ఇది క్రమంగా మరింత బాధాకరమవుతూంది. బరువై భరింపశక్యంగాని దవుతూంది.

జర్మన్ ఆర్థికవేత్త కెస్టనర్ కార్టెల్సుకు ప్రయివేటు కంపెనీలకు మధ్యవున్న పోరాటాన్ని గురించి ఒకపుస్తకం వ్రాశాడు: ఆపుస్తకానికి "నిర్మాణంలో చేరడానికి ఒత్తిడి" (The constraint to organisation) అని పేరు పెట్టాడు. కాని "గుత్తవ్యాపారస్థుల సంఘానికి లొంగిపోడానికి ఒత్తిడి" అనిపేరు పెడితే సరిపోయేది. ఈ పుస్తకాన్ని ఒకసారి తిరగవేస్తే యీ మానొపలీలు తమకు లొంగని కంపెనీలను ఎలా ఒత్తిడి ఛేస్తాయో బోధపడుతుంది.

వారవలంబించే పద్ధతులివి :—

1. ముడిపదార్థాలను కార్టెల్సులో చేరని సంస్థలకు అందనివ్వకుండా చేయడం. (ఇది చాలముఖ్యమైన ఆయుధం. ఏమంటే ముడిపదార్థాలు దొరకనిచోప పరిశ్రమనడువదుగదా!)

2. కార్మికులతో ఒడంబడికలు చేసికోడం (అనగా యజమానులు కార్మికులతో వారు ట్రస్టులలోచేరని కంపెనీలలోపనిచేయకూడదని ఒడంబడికలు చేసికొంటారు)

3. ట్రాన్స్‌పోర్టు (రవాణా) సౌకర్యాలు దొరకకుండా చేయడం.

4. వర్తకంచేసే అవకాశాలు దొరకకుండా చేయడం.

5. కొనుగోలు వర్తకులతో తాము కార్టెల్సులోచేరిన కంపెనీలనుండిమాత్రమేకొంటామని ఒడంబడికలు చేసికోడం.

6. తమ మానొపలీలలో చేరని కంపెనీలను ధ్వంసంచేయడానికి వస్తువుల ధరలను తగ్గించివేయడం. కొంతకాలం గిట్టుబాటు అయ్యే ఖరీదుకంటే చవుకగా సరుకులను అమ్మడానికి లక్షలు పెట్టుబడిపెడతారు. (ఉదాహరణకు బెంజైన్ ఖరీదు 40 నుండి 22 మార్కులకు ఆకస్మికంగా తగ్గించబడింది.)

7. ఋణాలు దొరకకుండా చేయడం.

8. బహిష్కార ఆయుధాన్ని ప్రయోగించడం.

ఇపుడు మనం చూచేపోటీ చిన్నపరిశ్రమలకు-పెద్దపరిశ్రమలకు మధ్య పోటీకాదు. లేక టెక్నికల్‌గా అభివృద్ధిచెందినవాటికి వెనుకబడినవాటికి మధ్యపోటీకాదు. బ్రహ్మాండమైన మానొపలీలు తమకులొంగని, దాసోహమనని కంపెనీలను గొంతు నులమడాన్ని ప్రత్యక్షంగా చూస్తున్నామన్నమాట. ఈ విధానాన్ని బూర్జువా ఆర్థికవేత్త యిలావర్ణించాడు:

కెస్టనర్ యిలా వ్రాశాడు, "కేవలం ఆర్థిక దృక్పథాన్నుంచి చూచినా వర్తక నైపుణ్యానికి ప్రాముఖ్యతతగ్గి. స్పెక్యులేషనుకు (వాయిదా బేరాలకి) నిర్మాణానికి ప్రాముఖ్యత హెచ్చింది. కొనేవారి అవసరాలను చక్కగా అంచనావేసే మంచి వర్తకానుభవం. టెక్నికల్ జ్ఞానంవున్న వర్తకుడు నేడు సంపూర్ణవిజయాన్ని పొందడంలేదు. ప్రత్యేక కంపెనీ

లకు బ్యాంకులకు వున్న సంబంధాన్ని, నిర్మాణ అభివృద్ధిని అంచనావేయడం తెలిసిన స్పెక్యులేటరు సంపూర్ణజయం పొందుతున్నాడు."

పై అభిప్రాయాలను సామాన్యమానవుల భాషలోకి అనువదించుదాం. పెట్టుబడిదారీ విధానం నేడు ఒకదశకు వచ్చింది. ఆర్థికజీవితానికి వస్తువుల ఉత్పత్తి పునాది అయినప్పటికి దాని ప్రాధాన్యత నేడు తగ్గిపోయింది. వస్తువులను సప్లయిచేసే వర్తకునికంటే స్పెక్యులేషనుచేసే (వాయిదాబేరాలు చేసే జూదగానికి) ఎక్కువ లాభాలు వస్తున్నాయి. కంబైన్లు, ట్రస్టులువెనకాల, తెలివిగల స్పెక్యులేటర్లవెనకాల ఉత్పత్తి సమాజాధీనం అవడం జూస్తున్నాము. కాని యీఅభివృద్ధి ఫలితాన్నంతనూ మానవసమాజం అనుభవించడానికి బదులు కొలదిమంది స్పెక్యులేటర్లు లాభంపొందుతున్నారు. సామ్రాజ్యవాద దశకువచ్చిన యీపెట్టుబడిదారీవిధానాన్ని పెట్టీబూర్జువా మేధావులు కూడవిమర్శించుతారు. కాని వారు సంకుచితంగా వెనక్కి పోదామని కలలుగంటున్నారు. ఫ్రీ కాంపిటీషన్, స్వేచ్ఛావ్యాపారమున్న కాలానికివెనుకంజ వేదామనుకొంటున్నారు. ఈవిషయమైతరువాత వివరంగా చర్చించుదాం.

కెస్టనర్ యిలా వ్రాసాడు: "కంబైన్లు ఏర్పడటం ఫలితంగా ఖరీదులు ఎడతెగకుండా పెరుగుతాయనే విషయం ప్రధాన పరిశ్రమలైన బొగ్గు, ఇనుము, పొటాషియంలలో స్పష్టంగా కన్పించుతుంది. తయారైన వస్తువుల విషయంలోయిది అంత స్పష్టంగా కన్పించదు. ఉత్పత్తి సాధనాలను తయారుచేసే పరిశ్రమలలోనే లాభాలు అధికమయ్యాయి. తయారయిన వస్తువులను ఉత్పత్తిజేసే పరిశ్రమలకంటే ముడిపదార్థాలతోపనిజేసే పరిశ్రమలకు ట్రస్టులద్వారా హెచ్చులాభాలు వస్తున్నాయా అనే విషయం యింకా పరిశోధించవలసి వుంటుంది. ఇదే రుజువైతే ముడిపదార్థాలను, ఉత్పత్తి సాధనాలను తయారుజేసే పరిశ్రమలు ప్రాముఖ్యమైన స్థానాన్ని వహించుతున్నాయన్నమాట. ఫ్రీ కాంపిటీషన్ (స్వేచ్ఛావ్యాపారం) రోజులలో యిలాంటి ప్రాధాన్యత వుండేదికాదు."

పై ముఖ్యమైన విషయాలను తమకు యిష్టంలేకపోయినా బూర్జువా ఆర్థిక వేత్తలు గుర్తించవలసివచ్చింది. కానికాట్స్కీవంటి అవకాశవాదులు యీసత్యాన్నిగుర్తించడంలేదు. ఈ విషయమై వారు ఉదహరించనేలేదు.

పెట్టుబడిదారీ యుగపు ప్రస్తుతదశలో పెద్దపెట్టుబడికి వున్న ప్రాముఖ్య స్థానాన్ని, అది తీసికొని రాగలిగిన ఒత్తిడిని గుర్తించాలి. సర్వశక్తిసంపన్నమైన మానాపలీలు ఏర్పడటంవల్ల వచ్చే తప్పనిసరి అయిన ఫలితమే ఇది.

మానాపలీల శక్తిని తెలిసికోడానికి యింకోఉదాహరణ చూద్దాం. ముడి పదార్థాలన్నిటిని గాని, ఎక్కువభాగాన్నిగాని హస్తగతం చేసికొంటే మానాపలీలను, కార్టెల్సును నిర్మించడం చాలాసులభమవుతుంది. కాని ముడిపదార్థాలను హస్తగతం చేసికోడానికి వీలులేని పరిశ్రమలలో మానాపలీలు ఏర్పడవనుకోవడం తప్పవుతుంది.

ఉదాహరణకు సిమెంటు పరిశ్రమను చూదాం. దాని కవుసరమైన ముడిపదార్థాలు ఎచటబడితే అచటే దొరుకుతాయి. ఇనప్పటికి జర్మనీలో సిమెంటు పరిశ్రమలో ట్రస్టులు ఏర్పడ్డాయి, ప్రాంతీయ సిండికేట్లు ఏర్పడ్డాయి. ఖరీదులను యివే నిర్ణయించుతాయి. ఒక టన్నుకు సిమెంటు గిట్టుబాటుధర 180 మార్కులయితే ఖరీదు 230-280 మార్కులమధ్య నిర్ణయించబడుతోంది. ఈ పరిశ్రమ నూటికి 12 నుంచి 16 వరకు లాభాలను పంచిపెడుతోంది. ఈ సందర్భంలో ఆధునిక స్పెక్యులేటర్లు భాగాలరూపంలో పంచుకునే లాభాలుగాక విపరీతమైన ఆదనపులాభాలను జేబులో వేసికోడంలో నిపుణులనే సంగతి మరచిపోరాదు. ఈలాంటి లాభసాటి పరిశ్రమలో పోటీదార్లను తొలగించడానికి మానొపలిస్టులు (గుత్త వ్యాపారస్తులు) అనేక ఎత్తులువేస్తారు. వారు అనేక వదంతులను వ్యాపింపజేసి తమ పరిశ్రమను గురించి అనుమానాలు సృష్టించుతారు. వారి వార్తాపత్రికలలో "సిమెంటు పరిశ్రమలో పెట్టుబడిని ధారబోయవద్దని ప్రకటనలు" చేయించుతారు. తమ ట్రస్టులకు బయటగావున్న పర్రియివేటు ఫ్యాక్టరీలను 60 నుంచి 150 వేల మార్కులుదాకా నష్టపరిహారం చెల్లించి కొనివేస్తారు.

ప్రతివిషయంలోనూ మనొపలీలు తమకున్న ఆటంకాలను ఎట్టి గగుర్పాటు లేకుండా తొలగించివేస్తాయి. కొలది నష్టపరిహారం యివ్వడం మొదలుకొని, అమెరికన్ పద్ధతిలో పోటీదారుని డైనమైటు ఉపయోగించి పేల్చివేయడందాకా, ఏ పద్ధతినైనా జంకులేకుండా అవలంబించుతారు.

కంబైన్సు ఏర్పడటంవల్ల ఆర్థిక సంక్షోభాలు తొలగించబడుతాయనే ప్రచారం బూర్జువా ఆర్థికవేత్తలు పెట్టుబడిదారీ విధానాన్ని సమర్థించడానికి అల్లిన కట్టుకథే గాని మరేమీ గాదు. అంతేగాకుండా ఒక పరిశ్రమలో మానొపలీ ఏర్పడటంవల్ల పెట్టుబడిదారీ విధానంలో సహజంగావచ్చే కల్లోలాన్ని మరింత తీవ్రపరుస్తుంది. పెట్టుబడిదారీ విధానంలో యిదివరకే వ్యవసాయాభివృద్ధికి - పరిశ్రమలకు మధ్యఅఘాతం ఏర్పడింది. మానోపలీలు వచ్చాక యిది మరింత తీవ్రమవుతుంది. అన్నిటికంటే బొగ్గు- ఉక్కు పరిశ్రమలలో ట్రస్టులు హెచ్చుగా ఏర్పడి వాటికి ప్రాముఖ్యతవచ్చింది. దీనిఫలంగా యితర పరిశ్రమలలో కేంద్రీకృత నిర్మాణం లేని లోటు కన్పించుతుంది" అని జీడల్స్ అనే గ్రంథకర్త వ్రాశాడు. (ఈయన "పరిశ్రమలఎడ జర్మన్ బ్యాంకుల దృక్పథం" అనే గ్రంథం వ్రాశాడు.)

పెట్టుబడిదారీ విధానాన్ని పూర్తిగా సమర్థించే లీఫ్‌మన్ యిలా వ్రాశాడు "ఆర్థిక విధానం అభివృద్ధి చెందేకొలదీ ప్రమాదకరమైన పరిశ్రమలపైన, విదేశాలలోని కంపెనీల పైన ఎక్కువ దృష్టి నిగుడ్చవలసి వస్తుంది. ఎమంటే వాటియభివృద్ధికి ఎక్కువకాలం అవసరమవుతుంది. లేదా స్థానిక ప్రాముఖ్యతగల పరిశ్రమలపైనే దృష్టి నిగుడ్చవలసి వుంటుంది."

పెట్టుబడి విపరీతంగా పెరిగేకొలదీ ప్రమాదంకూడ పెరుగుతుంది. ఏమంటే పెట్టుబడి హెచ్చినకొలదీ విదేశాలకు ప్రవహించడం ప్రారంభమవుతుంది. అదే సమయాన టెక్నికల్ అభివృద్ధి తీవ్రంగా జరిగేకొలదీ ఆర్థిక జీవితంలోని వివిధశాఖలలో సంక్షోభాలు, గందరగోళం హెచ్చుతుంది.

లీఫ్‌మన్ ఈసంగతి అంగీకరించవలసి వచ్చింది : "కొలదికాలంలోనే మానవజాతి టెక్నికల్ విప్లవాలను చూడవచ్చును. వాటి పలుకుబడి జాతీయార్థిక నిర్మాణంపై తప్పక పడుతుంది." ఎలెక్ట్రిసిటీ, విమానయానం అలాంటి విప్లవాలే. "తీవ్రమైన ఆర్థికమార్పులు వచ్చే కాలంలో స్పెక్యులేషన్ తీవ్రంగా అభివృద్ధిచెందుతుంది."

అన్నిరకాలైన సంక్షోభాలు — ముఖ్యంగా ఆర్థిక సంక్షోభాలు — పెట్టుబడి కేంద్రీకరణకు మరింత దోహదమిస్తాయి. ఈ సందర్భంలో క్రింది విషయాలు గమనించవలసి వుంది. 1900 నాటి ఆర్థిక సంక్షోభాన్ని గురించి ఎం. జీడెల్సు యీ విషయాలను వ్రాశాడు. ఈ ఆర్థిక సంక్షోభంతో మానొపలీల చరిత్రలో కొత్తదశ ప్రారంభమయిందని యిదివరకే చెప్పాము :

"1900 ఆర్థిక సంక్షోభంనాటికి బ్రహ్మాండమైన మానొపలీలతోపాటు అన్ని ముఖ్య పరిశ్రమలలోను అనేక ప్రాత నిర్మాణంతోకూడిన వ్యాపారసంస్థలుండేవి. వాటిని కంబైన్లలో చేరని స్వచ్ఛంద (pure) సంస్థలని పిలచేవారు. అనుకూలమైన ఆర్థిక పరిస్థితులున్న రోజులలో అవి పుట్టాయి. ఆర్థిక దుస్థితి ఫలితంగాఖరీదులు పడిపోడంవల్ల, డిమాండుతగ్గిపోవడంవల్ల యీ ఒంటరిగావున్న వ్యాపారసంస్థలు ప్రమాదంలో పడుతాయి. బ్రహ్మాండమైన కంబైన్లకు ఆర్థిక సంక్షోభం అంత ప్రమాదం కల్గించలేదు. అందుచేతనే 1873 ఆర్థిక సంక్షోభానికంటె 1900 ఆర్థిక సంక్షోభం రోజులలో ఉత్పత్తి కేంద్రీకరణ మరింత తీవ్రంగా జరిగింది. 1873 ఆర్థికదుస్థితిలో వివిద సంస్థల సుస్థిరత్వం పరీక్షించబడింది. కాని ఆ సమయంలో టెక్నికల్ అభివృద్ధిద్వారా పరీక్షకు నిలబడిన కంపెనీలు ఆర్థికదుస్థితిలో జయప్రదంగా బయటపడినా మానోపలీలుగా అభివృద్ధి చెందలేదు. నేడు ఎలెక్ట్రిసిటీ, ఇనుము పరిశ్రమలలో ఏర్పడిన బ్రహ్మాండమైన మానొపలీలు స్థిరమైన గుత్తాధికారాన్ని కలిగివున్నాయి. నిర్మాణబలంవల్లను, బ్రహ్మాండమైన పెట్టుబడి శక్తివల్లనూ, టెక్నికల్ అభివృద్ధివల్లను అవి అలా నిలబడుతున్నాయి. యంత్రనిర్మాణ పరిశ్రమ, ఇంజినీరింగ్ పరిశ్రమలుకూడ కొంతవరకు అదేవిధమైన సుస్థిరతను గలిగివున్నాయి."

"ఈమధ్య వచ్చిన పెట్టుబడిదారి విధానంలోని దశలో" మానొపలీ అంతిమదశ అని చెప్పవచ్చును. కాని బ్యాంకులు నిర్వహించుతున్న పాత్రను గమనించనిచో యీ మానొపలీల శక్తిని సంపూర్ణంగా తెలిసికోజాలము.

# బ్యాంకులు - వాటి క్రొత్తపాత్ర

బ్యాంకు నిర్వహించుతున్న ప్రధానపాత్ర, ప్రాముఖ్యమైనపాత్ర ఏమిటంటే యిచ్చి-పుచ్చుకోడాలకు (చెలామణీకి) మధ్యవర్తిగా పనిజేయడం. (అప్పు లివ్వడానికి, తెచ్చుకోడానికి, ఋణాలు తెచ్చుకోవడానికి, తీర్చడానికి, వస్తువుల కొనుగోలుకు, అమ్మకానికి సాధనంగా పనిజేస్తుంది). ఆవిధంగా చేయడంలో బ్యాంకులు మూలపడివున్న పెట్టుబడిని ఉపయోగంలోకి తెస్తాయి. అనగా లాభం తెచ్చే పెట్టుబడిగా మార్చుతాయి. అన్నిరకాల శిస్తులను వసూలుజేసి పెట్టుబడిదారులకు అందుబాటులో వుంచుతాయి.

బ్యాంకింగు అభివృద్ధి చెందేకొలదీ స్వల్పసంఖ్యగల బ్యాంకులలోనే యీశక్తిఅంతా కేంద్రీకరించబడుతుంది. ప్రారంభంలో మధ్యవర్తిగా మాత్రం పనిజేసిన బ్యాంకులు క్రమంగా మానొపలీలుగా వృద్ధిచెందుతాయి. దేశంలోని పెట్టుబడి అంతా, పెట్టుబడిదారులందరూ వాటి ఆధీనంలో వుంటారు. అదేవిధంగా ఒక దేశంయొక్క లేక అనేక దేశాలయొక్క ఉత్పత్తిసాధనా లన్నిటిమీద, ముడిపదార్థాలమీద పెత్తనం సంపాదించుతాయి. మధ్యవర్తులుగా పనిజేసే అనేకమైనచిన్న బ్యాంకులు చేరి బ్రహ్మాండమైన కొలది మానొపలీలుగా ఏర్పడటం పెట్టుబడిదారీ విధానం సామ్రాజ్యవాదంగా మారడానికి ముఖ్యమైన చిహ్నాలలో ఒకటి. అందుచే మనం యీ సమస్యను వివరంగా తరచాలి.

1907-08 సంవత్సరంలో 10లక్షల పెట్టుబడికి పైగా కలిగిన బ్యాంకులలో మొత్తం 700 కోట్ల మార్కులు డిపాజిట్లను (సిల్వను) కలిగివున్నాయి. 1912-13 సంవత్సరంలో వీటిలో 980 కోట్ల మార్కుల డిపాజిట్లు వున్నాయి. అనగా 5 సంవత్సరాలలో నూటికి 40 పెరుగుదల అన్నమాట ఇంతేగాక ఈ 280 కోట్ల మార్కుల పెరుగుదలలోనూ ఒకకోటి మార్కులను మించిన పెట్టుబడి కలిగిన 57 బ్యాంకుల డిపాజిట్లలో జరిగిన పెరుగుదల 275 కోట్ల మార్కులనే సంగతి గమనించాలి. చిన్న బ్యాంకులు, పెద్ద బ్యాంకుల మధ్య డిపాజిట్లు ఏవిధంగా విభజించబడివున్నాయో యీక్రింది అంకెలను పరిశీలించితే తెలుస్తుంది.

## మొత్తం డిపాజిట్లలో నూటికి ఎంత?

| సంవత్సరం | బెర్లిన్‌లోని బ్రహ్మాండమైన బ్యాంకులలో 9 టిలోనూ | 1 కోటికి పైగా పెట్టుబడికలిగిన ఇతర 48 బ్యాంకులలోనూ | 10 లక్షలకు పైగా కోటికి లోపు పెట్టుబడి గలిగిన 115 బ్యాంకులలో | 10 లక్షలకు లోపు పెట్టుబడి కలిగిన చిన్న బ్యాంకులలో |
|---|---|---|---|---|
| 1907–8 | 47% | 32–5% | 16–5% | 4% |
| 1912–13 | 49% | 36% | 12% | 3% |

పెద్దబ్యాంకులు చిన్నబ్యాంకులను రంగంలోనుంచి క్రమంగా నెట్టివేస్తున్నా యని పైలెఖ్కలు రుజువుచేస్తాయి. ఇంతేగాక 9 బ్రహ్మాండమైన బ్యాంకులలో మొత్తం డిపాజిట్లలో దాదాపు సగం వుంటుందనే సంగతి గుర్తించాలి. ఇచటమనం అనేక చిన్న బ్యాంకులు పెద్దబ్యాంకులకు కేవలంఅనుబంధాలుగా ఎలా అయిపోయాయో చర్చించలేదు. ఆ సంగతి తరువాత చూదాం.

1913 చివరలో స్కూల్జే - గావెర్నిట్స్ అనేవారు యీ విధంగా అంచనావేశాడు. మొత్తం 1000 కోట్ల డిపాజిట్లలోనూ బెర్లినులోని 9 బ్రహ్మాండమైన బ్యాంకులలోనే 510 కోట్ల మార్కుల డిపాజిట్లుగా వున్నాయి. వీటిలోవున్న డిపాజిట్లనేగాక పెట్టుబడినికూడ లెఖ్కకు తీసికుంటే అసలుసంగతి బయటపడుతుంద న్నాడు ఆ రచయిత. “1909 చివరలో 9 బెర్లిన్‌బ్యాంకులు, వాటికి అనుబంధంగా వున్న సంస్థలద్వారా 1130 కోట్ల మార్కులు చెలామణి జరిగింది, అనగాజర్మనీ దేశంలోని బ్యాంకింగు పెట్టుబడిలో నూటికి 83 పాళ్లు వీటిద్వారా జరిగిందన్నమాట. డూయిట్చ బ్యాంకుదాని అనుబంధశాఖలు కలసి 300 కోట్ల వ్యాపారం చేసింది. పూర్వార్ధగోళమంతటిలోకి యిది ఎక్కువపెట్టుబడి కలిగిన బ్యాంకు. జర్మనీస్టేట్ రైల్వేల నిర్వహణ దీనిద్వారానే జరుగుతోంది.

పైన పెద్దబ్యాంకులకు చిన్నబ్యాంకులు అనుబంధించబడ్డాయని వ్రాశాము. ఆధునిక పెట్టుబడిదారీ విధానంలో కేంద్రీకరణకు యిది ముఖ్యమైన మార్గాలలో ఒకటి. పెద్ద సంస్థలు చిన్నసంస్థలను తమలో కలిపివేసికొంటాయి. లేదా లొంగదీసుకొని అనుబంధాలుగా వుంచుకుంటాయి. పెద్దబ్యాంకులు చిన్నబ్యాంకులను తమ గ్రూపులో చేర్చుకొంటాయి. వాటిషేర్లను కొనివేసిగాని, తమషేర్లను మారకం యిచ్చికాని తమలో జీర్ణించుకుంటాయి. లేదా అప్పులిచ్చి వాటిని తమ అధీనంలో (కంట్రోలులో) వుంచుకుంటాయి. ప్రొఫెసర్ లీఫ్‌మన్ ఆధునిక బ్యాంకులను గురించి 500 పేజీల ముఖ్యమైన గ్రంధాన్ని వ్రాశాడు. ఆయన లెఖ్కలను యిచ్చాడుగాని వాటిని సిద్ధాంతీకరించుతూ వ్రాసిన వ్రాతలలో పటిమలేదు. జర్మన్ బ్యాంకులనుగురించి రీస్సెర్ వ్రాసిన గ్రంధం పెట్టుబడి కేంద్రీ

కరణాన్ని గురించి తెలిసికోడానికి బాగావినియోగపడుతుంది. ఆ లెఖ్కలను పరిశీలించే ముందు ఒక ఉదాహరణను చూదాం.

డూయిట్స్ బ్యాంకు గ్రూపు ముఖ్యమైన పెద్దగ్రూపులలో ఒకటి. ఈగ్రూపులోని బ్యాంకుల మధ్యవున్న బంధనాలను పరిశీలించాలంటే అందులో పాల్గొంటున్న వాటి వివరాలను తెలిసికోవాలి. ఈ క్రిందిటేబిల్‌లో బ్యాంకులు 3 డిగ్రీలుగా విభజించబడ్డాయి.

డూయిట్చ్ బ్యాంకుతో సంబంధించిన బ్యాంకులు

| | ఎల్లపుడు వుండేవి | చాలాకాలం కలిసివుండేవి | అపుడపుడు కలిసేవి | మొత్తం బ్యాంకులు |
|---|---|---|---|---|
| 1 డిగ్రీబ్యాంకులు | 17 బ్యాంకులు. | 5 బ్యాంకులు | 8 బ్యాంకులు. | 30 బ్యాంకులు. |
| 2 డిగ్రీ॥ | ఇందులో 9 బ్యాంకులు 34 ఇతరబ్యాంకులల్లో పాల్గొంటున్నాయి. | | అందులో 5 బ్యాంకులు 14 ఇతరబ్యాంకులలో పాల్గొంటున్నాయి. | అందులో 14 బ్యాంకులు 48 ఇతర బ్యాంకులలో పాల్గొంటున్నాయి. |
| 3. డిగ్రీ॥ | ఇందులో 4 బ్యాంకులు 7 ఇతరవాటిలో పాల్గొంటున్నాయి | | ఇందులో 2 బ్యాంకులు మరిఒకటిలో పాల్గొంటున్నాయి. | ఇందులో 6 బ్యాంకులు 9 ఇతరవాటిలో పాల్గొంటున్నాయి. |

మొదట డిగ్రీలో చెప్పబడినవాటిలో 8 దీనిపై ఆధారపడే బ్యాంకులున్నాయి. వీటిలో 3 విదేశీయబ్యాంకులు. ఒకటి ఆస్ట్రియాలోనూ. రెండు రష్యాలోనువున్నాయి. మొత్తం డూయిట్చ్‌బ్యాంకు గ్రూపులో ప్రత్యక్షంగాకాని. పరోక్షంగాకాని 87 బ్యాంకులు కలసి వున్నాయి. మొత్తం వీటిలో పెట్టుబడి 200 నుంచి 300 కోట్ల మార్కులుదాకా వుంటుంది.

అలాంటి గ్రూపుకు అధిపతిగావుండే బ్యాంకు యిచ్చి పుచ్చుకోడాలలో మధ్యవర్తి పాత్రను నిర్వర్తించే సాధారణ బ్యాంకులవంటిది. అది తనవలెనే పెద్ద పెట్టుబడిగల అరడజను యితర బ్రహ్మాండమైన బ్యాంకింగు గ్రూపులతో సంబంధం కలిగివుంటుంది. ఇవన్నీ ప్రభుత్వ ఋణపత్రాలతో వ్యాపారంచేస్తాయి. బ్యాంకింగులో గుత్తాధికారం సంపాదించి దేశ ఆర్థిక విధానంలో ప్రముఖపాత్రను వహించుతాయి.

రీస్సెర్ యిచ్చిన లెఖ్ఖలను పరిశీలించితే జర్మనీలో 19 వ శతాబ్దం ఆఖరులోను, 20 వ శతాబ్దం ఆరంభంలోనూ బ్యాంకింగు ఏవిధంగా కేంద్రీకరించబడిందో తెలుస్తుంది. వాటిని క్లుప్తంగా యిచట యిస్తున్నాము.

6 పెద్ద జర్మన్ బ్యాంకులకు శాఖలు యిలా వృద్ధిచెందాయి :

| సంవత్సరం | జర్మనీలో శాఖలు | సేవింగ్స్ బ్యాంకులు ఎక్స్ఛేంజి ఆఫీసులు | ఎన్ని ఇతర బ్యాంకులలో షేర్లు కలిగివుంది | మొత్తం సంస్థల సంఖ్య |
|---|---|---|---|---|
| 1895 | 16 | 14 | 1 | 42 |
| 1900 | 21 | 40 | 8 | 80 |
| 1911 | 104 | 276 | 63 | 450 |

ఈవిధంగా బ్యాంకుల శాఖలు దేశమంతటా వ్యాపించుతాయి. దేశంయొక్క పెట్టుబడి, ఆదాయాన్ని కేంద్రీకరించి అనేకవందల ఆర్థికసంస్థలను కలపివేస జాతీయ పెట్టుబడిదారీ ఐక్యతకు దారితీస్తాయి. తద్వారా అంతర్జాతీయ పెట్టుబడిదారీ ఐక్యతకు మార్గం చూపుతాయి. ఇదివరకు స్థానిక ప్రాముఖ్యతను మాత్రమే కలిగివున్న సంస్థలు అన్ని వైపులకు వ్యాపించడాన్ని గావెర్నిట్జ్ అనే గ్రంథకర్త "డీ సెంట్రలైజేషన్" (విభజన) జరుగుతోందనివ్రాశాడు. కాని వాస్తవంలో అది విభజనకాదు. కేంద్రీకరణమాత్రమే మానోపలీల (గుత్త వ్యాపారసంస్థల) అధికారం, ప్రాముఖ్యత హెచ్చుతూందేగాని తగ్గడంలేదు.

పాత పెట్టుబడిదారీ దేశాలలో బ్యాంకింగు యింకా చక్కని వలమాదిరిగావ్యాపించింది. బ్రిటనులో (ఐర్లండుసహా) 1910లో 7151 బ్యాంకు శాఖలున్నాయి. 4 పెద్దబ్యాంకులకు ఒక్కొకదానికి 400 లకు పైగా శాఖలున్నాయి. మరినాలుగు బ్యాంకులకు ఒక్కొకదానికి 200 లకు పైగా శాఖలున్నాయి. పదకొండు బ్యాంకులకు ఒక్కొకదానికి 100 కు మించిన శాఖలున్నాయి.

ఫ్రాన్సులో మూడు చాలాముఖ్యమైన బ్యాంకులున్నాయి. వాటిశాఖలు యీవిధంగా విస్తరించి వున్నాయి.

| సంవత్సరం | ఉన్న బ్రాంచీలు | | | పెట్టుబడి | డిపాజిట్లు |
|---|---|---|---|---|---|
| | పారిస్‌లో | రాష్ట్రాలలో | మొత్తం | ఫ్రాంకులలో | ఫ్రాంకులలో |
| 1870 | 17 | 47 | 64 | 20 కోట్లు | 43 కోట్లు |
| 1890 | 66 | 192 | 258 | 26 కోట్లు | 124 కోట్లు |
| 1909 | 196 | 1033 | 1229 | 89 కోట్లు | 436 కోట్లు |

ఆధునిక బ్యాంకు ఎంతవిస్తారమైన వ్యాపారం చేస్తుందో తెలుపడానికి రీస్సెర్ ఒక బ్యాంకుకు వచ్చేలేఖలు, వ్రాసేజవాబుల సంఖ్యలను యిచ్చాడు. 'డిస్కోంటో గసెల్షాఫ్ట్' అనేబ్యాంకు జర్మనీలోనూ, ప్రపంచంలోనూ చాలాముఖ్యమైన బ్యాంకులలో ఒకటి. దానికి 1914 లో 30 కోట్లపెట్టుబడివుండేది. దాని ఆఫీసుకువచ్చే ఉత్తరప్రత్యుత్తరాల సంఖ్యక్రింది టేబిల్లో యివ్వబడింది.

| సంవత్సరం | వచ్చిన జాబులు | వ్రాసిన జాబులు |
|---|---|---|
| 1852 | 6,135 | 6,292 |
| 1870 | 85,800 | 87,513 |
| 1900 | 533,102 | 626,043 |

1875 లో 'క్రెడిట్ లినాయిస్' అనే పారిస్ బ్యాంకుకు 28,535 ఓపెన్ ఎక్కౌంటులు (కాతాలు) వుండేవి. 1912 లో దానికి 633,539 కాతా లుండేవి.

పెట్టుబడి ఎలా కేంద్రీకరించబడుతూంది, వ్యాపారంఎలావిస్తరించుతూంది పైలెఖ్ఖలే స్పష్టంగాతెలుపుతున్నాయి. బ్యాంకులప్రాముఖ్యతఎలాహెచ్చుతుందో కూడా అవితెలుపుతాయి.

బ్యాంకులద్వారా దూరదూరంగావున్న పెట్టుబడిదారులందరు కలుస్తున్నారు. సమిష్టి పెట్టుబడిదారీ ఐక్యత నిర్మించబడుతూంది. అనేకమంది పెట్టుబడిదారుల కరెంటు ఎక్కౌంటులను (కాతాలను) వుంచడంలో బ్యాంకులుచేసేది టెక్నికల్పని మాత్రమే అనుకోరాదు. ఈ పని బ్రహ్మాండమైన రూపంలో జరుగుతున్నపుడు కొలదిమంది మానొపలిస్టులు (గుత్తాధికారులు) పెట్టుబడిదారీసమాజం యొక్క పరిశ్రమలను, వర్తకాన్ని కంట్రోలు చేయగలుగుతారు. వారు తమ చేతిక్రిందవున్న పెట్టుబడిదారు లందరియొక్క లోతుపాతులు తెలసికోగల్గుతారు. అప్పులను విరివిగా యివ్వడంద్వారా లేదా బిగబట్టడం ద్వారా ఒక్కొక పెట్టుబడి దారుని కంట్రోలు చేయగలుగుతారు. చివరకు వారి జీవితం, భావిగతి బ్యాంకుల చేతుల్లో వుండిపోతుంది. అవి వారికి పెట్టుబడి దొరకకుండాచేసి నాశనం చేయవచ్చు. లేదా హెచ్చు పెట్టుబడి సహాయంచేసి తోడ్పడవచ్చు.

బెర్లిన్లోని డిస్కొంటోగెస్ల్లిషాఫ్ట్'బ్యాంకుకు 30 కోట్లమార్కుల పెట్టుబడివుందని పైన తెలిపాము. బెర్లిన్లోని రెండు పెద్దబ్యాంకులైన డిస్కొంటో, డ్యూయిట్చ్'లమధ్య నాయకత్వంకొరకు వచ్చిన పోరాటం ఫలితంగానే మొదటిదాని పెట్టుబడి ఆ విధంగా పెరిగింది.

1870 లో 'డూయిట్చ్' బ్యాంకుకు 3 కోట్ల మార్కులు పెట్టుబడివుండేది. అప్పుడు 'డిస్కొంటో' బ్యాంకుకు 150 లక్షల మార్కుల పెట్టుబడి వుండేది.

1908 నాటికి డిస్కొంటో' పెట్టుబడి 20 కోట్ల మార్కులుదాకా పెరిగింది. కాని 'డూయిట్చ్' పెట్టుబడి 17 కోట్లు మాత్రమే వుంది. 1914 నాటికి 'డిస్కొంటో' తన

పెట్టుబడిని 25 కోట్లదాకా పెంచగలిగింది. 'డూయిట్చ్' బ్యాంకు ఇంకో ముఖ్యమైన బ్యాంకును (యూనియన్ ఆఫ్ స్కాఫాసాన్ అనే పేరుగల దానిని) తనలో కలుపుకొని తనపెట్టుబడి 30 కోట్లదాకా వృద్ధిచేయగలిగింది. ఈ రెండుబ్యాంకుల మధ్య పోరాటం జరుగుటతోపాటు తరుచుగా అగ్రిమెంటులు (రాజీలు) కూడా జరుచుతుండేవి.

బ్యాంకింగు యీ విధంగా అభివృద్ధి చెందడంతోపాటు బ్యాంకింగు సమస్యలను పరిశోధించే స్పెషలిస్టులు (నిపుణులు) తయారయ్యారు. ఆర్థికసమస్య ఏదీ బూర్జువా సంస్కరణవిధానాన్ని దాటిపోకుండా ఈ నిపుణులు కనిపెట్టి వుంటారు.

'డిస్కొంటో' బ్యాంకు పెట్టుబడిని 30 కోట్లదాకా పెంచడాన్ని గురించి. చర్చించుతూ 'డైబ్యాంకు' అనే పత్రిక ఇలా వ్రాసింది'. "ఇతర బ్యాంకులు కూడా యీ పద్ధతిని అవలంబించుతాయి. నేడు జర్మనీ ఆర్థిక జీవితాన్ని పాలించుతున్న 300 మంది బ్యాంకర్ల సంఖ్య క్రమంగా 50 కి తగ్గిపోతుంది. ఇంకా 25 కు కూడా తగ్గిపోవచ్చు. ఈ విధమైన కేంద్రీకరణ బ్యాంకింగుతోనే అంటిపెట్టుకు వుండదు. బ్యాంకులకు, పారిశ్రామిక కంబైన్లకు వున్న సంబంధాన్ని బట్టి వాటికికూడా వ్యాపించుతుంది .......ఒకరోజు తెల్లవారేటప్పటికి మన కండ్లముందు ట్రస్టులు, మానోపలీలు తప్ప మరేవీ కనిపించవు. ఈ ప్రయివేటు (స్వంత) మానోపలీలను ప్రభుత్వ మానోపలీలుగా మార్చవలసిన అవసరం ఏర్పడుతుంది. స్టాకులు, షేర్లతో వ్యాపారం (స్పెక్యులేషన్) ప్రారంభించి, పరిస్థితులను వాటి యిష్టమొచ్చినట్లు పోనిచ్చాము. చివరకు యీ రూపం దాల్చాయి. ఐనా మనం సిగ్గుపడవలసిందేమీ లేదు.

బూర్జువా మేధావి చేతగానితనానికి పైది చక్కని ఉదాహరణ. బూర్జువా సైన్సుకు పై అభిప్రాయాలకు అడ్డేతేడా వుండదు. పై రచయిత హృదయపూర్వకంగా నమ్మి వ్రాస్తే, బూర్జువాసైన్సు వాస్తవాన్ని కప్పిపుచ్చడానికి ప్రయత్నించుతుంది. అంతేభేదం.

కేంద్రీకరణ ఫలితాలను చూచి ఆశ్చర్యం వెల్లడించడం; జర్మన్ పెట్టుబడిదారి ప్రభుత్వాన్ని లేక సమాజాన్ని నిందించుకోడం, స్టాకులు, షేర్లతో వ్యాపారంచేయడంవల్ల కేంద్రీకరణ త్వరగా జరిగిందని భయపడటం; అమెరికన్ ట్రస్టులను చూచిభీతిచెందడం; అంతకంటే జర్మన్ కార్టెల్సు మంచివనుకోడం; అమెరికన్ ట్రస్టులక్రింద టెక్నికల్ అభివృద్ధి విపరీతంగా జరుగుతూందని నిరశించడం; ఇదీవరుస. ఇంతకంటే చేతగానితనం మరేముంటుంది?

వాస్తవాన్ని ఎవరూ మార్చలేరు. జర్మనీలో ట్రస్టులులేవు. కాని కార్టెల్సువున్నాయి. నేడు జర్మనీ 300 మంది కోటీశ్వరులచే పాలించబడుతూంది. వారిసంఖ్యక్రమంగా తగ్గిపోతూంది కూడా. అన్ని దేశాలలోనూ - వాటి శాసనాలలో భేదాలువున్నప్పటికి పెట్టుబడి కేంద్రీకరణ త్వరితంగా జరుగుతూంది. మానోపలీలు ఏర్పడుతున్నాయి.

అర్థశతాబ్దంక్రి ఒనే మార్క్స్ కాపిటల్' అనే తన గ్రంథంలో యిలా వ్రాశాడు. "సామాజికనిర్మాణంలో బ్యాంకులు నూతనరూపాన్ని సృష్టించు తున్నాయి. సామాజిక నిర్మాణంలో బ్యాంకులు ప్రధానమైన స్థానంవహించుతున్నాయి. ప్రపంచంలోవున్న స్టాకులపైన, ఉత్పత్తి సాధనాలపైన పూర్తియైన పెత్తనం సంపాదించుతున్నాయి." (3వ వాల్యూం 2వ భాగం.)

బ్యాంకింగు పెట్టుబడి అభివృద్ధిని గురించిన లెఖ్ఖలు పైన యివ్వబడినాయి. పెద్ద బ్యాంకులయొక్క శాఖలు, ఆఫీసులు, కాతాలు ఎలా పెరిగాయో తెలిపాము. ఈ బ్యాంకుల ఎకౌంటులు పెట్టుబడిదారీవర్గం అంతటియొక్క ఆర్థిక స్థితినంతను తెలియజేస్తాయి. అంతేగాదు చిన్న స్వంత ఆస్తిపరుల ఆదాయాన్ని, ఉద్యోగులఆదాయాన్ని, కార్మికులలో హెచ్చుజీతాలు పుచ్చుకునే వారి ఆదాయాన్ని కూడ బ్యాంకు ఎకౌంటులు ప్రతిబింబింపజేస్తాయి. ఫ్రాంసులోవున్న 3-6 బ్యాంకులు, జర్మనీలోవున్న 6-8 బ్యాంకులు వందలకోట్ల వ్యాపారాన్ని చేస్తున్నాయి దీనిఫలితంగా ఉత్పత్తి సాధనాలపైన ఆర్థిక జీవితమంతటిపైన పెత్తనం వహించు తున్నాయి.

కాని ఉత్పత్తిసాధనాల పంపకం మాత్రం సమాజమంతటి హస్తగతం కాలేదు. అవి స్వంత ఆస్తిగానే వుండిపోయాయి. పెద్ద పెట్టుబడిదారుల, ముఖ్యంగా గుత్తవ్యాపారుల ప్రయోజనాలను అనుసరించే వుండిపోయాయి. అందుచేతనే ప్రజలలో అధిక సంఖ్యాకుల జీవితం గడవడమే కష్టమవుతోంది. వ్యవసాయాభివృద్ధిని పరిశ్రమల అభివృద్ధి ఎన్నోరెట్లు మించిపోయింది. అంతేగాక ప్రధాన పరిశ్రమలు తక్కిన పరిశ్రమలకంటే అధిక లాభాలను సంపాదించుతున్నాయి.

సేవింగ్స్ బ్యాంకులు, పోస్టాఫీసులు పెట్టుబడిదారీ ఆర్థిక విధానాన్ని సమాజపరం చేయడానికి బ్యాంకులకు వ్యతిరేకంగా పోటీ చేస్తున్నాయి. అవి విడివిడిగా వుండి అనేక ప్రాంతాలకు విస్తరించివున్నాయి. బ్యాంకులలోనూ, సేవింగ్స్ బ్యాంకులలోనూ డిపాజిట్లు ఎలా పెరిగాయో లెక్కలను ఒక అమెరికన్ కమీషన్ సేకరించింది.

బ్యాంకు డిపాజిట్లు కోట్లలో

| సంవత్సరం | బ్రిటనులో | | ఫ్రాంసులో | | జర్మనీలో | |
|---|---|---|---|---|---|---|
| | బ్యాంకుల్లో | సేవింగ్స్ బ్యాంకుల్లో | బ్యాంకుల్లో | సేవింగ్స్ బ్యాంకుల్లో | బ్యాంకుల్లో | సేవింగ్స్ బ్యాంకుల్లో |
| 1880 | 840 కోట్లు | 160 కోట్లు | — | 100 కోట్లు | 50 కోట్లు | 260 కోట్లు |
| 1888 | 1250 ,, | 210 ,, | 150 కోట్లు | 220 ,, | 110 ,, | 450 ,, |
| 1908 | 2320 ,, | 420 ,, | 370 ,, | 420 ,, | 710 ,, | 1390 ,, |

సేవింగ్స్ బ్యాంకు నూటికి సంవత్సరానికి 4 చొప్పున వడ్డీ చెల్లించవలసివుంది. అందుచే అవి తమ డబ్బును లాభప్రదంగా పెట్టుబడి పెట్టవలసివస్తుంది; స్పెక్యులేషన్ బేరాలకు, తాకట్లు పెట్టించుకోడానికి దిగవలసివస్తుంది. దీనివలన క్రమక్రమంగా బ్యాంకు లకు, సేవింగ్స్ బ్యాంకులకు మధ్యవున్న తేడా నామమాత్రమైపోతుంది. బోకుం, ఎర్‌ఫర్ట్‌లలోని వర్తకసంఘాలు (ఛాంబర్స్ ఆఫ్ కామర్స్) బ్యాంకులు చేసేపనిని సేవింగ్స్ బ్యాంకులు చేయకుండా నిషేధించాలని కోరాయి. పోష్టాఫీసు బ్యాంకింగు పను లకు కూడా హద్దులేర్పరచాలని కోరాయి.

బ్యాంకింగు పెద్దలు ప్రభుత్వం ఎపుడో ఒకపుడు తమ బ్యాంకులను హస్తగతం చేసికొంటుందేమోనని భయపడుతున్నట్లు కన్పించుతుంది. కాని యిది ఒకే ఆఫీసులో పనిజేసే ఇద్దరు మానేజర్ల మధ్యవుండే పోటీకంటే మించినదికాదు. ఏమంటే సేవింగ్స్ బ్యాంకులలో ప్రజలు దాచుకొన్న కోట్లకొలది ధనంకూడ ఆ బ్యాంకింగు పెద్దల చేతుల్లోకే పోతుంది. నిజానికి పెట్టుబడిదారీ సమాజంలో ప్రభుత్వ మానొపలి అంటే కోటీశ్వరుల లాభాలను గ్యారంటీ చేయడమన్నమాట. ఏదైనా పరిశ్రమ దివాలాతీసే స్థితిలోవుంటే దాని యజమానులను ప్రభుత్వం రక్షించడమన్నమాట.

పెట్టుబడిదారీ విధానంయొక్క ప్రాతదశ అనగా ఫ్రీకాంపిటీషన్ (స్వేచ్ఛావ్యాపారం) దశపోయి కొత్తదశ అనగా మానొపలీల పెత్తనం ఏర్పడింది. దీనికి చిహ్నంగా స్టాక్ ఎక్చేంజి (ప్రభుత్వ మారకపు బ్యాంకు) ప్రాముఖ్యం తగ్గిపోతూంది. బ్యాంకులు తమ కాతాదారుల అన్ని అవసరాలను తీర్చలేనపుడు యీ మారకపు బ్యాంకులకు ప్రాముఖ్యత వుండేది. ఇపుడు బ్యాంకుల కాశక్తి పచ్చుటచే దాని ప్రాముఖ్యత తగ్గిపోయింది.

ఇపుడు "ప్రతి బ్యాంకు స్టాక్ ఎక్చేంజిగా పనిజేస్తూంది". బ్యాంకు పెద్దది అయ్యే కొలది, పెట్టుబడి కేంద్రీకరించబడేకొలదీ బ్యాంకుల కీశక్తి వస్తుంది. 1870 ప్రాంతంలో 'స్టాక్ ఎక్చేంజీ'లు 'మూడు పువ్వులు ఆరు కాయలుగా వున్నపుడు' జర్మనీలో పారిశ్రామికయుగం ప్రారంభమయింది. ఇపుడు వాటి సహాయం లేకుండానే బ్యాంకులు, పరిశ్రమలు తమ పనిని నెరవేర్చుకొంటున్నాయి.

ప్రొఫెసర్ స్కూల్జె - గావెర్నిట్జ్ జర్మన్ సామ్రాజ్యవాదాన్ని సమర్థించేవారిలో ఒకడు. అతనిని అన్నిదేశాలలోని సామ్రాజ్యవాదులు గొప్పనిపుణునిగా ఎంచుతారు. అత డిలావ్రాశాడు. "పెద్దబ్యాంకులు స్టార్ ఎక్చేంజీపై పెత్తనం వహించడమంటే జర్మనీలో పెట్టుబడిదారీ ప్రభుత్వంయొక్క నిర్మాణం పూర్తిఅయిందన్నమాట. ఆర్థిక సూత్రాలు వాటంతటవే పనిచేస్తున్నాయంటేనూ, బ్యాంకులపెత్తనం పెరిగిందంటేనూ జాతీయ ఆర్థిక జీవితంయొక్క బాధ్యత అంతా కొలదిమంది డైరెక్టర్ల చేతుల్లో వుందన్నమాట" ఈ రచ యిత ఒకవిషయాన్ని మాత్రం కావాలని దాచాడు. అదేమిటంటే ఆర్థిక జీవితంపై బ్యాంకు లకు పెత్తనం రావడమంటే కొలదిమంది మానొపలిస్టులు ప్రజలందరిని దోచుకోడమన్న

మాట. ఈసంగతిమాత్రం అతడుచెప్పలేదు. అవును! మరి! బూర్జువా ఆర్థికవేత్త కర్తవ్యం బూర్జువా ఆర్థిక విధానంలోని గుట్టుమ బట్టబయలు చేయడంకాదు. ధనిక మానొపలిష్టుల లోని రహస్యాలను బయట పెట్టడంకాదు? వాటిని మరుగు పరడమే అతని విధి.

రీస్సెర్ అనే యింకో బూర్జువా ఆర్థిక నిపుణుడు కూడ అదే విధంగా తానునిరాకరించవీలులేని నిజవిషయాలను మరుగుపరచడానికి సాచివేత కబుర్లతో సరిపుచ్చాడు. స్టాక్ఎక్స్చేంజీ క్రమక్రమంగా తన స్వభావాన్ని కోల్పోతూంది. ఒకప్పుడు అది ఆర్థికజీవితానికి ముఖ్యంగా సెక్యూరిటీల మారకానికి అత్యవసరంగావుండేది. వాటి విలువను నిర్ణయించడానికే కాకుండా, ఆర్థిక ప్రవాహాన్ని తనయిష్టం వచ్చినట్లు నడపడానికి కూడ వినియోగించేది. నేడా ప్రాముఖ్యతను స్టాక్ ఎక్స్చేంజి కోల్పోయింది"

ఇంకోవిధంగా చెప్పాలంటే ఫ్రీకాంపిటీషన్. స్టాక్ ఎక్స్చేంజీలతో కూడిన పాతరకం పెట్టుబడిదారీవిధానం గతించి పోతూంది. దాని స్థానే ఫ్రీకాంపిటీషన్. మానొపలీలతో మిశ్రితమైన యింకో తాత్కాలిక దశవచ్చింది. వెంటనే యీ తాత్కాలికదశ దేనికి దారి తీస్తుంది? అనే ప్రశ్నవస్తుంది. కాని బూర్జువా విద్వాంసులు యీ ప్రశ్నకు సమాధానమివ్వడానికే భయపడుతున్నారు.

"ముప్పయి యేండ్ల క్రితం శరీరకష్టానికి సంబంధించని ఆర్థిక కృషిలో పదింట తొమ్మిదివంతులు యజమానులే చేసేవారు. ఈ రోజునమెదడు ఉపయోగించిచేయవలసిన పనిలోకూడ పదింట తొమ్మిదివంతులు జీతానికున్న ఉద్యోగులే చేస్తున్నారు. బ్యాంకింగు యీ పరిణామానికి దారితీస్తూంది." అని స్కూల్జేవ్రాశాడు. ఆధునిక పెట్టుబడిదారీ విధానం యొక్క సామ్రాజ్యవాద దశలో వచ్చిన యీ దృక్పథం ఎటువైపుకు దారితీస్తుంది?

పెట్టుబడి కేంద్రీకరణ ఫలితంగా కొలది బ్యాంకులు పెట్టుబడిదారీ ఆర్థికవిధానంలో ప్రధానపాత్ర వహించుతున్నాయి. దీని ఫలితంగా మానొపలీలు, ట్రస్టులు ఏర్పడే విధానం సహజంగా మరింత బలపడుతూంది. ఉదాహరణకు అమెరికాలో 9 పెద్దబ్యాంకులున్న దశ పోయింది. నేడు రెండు బ్రహ్మాండమైన బ్యాంకులు మాత్రమే వున్నాయి. ఇవి రాక్ ఫెల్లర్, మార్గన్ అనే కోటీశ్వరులచే పరిపాలించబడుతూ 11000 కోట్ల మార్కుల పెట్టుబడి కలిగి వున్నాయి. జర్మనీలో డిస్కొంటో బ్యాంకు, స్కాఫానేన్ బ్యాంకు కలిసిపోడాన్ని గురించి జీటంగ్ పత్రిక యీ విధంగా వ్రాసింది.

"కేంద్రీకరణ హెచ్చి బ్యాంకులసంఖ్య తగ్గేకొలదీ పరిశ్రమలు కొలదిమంది కోటీశ్వరులపై పెట్టుబడికి ఆధారపడవలసి వస్తూంది. పరిశ్రమలకు, బ్యాంకులకు మధ్య సన్నిహిత సహకారము వుండాలి. కాని యిప్పుడు పెట్టుబడి కావలసిన పారిశ్రామిక సంస్థల స్వేచ్ఛ తగ్గిపోతూంది. అందుచేతనే బ్యాంకులు ట్రస్టులలోకి కేంద్రీకరించబడటాన్ని పారిశ్రామిక సంస్థలు సందేహదృష్టితో చూస్తున్నాయి. అంతేగాక పెద్ద బ్యాంకులమధ్య తరు

చుగా అగ్రిమెంటులు కూడా జరుగుతున్నాయనే సంగతి మనం చూశాం. అంటే వాటి మధ్య పోటీ తొలగించబడుతూందన్నమాట."

బ్యాంకుల అభివృద్ధిలో ఆఖరిదశ ఏమిటంటే మళ్ళీ మానొపలీ' అని చెప్పవలసి వస్తుంది.

బ్యాంకులు, పరిశ్రమల మధ్య సన్నిహిత సహకారముండాలనే సంగతి గుర్తించితే బ్యాంకులు వహించే నూతనపాత్ర బోధపడుతుంది. ఒకబ్యాంకు ఒకపారిశ్రామిక సంస్థకు కాతాతెరుస్తుందనుకొందాం. బిల్లును వసూలు చేస్తుందనుకొందాం. ఈ పనులన్నిటినీ వేరు వేరుగా చూస్తే యింతమాత్రంచేత పారిశ్రామిక సంస్థయొక్క స్వాతంత్ర్యం తగ్గదు. బ్యాంకు మధ్యవర్తిగా పనిచేయడంకంటే మరేపాత్రవహించదు. ఈ పనుల సంఖ్యపెరిగి నపుడు, నిత్యకృత్యం అయినపుడు, బ్యాంకు చేతులలోకి విపరీతమైన పెట్టుబడి చేరు నపుడు, ఒకపారిశ్రామిక సంస్థకు కాతా (కర్రెంటు ఎక్కౌంటు) పెట్టిన బ్యాంకుకు పై సంస్థయొక్క ఆర్థికస్థితి అంతా అవగాహన అవుతుంది. ఫలితం ఏమిటంటే పారిశ్రామిక సంస్థ ఆబ్యాంకుపై ఆధారపడవలసివస్తుంది. స్వాతంత్ర్యాన్ని కోల్పోతుంది.

ఈ పరిస్థితులకు అనుగుణ్యంగానే ఇంకోమార్పు జరుగుతోంది. బ్యాంకర్లు, పారిశ్రామిక, వర్తక సంస్థల యజమాన్లమధ్య సన్నిహిత సంబంధం ఏర్పడుతోంది. ఒక సంస్థషేర్లు మరొకరు కొనడంద్వారాను, బ్యాంకుడైరెక్టర్లు పారిశ్రామిక సంస్థల మానేజి మెంటులో ప్రవేశించడం వల్లను ఒకదానితో మరొకటి లీనమైపోతున్నాయి.

జర్మన్ ఆర్థికవేత్త జీడెల్స్ పెట్టుబడి కేంద్రీకరణాన్ని గురించి, సంస్థలు కలసి పోవడాన్ని గురించి పూర్తిలెఖ్ఖలను సేకరించాడు. ఆరుపెద్ద బెర్లిన్ బ్యాంకులయొక్క డైరెక్టర్లు 344 పారిశ్రామిక సంస్థలలో పాల్గొంటున్నారు. 407 యితర కంపెనీలలో యీ బ్యాంకుల మానేజర్లు ప్రతినిధులువుంటున్నారు. మొత్తంపైన 6 బ్యాంకుల ప్రతినిధులు 751 కంపెనీలను సూపర్‌వైజు చేస్తున్నారు. ఇందులో 299 కంపెనీల డైరెక్టర్లలోబ్యాంకుల ప్రతినిధులు యిద్దరు చొప్పున ఉన్నారు. వీటిలో రకరకాల పరిశ్రమలు, వర్తక సంస్థలు చేరివున్నాయి, ఇన్స్యురెన్సు, ట్రాన్స్‌పోర్టు, హోటళ్లు, థియేటర్లు, రహదారి మార్గాల కంపెనీలు వగైరా వున్నాయి. రెండోవైపున 1910 లో యీ ఆరుబ్యాంకుల డైరెక్టర్ల బోర్డులో 51 మంది పెద్దపరిశ్రమల యజమానులున్నారు. వీరిలో ప్రఖ్యాతి వహించిన 'కుప్స్" కర్మాగార డైరెక్టర్లుకూడా చేరి వున్నారు. 1895 నుంచి 1910 మధ్య యీ ఆరు బ్యాంకులు అనేకవందల పారిశ్రామిక కంపెనీల షేర్లతో వ్యాపారం చేశాయి. (ఈకంపెనీల సంఖ్య 218—419 మధ్య మారుతూవుండేది.)

బ్యాంకులకు, పరిశ్రమలకు మధ్య ఉన్న సంబంధం — రెండిటికీ ప్రభుత్వంతో వున్న సంబంధంవల్ల — మరింత సన్నిహితమవుతోంది. జీడెల్స్ యిలా వ్రాశాడు. సలహాసంఘాల (అడ్వయిజరీ బోర్డులలో) స్థానాలలోయిదివరకు సివిల్ సర్వెంట్సుగా

(పభుత్వోద్యోగులుగ) పనిజేసినవారిని నియమించుతారు. వారిద్వారా ప్రభుత్వంతో సన్నిహితసంబంధంచేకూర్చుకోబడుతుంది. సాధారణంగా ప్రతిపెద్దబ్యాంకు సంఘానసంఘంలోనూ పార్లమెంటు సభ్యుడోలేదా బెర్లిన్‌నగర కౌన్సిల్లరో వుంటాడు.

ఈవిధంగా బ్రహ్మాండమైన పెట్టుబడిదారీ మానోపలీలు ఏర్పడుతున్నాయి; విస్తరించుతున్నాయి. దీని ఫలితమేమిటంటే ఆధునిక పెట్టుబడిదారీ సమాజాన్ని పరిపాలించుతున్న కొలది వందంనుంది కోటీశ్వరులు ఆర్థిక వ్యవస్థనంతను తమలోతాము ఒకపద్ధతి ప్రకారం విభజించుకొంటున్నారు.

"పరిశ్రమల యజమానులు బ్యాంకుల మానేజిమెంటులో పాల్గొనడంవల్లను, రాష్ట్రీయ బ్యాంకుల మానేజర్లు పారిశ్రామిక సంస్థలలో పాల్గొనుటవల్లను పెద్దసంస్థల డైరెక్టర్లలో ప్రవీణులు తయారవడం అవసరమయింది.

"బ్యాంకింగు చాల విస్తరించినపుడు ముఖ్యంగా పరిశ్రమలతో విశేషసంబంధాలను కలిగివున్నపుడే ప్రవీణులు తయారవడం సాధ్యమవుతుంది.

"పని విభజన రెండురకాలుగా జరుగుతోంది. ఒకవైపున పరిశ్రమలతో సంబంధించిన వ్యవహారమంతా ప్రత్యేకంగా ఒక మానేజరుకు అప్పగించబడుతూంది. రెండో వైపున ఒకేరకమైన ప్రయోజనాలు, పనికలిగిన సంస్థలనుగాని గ్రూపులనుగాని ఒక్కొక్క డైరెక్టరు సూపర్వైజు చేస్తూవుంటాడు. (అనగా ఫరమ్స్‌ను సూపర్వైజు చేయడం సాధ్యమయ్యేదశకు పెట్టుబడిదారీ విధానం వచ్చింది.) "ఒకడు జర్మన్ పరిశ్రమలలో ప్రావీణ్యత సంపాదించుతాడు. (స్పెషలైజు చేస్తాడు) ఇతరులు విదేశ ప్రభుత్వాలతో సంబంధాలను, విదేశ పరిశ్రమలను స్పెషలైజు చేస్తారు. దీనికితోడు ప్రతి డైరెక్టరుకు ఒక ప్రాంతాన్నిగాని, పరిశ్రమ శాఖనుగాని అజమాయిషీచేసే పని అప్పగించుతారు. ఒకడు పూర్తిగా ఎలెక్ట్రిక్ కంపెనీల అడ్వయిజరీ బోర్డులలో పనిజేస్తాడు. ఒకడు కెమికల్ కంపెనీలలోను, మరొకడు పంచదార పరిశ్రమలలోనూ, ఇంకొకడు ఇన్సూరెన్సు కంపెనీల అడ్వయిజరీ బోర్డులలోనూ పనిజేస్తారు. వాస్తవంలో బ్యాంకులు పెద్దవి అయ్యేకొలదీ, వాటిపని విస్తరించేకొలదీ డైరెక్టర్లలో పని విభజనకూడ బాగా జరుగుతుంది. వారు కేవలం బ్యాంకులకు సంబంధించిన విషయాలలోనే గాకుండా, పరిశ్రమల విషయంలోనూ, కొన్ని పరిశ్రమల సమస్యలను పరిష్కరించడంలోనూ ప్రావీణ్యత సంపాదించుతారు. పరిశ్రమలపై బ్యాంకుల పలుకుబడిని విస్తరింపజేయ గలుగుతారు. ఫ్యాక్టరీ యజమానులు గనులు—రైల్వేలలో పనిజేసిన ఉద్యోగులు వగైరావంటి ఆయా పరిశ్రమలను గురించి బాగా తెలిసినవారిని మానేజర్లుగా బ్యాంకులు నియమించుతాయి. దీనిఫలితంగా బ్యాంకుల పలుకుబడి 'పరిశ్రమలపై' సంపూర్ణంగా విస్తరించుతుంది."

స్వల్ప భేదాలతో యిదే పద్ధతి ఫ్రెంచిదేశపు బ్యాంకింగులోకూడ అమలులో వుంది. ఉదాహరణకు 3 పెద్ద బ్యాంకులలోనూ ఒకటైన 'క్రెడిట్ లియోన్నస్' బ్యాంకు

విషయం చూదాం. అది వివిధ కంపెనీల వ్యవహారాలను సూపర్వైజు చేయడానికి 50 మంది ఇంజినీర్లను, ఆర్థికవేత్తలను, న్యాయవాదులు వగైరాను వినియోగించుతోంది. వారికి సంవత్సరానికి 6 లేక 7 లక్షల ఫ్రాంకులు ఖర్చుపెడుతోంది.

ఈ సర్వీసు 8 శాఖలుగా విభజించబడింది. ఒకశాఖ పరిశ్రమలను, మరొకటి రైల్వేలు - నావలను, ఇంకొకటి ఆర్థిక సంబంధాలను గురించి పనిజేస్తుంది.

దీని ఫలితాలు రెండురకాలుగా వుంటాయి. ఒకవైపున బుఖారిన్ చెప్పినట్లుగా "పారిశ్రామిక పెట్టుబడికి, బ్యాంకింగు పెట్టుబడికి అవినాభావసంబంధం ఏర్పడుతుంది. రెండోవైపున బ్యాంకులు సర్వవ్యాపితమైన సంస్థలుగా తయారవుతాయి." ఈ విషయంలో బాగా పరిశోధనజేసిన జీడెల్స్ వాక్యాలను ఇచట ఉదహరించుతాను :-

"బ్యాంకింగు సంస్థలకు పరిశ్రమలతో వున్న సంబంధాలను బాగా పరిశీలించితే పెద్ద బ్యాంకులే పరిశ్రమల తరఫున వ్యవహరించుతున్నాయని బోధపడుతుంది. టెక్స్టు పుస్తకాలలో నిర్వచింపబడిన పద్ధతికి యిది పూర్తిగా విరుద్ధం. వాటిప్రకారం చూస్తే బ్యాంకులు ఒకరకం వ్యాపారం మాత్రమే చేయాలి. ఇపుడో పెద్ద బ్యాంకులు అన్నిరకాల పరిశ్రమలతోను సంబంధం పెట్టుకొంటున్నాయి. కొన్ని బ్యాంకుల చరిత్ర చూస్తే అవి ఏవిధంగా వివిధప్రాంతాలకు, వివిధ పరిశ్రమలకు పెట్టుబడిని పంచడానికి, విస్తరింపజేయడానికి కృషిచేస్తున్నాయో బోధపడుతుంది.....ఒకధోరణి ఏమిటంటే సాధారణంగా పరిశ్రమలతో లీనమైపోవడం. కలయిక సన్నిహితమైనదిగాను, కట్టుదిట్టమైనదిగాను చేయడం రెండోధోరణి. ఈ రెండు ధోరణులుకూడ ఆరు పెద్ద జర్మన్ బ్యాకులలోను చెప్పుకోతగినంత సమానంగా పనిచేస్తున్నాయి."

పరిశ్రమలు, వర్తకంలో పాల్గొనేవారు తరచుగా బ్యాంకుల నిరంకుశత్వాన్ని గురించి కంప్లెయింటు చేస్తారు. ఒక పెద్దబ్యాంకు పంపిన యీ క్రింది ఉత్తరువును గమనించితే పై కంప్లెంటులో ఆశ్చర్యపడవలసిన దేమీ లేదని బోధపడుతుంది.

నవంబరు 19 వ తేదీన ఒక బెర్లిన్ పెద్దబ్యాంకు ఒక సిమెంటుకంపెనీకి యీ విధంగా లేఖ వ్రాసింది :—

"మీరు 18 వ తేదీ ఒక వార్తాపత్రికలో చేసిన ప్రకటనను బట్టి మీ కంపెనీ జనరల్ సమావేశం యీనెల 30 వ తేదీన జరుగుతుందని మాకు తెలిసింది. ఆ సమావేశంలో మాకు అంగీకారంగాని విధంగా మీ వ్యాపారంలో మార్పులు చేయాలని మీరు ఉద్దేశించినట్లుగా మాకు బోధపడుతోంది. అందుచే యిప్పటినుంచి మేము మీకు యిస్తున్న అప్పు యివ్వజాలమని తెలియజేయవలసి వచ్చినందులకు విచారించుతున్నాము. మీ జనరల్ మీటింగు మాకు అంగీకారంగాని మార్పులు చేయకుండావుంటేను, యికముందు అలా చేయమని గ్యారంటీ యిస్తేనూ తిరిగి మీకు కొత్త అప్పుయిచ్చే విషయమై ఆలోచించడానికి అభ్యంతరమేమీ లేదు."

వాస్తవంలో పూర్వంనుంచి వస్తున్న చిన్న పెట్టుబడీదారుని పెద్ద పెట్టుబడీదారుడు పీడించటం వంటిదే యిదికూడ. ఉన్న భేదమల్లా యిపుడు ఒక కంపెనీ సిండికేటుఅంతా బ్యాంకుచే బెదిరించబడుతూంది. పూర్వం చిన్న పెట్టుబడిదారుడు పెద్ద పెట్టుబడిదారుని మధ్య వున్న పోరాటం యిపుడు కొత్త రూపంలో ఉన్నతపథాన జరుగుతోందన్నమాట.

వందలకోట్లతో వ్యవహరించే బ్యాంకులచే నడుపబడుతున్న సంస్థలు పూర్వంకంటే హెచ్చుగా టెక్నికల్ అభివృద్ధి చేయగలవు. ఉదాహరణకు బ్యాంకులు టెక్నికల్ పరిశోధనాలయాలను స్థాపించుతున్నాయి. వీటిలో కనిపెట్టబడిన సాధనలు ఆయా బ్యాంకుల క్రింద వున్న సంస్థల ఉపయోగానికి మాత్రమే వినియోగించబడుతాయి. జర్మనీలో యీ విధంగా, ఎలెక్ట్రిక్ రైల్వే పరిశోధనాలయం, సైంటిఫిక్ అండ్ టెక్నికల్ పరిశోధనాలయం స్థాపించబడ్డాయి.

ఈ విధానంవలన ఆర్థిక జీవితంలో నూతన పరిస్థితులు ఏర్పడుతున్నాయని పెద్ద బ్యాంకుల డైరెక్టర్లు ఎరుగుదురు. కాని వారికి యీ దృక్పథాన్ని ఎదిరించే శక్తిలేదు.

జీడెల్స్ యిలావ్రాశాడు : "ఈ మధ్య జరుగుతున్నట్లుగా పెద్ద బ్యాంకుల డైరెక్టర్లు మానేజర్లు ప్రాతవారు పోవడం, కొత్తవారు ఎన్నుకోబడటం చూస్తే అధికారం క్రమంగా ఒకరకం వారి చేతుల్లోకి పోతుందని స్పష్టమవుతుంది. వీరు ఉత్పత్తిని అభివృద్ధి చేయడంలో బ్యాంకుల పెత్తనం తప్పనిసరిఅనీ, రోజురోజు యిది ప్రాముఖ్యత వహించుతూందని ఎంచుతున్నారు. కొత్తగా వచ్చిన వీరికి పాత డైరక్టర్లు—మానేజర్లకు యీవిషయమై తరుచుగా అభిప్రాయభేదాలువస్తున్నాయి. ఒక్కొకపుడు యివి వ్యక్తిగత తగవుల రూపంకూడ దాల్చుతున్నాయి. వాదం యిలా బయలుదేరుతుంది. అప్పులుపెట్టే బ్యాంకులు ఉత్పత్తిలో జోక్యం కల్గించుకోడం నష్టంకాదా ? మధ్యవర్తిగావుండి అప్పులివ్వడం ద్వారా నమ్మకమైన లాభాలను తెచ్చే పాతనియమాలను వదలివేయడం మంచిదా ? వర్తక స్థితిగతులపై ఆధారపడిన ఉత్పత్తి రంగంలో ప్రవేశించడం ప్రమాదంకాదా ? అనే ప్రశ్నలపై యీ రెండు ముఠాలకు వివాదాలు వస్తున్నాయి. పాత బ్యాంకు డైరెక్టర్లు అలా ప్రవేశించరాదని అభిప్రాయపడుతున్నారు. కొత్తవారు పరిశ్రమలలో జోక్యం కలిగించుకోడం అవసరమంటున్నారు. రెండుపక్షాలుకూడ ఒకవిషయమై ఏకాభిప్రాయంతోవున్నారు. ఐదు పెద్దబ్యాంకులు యిపుడు నిర్వహించుతున్నపనికి కట్టుదిట్టమైన పునాదిగాని, సూత్రాలుగాని స్పష్టమైన ఆశయంగాని లేదనే విషయాన్ని వారు గుర్తించుతున్నారు."

పెట్టుబడిదారీ విధానపు పాతరూపం రోజులు గడిచిపోయాయి. కొత్తమార్పు మరో రూపానికి దారితీస్తుంది. అంతేగాని ఫ్రీ కాంపిటీషనుతో మానాపలీని సమన్వయపరచడానికి "స్పష్టమైన ఆశయాలను, కట్టుదిట్టమైన సూత్రాలను" కనిపెట్టాలనుకోడం ఎండమావులలో నీటికోసం వెదకడం వంటిదే. అధికారంలోవున్న ఉద్యోగులుచెప్పే పెట్టుబడి

దారుల దొంగసరి కబుర్లకు ప్రత్యక్షానుభవమున్న వీరిగ్రాతలకు (confessiom) ఎంతో భేదం కన్పించుతుంది.

పెద్ద బ్యాంకులు నిర్వహించుతున్న కొత్తపని ఏ దశకు చెందుతుంది ? జీడెల్స్ యీ ముఖ్యప్రశ్నకు యిలా సమాధాన మిస్తున్నాడు.

"పారిశ్రామిక సంస్థలయొక్క కొత్తసంబంధాలు, కొత్తరూపాలు యింకాస్పష్టంగా చెప్పాలంటే పెద్దబ్యాంకులు ఏర్పడటం 1890 కి ముందుగాని తరువాత సంవత్సరాలలో గాని జరుగలేదు. ఒక విధంగా చూస్తే 1897 లో మొట్టమొదటిసారి అనేకవ్యాపార సంస్థలు కలసి బహ్మాండమైన కూటములు ఏర్పడ్డాయి. ఈ రూపమే ప్రస్తుతపెద్ద బ్యాంకులకు దారితీసింది. వీటిప్రారంభం యింకా తరువాతకాలమని కూడచెప్పవచ్చును. ఏమంటే నిజానికి 1900 ఆర్థిక సంక్షోభమే యీకేంద్రీకరణవిధానాన్ని పరిశ్రమలలోను, బ్యాంకింగు లోను త్వరితంగా ప్రవేశపెట్టింది. ఆ విధంగా కేంద్రీకరణ విధానంయొక్క పునాది స్థిర పడినాక పెద్దబ్యాంకులకు పరిశ్రమలలో జోక్యం కలిగించుకోడానికి అవకాశం దొరికింది. పరిశ్రమలు బ్యాంకుల మధ్య సంబంధాలు సన్నిహితమయ్యాయి.

అందుచే పాతపెట్టుబడిదారీ విధానంపోయి అనగా సాధారణ పెట్టుబడి అంతటి యొక్క పెత్తనం పోయి దానిస్థానే కొత్తవిధానం అనగా బ్యాంకింగు పెట్టుబడియొక్క పెత్తనం వచ్చింది. ఈమార్పు 20వ శతాబ్దం ఆరంభంలో జరిగిందని చెప్పవచ్చును.

# ఫైనాన్స్ పెట్టుబడి - ఫైనాన్షియల్ పెత్తందార్లు

హిల్‌ఫెర్డింగ్ యిలా వ్రాశాడు. "పారిశ్రామిక పెట్టుబడిలో ఒక భాగం పరిశ్రమల యజమానులదికాదు. ఈ భాగం క్రమంగా వృద్ధిచెందుతూందికూడ. పరిశ్రమల యజమానులు యీపెట్టుబడిని బ్యాంకులలోనుంచి అప్పుతెచ్చుకొని ఉపయోగించుకుంటున్నారు. బ్యాంకులు తమకు పెట్టుబడి పెట్టినవారికి ప్రాతినిధ్యం వహించి పనిజేస్తాయి. ఇంతేగాకుండా బ్యాంకులు క్రమక్రమంగా తమ నిల్వసొమ్ములో హెచ్చుభాగాన్ని యీ విధంగా వ్యాపారంలో వినియోగించవలసి వుంటుంది. అందుచే బ్యాంకు క్రమంగా పారిశ్రామిక పెట్టుబడిదారువలే సంచరించవలసివస్తుంది. బ్యాంకర్ల పెట్టుబడి అయిన యీ ధనం పారిశ్రామిక పెట్టుబడిగా మారుతోంది. దీనినే మనం ఫైనాన్సుపెట్టుబడి' అని పిలుద్దాము...........ఫైనాన్సు పెట్టుబడిఅనగా బ్యాంకులు అప్పుగాయిచ్చి, పరిశ్రమల యజమానులచే పెట్టుబడిగా వినియోగించబడిన దన్నమాట"

ఈ నిర్వచనం సంపూర్ణమైనదికాదు. ఏమంటే ఒకముఖ్యవిషయాన్ని గురించి యిది మౌనం వహించుతోంది. ఉత్పత్తి కేంద్రీకరణ, పెట్టుబడి కేంద్రీకరణ తీవ్రంగా జరిగి మానొపలి పరిస్థితులకు దారితీయడాన్ని గురించి ఏమీ తెలియజేయడంలేదు. కాని హిల్‌ఫెర్డింగ్ పుస్తకం, ముఖ్యంగా నిర్వచనానికి ముందున్న రెండు అధ్యాయాలు పెట్టుబడిదారి మానొపలీల ప్రముఖపాత్రను గురించి తెలియ జేశాయి.

పరిశ్రమల కేంద్రీకరణ; తత్ఫలితంగా ఏర్పడే మానొపలి (గుత్తాధికారం) బ్యాంకింగు - పరిశ్రమలు లీనమైపోవడం; యివి ఫైనాన్స్ పెట్టుబడి అనేది ఏర్పడటానికి దారితీశాయి.

సరుకును ఉత్పత్తిచేయడంలోను, స్వంతఆస్థిపైన పెట్టుబడిదారి మానొపలీలు ఎలా తప్పనిసరిగా పెత్తనం వహించుతాయో తెలియజేస్తాము. జర్మన్ బూర్జువా మేధావులందరూ—రీస్సెర్, స్కూల్జే, లీఫ్‌మన్ వగైరా అందరూ—సామ్రాజ్యవాదాన్ని, ఫైనాన్స్ పెట్టుబడిని సమర్థించేవారని గుర్తుంచుకోవాలి. ఫైనాన్షియల్ పెత్తందార్లు ఏర్పడటాన్ని గురించి, వారవలంబించే పద్ధతుల గురించి, బహిరంగంగానూ-రహస్యంగాను వచ్చే ఆదా

యూ్నిగురించి, పార్లమెంటులతో వారి సంబంధాలను గురించి వున్న రహస్యాలను యీ మేధావులు బయటపెట్టరు. ఉద్దేశపూర్వకంగా వాటిని కప్పిపుచ్చుతారు. ఈచిక్కుప్రశ్నలన్నిటిని సాచివేతకబుర్లతో దాటివేయాలని వారు చూస్తారు. బ్యాంకు డైరెక్టర్లు బాధ్యతగలవారనీ, ప్రభుత్వోద్యోగులు తమ విధిని నెరవేర్చేవారనీ, 'ప్లానుప్రకారం సూపర్విజన్ (అజమాయిషీ) జరుగుతోందని ఏవో సిద్ధాంతాలను ఏ కరువుపెట్టి తప్పించుకో చూస్తారు. ప్రొఫెసర్ లీఫ్‌మన్ యిలా నిర్వచనంచేశాడు. "పారిశ్రామిక కృషిఫలితంగా సరుకులను సమీకరించి, విల్వజేసి ఉపయోగం నిమిత్తం అందజేయడమే వర్తకం (కామెర్స్) అని పిలువబడుతుంది."

ఈ నిర్వచనం ప్రకారం మారకం అంటే ఏమీ తెలియని ఆదిమనివాసి కూడ వర్తకం అంటే ఏమిటో అర్థంచేసికొని వుండాలి. అంతేగాక వర్తకం ఆదిమకాలంనుంచీ వుందనీ, యికముందు సోషలిస్టు సమాజంలో కూడ వుంటుందనీ నిర్వచించడమన్నమాట.

కాని వాస్తవ మేమిటంటే అమెరికా, జర్మనీ, ఫ్రాంసువగైరా అన్ని పెట్టుబడిదారీ దేశాలలోనూ ఆయీ ఫైనాన్షియల్ పెత్తందార్ల రాక్షసపరిపాలన గురించి అనేక గ్రంధాలు వ్రాయబడ్డాయి. వాటిలో బూర్జువా దృక్పథాన్నుంచి సరియైన చిత్రమే గీయబడింది. విమర్శన సహజంగా పెటీబూర్జువా (మధ్యతరగతి) దృక్పధాన్నుంచి చేయబడింది.

జర్మన్ అర్థికవేత్త హేమన్ యీవిధంగా వర్ణించాడు: "తల్లి కంపెనీని ముఖ్య పెత్తందారు కంట్రోలుచేస్తాడు. తల్లికంపెనీ శాఖలను లేదా పిల్లకంపెనీలను కంట్రోలు చేస్తుంది. అవి వాటిక్రిందటి వాటిని అలాగే కంట్రోలుచేస్తాయి. ఈ విధంగా కొద్ది పెట్టుబడితోనే విస్తారమైన ఉత్పత్తిపై పెత్తనం సాగించవచ్చును. వాస్తవంలో నూటికి 50 వంతులు పెట్టుబడివుంటే ఒక కంపెనీని కంట్రోలు చేయవచ్చును. ముఖ్య పెత్తందారుకు 10 లక్షల షేర్లువుంటే, 1 కోటి పెట్టుబడికలిగిన పిల్ల కంపెనీలపై పెత్తనం చలాయించవచ్చును. ఈ నిర్మాణం విస్తరించితే 10 లక్షల పెట్టుబడితో 2 లేక 3 కోట్ల పెట్టుబడిగల కంపెనీలను కంట్రోలు చేయవచ్చును."

"చిన్న భాగస్థులు జనరల్‌బాడీ మీటింగులకు రాలేరుకాబట్టి సాధారణంగా నూటికి 40 షేర్లు చేతిలోవుంటే ఒక కంపెనీపై పెత్తనం చెలాయించవచ్చునని అనుభవం తెలుపుతోంది." బూర్జువా అర్థికవేత్తలు, అవకాశవాదులు, సోషల్ డిమాక్రేటులు పెట్టుబడిదారీ విధానాన్ని డిమాక్రీటైజు చెయ్యాలని కలలుకంటున్నారు. అనగా చిన్నభాగస్థుల సంఖ్యను హెచ్చుచేయాలని వారివాదన. కాని ఆచరణలో యిది ఫైనాన్షియల్ పెత్తందార్ల అధికారం మరింత హెచ్చుచేస్తుంది. అనుభవమున్న పెట్టుబడిదారీ దేశాలన్నిటిలో షేర్లు చిన్నవిగా వుండాలనే శాసనముంది. జర్మనీలోమాత్రం 1000 మార్కులకులోపుగా షేరు వుండరాదనే నియమముంది. ఇంగ్లండులో పౌను విలువగల షేర్లను యిస్యూచేయవచ్చును. అందుచే జర్మన్ ధనికులు బ్రిటనును అసూయతోచూస్తారు. పరిశ్రమల యజమానులలో

ముఖ్యుడైన సీమన్స్ జర్మన్ పార్లమెంటులో 1900 జూన్ 7 వ తేదీన యిలావాదించాడు. ఒకపాను షేర్లు (చిన్నవిగా) వుండటమే బ్రిటీషు సామ్రాజ్యవాదానికి పునాది" అన్నాడు. సోషలిస్టుల మనుకొంటూ యూరోపియన్ జాతులలో ఒకటి మాత్రమే సామ్రాజ్య వాదమనుకొనే వారికంటె యీ వర్తకుడు సామ్రాజ్యవాదం యొక్క భావాన్ని సరిగా అర్థంచేసికొన్నాడు.

"షేర్లుద్వారా భాగస్వామిత్వం" అనేవిధానం మానొపలిష్టుల అధికారాన్ని చాలా హెచ్చు చేస్తుంది. ఇంతేగాక అనుమాస్పదము, అసహ్యాకరము అయిన అనేక పద్ధతుల ద్వారా ప్రజలను దోచుకోడానికి అవకాశమిస్తుంది. తల్లికంపెనీకి లీగల్‌గా బాధ్యతలేదు కాబట్టి అదితప్పించుకోగల్గుతుంది. 1914 లో ప్రకటించబడిన 'డైబ్యాంకు' పత్రికలోని ఉదాహరణను చూదాం "కొన్ని సంవత్సరాలక్రిందట కేస్సెల్‌లోని ఉక్కుకంపెనీ మంచి లాభాలను పంచిపెట్టే ముఖ్యజర్మన్ కంపెనీలలో ఒకటిగా చెప్పబడేది. చెడుమానేజి మెంటువల్ల దానిషేర్ల విలువ నూటికి 15 నుంచి సున్నాకు పడిపోయాయి. ఈ కంపెనీ భాగస్థులకు తెలుపకుండానే ఒక అనుబంధ కంపెనీకి 60 లక్షలు అప్పుపెట్టింది. అప్పు పుచ్చుకొన్న 'హస్సియా' అనే కంపెనీకి కొలది లక్షల పెట్టుబడి మాత్రమేవుంది. తల్లి కంపెనీ బ్యాలెన్సు షీట్లలో పైఅప్పునుగురించి ఉదహరించనేలేదు. కంపెనీ 'లా' ప్రకారం యిలా రెండుసంవత్సరాలు దాయడానికి అవకాశముంది. ఈ తప్పుడు బ్యాలెన్సుషీటులపై సంతకంజేసిన డైరెక్టర్ల బోర్డు అధ్యక్షుడు యిప్పటికీ కాస్సెల్ ఛాంబర్ ఆఫ్ కామర్సు (వర్తక సంఘానికి) అధ్యక్షుడుగానే వున్నాడు. హస్సియా కంపెనీకి యిచ్చిన అప్పు సంగతి భాగస్థులకు చాలా కాలంవరకు తెలియదు. ఈ సంగతి తెలసిన పెత్తందార్లు మాత్రం తమషేర్లను అమ్మివేసికొన్నారు. సామాన్యులకు తెలిసేటప్పటికి షేర్లకు విలువే లేకుండాపోయింది."

ఈ తప్పుడు బ్యాలెన్సుషీట్లు చూపడం జాయింటు స్టాక్ కంపెనీలలో తరచుగా జరుగుతుంటుంది. అందుచేతనే డైరెక్టర్లు యీవిధమైన రహస్య పద్ధతులద్వారా యితర వ్యక్తులకంటే బాగా సంపాదించగల్గుతారు. బ్యాలెన్సుషీటులలో చేసే యీ దగావల్ల సామాన్య భాగస్థులనుండి సందేహాస్పదమైన విషయాలను దాయవచ్చును. అంతేగాక ఈ విషయం తెలిసినవారు పరిస్థితులుమించితే తమవంతు షేర్లు అమ్ముకొని బాగుపడ తారు. సామాన్యులు యీ సంగతి తెలియక కొని దివాళాతీస్తారు.

"చాలా జాయింట్ స్టాక్ కంపెనీలయొక్క బ్యాలన్సుషీట్లు మధ్యయుగపు వ్రాత లను జ్ఞాపకంచేస్తాయి. పైకి ఒకటి కనబడుతుంది. లోపల అంతరార్థం యింకొకటి వుంటుంది. బ్యాలన్సుషీట్లను అర్థంగాకుండా వ్రాయడానికి సుళువైన మార్గముంది. వ్యాపా

రాన్నీ అనేకభాగాలుగా విభజించి అనుబంధ కంపెనీల లెఖ్ఖలను వేరువేరుగా చూపడం. లేదా అన్ని కంపెనీల వ్యాపారాన్ని కలిపి చూపడంవల్ల సామాన్యులకు అర్థంగాకుండా చేయవచ్చును. ఈ పద్ధతివల్ల అనేక లీగల్ లాభాలు, రహస్య లాభాలుకూడ వున్నాయి. కాబట్టే ముఖ్య కంపెనీలన్నీ దాదాపు యిదే పద్ధతిని అవలంబించుతున్నాయి."

రచయిత ఉదాహరణగా ముఖ్యమైన మానోపలీ కంపెనీల లెఖ్ఖలను చూపాడు. జర్మన్ ఎలెక్ట్రిక్ ట్రస్టు 1912 లో 175 నుంచి 200 యితర కంపెనీలలో షేర్లు కలిగి వుంది. తద్వారా యితర కంపెనీలలో 150 కోట్ల పెట్టుబడి కలిగివుంది.

బ్యాలన్సు షీటులు ప్రకటించాలనీ, వాటిని నిర్ణీతపద్ధతులలో తయారు చేయాలనీ, బ్యాంకులు సూపర్వైజు చేయాలనీ శాసనాలున్నాయని తెలుపుతూ పెట్టుబడిదారీ విధానాన్ని సమర్థించే ప్రొఫెసర్లు, ఉద్యోగులు _ పైవిషయాన్ని గురించి మాత్రం నోరుమెదపరు. స్వంత ఆస్తిపవిత్రమైనది; షేర్లనుకొనడం, అమ్మడం, మారకంవేయడం, తాకట్టుపెట్టడం విషయంలో సంపూర్ణ స్వేచ్ఛవుండాలంటారు!

రష్యో - చైనా బ్యాంకులో 15 యేండ్లు ఉద్యోగిగా పనిజేసిన 'అగాద్' పెద్ద రష్యన్ బ్యాంకులలోవున్న 'భాగస్థుల విధానాన్ని' (System of participations) గురించి తనపుస్తకం 'పెద్దబ్యాంకు — ప్రపంచమార్కెటు' అనేదానిలో యిలా వ్రాశాడు.

ఆ గ్రంధకర్త రష్యన్ బ్యాంకులను రెండురకాలుగా విభజించాడు (ఎ) అనుబంధాలుగా పనిజేసేవి. (2) స్వతంత్రబ్యాంకులు (విదేశబ్యాంకులనుండి మాత్రమే స్వతంత్రంగా వున్నాయన్నమాట) మొదటిగ్రూపును మళ్ళీమూడు విభాగాలు చేశాడు. బ్రిటిషు, జర్మన్, ఫ్రెంచి బ్యాంకులకు అనుబంధాలుగా పనిజేసే బ్యాంకులను వేరువేరుగా విభజించాడు. ఈ గ్రూపుకు చెందిన పెట్టుబడిని రెండుభాగాలు చేశాడు. (1) ఉత్పత్తిని వృద్ధిచేయడానికి పారిశ్రామిక సంస్థలకు లేక వర్తక సంస్థలకు అప్పుగాయిచ్చినది (2) స్టాక్ఎక్స్చేంజి-మారకం, చెలామణి వగైరాకు ఉపయోగించబడిన పెట్టుబడి. రచయిత 'అగాద్' పెటీ బూర్జువాదృక్పధం కలిగినవాడు. అందుచే పెట్టుబడిదారీ విధానంయిలావుండగానే పెట్టుబడిని పై విధంగా రెండుగా విభజించడానికి సాధ్యమవుతుందను కొంటున్నాడు.

క్రింది లెఖ్ఖలు అతని పుస్తకంలోనుంచి గ్రహించబడ్డాయి. 1913 అక్టోబరు-నవంబరు బ్యాలెన్సు షీట్లనుండి తీసికొన్నాడు. కోట్ల రూబిల్సును తెలియజేస్తాయి.

## ఉపయోగంలోవున్న పెట్టుబడి

| రష్యన్ బ్యాంకు గ్రూపులు | ఉత్పత్తికి వినియోగించేది | స్పెక్యులేషనులో వుంది | మొత్తం పెట్టుబడి |
|---|---|---|---|
| (a) గ్రూపులో 4 బ్యాంకులు సైబేరియన్ - రష్యన్ - ఇంటర్నేషనల్ - డిస్కౌంటు బ్యాంకులు. | 41.37 కోట్లు. | 85.91 కోట్లు. | 127.28 కోట్లు. |
| (b) గ్రూపులో ఇండస్ట్రియల్ అండ్ కమ్మర్షియల్ బ్యాంకు, రస్సో-బ్రిటిష్ బ్యాంకు- 2 బ్యాంకులున్నాయి. | 23.93 ,, | 16.93 ,, | 40.84 ,, |
| (c) గ్రూపులో 5 బ్యాంకులున్నాయి. | 71.18 ,, | 66.12 ,, | 137.30 ,, |
| మొత్తం బ్యాంకులు. | 136.48 | 168.94 | 305.42 |
| (d) గ్రూపులో 8 బ్యాంకులున్నాయి. | 50.42 | 39.11 | 89.52 |
| మొత్తం బ్యాంకులు. | 186.50 | 208.'5 | 294 94 |

ఈ లెక్కలనుబట్టి 1913 లో రష్యన్ బ్యాంకులలో 400 కోట్ల రూబుల్సు పెట్టుబడి చెలామణి అవుతోంది. ఇందులో 300 కోట్ల రూబుల్సు విదేశ బ్యాంకులకు అనుబంధాలుగా వున్న బ్యాంకులద్వారా చెలామణి అవుతోంది. ముఖ్య రష్యన్ బ్యాంకులలో రెండు 1906-1912 మధ్య తమ పెట్టుబడిని 440 లక్షలనుంచి 980 లక్షలకు పెంచాయి. వాటిరిజర్వును 150 లక్షలనుంచి 390 లక్షలకు పెంచాయి. ఇందులో నాలుగింట మూడుపాళ్ళు జర్మను పెట్టుబడియే. వీనిలో ఒకటి (రష్యన్ బ్యాంక్ ఆఫ్ ఫారిన్‌ట్రేడ్) జర్మనీలోని డూయిట్చ్ బ్యాంకుకు అనుబంధంగావుంది. రెండోది (ఇంటర్నేషనల్ కమ్మర్షియల్ బ్యాంకు ఆఫ్ పెట్రోగ్రేడ్) జర్మనీ దేశంలోని డిస్కౌంట్ బ్యాంకుకు అనుబంధంగావుంది. రష్యన్ బ్యాంకుల షేర్లలో హెచ్చుభాగం జర్మనీ చేతుల్లో వున్నాయని పైగ్రంధకర్తకు ఉక్రోషంగా వుంది. అంతేగాకుండా ఏదేశం తన పెట్టుబడిని విదేశాలకు పంపుతుందో అది సహజంగా హెచ్చు లాభాన్ని పొందుతుంది. ఉదాహరణకు డూయిట్చ్ బ్యాంకు సైబీరియన్ కమర్షియల్ బ్యాంకు షేర్లను బెర్లిన్ మార్కెటులో అమ్మకానికి పెట్టింది. సంవత్సరం అయ్యాక రెట్టింపు ఖరీదుకు (193°/₀) అమ్మివేసింది. ఈ విధంగా అది 60 లక్షల రూబుల్సు లాభంపొందింది.

మన గ్రంధకర్త పెట్రోగ్రాడ్ బ్యాంకుల పెట్టుబడి 823 కోట్ల రూబిల్సు వుంటుందని అంచనావేశాడు. వాటిపైన విదేశబ్యాంకుల కంట్రోలు యీ విధంగా వుంటుందని లెఖ్ఖ-తేల్చాడు. ఫ్రెంచి బ్యాంకులు నూటికి 55 పాళ్ళు. ఇంగ్లీషు బ్యాంకులు నూటికి 10 పాళ్లు,

జర్మన్ బ్యాంకులు 35 పాళ్ళ షేర్లు కలిగివుంటాయన్నాడు. మొత్తం 823 కోట్ల పెట్టుబడి లోనూ నూటికి 40 వంతులు అనగా 369 కోట్ల పెట్టుబడిని సిండికేట్లు కలిగివున్నాయి. ఈ సిండికేట్లు చమురు, లోహాలు, సిమెంటు పరిశ్రమలలో వున్నాయి. రష్యాలోకూడ పారిశ్రామిక పెట్టుబడి, బ్యాంకింగ్ పెట్టుబడి ఎలా కలసి లీనమైపోయాయో పైలెఖ్ఖలు తెలియజేస్తాయి. పెట్టుబడిదారీ మానోపలీలు ఎంత త్వరగా పెరుగుతున్నాయోకూడ చూపుతాయి.

ఫైనాన్సు పెట్టుబడి కొలదిమంది చేతుల్లో కేంద్రీకరించబడటం, గుత్తాధికారం చెలాయించడం, విపరీతమైన లాభాలను పొందడం జరుగుతోంది. ప్రభుత్వ ఋణపత్రాలను, స్టాకులను కొనడంవల్లను వీరు విపరీతలాభాలను పొందుతూ, ప్రజలందరినుండి ఒకవిధమైన పరోక్షపన్నును వసూలుచేస్తూ పెత్తనం చెలాయించుతున్నారు. ఇచట ఒక అమెరికన్ ట్రస్టు ఉదాహరణ యిస్తాము. "1885 హేవ్‌మీయర్ 15 చిన్న కంపెనీలను చేర్చి పంచదార ట్రస్టు ఏర్పరచాడు. దానిపెట్టుబడి 65 లక్షల డాలర్లువుండేది. తరువాత క్రమంగా యీ ట్రస్టుపెట్టుబడి 5 కోట్ల డాలర్లదాకా పెరిగింది. అమెరికన్ స్టీల్ ట్రస్టు సాధ్యమైనన్ని ఇనుపగనులున్న భూములను కొనడంద్వారా లాభాలను వృద్ధిచేసికోడానికి ఎలా ప్రయత్నించుతూందో అదేవిధంగా యీ పంచదార ట్రస్టుకూడ పనిచేస్తూంది. నిజానికి తనకు యిష్టమొచ్చిన ఖరీదులను పంచదారట్రస్టు మార్కెటుపై రుద్దగలిగింది. భాగస్థులకు కొత్తగా అంచనావేయబడిన పెట్టుబడిపై నూటికి 10 చొప్పున లాభాలు చెల్లించింది. అనగా ప్రారంభంలో పెట్టిన పెట్టుబడిపై నూటికి 75 చొప్పున లాభాలు చెల్లించిం దన్న మాట. 1909 లో పంచదారట్రస్టు పెట్టుబడి 9 కోట్ల డాలర్లవరకు వృద్ధిచెందింది. అనగా 22 సంవత్సరాలలో పదిరెట్లు పెరిగిందన్నమాట.

ఫ్రాంసులోకూడ ఫైనాన్షియల్ పెత్తందార్ల పరిపాలన దాదాపు యిదేరూపందాల్చింది. ఈ నిరంకుశాధికారాన్ని నిరశించుతూ లీస్ వ్రాసిన పుస్తకం 1908 నాటికి 5 కూర్పులు ఖర్చయిపోయింది. ఫ్రాంసులోని 4 పెద్దబ్యాంకులు స్టాక్‌మార్కెటుపై పూర్తిఅధికారం కలిగివున్నాయి. వాస్తవంలో అదిముఖ్యమైన బ్యాంకుల ట్రస్టుఅని చెప్పవచ్చు. వీటికున్న గుత్తాధికారంవల్ల విపరీతమైన లాభాలను జేబులో వేసికొంటున్నాయి. ఫ్రాంసునుంచి ఏ దేశమైన అప్పుతీసికొంటే అందులో నూటికి 90 మాత్రమే దానికి చేరుతుంది. తక్కినది యీ బ్యాంకులకు, వాటిఏజెంట్లకు పోతుంది. 40 కోట్లఫ్రాంకులు రసో-చైనీస్ బ్యాంకుకు అప్పు యిచ్చినపుడు ఈ బ్యాంకులవడ్డీరేటు నూటికి సంవత్సరానికి 8 చొప్పునవుండేది. 1904 లో యిచ్చిన 80 కోట్ల ఫ్రాంకుల రష్యన్ అప్పుపై నూటికి 10 చొప్పున వడ్డీని గుంజాయి. 1904 లో మొరాకు యిచ్చిన 625 లక్షల ఫ్రాంకుల అప్పుపైన నూటికి 18.75 చొప్పున వడ్డీని గుంజాయి. చిన్నవడ్డీ వ్యాపారస్తుల స్వల్ప దోపిడితో ప్రారంభమైన పెట్టుబడిదారీ విధానం, పెద్దబ్యాంకుల విపరీత దోపిడీతో ముగించుతోంది.

లీస్ యిలా వ్రాశాడు. "ఫ్రెంచిబ్యాంకర్లు యూరపు ఖండానికంతటికి వడ్డీవ్యాపారస్థులైపోయారు. పెట్టుబడిదారీ విధానంలో వచ్చిన యీ మార్పు ఆర్థిక జీవిత మంతటిని మార్పు చేసింది. జనసంఖ్య పెరుగకుండా, పరిశ్రమలు, వర్తకం వృద్ధిచెందకుండా ఆదేశం వడ్డీ వ్యాపారంతో భాగ్యవంతం కాగలదు: 200 కోట్ల ఫ్రాంకులు పెట్టుబడి గలిగిన 4 బ్యాంకులను 80 లక్షల పెట్టుబడిగలిగిన 50 మంది వ్యక్తులు కంట్రోలు చేయగలరు. పైన తెలియజేసిన షేర్లవిధానము వారికా అవకాశం కలుగజేస్తూంది. ఉదాహరణకు 'సొసైటీజనరల్' అనే బ్యాంకు తన అనుబంధ కంపెనీలద్వారా 64 వేల ఈజిప్టు నూనెఫ్యాక్టరీల బాండులను అమ్మకానికి పెడుతుంది. బాండు ఖరీదు 150 వుంటే ప్రతి ఫ్రాంకులోనూ 50 సెంటైమ్స్ లాభం బ్యాంకుకు వస్తుంది. కాని తరువాత తేలిందేమంటే కొత్తకంపెనీకి డివిడెండ్లు లేనేలేవు. ఫలితం ప్రజాసామాన్యం 9 లేక 10 కోట్ల ఫ్రాంకులు నష్టపోయారు. పై బ్యాంకు డైరెక్టర్లలో ఒకడు ఈ జిప్టుచమురు కంపెనీకి కూడ డైరెక్టరుగా ఉన్నాడు. ఇలాంటపుడు ఫ్రెంచిరిపబ్లిక్‌ను ధనస్వాములరాచరికం అనిపిలిస్తే తప్పేముంది. పత్రికల వెనకాల, ప్రభుత్వం వెనుకాల అధికారం చెలాయించేది బ్యాంకింగు పెత్తందార్లే అనడంలో సందేహంలేదు.

సెక్యూరిటీలనుంచి బ్యాంకులు విపరీతమైన లాభాలను పొందుతాయి. ఇదే ఫైనాన్స్ పెత్తందార్ల అధికారం వృద్ధిచెందడానికి, స్థిరపడటానికి తోడ్పడుతూంది. జర్మన్ పత్రిక డైబ్యాంకు యిలా వ్రాసింది "దేశంలోని ఏ వ్యాపారంకూడ విదేశ అప్పులంత లాభాన్ని చేకూర్చడం లేదు."

"బ్యాంకులు నిర్వహించే ఏ పని కొత్తషేర్లు యిస్యూ చేయడమంత లాభప్రదం కాదు." జర్మన్ ఎకనామిస్టు పత్రిక ప్రకారం 1895 నుంచి 1900 వరకు పరిశ్రమల సెక్యూరిటీల అమ్మకంద్వారా యీ క్రిందవిధంగా లాభం వచ్చింది.

| | | | |
|---|---|---|---|
| 1895 లో | నూటికి | 38.6 | లాభం వచ్చింది. |
| 1896 ,, | ,, | 36.1 | ,, |
| 1897 ,, | ,, | 66.7 | ,, |
| 1898 ,, | ,, | 67.7 | ,, |
| 1899 ,, | ,, | 66.9 | ,, |
| 1900 ,, | ,, | 55.2 | ,, |

1891 నుంచి 1900 వరకు 10 యేండ్లలోనూ జర్మన్ బ్యాంకింగ్‌సంస్థలు పరిశ్రమల సెక్యూరిటీల అమ్మకంద్వారా 100 కోట్ల మార్కుల లాభాన్ని గడించాయి.

ఆర్థిక సుభిక్ష రోజుల్లో (బూమ్‌పీరియడ్) ఫైనాన్సుపెట్టుబడి (పెద్దబ్యాంకులు) విపరీతమైన లాభాలను పొందుతుంది. ఆర్థిక దుస్థితిరోజుల్లో చిన్నకంపెనీలు దెబ్బతిని

దివాళాతీస్తాయి. అపుడు వాటిషేర్లను పెద్దబ్యాంకులు నామమాత్రవెలయిచ్చి కొనివేసి లాభం పొందుతాయి. లేదా పునర్నిర్మాణం పేరుతో లాభం పొందుతాయి. దెబ్బతినిన కంపెనీలను పునర్నిర్మాణం చేయడంలో పెట్టుబడిషేర్ల విలువ తగ్గించివేయబడుతుంది. భవిష్యత్తులో వచ్చేలాభాలు కొత్తపెట్టుబడి ననుసరించి పంచబడుతాయి. ఆదాయం శూన్యమయితే కొత్తపెట్టుబడిని ఆహ్వానించుతాయి. ఈవిధంగా జరిగే పునర్నిర్మాణం రెండు విధాల పెద్ద బ్యాంకులకు లాభప్రదమని హిల్ఫర్డింగ్ చెబుతున్నాడు. (1) పునర్నిర్మాణంలో బ్యాంకులు సంపాదించే లాభము (2) కష్టాలలోవున్న కంపెనీలపై యీవిధంగా బ్యాంకులకు కంట్రోలుచేసే అవకాశం లభించుతుంది.

ఇచట ఒక ఉదాహరణవుంది. డార్ట్మండ్‌లోని యూనియన్ మైనింగ్ కంపెనీ 1872 లో స్థాపించబడింది. 4 కోట్ల మార్కుల పెట్టుబడితో ప్రారంభమయి సంవత్సరం తరువాత భాగస్థులకు నూటికి 17 చొప్పున లాభం పంచింది. దాని ఫలితంగా షేర్లవిలువ 175 వరకు పెరిగింది. బ్యాంకులకు 280 లక్షల లాభం గిట్టింది. ఈ కంపెనీ స్థాపనలో డిస్‌కొంటో బ్యాంకు ముఖ్యపాత్ర వహించింది. కాని తరువాత పైకంపెనీ షేర్ల విలువ పడిపోయింది. భాగస్తులు, తమ పెట్టుబడి విలువను తగ్గించివేసి పునర్నిర్మాణం చేయడానికి అంగీకరించవలసివచ్చింది. ఈ విధంగా 30 సంవత్సరాలలో అనేక పునర్నిర్మాణాల ఫలితంగా 7 కోట్ల మార్కులు యీ కంపెనీ ఫండులోనుంచి అదృశ్యమైపోయాయి. "ప్రస్తుతం ప్రారంభంనుంచి వున్న భాగస్తులకు వారిషేర్ల విలువ నూటికి 5 నామమాత్రంగా మిగిలివుంది. కాని బ్యాంకు మాత్రం ప్రతి పునర్నిర్మాణ ప్రయత్నంలోనుంచి లాభం పొందుతూంది."

అభివృద్ధిచెందుతున్న పట్టణాలచుట్టూ వున్న భూమిని కొని స్పెక్యులేషన్‌ద్వారా బ్యాంకులు విపరీతలాభాలను పొందుతాయి. ఈ భూమి విలువపెరగడం పట్టణం మధ్యకు వెళ్ళడానికి వున్న రవాణాసౌకర్యాల ననుసరించి వుంటుంది. రవాణాసౌకర్యాలు కూడ పెద్దకంపెనీల చేతుల్లో వుంటాయి. ఒకరు మరొక కంపెనీషేర్లు కొనడంద్వారా బ్యాంకుల డైరెక్టర్లుకు - రవాణాకంపెనీల డైరెక్టర్లతో సన్నిహితసంబంధం ఏర్పడుతుంది. ఇలా లీనమైపోవడాన్ని జర్మన్ రచయిత ఎల్‌విగ్ 'ఊబి' (బాగ్) అని పిలిచాడు. ఇతడు పట్టణ పరిసరాలభూమిపై బ్యాంకుల స్పెక్యులేషనుగురించి బాగా పరిశోధన చేశాడు. డూయిట్స్చె బ్యాంకు సహాయంతో ఒక బెర్లిన్ గృహనిర్మాణకంపెనీ 10 కోట్ల మార్కులు సంపాదించింది. డూయిట్స్‌బ్యాంకు తెరవెనకాల వుండి నాటకమాడింది. తరువాత యీ కంపెనీ దివాళా తీసింది. అనేకమంది చిన్న భాగస్తులు దీని ఫలితంగా దెబ్బతిన్నారు. బెర్లిన్ పోలీసులు, ఉద్యోగులతో కలసి కుట్రపన్ని బిల్డింగు లైసెన్సులు పొందడంవల్లనూ, భూమిపై పెట్టుబడి పెట్టడం లాభప్రదమని ప్రచారం చేయడంద్వారాను ప్రజలను అలా దగా చేయగలుగుతున్నారు.

ఇలాంటి దగాలను "అమెరికన్ పద్ధతులని" యూరోపియన్ ప్రొఫెసర్లు, బూర్జువా పెద్దమనుష్యులు పిలిచేవారు. కాని ఫైనాన్సు పెట్టుబడి పెత్తనం చెలామణి అవుతున్న యీ యుగంలో ప్రతిపట్టణంలోనూ, ప్రతి దేశంలోనూ యీ దగాలు నేడు పరిపాటి అయి పోయాయి.

1914 ప్రారంభంలో మూడు బెర్లిన్ ట్రాన్స్‌పోర్టు కంపెనీలతో (మెట్రోపోలిటన్, ట్రాంవేకంపెనీ, ఆమ్నిబస్ కంపెనీలతో) కలసి ఒక రవాణాసౌకర్యాల ట్రస్టు ఏర్పడు తుందని బెర్లిన్‌లో చెప్పుకో మొదలెట్టారు. డై బ్యాంకు పత్రిక యిలా వ్రాసింది. "బస్ కంపెనీలోని షేర్లలో అధికభాగాన్ని తతిమ్మా రెండు కంపెనీలు కొనివేయడం వల్ల యీ ప్లాను సంభవమయింది. ట్రాన్స్‌పోర్టు సర్వీసులను యీ విధంగా కలిపి పునర్నిర్మాణం చేయడంవల్ల ఆర్థికంగా లాభప్రదమౌతుందనీ, దాని ఫలితంగా ప్రజలు సౌకర్యా లనుభ వించుతారనీ, మేము నమ్ముతున్నాము. కాని ఏర్పడనున్న యీ ట్రస్టు వెనకాల బ్యాంకు లున్నాయి. అవి ట్రాన్స్‌పోర్టు సర్వీసులపై యీ విధంగా పెత్తనం సంపాదించాక తమ స్వంత వ్యాపారానికే ఉపయోగించుకొనే ప్రమాదం వుంది. అసలు మెట్రోపోలిటన్ కంపెనీ ఒక పెద్ద బ్యాంకు సహాయంవల్ల స్థాపించబడింది. అందుచే ఈ కంపెనీ ఆ బ్యాంకు ప్రయోజనాలనుసరించి ప్రవర్తించవలసి వుంటుంది. ఈ కంపెనీ నడిపే తూర్పు లైన్‌సర్వీసు పై బ్యాంకుకుచెందిన భూములకు రహదారీ సౌకర్యం ఏర్పరచడానికి వేయ బడింది. అందువల్ల ఈ రైల్వే పూర్తిఅయినపుడు బ్యాంకు విపరీత లాభాలను పొందు తుంది. కొందరు సభ్యులు భాగ్యవంతులవుతారు."

కోట్లకొలది డబ్బు చేతిలోవున్న మానొపలి ఏర్పడిన తరువాత రాజకీయ పరిస్థితు లతో సంబంధం లేకుండానే ప్రజా జీవితంయొక్క అన్నిభాగాలపైన దాని పలుకుబడి, అధికారం వ్యాప్తిచెందుతుంది. ఆర్థిక విషయాలపై వ్రాయబడిన జర్మన్ సాహిత్యం ఫ్రాంసులో ఉద్యోగులపైవున్న నిందలను, అమెరికాలోవున్న లంచగొండితనాన్ని చూపి జర్మన్ ఉద్యోగుల నిక్కచ్చితనాన్ని పొగడుతాయి. కాని వాస్తవమేమిటంటే బ్యాంకులపై వ్రాయబడిన జర్మన్ బూర్జువాసాహిత్యం బ్యాంకుల పనినిగురించి వ్రాయడంతో సంతృప్తి చెందదు. ఉదాహరణకు ప్రభుత్వోద్యోగులు బ్యాంకులో ఉద్యోగాలవైపు ఎలా ఆకర్షింప బడుతూన్నారో తెలుపుతాయి. "బ్యాంకులో ఉద్యోగానికి తహతహలాడే ప్రభుత్వోద్యోగి వాస్తవంగా నిక్కచ్చిగా వున్నాడని ఎవరనగలరు ?" డై బ్యాంకు డైరెక్టరు ఆల్‌ఫ్రెడ్ లాన్స్‌బర్గ్ 1909 లో యిలావ్రాశాడు. "జర్మన్‌చక్రవర్తి ద్వితీయ విలియం పాలస్టైయిన్ ప్రయాణ ఫలితంగానే బెర్లిన్-బాగ్దాద్ రైల్వేను నిర్మించడానికి పెద్ద జర్మన్ కంపెనీ స్థాపించబడింది. 'మనంచేసిన రాజకీయ తప్పులన్నిటికంటే యిదే మనచుట్టూ వలయం నిర్మించడానికి కారణమయింది." (సప్తమ ఎడ్వర్డు ప్రభుత్వం జర్మనీచుట్టూ దానికి వ్యతిరేకంగా సామ్రాజ్యవాదుల వలయాన్ని నిర్మించడానికి ప్రయత్నించింది.) 1912 లో

ఎం. ఎల్‌వేగ్ అనే రచయిత 'ప్లూటోక్రసీ - బ్యూరోక్రసి' (దనిక నిరంకుశత్వం - అధికారుల నిరంకుశత్వం) అనే వ్యాసాన్ని వ్రాశాడు. దానిలో చాలా ఉదాహరణలున్నాయి. ఫెల్కర్ అనే జర్మన్ ఉద్యోగి ట్రస్టులపై ప్రభుత్వ. కమీషన్‌లో సభ్యుడుగా పనిజేశాడు. తన చర్యల ఫలితంగా యితడు స్టీల్ సిండికేటుకో ఉద్యోగాన్ని సంపాదించుకొన్నాడు.

ఇలాంటి కేసులెన్నో వున్నాయి. అందుచే యీ బూర్జువా రచయితకూడ జర్మనీ రాజ్యాంగమిచ్చే ఆర్థిక స్వాతంత్ర్యానికి అర్థంలేదని అంగీకరించాడు. ధనికుల నిరంకుశ పాలన సాగుతున్నంతవరకు "ఎంతరాజకీయ స్వాతంత్ర్యం యిచ్చినప్పటికి మనంఅస్వతంత్రులమే" అన్నాడు.

రష్యాను గురించి ఒక ఉదాహరణ యిస్తాను. ప్రభుత్వ బ్యాంకింగు డిపార్టుమెంటులో ఉద్యోగి అయిన డెవిడోవ్‌కు ఒకపెద్దబ్యాంకు ఉద్యోగమివ్వబడిందని పత్రికలలో చదివాను. అతనికి బ్యాంకు చాలపెద్దజీతమిచ్చింది. కొలది యేండ్లలోనే అతనికి అనేక లక్షలరూబిల్సు జీతం ముట్టివుంటుంది. ప్రభుత్వబ్యాంకింగు డిపార్టుమెంటు ప్రభుత్వానికి అప్పుయిచ్చే బ్యాంకులతో పనిని సమన్వయ పరచడానికి, బ్యాంకులకు సబ్‌సిడీలు (అనగా భరణం) యివ్వడానికి ఏర్పరచబడింది.

పెట్టుబడిదారీ విధానం యొక్క సాధారణ స్వరూపమిది. పెట్టుబడి యజమానిని, ఉత్పత్తిని వేరుపరుచుతుంది. ఫైనాన్షియల్ పెట్టుబడిని - పారిశ్రామిక పెట్టుబడినుండి వేరుపరుస్తుంది. వడ్డీవ్యాపారం మీద జీవించే వానిని, పరిశ్రమలం యజమానినుండి వేరుపరుస్తుంది. -ఫైనాన్స్ పెట్టుబడి పెత్తనాన్నే సామ్రాజ్యవాదమని పిలుస్తాము. ఇది పెట్టుబడిదారీ విధానం యొక్క అత్యున్నతదశ. ఈ దశలో పైవిభాగం మరింత విశాలమవుతుంది. తక్కిన అన్నిపెట్టుబడి రూపాలపైన ఫైనాన్సు పెట్టుబడిదారుల (బ్యాంకర్ల) పెత్తనం చలామణి అవుతుంది. అనగా వడ్డీవ్యాపారుల అధికారం (కొలదిమంది బ్యాంకర్ల నిరంకుశాధికారం) పెట్టుబడిదారులందరి పైన విస్తరించుతుంది. ఇది 'ఎంతవ్యాప్తంగా వుంటుందో సెక్యూరిటీల అమ్మకం లెక్కలనుబట్టి తేలుతుంది. 'నేమార్క్' అనేరచయిత ప్రపంచంలోని సెక్యూరిటీల లెక్కలను అంతర్జాతీయ స్టాటిస్టికల్ బ్యూరో ప్రకటించిన బులెటిన్‌లో యీ విధంగా తేల్చాడు.

కోట్ల ఫ్రాంకులలో సెక్యూరిటీల అమ్మకం

| | |
|---|---|
| 1871-1880 | 7610 కోట్లు ఫ్రాంకులు |
| 1881-1890 | 6450 .. |
| 1891-1900 | 10040 .. |
| 1901-1910 | 19780 .. |

1870-80 సంవత్సరాలమధ్య ఫ్రాంకో - జర్మన్ యుద్ధఫలితంగా అప్పులు యివ్వడంవల్ల సెక్యూరిటీలమొత్త హెచ్చుగానేవుంది. కాని మొత్తం పై 19-వ శతాబ్దపు చివరి

మూడు దశాబ్దాలలోనూ పెరుగుదల అంతతీవ్రంగా జరుగలేదు. కాని 20 శతాబ్దపు మొదటి 10 సంవత్సరాలలోనే నూటికి నూరు వృద్ధిచెందింది. అందుచే ఇదివరకే మేముచెప్పినట్లుగా 20వ శతాబ్దారంభంలో మానొపలీలు (కార్టెల్సు, సిండికేటులు, ట్రస్టులు) విరివిగా ఏర్పడటం లోనే గాకుండా ఫైనాన్స్ పెట్టుబడి అభివృద్ధి చెందడంలో కూడ పెట్టుబడిదారీ విధానానికి నూతన దశ ఏర్పడిందని చెప్పవచ్చును.

'నేమార్క్' 1910 లో కర్రెంటులోవున్న సెక్యూరిటీల మొత్తం 81500 కోట్ల ఫ్రాంకులు వుంటుందని అంచనావేశాడు. ఈ మొత్తంలో ఒకసారి లెక్కలోకి వచ్చినవి తిరిగిరావచ్చుననే ఉద్దేశంతో మొత్తాన్ని తగ్గించివేశాడు. మొత్తం షుమారు 57500-60000 కోట్ల ఫ్రాంకుల మధ్యవుంటుందని లెక్కతేల్చాడు. దానిని వివిధ దేశాలమధ్య యీ విధంగా విభజించాడు.

1910 లో కర్రెంటులోవున్న సెకూ్యరిటీలు

| | | |
|---|---|---|
| బ్రిటను | 14200 | కోట్ల ఫ్రాంకులు |
| అమెరికా | 13200 | ,, |
| ఫ్రాంసు | 11000 | ,, |
| జర్మనీ | 9500 | ,, |
| రష్యా | 3100 | ,, |
| ఆస్ట్రియా-హంగెరీ | 2400 | ,, |
| ఇటలీ | 1400 | ,, |
| జపాను | 1200 | ,, |
| హాలెండు | 1250 | ,, |
| బెల్జియం | 750 | ,, |
| స్పెయిన్ | 750 | ,, |
| స్విట్జర్లాండు | 625 | ,, |
| డెన్మార్క్ | 375 | ,, |
| నార్వే-స్వీడన్, రుమేనియావగైరా | 250 | ,, |
| మొత్తం | 60000 | కోట్ల ఫ్రాంకులు |

పై లెక్కలను చూస్తే ముఖ్యమైన నాలుగు పెట్టుబడిదారీ దేశాలు ఎలాంటి ప్రముఖ స్థానాన్ని వహించుతున్నాయో బోధపడుతుంది. ఒక్కొకటి 10000 నుంచి 15000 కోట్ల ఫ్రాంకుల సెక్యూరిటీలను కలిగివుంది. వీటిలో రెండు ఎక్కువ వలసదేశాలను కలిగి వున్న ఇంగ్లండు, ఫ్రాంసులు. తక్కిన రెండు త్వరత్వరగా అభివృద్ధిచెందుతున్న అమెరికా సంయుక్తరాష్ట్రాలు, జర్మనీ అయివున్నాయి. మొత్తం పై ఈ నాలుగుదేశాలు 47900

కోట్ల ఫ్రాంకుల సెక్యూరిటీలను కలిగివున్నాయి. అనగా మొత్తంలో నూటికి ౮౦ వంతులు యివే కలిగివున్నాయి. అందుచే ఏదోవిధంగా తక్కిన ప్రపంచమంతా వీటికి బాకీదారుగా వుంది. అంతర్జాతీయంగా బ్యాంకర్ల దేశాలైన వీటికి ప్రపంచమంతా ఋణపడివుంది. తద్వారా బానిసగా కట్టుబడివుందన్నమాట.

పెట్టుబడిని విదేశాలకు రవాణాచేయడంవల్ల వచ్చే ఫలితాలను యిపుడు వివరించ వలసివుంది. అంతర్జాతీయంగా ఫైనాన్సు పెట్టుబడి అల్లిన వలయొక్కరూపాన్ని తెలియ జేయవలసివుంది.

# పెట్టుబడిని ఎగుమతిచేయడం

ఫ్రీకాంపిటీషన్ (స్వేచ్ఛావ్యాపారం) ప్రధానసూత్రంగా కలిగిన పాతరకపు పెట్టుబడిదారి విధానంలో సరుకును ఎగుమతిచేయడం ముఖ్యమైన లక్షణంగా వుండేది. ఆధునిక పెట్టుబడిదారీ విధానం అయిన మానొపలీ దశలో పెట్టుబడిని ఎగుమతిచేయడం ప్రత్యేక లక్షణంగావుంది.

పెట్టుబడిదారీ విధానం వర్తకపు సరుకును ఉత్పత్తిచేసే ఉన్నతదశ: దీనిక్రింద శ్రీమశక్తికూడ ఒక వర్తకపు సరుకు అయిపోయింది. జాతీయంగాను, అంతర్జాతీయంగానూ మారకం అభివృద్ధి చెందడం కూడ పెట్టుబడిదారీ విధానంయొక్క ప్రభావమే. పెట్టుబడిదారీ విధానంక్రింద వివిధసంస్థల అభివృద్ధిలో అసమానత్వం, హెచ్చుతగ్గులు వుండటం పరిపాటి: ఉత్పత్తియొక్క వివిధశాఖల అభివృద్ధిలో కూడ అసమానత్వం వుంటుంది. వివిధదేశాల అభివృద్ధిలో హెచ్చుతగ్గులుంటాయి. పెట్టుబడిదారీ విధానంలో యిది తప్పనిసరి. ఇతర దేశాలకంటే ముందు ఇంగ్లండు పెట్టుబడిదారీ దేశ మయింది; స్వేచ్ఛావ్యాపారం ప్రవేశపెట్టింది. 19 వ శతాబ్దం మధ్యలోనే ప్రపంచానికి కర్మాగారమయింది. ఫ్యాక్టరీలలో తయారైన వస్తువులను ఇతర దేశాలకు సప్లయిచేసి మారకంగా ముడిపదార్థాలను దిగుమతి చేసికొనేది. కాని 19 వ శతాబ్దపు చివరి పాతికేండ్లలో బ్రిటనుయొక్క యీ మానొపలీ ఉద్ధృతం తగ్గిపోయింది. దిగుమతి సుంకాలద్వారా తమ పరిశ్రమలను రక్షించుకొంటూ కొన్ని యితరదేశాలు స్వతంత్రపెట్టుబడిదారీ దేశాలయ్యాయి. 20 వ శతాబ్దం ఆరంభంలో కొత్తరకం మానొపలీలు ఏర్పడటం ఆరంభించాయి. అభివృద్ధిచెందిన పెట్టుబడిదారీ దేశాలలో మొదట్లో అవి పెట్టుబడిదారుల మధ్య కలయికగా ప్రారంభమయ్యాయి. రెండోదశలో కొలది భాగ్యవంతమైన దేశాలయొక్క పెట్టుబడి విపరీతంగా పెరిగి బ్రహ్మాండమైన రూపందాల్చి ప్రపంచమంతటిపైన వాటిమానొపలి ఏర్పడింది. ముందంజవేసిన దేశాలలో పెద్దమొత్తాలు 'అదనపుపెట్టుబడిగా' ప్రోగుబడసాగింది.

ఇప్పటికింకా వ్యవసాయం పరిశ్రమలకంటే చాల వెనుకబడివుంది. అందుచే వ్యవసాయాన్ని అభివృద్ధిచేయదలచితేనూ, టెక్నికల్ జ్ఞానం హెచ్చినా దరిద్రంలో మునుగులాడుతున్న ప్రజాసామాన్యం యొక్క జీవితపరిమాణం హెచ్చించదలచితేనూ "అదనపు పెట్టుబడి" మిగలడమనే మాటేరాదు. పెటీబూర్జువా విమర్శకులు పెట్టుబడిదారీ విధానానికి వ్యతిరేకంగా ఎల్లప్పుడూ యీ వాదన తెస్తారు. కాని పెట్టుబడిదారీ ఉత్పత్తియొక్క స్వభావమే అది. అభివృద్ధిలో హెచ్చుతగ్గులు లేకపోతేనూ, ప్రజాసామాన్యం దుర్భరస్థితిలో వుండకపోతేనూ అది పెట్టుబడిదారీ విధానమే అనిపించుకోదు. పెట్టుబడిదారీ విధానం ఆరూపంలో వున్నంతవరకు అదనపుపెట్టుబడిని ఆదేశంలోవున్న ప్రజాసామాన్యము యొక్క జీవితపరిమాణాన్ని అభివృద్ధిచేయడానికి ఉపయోగించదు. ఏమంటే అలాచేయడం వల్ల లాభాలను తగ్గించుకోవాలసివస్తుంది. అలాగాకుండా విదేశాలకు, వెనుకబడిన దేశాలకు పెట్టుబడిని ఎగుమతిచేస్తే హెచ్చులాభాలు వస్తాయి. అచట పెట్టుబడి తక్కువగా వుంటుంది; కూలి రేటు తక్కువ; ముడిపదార్థాలు చౌకగానూ వుంటాయి. అందుచే విపరీతలాభాలు తీయవచ్చును. అంతర్జాతీయంగా పెట్టుబడిదారీ జీవితవిధానంలోకి వెనుకబడిన దేశాలు ప్రవేశించడంవలన పెట్టుబడిని ఆ దేశాలలోనికి ఎగుమతిచేయ సంభవమవుతోంది; అచట ముఖ్యమైనరైల్వేలు నిర్మించ బడుతున్నాయి; పరిశ్రమల అభివృద్ధికి అవసరమైన పరిస్థితులు ఏర్పడుతున్నాయి.

కొన్ని దేశాలలో పెట్టుబడిదారీ విధానం "మితిమీరి పెరగడంవల్ల" (వ్యవసాయం వెనుకబడివున్నా!, ప్రజలు దరిద్రంలోనేవున్నా!) ఆ దేశాలలో లాభప్రదంగా పెట్టుబడి పెట్టే అవకాశాలు అరుదయ్యాయి.

ముఖ్యమైన మూడు సామ్రాజ్యవాద దేశాలు విదేశాలలో పెట్టిన పెట్టుబడి లెఖ్కలు క్రింద టేబిల్‌లో యివ్వబడినాయి :

కోట్ల ఫ్రాంకులలో విదేశాలలో పెట్టిన పెట్టుబడి

| సంవత్సరం | బ్రిటను | ఫ్రాంసు | జర్మనీ |
|---|---|---|---|
| 1862 | 360 కోట్లు | — | — |
| 1872 | 1500 ,, | 1000 కోట్లు | — |
| 1882 | 2200 ,, | 1500 ,, | ? |
| 1893 | 4200 ,, | 2000 ,, | ? |
| 1902 | 6200 ,, | 3700 ,, | 1250 |
| 1914 | 7500 ,, | 6000 ,, | 4400 |

ఈ టేబిల్ చూస్తే 20 వ శతాబ్దారంభంవరకు పెట్టుబడి ఎగుమతి ఎక్కువగా లేదని బోధపడుతుంది. యుద్ధానికి పూర్వం మూడు సామ్రాజ్యాలు కలసి విదేశాలలో 17500

నుంచి 20000 కోట్ల ఫ్రాంకుల పెట్టుబడిని కలిగివున్నాయి. నూటికి 5 చొప్పున కనీస లాభం అంచనావేసినా సంవత్సరానికి దీనివల్ల 800 నుంచి 1000 కోట్లఫ్రాంకుల ఆదాయం వస్తుంది. ప్రపంచంలోని యితర దేశాలను, జాతులను దోచుకోడానికి, నిరంకుశంగా పీడిలచడానికి సామ్రాజ్యవాదులకు యింతకంటే ఏమి కావాలి ! కొలది భాగ్యవంతమైన పెట్టుబడిదారిదేశాల దోపిడికి యిదే స్థిరమైన పునాదిగావుంది.

విదేశాలలో పెట్టుబడి ఏవిధంగా విభజించబడింది ? ఎచటెచటికి ఎగుమతి చేయ బడుతూంది ? ఈ ప్రశ్నకు జవాబుగా లెక్కలను సుమారుగా మాత్రమే యివ్వగలం. కాని ఆధునిక సామ్రాజ్యవాదం యొక్క రూపాన్ని, స్వభావాన్ని తెలిసికోడానికి యీక్రింది లెక్కలు చాలును.

1910 లో ముఖ్యమైన సామ్రాజ్యవాద దేశాలు, ఏయే ఖండాల్లో ఎంత పెట్టుబడి పెట్టాయో తెలుపు సుమారు లెఖ్కలు యిచట యిచ్చాము. ఇవి కోట్ల మార్కులలో యివ్వబడినాయి.

| ఖండాల పేరు | సామ్రాజ్యాల పేరు | | | మొత్తం |
|---|---|---|---|---|
| | బ్రిటను | ఫ్రాంసు | జర్మనీ | |
| యూరపు | 400 కోట్లు | 2300 కోట్లు | 1800 కోట్లు | 4500 కోట్లు |
| అమెరికా | 3700 ,, | 400 ,, | 1000 ,, | 5100 ,, |
| ఆశియా, ఆఫ్రికా ఆస్ట్రేలియాలలో | 2900 ,, | 800 ,, | 700 ,, | 4400 ,, |
| మొత్తం | 7000 కోట్లు | 3500 కోట్లు | 3500 కోట్లు | 14000 కోట్లు |

బ్రిటన్ తన వలసదేశాలలో ఎక్కువ పెట్టుబడిపెట్టింది. ఆశియాలోని వలసదేశాల లోనేగాక అమెరికా (కెనడా)లో కూడ హెచ్చు పెట్టుబడిపెట్టింది. విశాలమైన వలస దేశాలలోకి బ్రిటను పెట్టుబడిని పెద్దమొత్తాలలో ఎగుమతిచేసింది. సామ్రాజ్యవాదులకు తమ క్రిందవున్న దాసిసదేశాల ప్రాముఖ్యతను గురించి తరువాత చర్చించుదాము. ఫ్రాంసు విషయం వేరుగావుంది. అది యూరపులోని దేశాలలోకి తన పెట్టుబడిని హెచ్చుగా ఎగుమతిచేసింది. ముఖ్యంగా రష్యాలో 1000 కోట్ల ఫ్రాంకుల పెట్టుబడిపెట్టింది. ఈపెట్టు బడి హెచ్చుగా పరిశ్రమలలోగాక ప్రభుత్వరుణాలు రూపంలో అధికంగావుంది. వలస దేశాల సామ్రాజ్యవాదమైన బ్రిటనుతో పోల్చిచూస్తే ఫ్రాంసును వడ్డీవ్యాపారంచేసే సామ్రాజ్యవాదం అని పిలువవచ్చు. జర్మన్ సామ్రాజ్యవాదం ప్రత్యేకరకం. దీనికి చెప్పుకోదగ్గ వలసరాజ్యాలులేవు. అందుచే జర్మనీకి విదేశాలలోవున్న పెట్టుబడి యూరపు లోనూ, అమెరికాలోనూ సమంగా పంచబడివుంది.

పెట్టుబడి ఎగుమతిచేయబడిన దేశాలలో పెట్టుబడిదారీ విధానం అభివృద్ధికి దోహదమిస్తుంది. ఏ దేశాలనుండి ఎగుమతి చేయబడిందో ఆదేశాలలో పారిశ్రామికాభివృద్ధి కొంత ఆటంకపరచబడినా మొత్తంపై ప్రపంచంలో పెట్టుబడిదారీ విధానంయొక్క అభివృద్ధి తీవ్రంగా సాగుతుంది.

పెట్టుబడిని ఎగుమతిచేయగల దేశాలన్నీ ప్రత్యేక సౌకర్యాలను పొందుతాయి. ఇది ఫైనాన్సు పెట్టుబడి — మానొపలీల దశయొక్క ప్రత్యేకత అని చెప్పవచ్చును. ఉదాహరణకు 1913 అక్టోబరు సంచిక బెర్లిన్ పత్రికఅయిన 'డై బ్యాంకు'—లో యీవిధంగా వ్రాయబడింది

"అంతర్జాతీయ ధన మార్కెటులో విచిత్రమైన నాటకం ఆడబడుతోంది. ప్రపంచంలో —స్పెయిన్ నుండి బాల్కన్లవరకు, రష్యానుంచి అర్జంటైనావరకు, బ్రెజిల్‌నుంచి చైనావరకు — అనేక దేశాలు రుణాలు అడుగుతున్నాయి. కొన్నిసార్లు అప్పులకొరకు తహతహ పడుతున్నాయికూడ. ధనమార్కెటు యిపుడు అట్టే ప్రకాశవంతంగాలేదు; రాజకీయ పరిస్థితులు ఆకర్షణీయమైన భవిష్యత్తును చూపడంలేదు. కాని ధనమార్కెట్టు ఏదీ అప్పులుపెట్టి నిరాకరించడంలేదు. ఏమంటే తామివ్వకపోతే యితరులు రుణమిచ్చి విలువైన సౌకర్యాలు పొందుతారని భయపడుతున్నారు. ఈరకమైన వ్యాపారంలో ఋణదాత ఎల్లపుడు ఏదో కొంతలాభం పొందుతాడు; అది ఒక వర్తకసంధి రూపంలో వుండవచ్చు; లేదా బొగ్గుగనికాని, రేవు నిర్మాణంకాని, ఏదైనా లాభప్రదమైన సౌకర్యంగాని, లేదా యుద్ధసామగ్రికి ఆర్డరుగాని లభించవచ్చును."

ఫైనాన్సుపెట్టుబడి మానొపలీల దశను నిర్మించింది. మానొపలీలు వాటితోపాటు అనేక కొత్తపద్ధతులను ప్రవేశపెట్టాయి. బహిరంగ మార్కెటులో కాంపిటీషను (పోటీ) బదులు వ్యాపారసంబంధాలద్వారా లాభప్రదమైన బేరాలను సాగించడం పరిపాటిఅయింది. ఒక రుణం యిచ్చేముందు దానిలో భాగం తమదేశాన్నుంచి సరుకు కొనడానికి వినియోగించుతామని, ముఖ్యంగా యుద్ధసామగ్రికో, ఓడలకో, ఆర్డరు ఇస్తామని రుణస్తునిచే రుణదాత ఒప్పించుకోడం సులభమైన పనేగదా! గత రెండు దశాబ్దాలలోనూ అనగా 1890-1910 మధ్య ఫ్రాంసు యీ పద్ధతిని విరివిగా వినియోగించింది. ఈ విధంగా పెట్టుబడిని ఎగుమతి చేయడం (రుణాలివ్వడంద్వారా) సరుకులను ఎగుమతి చేయడానికి ఒక మార్గమయింది. ఈ పరిస్థితులలో జరిగే వ్యాపారంలో ముఖ్యంగా పెద్ద కంపెనీలమధ్య జరిగే వ్యాపారంలో మోసాలు జరగడానికి అవకాశముందని 'స్కీల్డర్' అనే రచయిత మృదువుగా చెప్పాడు. ఉదాహరణకు బ్యాంకులు, ప్రభుత్వం యితర దేశాలకు రుణాలిచ్చేటపుడు ఇంగ్లండులో 'ఆరమ్‌స్ట్రాంగ్' కంపెనీతోనూ, జర్మనీలో క్రుప్స్ కంపెనీతోనూ, ఫ్రాంసులో స్కీన్డర్ కంపెనీతోనూ సంప్రదించకుండా వుండటమనేది జరుగనే జరుగదు.

1905 సెప్టెంబరు 16 వర్తక ఒడంబడిక ప్రకారం ఫ్రాంసు రష్యాకు అప్పులు పెట్టింది. దానికి ఫలితంగా ఫ్రాంసు 1917 వరకు రష్యాలో ప్రత్యేక సౌకర్యాలను పొందింది. 1911 ఆగస్టు 19 న జరిగిన ఫ్రాంకో-జపానీస్ వర్తక సంధివల్లకూడ ఫ్రాంసు అలాంటి లాభాలనే పొందింది. 1906 నుంచి 1911 వరకు ఆస్ట్రియా-సెర్బియా దేశాల మధ్య దిగుమతి సుంకాలనే గోడ వుండేది. (మధ్య 7 నెలలు మినహా) ఇది ఫ్రాంసు ఆస్ట్రియాదేశాలు సెర్బియాలోకి యుద్ధసామాగ్రిని పంపడానికి పడిన పోటీ ఫలితంగానే జరిగింది. 1912 జనవరిలో పార్లమెంటులో — పాల్ డిష్నల్ యిలా చెప్పాడు: "ఫ్రెంచి కంపెనీలు 1908—1911 మధ్య 450 లక్షల ఫ్రాంకుల విలువగల యుద్ధసామగ్రిని సెర్బియాకు ఎగుమతిచేశాయి."

ఆస్ట్రియా-హంగరీ రాయబారిగా బ్రెజిల్‌లోవున్న సా-పాల్ యిలా చెప్పాడు: "బ్రెజిల్ దేశంలోని రైల్వేలు ముఖ్యంగా ఫ్రాంసు, బెల్జియం, బ్రిటన్, జర్మనీల నుండి దిగుమతిఅయిన పెట్టుబడితో నిర్మించబడ్డాయి. ఆయాదేశాలు ఋణంకొరకు రాయబారాలు సాగుతున్న సమయంలోనే రైల్వేసామగ్రికి ఆర్డర్లనుకూడ సంపాదించగలిగాయి."

ఆవిధంగా ఫైనాన్స్ పెట్టుబడి తనవలను యావత్ప్రపంచంపైన పన్నుతుంది. వలస దేశాలలో స్థాపించబడిన బ్యాంకులు లేదా మానోపలీ బ్యాంకుల శాఖలు యీ వ్యవహారాలలో ముఖ్యపాత్రను నిర్వహించుతాయి. ఈ విషయంలో యిదివరకే వలసదేశాలలో స్థిరంగా నాటుకుపోయిన ప్రాతసామ్రాజ్యవాదదేశాలను (బ్రిటను వగైరాను) చూచి జర్మన్ సామ్రాజ్యవాదులు అసూయపడతారు. బ్రిటనుకు 1904 లో వలసదేశాలలో 50 బ్యాంకులు, 2279 శాఖలు వున్నాయి; 1910 లో 72 బ్యాంకులు 5449 శాఖలు వున్నాయి. ఫ్రాంసుకు వలసదేశాలలో 20 బ్యాంకులు, 136 శాఖలు వున్నాయి. హాలెండుకు 16 బ్యాంకులు, 68 శాఖలు వున్నాయి. జర్మనీకి 13 బ్యాంకులు 70 శాఖలు మాత్రమే వున్నాయి.

మరొకవైపున అమెరికన్ సామ్రాజ్యవాదులు ఇంగ్లండును, జర్మనీని చూచి అసూయపడతారు. "దక్షిణ అమెరికాలో 5 జర్మన్ బ్యాంకులు, వాటి శాఖలు 40 వున్నాయి; 5 బ్రిటీషు బ్యాంకులు, 70 శాఖలు వున్నాయి. బ్రిటను, జర్మనీలు కలిసి అర్జంటైనా, బ్రెజిల్, ఉరుగ్వేలలో మొత్తం 400 కోట్ల డాలర్లు పెట్టుబడిపెట్టాయి. తద్వారా ఆ మూడు దేశాల మొత్తం వర్తకంలో నూటికి 46 వంతులు బ్రిటన్, జర్మనీల స్వాధీనంలో వుంది" అని 1915 లో ఒక అమెరికన్ రచయిత వాపోయాడు.

పెట్టుబడిని ఎగుమతిచేసే భూగోళాన్ని విభజించుకున్నారని చెప్పవచ్చును. ఇంతేగాక ఫైనాన్స్-పెట్టుబడి అనగా సామ్రాజ్యవాదులు ప్రపంచాన్ని నిజంగా రెండు పక్షాలుగా విభజించారని కూడా చెప్పవచ్చును.

# సామ్రాజ్యవాద గ్రూపులమధ్య ప్రపంచవిభజన

పెట్టుబడిదారీ మానొపలీ గ్రూపులు- కార్టెల్సు, సిండికేట్లు, ట్రస్టులు- మొట్ట మొదట తమదేశంలోని వర్తకాన్ని తమలో తాము విభజించుకొంటాయి. క్రమక్రమంగా పరిశ్రమలన్నిటినీ వశం చేసికొంటాయి. కాని యింతటితో పూర్తికాదు. ఏమంటే పెట్టుబడిదారీ సమాజంలో దేశంలోని వర్తకం విదేశ వర్తకంతో సంబంధం కలిగివుంది. చాలా కాలం క్రిందటనే పెట్టుబడిదారీవిధానం ప్రపంచమార్కెట్టును సృష్టించింది. పెట్టుబడి ఎగుమతులు వృద్ధి అయ్యేకొలదీ, బ్రహ్మాండమైన మానొపలి సంస్థల పలుకుబడి అప్పు పుచ్చుకున్న విదేశాలలోను- వలసదేశాలలోనూ- విస్తరించేకొలదీ యీ సంస్థలమధ్య అంతర్జాతీయ ఒడంబడికలు అవసరమవుతాయి. తత్ఫలింగా అంతర్జాతీయ కార్టెల్సు ఏర్పడుతాయి.

ఇదివరకు జరిగిన వాటన్నిటికంటే ఉన్నతమైన స్థాయిలో జరిగే ప్రపంచ పెట్టుబడి కేంద్రీకరణకు- ఉత్పత్తి కేంద్రీకరణకు యిది దారితీస్తుంది. ఈ అంతర్జాతీయ మానొపలీలు ఎలా అభివృద్ధి చెందుతాయోచూదాం.

19 వ శతాబ్దం చివరలోనూ, 20 వ శతాబ్దం ప్రారంభంలోనూ పెట్టుడిదారీ విధానం టెక్నికల్ పరిశ్రమ చాలా ముఖ్యమైనది. కొత్తగా పెట్టుబడిదారీ దేశాలయిన జర్మనీలోనూ, అమెరికా యునైటెడ్ స్టేట్సులోనూ యిది చాలా అభివృద్ధి చెందింది.

జర్మనీలో 1900 సంవత్సరంలో వచ్చిన ఆర్థికదుస్థితి ఫలితంగా యీ పరిశ్రమలో కేంద్రీకరణ విశేషంగా జరిగింది. అదివరకే పరిశ్రమలలో జోక్యం పెట్టుకొంటున్న బ్యాంకులు యీ ఆర్థిక సంక్షోభం రోజులలో చిన్న చిన్న కంపెనీలను కూలద్రోసి, వాటన్నిటినీ పెద్ద మానొపలీలలో లీనమయ్యేటట్లు చేశాయి. జీడెల్స్ యిలా వ్రాశాడు. "సహాయం అవసరమైన చిన్న కంపెనీలకు బ్యాంకులు సహాయమివ్వ నిరాకరించాయి. సుభిక్షపు రోజులలో (బూమ్‌పిరియడ్‌లో) అభివృద్ధిచెంది స్వతంత్రంగావున్న చిన్న కంపెనీలనేకం సంక్షోభం రోజులలో బ్యాంకులు సహాయమివ్వ నిరాకరించుటచే దివాళా తీశాయి"

1900 తరువాత జర్మనీలో కేంద్రీకరణ 'మూడు పువ్వులు ఆరుకాయలుగా' అభివృద్ధిచెందింది. 1900 వరకు ఎలెక్ట్రికల్ పరిశ్రమలో 7 లేక 8 గ్రూపులుండేవి. ఒక్కొక గ్రూపులో చాలా కంపెనీలుండేవి. మొత్తం 28 కంపెనీలుండేవి. ఒక్కొకదానిని 2 మొదలు 11 బ్యాంకులుదాకా సపోర్టుచేసేవి (బలపరచేవి). 1908–1912 సంవత్సరాల మధ్య ఈ గ్రూపులన్నీపోయి రెండుగ్రూపులు మాత్రం మిగిలాయి. ఈ రెంటినీ ఒకే గ్రూపు అనికూడా పిలువవచ్చును. క్రింద టేబిల్ యీ కేంద్రీకరణాన్నే చూపుతుంది.

- జర్మనీదేశపు ఎలెక్ట్రిక్ పరిశ్రమలోవున్న గ్రూపులు

1900 లో

(1) ఫెల్టెన్ & గిల్లామి-లాహమేయర్
(2) యూనియన్ ఎ. యి. జి.
(3) సీమన్స్-స్కూకెర్ట్, హాల్స్కే అండ్కో
(4) బెర్గ్మన్ కూమెర్
(5) ఫెల్టెన్ & లాహ్మేర్ (జనరల్ ఎలెక్ట్రిక్ కంపెనీ)
(6) ఎ. యి. జి.
(7) సీమెన్స్-హాల్స్కె-స్కూకెర్ట్
(8) బెర్గ్మన్ (1900 లో దివాళాతీసింది)

1912 లో

(1) ఎ. యి. జి. (జనరల్ ఎలెక్ట్రికల్ కంపెనీ)
(2) సీమెన్స్-హాల్స్కే-స్కూకెర్ట్

} ఇవిరెండూ 1908 నుంచీ సన్నిహిత సహకారంతో పని జేస్తున్నాయి.

ప్రసిద్ధిచెందిన ఎ. యి. జి. (జనరల్ ఎలెక్ట్రిక్ కంపెనీ) 175 నుంచి 200 కంపెనీలదాకా కంట్రోలు చేస్తుంది. మొత్తం 150 కోట్ల మార్కులు పెట్టుబడిని కలిగివుంది. దానికి విదేశాలలో 35 ప్రతినిధి సంస్థలున్నాయి. ఇందులో 12 జాయింటుస్టాక్ కంపెనీలు 10 దేశాలలోవున్నాయి. 1904 లో విదేశాలలోని ఎలెక్ట్రిక్ పరిశ్రమలో పెట్టిన జర్మన్ పెట్టుబడి మొత్తం 23 కోట్ల 30 లక్షల మార్కులు వుంటుందని అంచనా వేయబడింది. ఇందులో 620 లక్షల మార్కులు రష్యాలోనే పెట్టబడింది. ఎ. యి. జి. పెద్ద-కంబైన్ అని వేరే చెప్పనక్కరలేదనుకొంటా. దాని అధీనంలో 16 పారిశ్రామిక కంపెనీలున్నాయి. దాని ఫ్యాక్టరీలలో తంతులు, ఇన్సులేటర్లు మొదలుకొని మోటార్ కార్లు, గాలి విమానాల వరకు అనేకరకాల వస్తువులు తయారు చేయబడుతున్నాయి.

యూరపులో జరిగిన కేంద్రీకరణ, అమెరికాలో జరిగిన కేంద్రీకరణలో భాగం మాత్రమే.

| | | |
|---|---|---|
| యునైటెడ్ స్టేట్స్ | థామ్సన్-హూస్టన్ జి.ఇ.సి. అందుకో యూరపులో ఒక కంపెనీ స్థాపించింది. | ఎడిసన్ అండ్ కో యూరపులో ఫ్రెంచి ఎడిసన్ అండ్ కో అనే కంపెనీ స్థాపించింది. ఇది జర్మనీలోని ఎ. ఇ. జి. కి తన పేటెంట్లు సప్లయి చేస్తుంది. |

జర్మనీ — యూనియన్ ఎలెక్ట్రిక్ కంపెనీ
జనరల్ ఎలెక్ట్రిక్ కంపెనీ (ఎ. ఇ. జి.)

ఈవిధంగా ఎలెక్ట్రికల్ పరిశ్రమలో రెండు బ్రహ్మాండమైన మానొపలీలు ఏర్పడ్డాయి. "ప్రపంచంలో వీటితో సంబంధం లేకుండా స్వతంత్రంగా వున్న ఎలెక్ట్రిక్ కంపెనీయే లేదు." అని హీనిగ్ అనే రచయిత "పాత్స్ ఆఫ్ ఎలెక్ట్రిసిటీట్రస్టు" అనే వ్యాసంలో వ్రాశాడు. ఈ రెండు మానొపలీసంస్థలు చేస్తున్న మొత్తం వ్యాపారం యీ క్రింది లెఖ్కలను చూస్తే బోధపడుతుంది.

| | | మొత్తం వ్యాపారం కోట్ల మార్కులలో | కార్మికుల సంఖ్య | లాభాలు కోట్ల మార్కులలో |
|---|---|---|---|---|
| అమెరికా జనరల్ ఎలెక్ట్రికల్ కంపెనీ | 1907 సం॥లో | 25.2 కోట్లు | 28,000 | 3,5 కోట్లు |
| | 1910 ,, | 29.8 ,, | 32,000 | 4,6 ,, |
| జర్మనీలోని ఎ. ఇ. జి. | 1907 ,, | 21.6 ,, | 30,700 | 1.5 ,, |
| | 1910 ,, | 36.2 ,, | 60,800 | 2,2 ,, |

1907 సంవత్సరంలో జర్మన్ట్రస్టు, అమెరికన్ట్రస్టు ఒకఒడంబడిక చేసికొన్నాయి. దాని ప్రకారం అవి ప్రపంచాన్ని పంచుకొన్నాయి. తత్ఫలితంగా వాటిమధ్య పోటీలేకుండా, పోయింది. అమెరికన్ జనరల్ ఎలెక్ట్రికల్ కంపెనీ వంతు అమెరికా యునైటెడ్ స్టేట్సు, కెనడా వచ్చింది. జర్మన్ ఎ. ఇ. జి వంతుగా జర్మనీ, ఆస్ట్రియా, రష్యా, హాలెండు, డెన్మార్కు, స్విట్జర్లాండు, టర్కీ, యితర బాల్కన్ రాజ్యాలు వచ్చాయి. రహస్యమైన ప్రత్యేక ఒడంబడికలు జరిగాయి. వాటిలో బ్రాంచి కంపెనీల విషయం, ఉత్పత్తిలో కొత్త శాఖలు తెరవడం విషయం, యిదివరకు పంపిణీకి రాని కొత్త దేశాల విషయం రూల్సు నిర్ణయించుకోబడ్డాయి. ఈ రెండు ట్రస్టులు కొత్త పరిశోధనలను, అనుభవాలను ఒండొరులకు తెలుపుకోవాలనే నియమంకూడ ఒడంబడికలోవుంది.

700 కోట్ల మార్కులపెట్టుబడి కలిగి ప్రపంచ మంతటా వ్యాపించి ప్రతిదేశంలోనూ తమ శాఖలనో, ఏజెన్సీలనో, ప్రతినిధులనో కలిగివున్న యీ బ్రహ్మాండమైన ట్రస్టుతో

పోటీచేయడం ఎంతకష్టమో సులభంగా తెలసికోవచ్చు. కాని రెండు ట్రస్టులమధ్య జరిగిన యీ ప్రపంచ విభజనను మార్చడం అసాధ్యంమాత్రంకాదు. అభివృద్ధిలోవున్న హెచ్చు తగ్గులవలన, యుద్ధాలవలన, దివాళాలవలన వివిధ శక్తులలో వచ్చే మార్పుల ననుసరించి ప్రపంచాన్ని పునర్విభజన చేసికోడం జరుగుతుంది.

చమురు పరిశ్రమ అలాంటి పునర్విభజనను గురించి ఉదాహరణగా వినియోగించు తుంది. ఒడంబడికలను తిరుగతోడి పునర్విభజన చేసికోడంకోసం జరిగిన పోరాటాన్ని గురించి యీ పరిశ్రమ చరిత్ర తెలుపుతుంది.

1905 లో జీడెల్స్ యిలా వ్రాశాడు. "ప్రపంచ ఆయిల్ మార్కెటును రెండు బ్రహ్మాండమైన గ్రూపులు అపుడే విభజించుకొన్నాయి. ఒకటి రాక్‌ఫెల్లకు చెందిన స్టాండర్డు ఆయిల్ కంపెనీ. రెండోది రాత్‌చైల్డ్ అండ్ నోబెల్‌కు చెందిన రష్యన్ ఆయిల్ కంపెనీ. ఈ రెండు కంపెనీలు ఒడంబడిక ననుసరించి పరస్పరం కలసి పనిజేశాయి. కాని చాల సంవత్సరాలనుంచి వీటి గుత్త అధికారాన్ని తొలగించడానికి ఐదు శత్రు కంపెనీలు పనిచేయసాగాయి.

(1) అమెరికన్‌నూనె గనులు క్రమంగా ఒట్టి పోవడం (2) బాకూ సమీపంలో మెంట్‌కాఫ్ అనేకంపెనీ పోటీగా స్థాపించబడటం (3) ఆస్ట్రియా చమురు గనులు (4) రొమేనియన్ చమురు గనులు (5) డచ్ వలసదేశాలలోని చమురు గనులు (వాటిని నడుపుతున్న - ఇంగ్లీషు పెట్టుబడితో సంబంధం కలిగిన - శామ్యూల్ అండ్ షెల్ కంపెనీ) చివరిమూడు కంపెనీలతో జర్మన్ బ్యాంకులకు ముఖ్యంగా 'డూయిట్చె బ్యాంకుకు' సంబంధముంది. ఈ బ్యాంకులు ఒక ప్లాను ప్రకారం ముఖ్యంగా రొమేనియా చమురు గనులనుండి నూనె ఉత్పత్తిని అభివృద్ధి చేశాయి. 1907 లో రొమేనియా చమురు పరిశ్రమలో 18 కోట్ల 50 లక్షల ఫ్రాంకుల విదేశ పెట్టుబడివుంది. ఇందులో 7 కోట్ల 40 లక్షల పెట్టుబడి జర్మనీ నుంచే వచ్చింది."

ఆర్థిక సమస్యలపై వ్రాయబడిన సాహిత్యంలో యీ పోరాటం "ప్రపంచాన్ని పంచు కోడానికి జరుగుతున్న పోరాట"మని పిలువబడింది. ఒకవైపున రాక్‌ఫెల్లర్‌ట్రస్టు అన్ని టినీ జయించతలచింది. అందుకుగాను డచ్ ఇండియా దీవులలోని చమురు గనులను స్వాధీనం చేసికోడానికి ఒక పిల్లకంపెనీని హాలెండులో స్థాపించడానికి ప్రయత్నించింది. తద్వారా అది తన ముఖ్యశత్రువైన ఆంగ్లో-డచ్ షెల్‌ట్రస్టును దెబ్బగొట్టాలని ప్రయత్నించింది. రెండోవైపున డూయిట్చె బ్యాంకు, ఇతర జర్మన్ బ్యాంకులు రొమేనియా చమురు గనులను అంటిపెట్టుకొని, రష్యన్ చమురు గనుల కంపెనీలతో కలసి 'రాక్ ఫెల్లర్' ముఠాతో పోరాటం సాగించాయి. రాక్‌ఫెల్లర్ ముఠాకు హెచ్చు పెట్టుబడివుంది. ఆయిల్ ఎగుమతులు వినిమయదారులకు అందచేయడానికి చక్కని ట్రాన్స్‌పోర్టు సౌక

ర్యాలను కలిగివుంది. అందుచే పోరాటం 1907 లో డూయిట్చ్‌బ్యాంకు పూతా ఓటమితో ముగిసింది. ఏమంటే డూయిట్స్‌బ్యాంకు ఆయిల్ వ్యాపారాన్ని వదులుకొని కోట్లధనాన్ని నష్టపోవాలసిన స్థితివచ్చింది. అందుచే లొంగిపోయి అమెరికన్ ట్రస్టుతో తనకు నష్టకరమైన ఒడంబడిక చేసికొంది. డూయిట్స్ బ్యాంకు "అమెరికన్ ప్రయోజనాలకు" విరుద్ధమైన ఏపని చేయనని అంగీకరించింది.

తరువాత 'విచిత్ర ఆయిల్ నాటకం' ప్రారంభమయింది. జర్మనీలో చమురు పరిశ్రమకు రాజు అని పిలువబడే డూయిట్చ్‌బ్యాంకు డైరెక్టరు 'వాన్ గ్విన్నర్' తన ప్రయివేటు కార్యదర్శిద్వారా ఆయిల్ పరిశ్రమను ప్రభుత్వం స్వాధీనం చేసికోవాలని ఆందోళన ప్రారంభించాడు. బ్రహ్మాండమైన యీ జర్మన్ బ్యాంకు, దానితో సంబంధమున్నవారందరు యీ ప్రచారాన్ని బలపరచారు. పత్రికలు 'దేశభక్తి'ని వెళ్ళగ్రక్కుతూ అమెరికన్‌ట్రస్టు జర్మనీ కంపెనీపైవేసిన బరువును తీవ్రంగా నిరసించాయి. 1911 మార్చి 15 వ తేదీన జర్మన్ పార్లమెంటులో ప్రభుత్వం ఆయిల్ మానొపలీని హస్తగతం చేసికోడానికి ప్లాను తయారుచేయాలనే తీర్మానం ఏకగ్రీవంగా ప్యాసయింది. ప్రభుత్వం యీ కోర్కెను అమలు జరుపడానికి వెంటనే పూనుకుంది. ఈవిధంగా ఆయిల్ పరిశ్రమను ప్రభుత్వ మానొపలీగా మార్చి అమెరికన్ ట్రస్టును దగాచేసి తన వ్యాపారాన్ని బాగుచేసికోవాలని డూయిట్చ్‌బ్యాంకు ప్రయత్నించింది. ఈ ఎత్తు జయించినట్లే కనిపించిందికూడ. ఇంతలో ఆయిల్ వ్యాపారస్థులు తమకు విపరీత లాభాలు వస్తాయని కలలుగన్నారు. రష్యాలోని పంచదార పరిశ్రమ యజమానులకంటే కూడ ఎక్కువ లాభాలను సంపాదించవచ్చు ననుకొన్నారు......... కాని యీ లాభాలను పంచుకోడాన్ని గురించి పెద్ద జర్మన్ బ్యాంకులు తగవులాడ ప్రారంభించాయి. 'డిస్‌కొంటో' బ్యాంకు డూయిట్చ్ బ్యాంకు ఉద్దేశ్యాలను బట్టబయలు జేసింది. రెండో విషయమేమిటంటే రాక్‌ఫెల్లర్‌తో తగువు వస్తుందని ప్రభుత్వం భయపడింది. రొమీనియన్ ఆయిల్ ఎక్కువగా సప్లయి కాదు; రాక్‌ఫెల్లరు సప్లయి చేయకపోతే ఆయిల్ సంపాదించడం సాధ్యమవుతుందా ? అనే సందేహం కలిగింది. అంతేగాకుండా రానున్న (1913 లో) యుద్ధంకోసం ఆయుధ సామగ్రి సప్లయిలకోసం ఆ కోటీశ్వరుని సహాయంకావాలి. ఇందుకు ఫలితంగా ఆయిల్ మానొపలీని ప్రభుత్వం హస్తగతం చేసుకొనే ప్లాను వదలివేయబడింది, ఈ పోరాటంలో మరల రాక్‌ఫెల్లర్ తాత్కాలికంగా జయించాడు.

జర్మన్ పత్రిక 'డైబ్యాంకు' యీ విషయమై యిలా వ్రాసింది: జర్మన్ ఎలెక్ట్రిసిటీ మానొపలీని స్థాపించి, జలపాతాలసహాయంతో చౌకగా ఎలెక్ట్రిసిటీని తయారు చేయాలని వ్రాసింది. ఆ విధంగానే అమెరికన్ ఆయిల్ ట్రస్టుతో పోరాడకలుగుతామంది. "కాని ఉత్పత్తిదార్లు ఎప్పుడు కావాలనుకొంటే ఎలెక్ట్రిసిటీ మానొపలి అప్పుడు వస్తుంది. ఎలెక్ట్రిక్ పరిశ్రమలో సంక్షోభ ఏర్పడినపుడు ఏర్పడుతుంది. ఇప్పటి కప్పుడే ప్రభుత్వా

న్నుంచీ, పట్టణాలనుంచి మానోపలీ (గుత్తాధికారం) సంపాదించి ఎంతోడబ్బుఖర్చుపెట్టి నిర్మించబడిన ప్రయివేట్ కంపెనీలకు లాభం రానపుడు ఎలెక్ట్రిసిటీ మానొపలీ ఏర్పరచడం సాధ్యమవుతుంది. అపుడు జలపాతాలను ఉపయోగించి ఎలెక్ట్రిసిటీ తయారుచేయాలి. కాని ప్రభుత్వం ఖర్చుతో ఎలెక్ట్రిసిటీని చౌకగా తయారు చేయడం సాధ్యంకాదు. అందుచే దానిని ప్రభుత్వ కంట్రోలు క్రింద పని చేసే ప్రయివేటు మానొపలీకి అప్పచెప్పాలి. ఏమంటే ప్రయివేటు కంపెనీలు యిదివరకే అనేక కంట్రాక్టులు సంపాదించాయి. ఎక్కువ ముదరా కోరుతాయికూడా. పొటాష్ మానొపలి విషయం యిలాగే జరిగింది. ఆయిల్ మానొపలి విషయం యిలాగే జరుగుతూంది. ఎలక్ట్రిసిటీ విషయం యిలాగే జరుగ నున్నది. ప్రభుత్వవశం చేసికోవాలని వాదించేవారు ఒక సంగతి గమనించాలి. తియ్యని మాటలు విని మోసపోరాదు. జర్మనీలోని యీ మానొపలీలు ఎన్నడూ వినిమయదార్ల (Consumers) క్షేమాన్ని కోరలేదు; పరిశ్రమల్లో వచ్చిన లాభాలు ప్రభుత్వానికి చెందా లనే ఉద్దేశ్యం కూడ వాటికిలేదు. దివాళా తీయడానికి సిద్ధంగావున్న ప్రయివేటు పరిశ్రమ లను ప్రభుత్వానికి అంటగట్టి, దాని ఖర్చుపై పరిశ్రమలను పునరుద్ధరించాలనే వాటి ప్రయత్నం!

జర్మన్ బూర్జువా ఆర్థికవేత్తలు సైతం యీ విషయాలను అంగీకరించక తప్పింది కాదు. దీనినిబట్టి ప్రయివేటు మానొపలీలకు- ప్రభుత్వ మానొపలీలకు మధ్యవున్న పరస్పర సంబంధం మనకు బోధపడుతుంది. ప్రపంచ విభజనకోసం పెద్ద మానొపలిస్టుల మధ్య జరిగే సామ్రాజ్యవాద పోరాటంలో యివి దశలు మాత్రమేనని స్పష్టపడుతుంది.

వర్తక నావల పరిశ్రమలో కూడ కేంద్రీకరణ విపరీతంగా అభివృద్ధి చెందింది. ప్రపంచ విభజనతో అంతమయింది. జర్మనీలో రెండు పెద్ద కంపెనీలు తలలెత్తాయి. (1) హాంబర్గ్ - అమెరికా (2) నార్డ్ - డూయిట్చర్ - లాయిడ్ అనే కంపెనీలు. ఒక్కొకదానికి స్టాకుద్వారాగాని, షేర్లద్వారాగాని 20 కోట్ల మార్కుల పెట్టుబడివుంది. ఒక్కొకదానికి 18 కోట్ల మార్కులకుపైగా విలువగల ఓడలు వున్నాయి. అమెరికాలో 1903 జనవరి ఒకటవ తేదీన అంతర్జాతీయ నావికావర్తక కంపెనీ అనే పేరుతో 'మోర్గన్' ట్రస్టు ఏర్పడింది. దీనిలో 9 బ్రిటీషు, అమెరికన్ నావికా కంపెనీలు ఏక మయ్యాయి. దీనికి 12 కోట్ల డాలర్లు (అనగా 48 కోట్ల మార్కులు) పెట్టుబడివుంది.

1903 ప్రాంతంలో బ్రహ్మాండమైన జర్మనీ కంపెనీలు- ఆంగ్లో అమెరికన్ కంపెనీల మధ్య ఒడంబడిక జరిగింది. లాభాల పంపకాన్ని అనుసరించి ప్రపంచాన్ని యివి పంచు కొన్నాయి. ఆంగ్లో-అమెరికన్ రవాణా విషయంలో పోటీచేయకుండా వుంటానికి జర్మన్ కంపెనీలు అంగీకరించాయి. జర్మనీ రేవులను, అమెరికన్ రేవులను జాగ్రత్తగా విభజించి. కంట్రోలుకమిటీ నియమించబడింది. ఈ కంట్రాక్టు 20 సంవత్సరాలకు ఉద్దేశించబడింది. కాని యుద్ధంవచ్చిన సందర్భంలో ఒడంబడిక రద్దు అవుతుందనే మినహాయింపు వుంది,

అంతర్జాతీయ 'రైలు కంబైను' ఎలా ఏర్పడిందో తెలిపే కథనుంచి మనం చాలా విషయాలు నేర్చుకోవచ్చు. 1884 వర్తకమాంద్యం రోజులలో రైలు కార్టెలును ఏర్పరచ డానికి బ్రిటిషు, బెల్జియం, జర్మనీ రైల్వే పరిశ్రమ యజమాన్లు మొట్టమొదటిసారి ప్రయత్నించారు. తమ దేశాలలోని మార్కెటులకోసం తమలోతాము పోటీచేయరాదని యివి ఒడంబడిక చేసికొన్నాయి. విదేశమార్కెటులను యీవిధంగా పంచుకొన్నాయి. నూటికి 66 వంతులు బ్రిటనుకు; 27 వంతులు జర్మనీకి; 17 వంతులు బెల్జియంకు అని నిర్ణయించబడింది. ఇండియా బ్రిటనుకోసం ప్రత్యేకించు (రిజర్వు) కోబడింది. ఒక బ్రిటిషుకంపెనీ యీ కార్టెలులో చేరలేదు. దానితో పోరాడటానికి అమ్మకాలపై పన్నువేసికొని కార్టెలు ఖర్చులు భరించింది. కాని 1886 లో మరిరెండు బ్రిటీషు కంపెనీలు కార్టెలునుంచి విడిపోయాయి. తత్ఫలితంగా కార్టెలు విచ్ఛిన్నమైపోయింది. పరిశ్రమలు లాభప్రదంగావున్న సుభిక్షరోజులలో ఒడంబడిక నిలువజాలదనడానికి యిదొక ఉదాహరణ.

1904 ప్రారంభంలో జర్మనీలో ఉక్కు సిండికేటు (గుత్త వ్యాపారసంస్థ) ఏర్పడింది. 1904 నవంబరులో అంతర్జాతీయ రైల్‌కార్టెల్ పునరుద్ధరించబడింది. దానిప్రకారం విదేశవర్తకం యీవిధంగా పంచుకోబడింది. నూటికి 53.5 వంతులు బ్రిటనుకు; 28.83 వంతులు జర్మనీకి; 17.67 వంతులు బెల్జియంకు పంచబడింది. తరువాత ఫ్రాంసు దీనిలో చేరింది. దానికి మొదటియేడాది 4.8 వంతులు, రెండోయేడాది 5.8 వంతులు, మూడోయేడాది 6.4 వంతులు యివ్వబడింది. 1905 లో యునైటెడ్ స్టీల్ కార్పొరేషన్ యీ కార్టెల్‌లో ప్రవేశించింది. తరువాత ఆస్ట్రియా, స్పెయిన్ చేరాయి. 1910 లో ఓగెల్‌స్టీన్ యిలావ్రాశాడు. "ఇపుడు ప్రపంచవిభజన పూర్తి అయిపోయింది. ఈ విభజన చేసేటపుడు రైల్వే సామాన్లను ఎక్కువగా వినియోగించే ప్రభుత్వ రైల్వేల ప్రయోజనాలను గమనించలేదు. అందుచే అవి త్రిశంకు స్వర్గంలో జీవించవలసి వుంటుంది."

1909 లో స్థాపించబడిన అంతర్జాతీయ జింక్‌సిండికేటు విషయంచూదాం. ఉత్పత్తి ఐదు ఫ్యాక్టరీ గ్రూపులమధ్య విభజించబడింది. జర్మనీ, బెల్జియం, ఫ్రెంచి, స్పెయిన్, బ్రిటీషు కంపెనీలు యిందులోచేరాయి. అంతర్జాతీయ పవర్‌ట్రస్టు అనేది ఒకటిఏర్పడింది. దీనినిగూర్చి లీఫ్‌మన్ యిలాచెప్పాడు : "ప్రేలుడు సరుకును ఉత్పత్తిచేసే పరిశ్రమల యజమానుల కలయికను యిది తెలియజేస్తుంది. వీళ్ళు అలాగే ఐక్యమయిన ఇంగ్లీషు, ఫ్రెంచి వ్యాపారస్థులతో కలసి ప్రపంచాన్ని పంచుకొన్నారు."

1897 నాటికి జర్మనీకి 40 అంతర్జాతీయ కార్టెల్సులో భాగముందనీ, 1910 నాటికి 100 లో భాగముందనీ 'లీఫ్‌మన్' తెలియజేశాడు.

కొంతమంది బూర్జువా రచయితలు ఈ అంతర్జాతీయ కార్టెల్సు పెట్టుబడియొక్క అంతర్జాతీయ స్వరూపానికి చక్కని ఉదాహరణఅనే భావం వెల్లడించుతున్నారు. పెట్టుబడిదారీ విధానంక్రింద ప్రపంచశాంతిని కాపాడటానికి యివి ఆశాజ్యోతులవంటివని అభిప్రాయ

పడుతున్నారు. శాస్త్రీయ దృక్పథాన్నుంచిచూస్తే యీ అభిప్రాయాలు అపసవ్యమైనవి. ఆచరణరీత్యాచూస్తే సాచివేత కబుర్లకు, ఉపేక్షాభావానికి దారితీస్తాయి. ఇలాంటి వాదన జరిగిపోయిందల్లా మంచిదని సమర్థించే అసహ్యాకరమైన ఆపర్చ్యునిజం అనిపించు కొంటుంది. పెట్టుబడిదారుల మానోపలీలు ఎంతవరకు అభివృద్ధిచెందాయో తెలిసికోడానికి అంతర్జాతీయ కార్టెల్సు వినియోగింపతాయి. తద్వారా వివిధ పెట్టుబడిదారీ గ్రూపులమధ్య జరిగే పోరాటంయొక్క లక్ష్యం తెలుస్తుంది. ఆర్థికదృష్టితోను, చరిత్రదృష్టితోను చూస్తే పరిస్థితులు ఎటువైపు దారితీస్తున్నాయో తెలిసికోడానికి బాగా వినియోగించుతాయి. పోరాటంయొక్క రూపాలు మారుతూవుంటాయి. తాత్కాలికమైన కారణాలవల్లను, ప్రత్యేకమైన కారణాలవల్లను మార్పు ఎల్లపుడు జరుగుతూవుంటుంది. కాని పోరాటంయొక్క సారాంశం, వర్గస్వభావం మాత్రం వర్గాలు వున్నంతవరకు మారజాలదు. క్రింది ఉదాహరణద్వారా యీ విషయాన్ని అర్థం చేసికోవడం సులభమవుతుంది. జర్మన్ బూర్జువావర్గ ప్రయోజనాలదృష్టితో చూస్తే ఆర్థిక పోరాటంయొక్క (ప్రపంచ విభజనకు) కారణాలు బట్టబయలు చేయడం మంచిదికాదు. అందుచే పెట్టుబడిదారులు పోరాటంయొక్క ఏదో ఒకరూపాన్ని సమర్థించుతారు. కాట్స్కీకూడ యిదేపని చేస్తున్నాడు. ఇది ఒక జర్మన్ బూర్జువావర్గానికి సంబంధించినది మాత్రమేకాదు. ప్రపంచంలోని పెట్టుబడిదారులందరకు సంబంధించిన సమస్యయిది. పెట్టుబడిదారులు పాపాత్ములగుటవల్ల - ప్రపంచాన్ని పంచుకోవడంలేదు. పెట్టుబడి కేంద్రీకరణ క్రమంగా అభివృద్ధిచెందిన ఫలితంగా వారు లాభాలు సంపాదించడానికి యీ మార్గం అవలంబించారు. వారు తమ లాభాలను పెట్టుబడినిబట్టి పంచుకొంటారు. వర్తకంకోసం సరుకులను ఉత్పత్తిచేసే పెట్టుబడిదారి విధానంక్రింద యింకోమార్గం ఏమీలేదు. ఆర్థిక, రాజకీయ పరిస్థితులలో కల్గిన మార్పువల్ల వివిధశక్తులు కూడ మార్పుచెందుతాయి. ఈ మార్పులను అర్థంచేసుకోవడానికి వాటివల్ల ఏయే సమస్యలు బయలుదేరుతున్నాయో తెలిసికోవాలి. ఈ మార్పులు కేవలం అర్థికంగానే వున్నాయా ? లేక సైనికబలంలో జరిగిన మార్పులా ? ప్రస్తుత పెట్టుబడిదారీ విధానంయొక్క దశను మార్చడానికితగినంత ప్రాముఖ్యమైనవా ? లేక అప్రధానమైనవా ? అనే సంగతులు తెలిసికోవాలి.

వివిధ గ్రూపుల పెట్టుబడిదారులమధ్య జరుగుతున్న పోరాటాల ఉద్దేశాలను, ఒడంబడికల ఉద్దేశాలను బట్టబయలు చేయకుండా రోజురోజు మారుతుండే పోరాటరూపాలలో (యుద్ధాలు - ఒడంబడికలు) ఒకటి మంచిది, మరొకటి చెడ్డదని వాదించడం సాచివేత కబుర్లకు (Sophistry) దిగడమనిపించు కొంటుంది.

పెట్టుబడిదారీవిధానంయొక్క ప్రస్తుతదశలో ప్రపంచాన్ని అర్థికంగా పంచుకోడంపై ఆధారపడి పెట్టుబడిదారీ గ్రూపులు ఏర్పడుతున్నాయి. రెండోవైపున దీనిననుసరించే వివిధ ప్రభుత్వాలు, రాజకీయ గ్రూపులు ప్రపంచాన్ని పంచుకోడానికి ప్రయత్నాలు చేస్తున్నాయి. రెండోవైపునదీనిననుసరించేవివిధప్రభుత్వాలు, రాజకీయగ్రూపులుప్రపంచాన్నిపంచుకోడానికి ప్రయత్నాలు చేస్తున్నాయి. దీని ఫలితంగానే వలస దేశాలకొరకుపోరాటాలుజరుగుతున్నాయి.

# పెద్ద సామ్రాజ్యవాదులమధ్య జరిగిన ప్రపంచ విభజన

19 వ శతాబ్దాంతానికి ప్రపంచ పంపకం ఎంతవరకు వచ్చిందీ సంగ్రహంగా తెలియజేస్తూ ప్రముఖ భూగోళశాస్త్రజ్ఞుడైన ఎ. సూపాన్ తన "యూరపియన్ వలసదేశాల విస్తీర్ణ అభివృద్ధి" అను గ్రంథంలో ఈ క్రింది లెక్కలను ఇచ్చాడు :

యునైటెడ్ స్టేట్స్‌తోసహా వివిధ యూరపియన్ సామ్రాజ్యవాదులకు చెందిన భూభాగాలు (నూటికి)

| | 1876 | 1900 | పెరుగుదల లేక తగ్గుదల |
|---|---|---|---|
| ఆఫ్రికా | 10.8 | 90.4 | + 79.6 |
| పాలినీసియా | 56.8 | 98.9 | + 42.1 |
| ఆసియా | 51.5 | 56.6 | + 5.1 |
| ఆస్ట్రేలియా | 100 | 100 | — |
| అమెరికా | 27.5 | 27.2 | — 0.3 |

కాబట్టి ఈ దశయొక్క ప్రత్యేక లక్షణం పాలినీసియాను ఆఫ్రికాను పంచుకొనడమేనని సూపాన్ తెలియజేశాడు.

కాని ఆసియా అమెరికాలలో అనాక్రమిత ప్రాంతాలనేవి లేకపోవుటవల్ల సూపాన్ సిద్ధాంతాన్ని ఇంకా విస్తరింపచేసి, ఈ దశయొక్క ప్రత్యేకలక్షణం, భూగోళంయొక్క అంతిమ పంపకమని చెప్పవచ్చును. అంటే కొత్త పంపకం సాధ్యపడదనే అర్థంలో కాదు. కొత్తపంపకాలు సాధ్యపడతాయి, తప్పనిసరిగా జరుగుతాయికూడా. కాని భూమండలంలోని అనాక్రమిత భూభాగాలనన్నిటినీ సామ్రాజ్యవాదులు 19 వ శతాబ్దాంతానికి సంపూర్ణంగా ఆక్రమించేశారని మాత్రం గుర్తించాలి. మొట్టమొదటిసారిగా ప్రపంచ పంపకం పూర్తి అయింది. భవిష్యత్తులో మళ్ళీజరిగితే పునర్విభజన జరగాల్సిందే. ఏ "యజమాని"కి చెందని భూభాగాలను ఆక్రమించేబదులు భవిష్యత్తులో జరిగే పంపకాలన్నీ ఒక "యజమాని" వద్దనుంచి మరొక యజమాని స్వాధీనం చేసుకొనుటద్వారా జరుగుతాయి.

అందువల్ల ప్రపంచ వలస దేశాలయందు సామ్రాజ్యవాదుల వైఖరి నేడు ఒక ప్రత్యేకదశకు వచ్చిందని చెప్పవచ్చును. ఈ వైఖరికి, పెట్టుబడివిధానంయొక్క అధునాతన దశకు, లేక బ్యాంకు పెట్టుబడి విధానానికి అతి సన్నిహితసంబంధం ఉంది. అందువల్ల ప్రస్తుత దశకు, పూర్వదశలకు గల భేదాన్నిగురించి ప్రస్తుత పరిస్థితినిగురించి సరిగా తెలుసుకోవాలంటే, వివరాలతోసహా విషయాలనన్నిటిని సమగ్రంగా పరిశీలించుట అవసరం. వెంటనే రెండుప్రశ్నలు బయలుదేరుతున్నాయి." వలస దేశాలకొరకు పోరాటం తీవ్రతరంఅయి వలసనీతి తీవ్రతరంఅగుట సరిగ్గా ఈ ఫైనాన్సుకాపిటల్ ఈ దశలోనే జరిగిందా ? అయితే ఈ విషయంలో ప్రస్తుత ప్రపంచపంపకం ఎలాఉంది ? అనే విషయాలను మొదట తేల్చుకోవాలి.

19 వ శతాబ్దంలో వివిధదశలయందు బ్రిటన్, ఫ్రాన్సు, జర్మనీ దేశాలకు చెందిన వలసప్రాంతాలను గురించి వివరించుటకు తన "వలసదేశాల ఆక్రమణయొక్క చరిత్ర" అను గ్రంథంలో మారిస్ అను అమెరికన్ రచయిత ప్రయత్నించాడు. అతని పరిశోధన ఫలితాలు సంగ్రహంగా ఈ క్రింద చెప్పబడినాయి :

వలసప్రదేశాల వైశాల్యం, జనాభాలు

(10 లక్షల చదరపుమైళ్ళు, 10 లక్షల ప్రజలు)

| | బ్రిటన్ | | ఫ్రాన్సు | | జర్మనీ | |
|---|---|---|---|---|---|---|
| | వైశాల్యం | జనాభా | వైశాల్యం | జనాభా | వైశాల్యం | జనాభా |
| 1815-30 | ? | 126.4 | 0.02 | 0.5 | — | — |
| 1860 | 2.5 | 145.1 | 0.2 | 3.4 | — | — |
| 1880 | 7.7 | 267.9 | 0.7 | 7.5 | — | — |
| 1899 | 9.3 | 309 | 3.7 | 56.4 | 1 | 14.7 |

పైలెక్కలనుబట్టి 1860-1880 మధ్య బ్రిటన్ యొక్క వలసప్రాంతాలు విపరీతంగా అభివృద్ధి అయినవని, 19 వ శతాబ్దంలో ఆఖరి 20 సంవత్సరాల్లో గూడా కొంతవరకూ అభివృద్ధి అయినవని తెలుస్తుంది. ఈ చివరి 20 సంవత్సరాల్లోనే ఫ్రాన్సు జర్మనీల వలస ప్రాంతాలు ఎక్కువయినాయి. అయితే స్వేచ్ఛావ్యాపార విధానం 1860, 1870 ల వరకు ఆధిక్యత వహించిందని, తరువాత గుత్త వ్యాపార విధానం బయలుదేరిందని ఇదివరకే తెలుసుకున్నాం. స్వేచ్ఛావ్యాపారదశ 1860, 1870 నాటికి అత్యున్నత స్థాయికి వచ్చింది. ఆతరువాత దశలోనే వలస దేశాల ఆక్రమణయొక్క ఉధృతం ఎక్కువయిందని, ప్రపంచ భూభాగాల పంపకానికై జరిగే పోరాటం గూడా మరింత తీవ్రమయిందని ఇప్పుడు స్పష్ట మయింది. అందువల్ల పెట్టుబడివిధానం పరిణామం చెందుతూ గుత్త పెట్టుబడివిధానంలోకి,

బ్యాంకు పెట్టుబడివిధానంలోకి మారటానికీ, ప్రపంచ పంపకంకోరకు తీవ్రమవుతున్న పోరాటానికి, అతి సన్నిహిత సంబంధం గలదని నిస్సందేహంగా చెప్పవచ్చును.

హాబ్సన్ తన "సామ్రాజ్యవాదం" అను గ్రంథంలో యూరపియన్ సామ్రాజ్యవాదుల వలసదేశ ఆక్రమణయొక్క ఉధృతం 1884-1900 మధ్య తీవ్రమయిందని నిర్ణయించాడు. ఆతని అంచనాల ప్రకారం, ఈ సంవత్సరాల్లో 5 కోట్ల 70 లక్షలామంది ప్రజలు నివసించే 37 లక్షల చదరపుమైళ్ళ విస్తీర్ణంగల వలదేశ ప్రాంతాలు బ్రిటన్ వశమయినాయి. అదేవిధంగా 3 కోట్ల 65 లక్షల ప్రజలు కల్గిన 36 లక్షల చదరపుమైళ్ళ వలసదేశాలు ఫ్రాన్సు వశంగావించుకుంది 1 కోటి 67 లక్షల ప్రజలు గల 10 లక్షల చదరపుమైళ్ళ వలస ప్రదేశం ఈ సంవత్సరాల్లో జర్మనీ క్రిందికి వచ్చినాయి. 3 కోట్ల ప్రజలతో గూడిన 9 లక్షల చదరపుమైళ్ళ విస్తీర్ణంగల వలసదేశం బెల్జియమ్ వశమయింది. 90 లక్షల ప్రజలు గల 8 లక్షల చదరపుమైళ్ళ వలస ప్రాంతం పోర్చుగల్ అధీనమయింది. 19 వ శతాబ్దాంతానికి ముఖ్యంగా 1880 నుంచి వలసదేశాల దురాక్రమణయొక్క ఉధృతం పెరిగిందని, అందరికీ తెలిసిన విషయమే.

1840-1860 మధ్య బ్రిటన్‌లో స్వేచ్ఛావ్యాపారం అత్యున్నతదశకు వచ్చింది. ఆ కాలంలో బ్రిటిష్ రాజ్యాంగవేత్తలందరూ వలసదేశాలవిషయంలో విముఖత చూపించేవారు. వలసదేశాలు బ్రిటన్ నుంచి విడిపోయి స్వాతంత్ర్యం సంపాదించుకొనుట తప్పనిసరిగా జరిగితీరుతుందని వారు అభిప్రాయపడేవారు. 1898 లో యం. బీర్ ప్రకటించిన "ఆధునిక బ్రిటిష్ సామ్రాజ్యవాదం" అను వ్యాసంలో ఈ క్రింది విధంగా ఉంది :- "సామ్రాజ్యవాద తత్వాన్ని సాధారణంగా బలపరచే డిస్రాయిల్ గూడా 1852 లో 'ఈ వలసదేశాలన్నీ మన మెడకు గుదిబండలే' అని చెప్పాడు." కాని 19 వ శతాబ్దాంతానికి ఇంగ్లండు రాజకీయ రంగంలో నాయకులుగా వచ్చిన సిసిల్‌రోడ్స్, జోసెఫ్ ఛేంబర్లయిన్లు బహిరంగంగా సామ్రాజ్యాన్ని బలపరచి నిర్దాక్షిణ్యంగా సామ్రాజ్యవాద వైఖరిని వర్తింపచేశారు.

అప్పటికే ఈ బ్రిటిష్ బూర్జువారాజ్యాంగవేత్తలందరూ ఆధునిక సామ్రాజ్యవాదం యొక్క రాజకీయ, ఆర్థిక అంకురాలకుగల సంబంధాన్ని స్పష్టంగాగ్రహించారని గుర్తుపెట్టుకోవాలి. నిజమైన తెలివిగల ఆర్థికపంథా అనిచెప్తూ ఛేంబర్లేయిన్ సామ్రాజ్యవాదాన్ని బలపరిచాడు. ప్రపంచమార్కెట్‌లో బ్రిటన్ ఎదుర్కొనవలసివస్తున్న జర్మన్, అమెరికన్, బెల్జియన్ పోటీలను అతడు ఉదహరించాడు. కార్టెల్సు, సిండికేట్లు ట్రస్టులు మొదలైన గుత్త సంస్థలను నిర్మిస్తూ గుత్త సంస్థలలోనే మోక్షమార్గం ఉందని పెట్టుబడిదారులు భావించారు. బూర్జువావర్గంయొక్క రాజకీయ నాయకులు గూడా గుత్త సంస్థలను బలపరుస్తూ, ప్రపంచంలో మిగిలిపోయిన అనాక్రమిత ప్రాంతాలను ఆక్రమించుటకై త్వరపడ్డారు. సిసిల్‌రోడ్స్‌యొక్క సామ్రాజ్యవాద ఆశయాలను గురించి 'స్టీడ్' అను పత్రికా విలేఖరి వ్రాస్తూ 1895 లో సిసిల్‌రోడ్స్ చెప్పిన ఈ క్రింది మాటలను ఉదహరించాడు :-

" నిన్నటిరోజున తూర్పులండన్‌లో జరిగిన ఒక నిరుద్యోగులసభకు హాజరయ్యాను. ఆ సభలో అనేక తీవ్ర ఉపన్యాసాలు జరిగినాయి. "తిండిపెట్టండి" "తిండికావాలి", "తిండి, తిండి" అని ఉపన్యాసకులందరూ గగ్గోలుపెట్టినారు. సమావేశం తరువాత ఇంటికివస్తూ ఆలోచించినప్పుడు సామ్రాజ్యవాదంయొక్క అవశ్యకత నాకు గోచరించింది. ఎలాగైనాసరే బ్రిటన్‌లో రక్తపాతం జరుగకుండా అంతర్యుద్ధం రాకుండా చేయాలంటే మన దేశంలోని 4 కోట్లమందికి తిండి కల్పించుట అవసరం. ఇది రాజ్యాంగవేత్తలమైన మన విధి. ఇందుకై కొత్తగా వలసదేశాలను ఇంకా సంపాదించాలి. సంపాదించి కొత్త మార్కెట్లను కల్పించాలి. మన ప్రజలకు తిండి ఉండాలంటే సామ్రాజ్యం అవసరం. ఇదే సామ్రాజ్యవాదంయొక్క అర్థం. కనుక అంతర్యుద్ధం రాకుండాచేయాలంటే మీరంతా సామ్రాజ్యవాదులుగా తయారుకావాలి ".

బోయర్ యుద్ధానికి ముఖ్యబాధ్యుడైన బ్రిటిష్ కోటీశ్వరుడగు సిసిల్‌రోడ్స్ 1895లో చెప్పిన మాటలు ఇవి: మోటుగా, బహిరంగంగా సామ్రాజ్యవాదాన్ని సమర్థించాడు సిసిల్‌రోడ్స్. ఇంత బహిరంగంగా కాకపోయినా మాస్లోవ్, సూడెకూమ్, పోట్రెసోవ్, దేవిడ్, రష్యన్ మార్క్సిస్టు "సిద్ధాంతానికి" పునాదివేసిన ఇతరులుగూడా సామ్రాజ్యవాదాన్ని బలపరచుట జరిగింది. సిసిల్‌రోడ్స్ బాహాటంగా సమర్థిస్తే, మిగిలినవారు గూఢంగా సమర్థించారు. అంతేభేదం!

ప్రపంచ భూభాగంయొక్క పంపకాన్ని గురించి, ఆఖరిదశలో పంపకంలో వచ్చిన మార్పులను గురించి సాధ్యమైనంతవరకు సరిగ్గా నిర్ణయించుటకై సూపాన్ తయారుచేసిన లెక్కలను తీసుకుందాం. 1876–1900 మధ్యకాలాన్ని, సూపాన్ పరిశీలించాడు. 1876వ సంవత్సరంలో పశ్చిమ యూరపియన్ స్వేచ్ఛావ్యాపార విధానం అత్యున్నతదశకువచ్చి, 1876 తరువాత గుత్తవిధానం ఆధిక్యత వహించుట జరిగిందికనుక 1876 సంవత్సరం తోనే ప్రారంభిద్దాం. 1914 కు సంబంధించిన 'సూపాన్' లెక్కలకంటె హ్యూబ్నర్ ఈమధ్యనే తయారుచేసిన లెక్కలు (జెగ్రాఫికల్ & స్టాటిస్టికల్ పట్టికలు) సరియైనవి గనుక 1914 కు సంబంధించినంతవరకూ హ్యూబ్నర్ లెక్కలను తీసుకుందాం. ఒక్క వలసదేశాలకు సంబంధించే ఉంటాయి సూపాన్ తయారుచేసిన లెక్కలన్నీ: అందువల్ల ప్రపంచ పంపకాన్నిగురించి సంపూర్ణంగా అంచనాలను తయారుచేయుటకై వలసదేశాలు కానటువంటి, అర్ధవలసదేశాలుగా ఉన్నటువంటి పర్షియా, చైనా, టర్కీ మొదలైన దేశాలనుగూడా కలిపి పట్టిక తయారుచేద్దాం. పర్షియా ఇప్పటికే దాదాపు వలసదేశంగా మారిపోయింది. చైనా టర్కీలు వలసదేశాలుగా మారుటకు సిద్ధంగాఉన్నాయి.' ఈవిషయాలనుబట్టి ఈ క్రింది పట్టిక తయారైంది.

## పెద్ద సామ్రాజ్యవాదులకు చెందిన వలసప్రాంతాలు

(యూనిట్లు : వైశాల్యం లక్షల చదరపు కిలోమీటర్లలో ; జనసంఖ్య లక్షలలో)

| | వలసదేశాలు | | | | సామ్రాజ్యవాద దేశాలు | | మొత్తం | |
|---|---|---|---|---|---|---|---|---|
| | 1876 | | 1914 | | 1914 | | 1914 | |
| | వైశాల్యం | జనసంఖ్య | వైశాల్యం | జనసంఖ్య | వైశాల్యం | జనసంఖ్య | వైశాల్యం | జనసంఖ్య |
| బ్రిటన్ | 225 | 2519 | 335 | 3935 | 3 | 465 | 338 | 4400 లక్షలు |
| రష్యా | 170 | 159 | 174 | 332 | 54 | 1362 | 228 | 1694 |
| ఫ్రాన్సు | 9 | 60 | 106 | 556 | 5 | 396 | 111 | 951 |
| జర్మనీ | — | — | 29 | 123 | 5 | 649 | 34 | 772 |
| యునైటెడ్ స్టేట్సు | — | — | 3 | 97 | 94 | 970 | 97 | 1067 |
| జపాన్ | — | — | 3 | 192 | 4 | 530 | 7 | 722 |
| మొత్తం | 404 | 2738 | 650 | 5234 | 165 | 4372 | 815 | 9606 లక్షలు |
| బెల్జియం, హాలెండు మొదలైన ఇతర సామ్రాజ్యవాద దేశాలకు చెందిన వలసదేశాలు | | | | | | | 99 | 453 |
| అర్ధ వలసదేశాలు | .... | | .... | | .... | | 145 | 3612 |
| ఇతరదేశాలు | .... | | .... | | .... | | 280 | 2891 |
| మొత్తం ప్రపంచం యొక్క | | | .... | | .... | .... | 1339 | 16570 |

పై పట్టికనుబట్టి 19 వ శతాబ్దాంతానికి, 20 వ శతాబ్ద ప్రారంభానికి ప్రపంచామంతా ఎలా పూర్తిగా పంపకమయిందో స్పష్టపడుతుంది. 1876 తరువాత వలస ప్రాంతాల విస్తీర్ణం విపరీతంగా వృద్ధి అయింది. ఆ ముఖ్య సామ్రాజ్యదేశాలకు చెందిన వలస రాజ్యాలే దాదాపు 1½ రెట్లు (4 కోట్ల చదరపు కిలో మీటర్లనుంచి 6½ కోట్ల చదరపుమైళ్ళ వరకూ) పెరిగినాయి. అనగా 2½ కోట్ల చదరపుకిలో మీటర్లు ఎక్కువయినవన్నమాట. 1 కోటి 65 లక్షల చదరపు కిలోమీటర్ల వైశాల్యం గల 6 సామ్రాజ్య వాదదేశాల విస్తీర్ణంకంటె వలసదేశాల విస్తీర్ణం 1½ రెట్లు పెరిగిందని తెలుస్తుంది. 1876 లో మూడు దేశాలకు (జర్మనీ, యునైటెడ్ స్టేట్స్, జపాన్) వలసదేశాలే లేవు. ఫ్రాన్సుకు బహుకొద్దిగా ఉండేవి. 1914 వచ్చేసరికి ఈ 4 దేశాలకే యూరప్ ఖండంకంటె 2½ రెట్లు ఎక్కువ వైశాల్యంగల వలసప్రాంతం (1 కోటి 41 లక్షల చదరపు కిలో మీటర్లు) ఏర్పడింది: వలసదేశాల అభివృద్ధి క్రమం గూడా ఎగుడుదిగుడుగా జరిగిందని స్పష్టమవుతోంది. ఉదాహరణకు, దాదాపు సమాన వైశాల్యం, జన సంఖ్యలుగల ఫ్రాన్సు, జర్మనీ, జపాన్ దేశాలను పోల్చిన యెడల జర్మనీ, జపాన్ దేశాలు రెండిటికి క్రింద ఉన్న మొత్తం వలస ప్రాంతంకంటె 3 రెట్లు ఎక్కువ విస్తీర్ణంగల వలస ప్రదేశాలు ఫ్రాన్సు అధీనంలో వున్నాయి. అదే విధంగా బ్యాంకు పెట్టుబడుల విషయంలోగూడా జర్మనీ, జపాన్ రెంటిని కలిపి చూసినా వాటికంటె ఎన్నోరెట్లు ఎక్కువ బ్యాంకు పెట్టుబడులు ఫ్రాన్సుకు ఏర్పడినాయి. వలసదేశాల ఆక్రమణ ఒక ఆర్థిక కారణాలమీదనే ఆధార పడి లేదు. భూగోళ పరిస్థితులు మొదలైన అనేక విషయాలమీదగూడా వలసప్రాంతాల విస్తీర్ణం ఆధారపడి ఉంటుంది. బాహుళ్యమైన పరిశ్రమలు, మారకం, బ్యాంకుపెట్టుబడి విధానముల వత్తిడి ఫలితంగా వివిధదేశాలలోని ఆర్థిక జీవిత ప్రమాణాలను సమాన స్థాయికి తీసుకొని వచ్చుటకు బలవత్తరమైనశక్తులు ఏర్పడినప్పటికి వివిధ ప్రాంతాల్లో ఇంకా గొప్పవ్యత్యాసములు కన్పిస్తున్నాయి. 6 ముఖ్యసామ్రాజ్యవాద దేశాల్లో ఆలస్యంగా బయలుదేరిన పెట్టుబడి దేశాలైన అమెరికా, జర్మనీ, జపానులు త్వరత్వరగా అభివృద్ధిఅయినాయి. నూతనంగా ఎక్కువ అభివృద్ధి చెందని పాత సామ్రాజ్యదేశాలైన బ్రిటన్, ఫ్రాన్సులు పై 3 దేశాలకంటె మందంగా వృద్ధిఅయినాయి. ఇకరష్యా విషయంలో, సామ్రాజ్యవాదం ఈ దేశంలో మూర్తీభవించి యున్నప్పటికి ఇంకా ఆర్థికంగా ఎంతోవెనుకబడి భూస్వామ్య యుగంనాటి సంబంధాలతో పెట్టుబడి విధానం ఇక్కడ మిళితమైఉంది.

పెద్ద సామ్రాజ్యవాద ప్రభుత్వాల అధీనంలోఉన్న వలసదేశాలతోపాటు ఇతర చిన్న ప్రభుత్వాలకు చెందిన చిన్న వలసదేశాలనుగూడా పేర్కొన్నాం. వలసదేశాలను తిరిగి పంచుకొనుటకై పెద్ద సామ్రాజ్యవాద ప్రభుత్వాలు సాగించబోయే పోరాటంలో ఈ చిన్న వలసదేశాలన్నిటిని పెద్ద ప్రభుత్వాలు స్వాహాచేయవచ్చును. ప్రస్తుతం పెద్దవారి మధ్యగల ఘర్షణలు, చీలికలు, వైరుధ్యాలఫలితంగా వలసదేశాలు కొన్ని ఈ చిన్న

సామ్రాజ్యవాద ప్రభుత్వాల అధీనంలోఉండుట జరుగుతోంది. కొన్ని దేశాలు క్రమేణా వలస దేశాలుగా ఎలా మారిపోతున్నవో "అర్ధవలస దేశాలు" నిరూపిస్తున్నాయి. ఈమార్పు ప్రపంచమంతటా అన్ని సామాజికరంగాల్లో కన్పిస్తుంది. ఆర్థిక, అంతర్జాతీయ రంగాల్లో పెట్టుబడిదారులగు కోటీశ్వరులకు ఎంత గొప్పశక్తి కలదంటే, చివరికి సంపూర్ణ రాజకీయ స్వాతంత్ర్యంగల దేశాలనుగూడా తమ చెప్పుచేతలక్రిందికి తెచ్చుకోగలుగుతున్నారు. ఇప్పుడే దీనికి ఒక ఉదాహరణచూస్తాం. రాజకీయ స్వాతంత్ర్యమును భగ్నంచేసి తమ అధీనంక్రిందికి తెచ్చుకొనుటవల్ల సామ్రాజ్యవాదులకు అత్యంత లాభాలు చేకూరుటకు అనుకూలపరిస్థితులు ఏర్పడుతాయి. 'అర్ధవలస' రాజ్యాలన్నీ రాజకీయ స్వాతంత్ర్యమును కోల్పోయేబాటలో మధ్యలోఉన్నవని చెప్పవచ్చును. మిగిలిన ప్రపంచాన్నంతా ఇదివరకే పంచుకున్న తరువాత అర్ధబానిస దేశాలనుగూడా ఆక్రమించుకొనుటకై ప్రారంభమయిన పోరాటం ఈ గుత్తపెట్టుబడి కోటీశ్వరుల హయాంలో మరింత తీవ్రమయింది.

పెట్టుబడివిధానంలో ఈ ఆధునికదశ (గుత్తవ్యాపారం, బ్యాంకు పెట్టుబడులదశ) ప్రారంభంకాకపూర్వమే, అసలు పెట్టుబడివిధానం బయలుదేరక ముందుగూడా సామ్రాజ్యవాదం, వలస దేశాల ఆక్రమణ, వలసనీతి అన్నీఉండేవి. బానిసవిధానంమీద నిర్మించబడిన రోమ్‌నగరం సామ్రాజ్యవాదబాటలో సాగిపోయి వలసదేశాలను ఆక్రమించింది. కాని ఆయా కాలములలోని సామాజిక, ఆర్థిక సంబంధాలను గుర్తించకుండా సామ్రాజ్యవాదాన్ని గురించి వ్యర్థవాదనలుసాగిస్తూ రోమక మహాసామ్రాజ్యాన్ని, బ్రిటిష్ మహాసామ్రాజ్యాన్ని పోల్చుటకు ప్రారంభించుటలో అర్ధంలేదు. పెట్టుబడివిధానం ఏర్పడిన తరువాతగూడా గుత్తవ్యాపారులగు కోటీశ్వరులయొక్క వలసనీతికి పెట్టుబడివిధానంలో గుత్తదశకు పూర్వం వివిధదశలలో సామ్రాజ్యవాదుల వలసనీతికిగూడా ఎంతో వ్యత్యాసం ఉంది.

పెద్దపెద్ద పెట్టుబడిదారులయొక్క గుత్త సమ్మేళనములయొక్క అధిక్యతయే ఆధునిక పెట్టుబడి విధానంయొక్క ప్రధానలక్షణం. ముడిపదార్థాల నిధులన్నీ ఒకే ఒకముఠా స్వాధీనమగుటద్వారా ఈ గుత్తసంస్థలన్నీ గట్టిగా నిలబడగల్గుతాయి. అంతర్జాతీయ పెట్టుబడి సమ్మేళనాసంస్థలన్నీ తమ పోటీదార్లను తమతో పోటీలో నిలబడకుండా చేయుటకై ఎటువంటి విశ్వప్రయత్నాలుచేయునో ఇదివరకే తెలుసుకున్నాం. ఉదాహరణానికి గనులతోనిండిన భూభాగాలను, నూనెగనులను మొదలైన ముడిసరుకుల నిధులనన్నిటిని కొనేస్తారు పోటీదార్ల పోటీ బెడదలేకుండా గుత్తసంస్థలన్నీ నిరాటంకంగా విజయం పొందాలంటే వలస దేశాలను రాజకీయంగా స్వాధీనపరుచుకొనుట ఒకటేమార్గం. వలస దేశాలమీద రాజకీయ అధికారం లేనియెడల, ఆయా దేశాలలో శాసనరూపంగా ప్రభుత్వ గుత్తసంస్థలు నిర్మించబడి తమకు పోటీగా తయారయే ప్రమాదంగూడా కలుగవచ్చును. ఎంత ఎక్కువగా పెట్టుబడివిధానం అభివృద్ధిఅయితే, అంత ఎక్కువగా ముడిసరుకుల

కొరకు అన్వేషణ, అంతఎక్కువగా పోటీవిధానం, వలసరాజ్యాలకొరకు తీవ్రమైన సంఘర్షణ ప్రపంచమంతా బయలుదేరుతుంది.

షిల్డర్ ఈవిధంగా వ్రాశాడు :

"త్వరలోనే ఒక విపరీతపరిస్థితి కలుగవచ్చును. ఆహారపదార్థాలు తగ్గిపోవుటవల్ల గాక పరిశ్రమల కవసరమైన ముడిపదార్థాలు కావలసినంత దొరకకపోవుటవల్ల పరిశ్రమలు క్షీణించుటద్వారా పట్టణాల్లోని పారిశ్రామిక జనసంఖ్య క్షీణించే పరిస్థితులు ఏర్పడవచ్చును. నమ్మటానికి వీలులేనట్లుగా కనపడినా యీవిషయం తప్పనిసరిగా జరుగుతుందని చెప్పుటకు తగిన కారణాలు ఉన్నాయి"

ఉదాహరణానికి : బట్టల మిల్లుల కవసరమైన ముడిసరుకులన్నీ క్రమేణా తగ్గిపోతున్నాయి. కలపతగ్గి పోతోంది. అందువల్ల దాని ధరగూడా క్రమంగా పెరుగుతోంది. అదేవిధంగా తోళ్ళుగూడా తగ్గిపోతున్నాయి.

"ప్రపంచ ఆర్థిక విధానంలో పరిశ్రమకు, వ్యవసాయానికి మధ్యసమానత్వాన్ని వెలకొల్పుటకై పారిశ్రామిక నిర్మాతల సంఘాలు చాలాప్రయత్నాలు చేసినాయి. ఈ ప్రయత్నాలు చేసినవాటిలో ముఖ్యపారిశ్రామిక దేశాలన్నిటిలో 1904 లో స్థాపించబడిన అంతర్జాతీయ కాటన్‌స్పిన్నర్స్ సంఘాల ఫెడరేషన్, 1910 లో ఏర్పడిన యూరపియన్ ఫ్లాక్సు స్పిన్నర్స్ సంఘాలఫెడరేషన్ ముఖ్యమైనవి"

బూర్జువా సంస్కరణవాదులు వారిలో గూడా ముఖ్యంగా కాట్‌స్కీ అనుచరులు ఈ విషయాల యొక్క ప్రాముఖ్యతను గుర్తించరు. అధికవ్యయ ప్రమాదములతో కూడుకొనిన వలసనీతిని అవలంబించకుండానే, 'కేవలం' వ్యవసాయ విధానాన్ని అభివృద్ధి చేయుటద్వారా ముడిసరుకులసప్లయిలను వృద్ధిచేసి బహిరంగ మార్కెట్లలోకి తీసుకు వచ్చుట సాధ్యపడుతుందని వారు వాదిస్తారు : ఈ వాదనలన్నీ సామ్రాజ్యవాదాన్ని సమర్థించుటయే గాక దానికి చిన్నెలు, వన్నెలు కల్పించుటకు ప్రయత్నించుటతప్ప మరేమీకాదు. ఆధునిక పెట్టుబడివిధానంయొక్క ప్రధానలక్షణమైన గుత్తస్వభావాన్ని లెక్కలోకి తీసుకొనక పోవుటవల్ల ఇటువంటి వాదనలు బయలుదేరుతున్నాయి. స్వేచ్ఛావ్యాపారమనేది ఎప్పుడో గతించిపోయిన విషయం. దాని స్థానే గుత్తసంస్థలైన సిండికేట్లు, ట్రస్టులు బయలుదేరి స్వేచ్ఛావ్యాపారం మీద క్రమేణా నిర్బంధాలను ఎక్కువగా కల్పించినాయి. ఇక వ్యవసాయ విధానాన్ని అభివృద్ధి చేయుటవల్ల లాభాలు తగ్గి, కూలి ఎక్కువై ప్రజాసామాన్యం యొక్క ఆర్థిక పరిస్థితులు అభివృద్ధి కాగలవు. కాని వలసదేశాల దురాక్రమణల బదులు ప్రజల పరిస్థితిని బాగుచేయాలని ఏ గుత్తసంస్థలైనా కృషిచేయగలవని ఒక్క పిచ్చిబూర్జువా సంస్కరణవాదులు తప్ప మరెవరు ఊహించగలరు ?

ఇదివరకే కనిపెట్టబడిన ముడిసరుకుల నిధులను దోపిడిచేయుటతో పెట్టుబడిదారు లగు కోటీశ్వరులు ఆగరు. భవిష్యత్తులో పనికిరావడానికి అవకాశం ఉన్న ముడిసరుకుల ప్రదేశాలన్నీ వారికి కావాలి. టెక్నికల్ అభివృద్ధి అతివేగంగా జరుగుతున్న ప్రస్తుత పరిస్థితులలో, ఈనాడు నిరుపయోగమైన ప్రదేశంలో నూతన పద్ధతులను వర్తింపచేసి పెట్టుబడిని ఎక్కువ చేయుటద్వారా రేపు ఫలవంతమైన ప్రదేశంగా మారవచ్చును. (ఈ నూతన పద్ధతులను కనిపెట్టుటకు అవసరమైన ఇంజనీయర్లను, వ్యవసాయశాఖా నిపుణులను నియమించి ఖర్చు అంతా భరించుటకు పెద్ద బ్యాంకులు సిద్ధంగాఉన్నాయి) ఇదే విధంగా నూతన లోహములను, ఖనిజములను కనిపెట్టుటకు, ముడిసరుకులను కనుగొని ఉపయోగించుటకు సహాయపడే నూతన పరిశోధనలను సాధించుటకు పరిస్థితులు ఏర్పడినాయి. ఈ కారణాలవల్ల పెట్టుబడి కోటీశ్వరులు తమ ఆర్థిక ఆధిక్యతను వృద్ధిచేసుకొనుటకు ఇంకా ఎక్కువ భూప్రదేశాలను సంపాదించుటకు అన్వేషణ ప్రారంభిస్తారు. భవిష్యత్తులో 'రాగల' ఆదాయాన్ని గూడా ఇప్పుడే లెక్కలోకి తీసుకొని ట్రస్టులు తమ ఆస్తుల విలువను రెండు మూడు రెట్లు హెచ్చించి పెట్టుబడిలోకి చేరుస్తూవుంటాయి. గుత్తవిధాన ఫలితంగా ముందు 'రాగల' ఆదాయాన్ని గూడా ఇప్పుడే లెక్కలోకి తీసుకుంటాయి. అదే విధంగా ఫైనాన్సు కాపిటల్ గూడా, నిధులు ఉండకపోవనే దృష్టితో ఎటువంటివైనా సరే, ఉక్కడివైనాసరే, ఏవిధంగానైనాసరే సాధ్యమైనన్ని భూ ప్రదేశాలను ఆక్రమించుటకు ప్రయత్నిస్తుంది. మిగిలిపోయిన చిన్నచిన్న అనాక్రమిత భూ ఖండాలను వశపరచుకొనుటలో ఎక్కడ వెనుకబడిపోతామో ననే భయంతో ఆరాటపడుతుంది. ఇదివరకే పంపకమయిన భూభాగాలను తిరిగి పంపకం చేసుకొనుటకు గూడా తీవ్రప్రయత్నాలు సాగిస్తుంది.

బ్రిటిష్ పెట్టుబడిదారులు తమవలస దేశమైన ఈ జిప్టులో పత్తిపంటను వృద్ధిచేయుటకు సర్వప్రయత్నాలు చేస్తున్నారు, 1904 లో ఈ జిప్టులో సాగుచేయబడిన 23 లక్షల హెక్టార్లభూమిలో 6 లక్షలు హెక్టార్లలో (హెక్టార్ = 2½ ఎకరాలు) పత్తిపండించబడింది. అనగా మొత్తం సాగైన భూమిలో 4 వ వంతుకుపైగా పత్తిపంటకై వినియోగించబడింది. ఇదే విధంగా రష్యన్లు తమ వలసదేశమైన టుర్కీస్థాన్‌లో చేస్తున్నారు. విదేశ పోటీదారులను ఓడించుటకై తమపరిస్థితి అభివృద్ధిచేసుకునే అభిప్రాయంతో ఇవన్నీచేస్తున్నారు. పత్తిని పండించుట మొదలుకుని బట్టలు తయారుచేసే పారిశ్రామిక నిర్మాణాన్నంతా ఒకే ఒక యజమానిచేతుల్లో కేంద్రీకరించుటకై లాభకరమైన గొప్పపత్తిట్రస్టును ఏర్పాటుచేసి ముడిసరుకుల నిధులనన్నిటిని గుత్తఅధికారంక్రిందికి తీసుకొని వచ్చుటకు ప్రయత్నిస్తున్నారు.

పెట్టుబడిని ఎగుమతిచేసే అవసరం వలస దేశాల ఆక్రమణకు గూడా దోహదమిస్తుంది. ఎందుకంటే వలసదేశాల మీద రాజ్యాంగ అధికారం ఏర్పడినప్పుడు పోటీలను నిర్మూలించి, తమ సరుకులకు అవసరమైన మార్కెట్టును స్థిరపరచుకొని గుత్తవిధానం

ద్వారా పరిస్థితినంతా దృఢపరుచుకోగల్గుతారు. ఈ స్థిరత్వం రావాలంటే ఒక్కొక్కప్పుడు వలస దేశములను జయించుట ఒకటే మార్గంగా తయారవుతుంది గూడా.

ఫైనాన్సు కాపిటల్‌ను ఆధారంచేసుకొని వృద్ధిఅయే ఆర్థిక నిర్మాణం, దాని రాజకీయాలు, సిద్ధాంతం - అన్నీ వలసదేశాల ఆక్రమణకు దారితీస్తాయి. "ఫైనాన్సు కాపిటల్‌కు స్వేచ్ఛ అనేది పనికిరాదు; ఆధిక్యతయే అది కోరేది" అని హిల్ఫర్డుంగ్ చెప్పిన మాట సత్యం. లోగడ ఉదహరించిన సిసిల్‌రోడ్స్‌యొక్క అభిప్రాయాలను వృద్ధిపరచి ఒక ఫ్రెంచి బూర్జువా రచయిత, వలసదేశ ఆక్రమణకు దారితీసే ఆర్థిక కారణములకు సాంఘిక కారణాలనుగూడ కలపాలంటూ వ్రాశాడు :-

" కార్మిక ప్రజాసామాన్యంయొక్క దుస్థితి దుర్భరమగుటయేకాదు. పాతనాగరిక దేశాల్లోని మధ్యవర్గాలవారి దైనందిన కష్టాలుగూడా ఎక్కువయి చికాకు, ఆతురత, ద్వేషభావాలు పెరిగి ప్రజాశాంతికే భంగంకల్గే పరిస్థితులు ఏర్పడుతున్నాయి. ఈ అసంతృప్తినంతా చల్లార్చుటకు వారందరికి ఉద్యోగాలు కల్పించాలి. దేశంలో విప్లవంరాకుండా చేయాలంటే, విదేశాల్లో వీరందరికి స్థానం చూపించాలి "

సామ్రాజ్యవాద దశలో వలసనీతిని గురించి ప్రస్తుతం పరిశీలిస్తున్నాం. పెట్టుబడి కోటీశ్వరులయొక్క విదేశాంగవైఖరి ఫలితంగా ప్రపంచ ఆర్థిక రాజకీయ విభజనకొరకు వివిధ పెద్ద సామ్రాజ్యవాదులమధ్య జరిగే గొప్ప సంఘర్షణ అనేకరకాల తాత్కాలిక అస్వతంత్ర వ్యవస్థలకు దారితీస్తోంది. వలసప్రాంతాలు కల్గినదేశాలు, వలసప్రాంతాలులేని దేశాలు — ఈవిధంగా ప్రపంచమంతా రెండుగ్రూపులుగా విభజింపబడుట ఒక్కటేకాదు ఈ దశయొక్క ప్రత్యేకలక్షణం. ఇవిగాకుండా అనేకరకాలైన అస్వతంత్ర దేశాలు ఉన్నాయి. వీటికి రాజకీయ స్వాతంత్ర్యం ఉన్నప్పటికి ఆర్థిక రంగంలోనూ, రాజకీయ తంత్ర విషయాల్లోనూ ఫైనాన్సు కాపిటల్‌యొక్క వలలోచిక్కుకొని పరాధీనతనే అనుభవిస్తున్నాయి. అర్థవలసదేశాలు ఒకరకమైన పరాధీనతను అనుభవిస్తున్నాయి. వాటిని గురించి ఇదివరకే చూశాం. ఇప్పుడు మరొకరకమైన పరాధీనతను చూడాలంటే అర్జెంటీనాను ఉదాహరణగా తీసుకొనవచ్చును.

బ్యూనస్‌ఐర్స్‌లోఉన్న ఆస్ట్రో-హంగేరియన్ రాజ్యప్రతినిధి 1909 సంవత్సరానికి తయారుచేసిన రిపోర్టును ఆధారంచేసుకొని, అర్జెంటీనాలో బ్రిటిష్‌వారి మొత్తంపెట్టుబడి 875 కోట్ల ఫ్రాంకులని షిల్డర్ అంచనావేశాడు. ఈ పెట్టుబడిద్వారా అర్జెంటీనాలోని బూర్జువావర్గంతోనూ, రాజ్యాంగవేత్తలతోనూ బ్రిటిష్‌పెట్టుబడి కోటీశ్వరులకు ఎట్టి స్థిర సంబంధములు ఏర్పడినదీ ఊహించుకొనవచ్చును.

రాజకీయ స్వాతంత్ర్యం ఉండికూడా ఆర్థిక రాజ్యాంగతంత్ర విషయాల్లో మరొక రకమైన పరాధీనత ననుభవిస్తున్న పోర్చుగల్‌దేశాన్ని చూడండి. సంపూర్ణ రాజకీయ

స్వాతంత్ర్యంకల్గిన దేశం పోర్చుగల్. కాని 1700–1714 స్పానిష్‌యుద్ధం జరిగినప్పటి నుంచి గత 200 సంవత్సరాలకుపైగా పోర్చుగల్ యదార్థంగా బ్రిటిష్‌వారి రక్షణక్రింద ఉంది. తన పోటీదారులైన స్పెయిన్, ఫ్రాన్సులను ఎదుర్కొనుటకై తన ప్రదేశాలనన్నిటిని బలపరుచుకొనే ఉద్దేశ్యంతో పోర్చుగల్‌ను, పోర్చుగల్ క్రింద ఉన్న వలసప్రాంతాలను గూడా బ్రిటన్ రక్షించింది. దానికి ప్రతిఫలంగా బ్రిటన్‌కు అనేక వ్యాపారసౌకర్యాలు లభించినాయి. పోర్చుగల్ దిగుమతి వ్యాపారవిషయంలో బ్రిటిష్ సరుకులకు ప్రధమ స్థానం వచ్చింది. ఇంతేకాదు. పోర్చుగల్‌లోనూ, పోర్చుగల్‌కు చెందిన వలస దేశాల్లోనూ బ్రిటిష్‌పెట్టుబడి దిగుమతిఅయింది. పోర్చుగల్‌కుచెందిన రేవుపట్టణాలు, దీవులు, టెలిగ్రాఫ్ కేబుల్స్....అన్నిటిని ఉపయోగించుకొనే హక్కు బ్రిటన్‌కు ఏర్పడింది. ఇటువంటి సంబంధాలు పెద్దదేశాలు చిన్నదేశాలమధ్య ఎప్పుడూ ఉన్నమాటనిజమే. కాని పెట్టుబడి సామ్రాజ్యవాదయుగంలో ఇవన్నీ సర్వసాధారణ సంబంధాలుగా తయారై, ప్రపంచ విభజనలో ఒకభాగంగానూ, ప్రపంచ ఫైనాన్సు కాపిటల్ వ్యవహారాల గొలుసులో లింకులుగా వినియోగపడుతున్నాయి.

ప్రపంచ పంపక విషయ పరిశీలనను పూర్తిచేసేముందు మరొక విషయాన్ని గూడా చెప్పక తప్పదు. స్పానిష్ - అమెరికన్ యుద్ధం జరిగినప్పటినుంచి అమెరికన్ సాహిత్యంలో ఈ ప్రపంచ పంపక సమస్యనుగురించి బహిరంగంగానూ, స్పష్టంగానూ చెప్పబడింది. ఒక్క అమెరికన్‌గ్రంథాలలోనేకాదు, "19వ శతాబ్దాంతంనుంచి, బోయర్ యుద్ధానంతరం, 20 వ శతాబ్ద ప్రారంభంలో ఇంగ్లిష్ సాహిత్యంగూడా ఈ విషయాన్ని బహిరంగంగా చాటింది. బ్రిటిష్ సామ్రాజ్యవాదాన్ని ద్వేషించే జర్మన్ సాహిత్యం, ఫ్రెంచి సాహిత్యంగూడా బూర్జువా దృక్పధంనుంచి ఎంతస్పష్టంగా చెప్పాలో అంత స్పష్టంగా ఈ ప్రపంచ పంపక విషయాన్ని ముందుకు తీసుకొని వచ్చినాయి. 19వ శతాబ్దాంతం నాటికి గల రాజకీయ సాంఘిక సమస్యలు" అను గ్రంధాన్ని రచించిన చరిత్రకారుడగు డ్రియాల్ట్ 'పెద్ద ప్రభుత్వాలు, ప్రపంచ పంపకం' అను ప్రకరణంలో ఈ క్రింది విధంగా చెప్పాడు :-

ఈ మధ్య కాలంలో ఒకచైనా మినహా భూమండలములోనిస్వేచ్ఛా ప్రదేశాలనన్నిటిని యూరపియన్ ప్రభుత్వాలుగాని, ఉత్తరఅమెరికా ప్రభుత్వాలుగాని ఆక్రమించినాయి. ఈ సందర్భంలో అనేక పేచీలు, ఘర్షణలు ఇప్పటికే జరిగాయి. త్వరలోనే మరింత భయంకరమైన పోరాటాలు జరిగే సూచనలు కన్పిస్తున్నాయి. ఎందుకంటే త్వరపడటం అవసరమవుతోంది. త్వరపడని యెడల వలసరాజ్యాలేమీ లేనటువంటి దేశాలు తమ వాటానెప్పటికీపొందలేక, ముందుశతాబ్ద (20 వ శతాబ్దం) ప్రధాన లక్షణమైన భూగోళ దోపిడీలో పాల్గొనలేక పోతాయి. అందువల్లనే ఈ మధ్య యూరపు, అమెరికాలావదివడిగా

వలసదేశాలదురాక్రమణను సాగించుటకు ప్రారంభించినాయి. అనగాసామ్రాజ్యవాదలక్షణం ఈ దేశాలలో బాగా ప్రస్ఫుటమవుతోంది. 19 వ శతాబ్దాంతం యొక్క ప్రధానలక్షణం ఈ సామ్రాజ్యవాదలక్షణమే అనిగుర్తించాలి."

ఇంకా

"ఈ ప్రపంచపంపకం విషయంలో భూగోళసంపద మార్కెట్ల కొరకు జరిగిన ఈ తీవ్రాన్వేషణలో ఈ 19 వ శతాబ్దంలో నిర్మించబడిన సామ్రాజ్యాల వైశాల్యానికి, ఈ సామ్రాజ్యాలను నిర్మించిన యూరపియన్ దేశాలవైశాల్యానికి విపరీతవ్యత్యాసం ఉంది. యూరప్ ఖండ భవిష్యత్తును నిర్ణయించే ఈ ప్రధాన సామ్రాజ్యవాద దేశాలకు ప్రపంచ మంతటా సమానశక్తిలేదు. ఎన్నడూ ఎరుగని సంపదను వశంచేసుకొనగల్గే వలస దేశాల మీదఅధికారం, యూరపియన్ రాజ్యాల తారతమ్యశక్తులలో అనేక మార్పులకు కారణ మయినట్లుగా, ఇప్పటికే యూరపియన్ రాజకీయాల్లో ఎన్నోమార్పులకు కారణమయిన వలసదేశాల సమస్య (లేక సామ్రాజ్యవాదం) భవిష్యత్తులో ఇంకా ఎన్నోగొప్పమార్పు లకు కారణంకాగలదు."

# సామ్రాజ్యవాదం : పెట్టుబడి విధానంలో ఒక ప్రత్యేకదశ

సామ్రాజ్యవాదాన్ని గురించి ఇంతవరకూ పరిశీలించిన విషయాలన్నీ కలిపి సంగ్రహంగా చూద్దాం. పెట్టుబడివిధానం యొక్క ప్రధానలక్షణాల పరిణామ ఫలితంగా, పెట్టుబడి విధాన పరిణామంలోనే సామ్రాజ్యవాదం బయలుదేరింది. కాని పెట్టుబడివిధానం అత్యున్నతదశకు అభివృద్ధి చెందిన ఫలితంగానే పెట్టుబడిధారీవిధానం సామ్రాజ్యవాదంగా పరిణమించింది. ఈ అత్యున్నతదశ వచ్చేసరికి, పెట్టుబడివిధానంయొక్క కొన్ని ప్రధాన లక్షణాలు వాటి వ్యతిరేక లక్షణాలుగా మారుటవల్ల, పెట్టుబడివిధానంనుంచి, అంతకంటె ఉచ్ఛస్థాయికి చెందిన సాంఘిక ఆర్థిక నిర్మాణం (సామ్రాజ్యవాదం) ప్రత్యక్షమైంది. ఈ పరిణామక్రమంలో ఆర్థికంగా ప్రస్ఫుటమైన ముఖ్యవిషయం ఏమిటి? అంతకుపూర్వం ఉన్న స్వేచ్ఛా పోటీవ్యాపారం స్థానే గుత్తపెట్టుబడిసంస్థలు బయలుదేరినాయి. స్వేచ్ఛగా ఏనిర్బంధాలు లేకుండా పోటీచేయుట, పెట్టుబడివిధానం యొక్క ఒక ప్రధానలక్షణం. గుత్తవ్యాపారమనేది స్వేచ్ఛగా పోటీచేసే విధానానికి సరీగా వ్యతిరేకవిధానం. కాని స్వేచ్ఛా వ్యాపారం స్థానే గుత్తవ్యాపారం ఎలా బయలుదేరిందో, చిన్నచిన్న పరిశ్రమలు నిర్మూలమయి వాటిస్థానే బాహుళ్యమైన పరిశ్రమలు ఎలా బయలుదేరినవో, బాహుళ్యమైన పరిశ్రమలు నిర్మూలమై వాటిస్థానే ఇంకా మరింత బాహుళ్యమైన పరిశ్రమలు ఎలా బయలుదేరినవో, వీటి ఫలితంగా చివరికి ఉత్పత్తి పెట్టుబడుల కేంద్రీకరణ అపరిమితంగా వృద్ధి అయి గుత్తసంస్థలు ఎలా బయలుదేరినవో మనంతట మనం కళ్ళార చూశాం. కార్టెల్స్, సిండికేట్లు, ట్రస్టులు మొదలైన గుత్తసంస్థలన్నీ బయలుదేరి వాటితోపాటు కొన్నికోట్ల పెట్టుబడిగల దాదాపు ఒక డజన్ బ్యాంకులు గూడా కలిసిపోయినాయి. స్వేచ్ఛగా పోటీ చేసే వ్యాపారపద్ధతిలో నుంచి బయలుదేరిన గుత్తవిధానం, స్వేచ్ఛావ్యాపారాన్ని పూర్తిగా నాశనం చేయక, స్వేచ్ఛాపోటీవిధానం ప్రక్కనే బలపడుతూ వృద్ధి అగుటవల్ల అనేకరకములైన పేచీలు, తీవ్రసంఘర్షణలు, వైరుధ్యాలు కలుగుతున్నాయి. పరిణామక్రమంలో పెట్టుబడివిధానం మరొక ఉన్నతదశలోకి (సామ్రాజ్యవాదం) ప్రవేశించేముందు పరిణామ కాలంలోని స్థితియే గుత్తవిధానం.

క్లుప్తంలో సామ్రాజ్యవాదాన్ని నిర్వచించవలసివస్తే పెట్టుబడివిధానంయొక్క గుత్త దశయే సామ్రాజ్యవాదం అని చెప్పవలసివస్తుంది. అటువంటి నిర్వచనంలో సామ్రాజ్య వాదంయొక్క ముఖ్య సారాంశమంతా ఇమిడిఉంది ఎందుకంటే, ఒకవైపున పారిశ్రామిక నిర్మాతల గుత్తసమ్మేళనాల పెట్టుబడితో కలిసిపోయిన కొన్ని పెద్ద గుత్తబ్యాంకుల పెట్టుబడియే ఫైనాన్సు కాపిటల్ అవుతోంది; రెండోవైపున పూర్వం ఏ పెట్టుబడిదారీదేశం ఆక్రమించనటువంటి ప్రాంతాలకుగూడా బాహాటంగా విస్తరించిన వలసవైఖరి పూర్తిగా పంపకమయిన ప్రపంచాన్నంతా గుత్తగా స్వాధీనంచేసుకొనే వలసవైఖరిగా మారే పరిణామకాలంలో ప్రపంచ పంపకమంతా జరిగింది.

కాని సంగ్రహ నిర్వచనాలవల్ల ప్రయోజనంలేదు. సంగ్రహ నిర్వచనాలు, ప్రధాన విషయాల సారాంశమును తెలియజేయును గనుక సౌకర్యంగా ఉండవచ్చు. కాని నిర్వ చించవలసిన ప్రధాన విషయాలయొక్క ముఖ్య లక్షణాలనన్నిటిని ఒక సంగ్రహ నిర్వచ నంలో చెప్పుటకు వీలులేనందువల్ల వాటినిగురించి ప్రత్యేకంగా ఊహించుకోవలసివస్తుంది. కనుక, పూర్తి వివరాలనన్నిటిని తెలియజేయలేని నిర్వచనాల స్వభావంలోని లోపాన్ని మరిచిపోకుండా, ఈక్రింది 5 ముఖ్యలక్షణాలన్నీ ప్రకటితమగునట్లుగా సామ్రాజ్యవాదాన్ని నిర్వచించవలసియున్నది :—

1. ఉత్పత్తి కేంద్రీకరణ, పెట్టుబడి కేంద్రీకరణ అత్యున్నతదశకు వృద్ధిఅయి, ఆర్థిక జీవితంలో ప్రధానపాత్రను వహించే గుత్తసంస్థలు బయలుదేరుట.

2. బ్యాంకు పెట్టుబడులు, పారిశ్రామిక పెట్టుబడులు కలిసిపోవుటవల్ల ఏర్పడే 'ఫైనాన్సు కాపిటల్' ఆధారంగా కొద్దిమంది పెట్టుబడిదారులగు కోటీశ్వరుల ఆధిపత్యం బయలుదేరుట.

3. సరుకుల ఎగుమతిగాక, పెట్టుబడులే ఎగుమతిఅయి గొప్ప ప్రాధాన్యతను వహించుట.

4. అంతర్జాతీయ పెట్టుబడిదారీ గుత్తసంస్థలు ఏర్పడి ప్రపంచాన్నంతా తమవశం చేసుకొని పంచుకొనుట.

5. వివిధ పెద్దపెట్టుబడిదారీ ప్రభుత్వాలమధ్య మొత్తం ప్రపంచ భూవిభజనఅంతా పూర్తిఅగుట.

గుత్తసంస్థలయొక్క, ఫైనాన్సు కాపిటల్‌యొక్క ఆధిపత్యం స్థిరపడినదశలో పెట్టుబడివిధానాన్ని సామ్రాజ్యవాదం అని పిలుస్తున్నాం.

ఇంతవరకూ మనం కేవలం ఒక్క ఆర్థికవిషయాలనే చర్చలోకి తీసుకొని ఆర్థిక దృక్పథం నుంచి మాత్రమే సామ్రాజ్యవాదాన్ని నిర్వచించాం. కాని పెట్టుబడివిధానంలో

ఈ దశయొక్క చారిత్రిక ప్రాముఖ్యతను మొత్తం పెట్టుబడివిధాన పరిణామంతో పోల్చి చూసినప్పుడుగాని లేక సామ్రాజ్యవాదానికి కార్మిక ఉద్యమంయొక్క రెండు ప్రధాన గతులకు గల సంబంధాన్ని పరిశీలించినప్పుడు గాని సామ్రాజ్యవాదాన్ని మరొక విధంగా నిర్వచించవలసి యున్నదని ఇప్పుడే తెలుసుకుంటాం. పై నిర్వచనం ప్రకారం పెట్టుబడి విధాన పరిణామంలో సామ్రాజ్యవాదమనేది ఒక ప్రత్యేక దశ అని మనం గుర్తించాం. నిస్సంశేశంగా విస్పష్టమైపోయిన ఆధునిక పెట్టుబడిదారీవిధానం యొక్క ప్రధాన లక్షణాలను బూర్జువా ఆర్థికవేత్తలు గూడా అంగీకరించక తప్పలేదు. అందువల్ల సామ్రాజ్యవాదాన్ని గురించి చదువరులకు మనస్సుకు పట్టేట్లుగా నచ్చచెప్పుటకొరకు సాధ్యమైనంత వరకూ బూర్జువా ఆర్థిశాస్త్రజ్ఞులు చేప్పిన విషయాలనే ఎక్కువగా ఉదహరించాను. ఈ ఉద్దేశ్యంతోనే బ్యాంకు పెట్టుబడులు ఎంత విస్తారంగా పెరిగిపోయినవో నిరూపించుటకై వివిరాలతో అనేక లెక్కలను గూడా యిచ్చి పరిణామంలో నుంచి లక్షణభేదం రాగానే పెట్టుబడివిధానం సామ్రాజ్యవాదంగా ఎలా పరిణమించిందీ తెలియజేశాం. ప్రకృతిలో గాని, లేక సమాజంలోగాని మార్పు చెందని స్థిరమైన హద్దులు అనేవి ఉండవని చెప్పనక్కర లేదు. అందువల్ల స్పష్టంగా ఫలానా సంవత్సరంలో గాని లేక ఫలానా దశాబ్దంలోగాని సామ్రాజ్యవాదం స్థాపించబడిందని చర్చలు సాగించుటలో అర్థంలేదు.

కాని సామ్రాజ్యవాదాన్ని నిర్వచించే విషయంలో ముఖ్యంగా కె. కాట్‌స్కీతో వాగ్వాదం చేయక తప్పదు.

2వ అంతర్జాతీయసంస్థ ఆధిక్యతవహించిన కాలంలో (అనగా 1889-1914 మధ్య 25 సంవత్సరాలు) ప్రధాన మార్క్సిస్టు సిద్ధాంతవేత్త కాట్‌స్కీయే గనుక.

సామ్రాజ్యవాదాన్ని గురించి ఇవ్వబడిన మన నిర్వచనంలోని ప్రధాన భావాలను 1915 లోనూ 1914 నవంబరులోనే కాటస్కీ తీవ్రంగా వ్యతిరేకించాడు. సామ్రాజ్యవాదాన్ని ఒక 'దశ'గా లేక ఒక ఆర్థికస్థితిగా పరిగణించగూడదని, సామ్రాజ్యవాదం కేవలం ఒక పంథాయేనని కాట్‌స్కీవాదం. పెట్టుబడి కోటీశ్వరులయొక్క ఒక నిర్దిష్టమైన పంథాగా సామ్రాజ్యవాదాన్ని పరిగణించాలిగాని 'ప్రస్తుతకాలపు పెట్టుబడివిధానం'తో దాన్ని సరి పోల్చగూడదని కాట్‌స్కీచెప్పాడు.

ఆధునిక పెట్టుబడివిధానం యొక్క లక్షణాలన్నీ - కార్టెల్స్, రక్షణలు, పెట్టుబడి కోటీశ్వరుల ఆధిపత్యం వలసవైఖరి-ఇవన్నీకలిపి సామ్రాజ్యవాదమయితే అప్పుడుమరొక ప్రశ్నబయలుదేరుతుంది. పెట్టుబడివిధానానికి అవసరంగా సామ్రాజ్యవాదంగా కావాలా ? అనేఅర్థరహితమైన ప్రశ్నరాకతప్పదు. ఎందుకంటే ఆఅర్థంలో సామ్రాజ్యవాదం పెట్టుబడివిధానానికి అత్యావసరమని, ఇంకాఇలాంటి విషయాలెన్నో కాట్‌స్కీచెప్పాడు. కాట్‌స్కీ యొక్కభావాల్ని పూర్తిగాతెలుసుకొనుటకై సామ్రాజ్యవాదాన్ని గురించి కాట్‌స్కీఇచ్చిన

నిర్వచనాన్నే ఉదహరిస్తే, అతని నిర్వచనం మన నిర్వచనానికి పూర్తిగా వ్యతిరేకమని తెలుస్తుంది. (తన నిర్వచనాన్ని అంగీకరించకుండా జర్మన్ మార్క్సిస్టులు ఎంతోకాలం నుంచి అనేక అభ్యంతరాలను తెలియజేశారని కాట్‌స్కీకి తెలుసును. ఒకస్పష్టమైన మార్క్సిస్టు - వైఖరి కల్గిన వారినుంచే ఈ అభ్యంతరాలన్నీ వస్తున్నవనిగూడా కాట్‌స్కీకి తెలుసు)

కాట్‌స్కీయొక్క నిర్వచనం ఇది :

"పారిశ్రామిక పెట్టుబడి విధానం ఎక్కువ ఉన్నతస్థితికి అభివృద్ధిఅగుట వల్ల సామ్రాజ్యవాదం బయలుదేరింది. ప్రతిపారిశ్రామిక పెట్టుబడిదారీదేశం పెద్దపెద్ద వ్యవసాయక ప్రాంతాలను- ఆప్రాంతాలలో ఏప్రజలు- నివసిస్తున్నాసరే- తనస్వాధీనంలోకి తెచ్చుకొని ఆక్రమించుటకు చేసే ప్రయత్నమే సామ్రాజ్యవాదం"

పైనిర్వచనాన్ని ఎందుకూ ప్రయోజనంలేని వట్టిచెత్తక్రింద పరిగణించవచ్చును. ఎందుకంటే, ఇది ఒక పాక్షికనిర్వచనం. ఇందులో ఒక్కజాతీయ సమస్యయే (ఈ సమస్య చాలా ముఖ్యమైనప్పటికి, దానికి సామ్రాజ్యవాదానికిగల సంబంధంగూడా ప్రధానమైనప్పటికి) ముందుకుతేబడింది. ఇతర దేశాలను ఆక్రమించుకునేదేశాల పారిశ్రామిక పెట్టుబడితో మాత్రమే జాతిసమస్యను ముడి పెట్టుట సరియైనదికాదు. అదేవిధంగా ఒక్కవ్యవసాయిక ప్రాంతాల ఆక్రమణను గురించి మాత్రమే చెప్పటం గూడా సరియైనదిగాదు.

సామ్రాజ్యవాదం ఇతర దేశాలను ఆక్రమించుటకు ప్రయత్నిస్తోంది - ఇదేకాట్‌స్కీ నిర్వచనంలోని రాజకీయ భాగం యొక్కసారాంశం. ఈ విషయం సత్యమేగాని రాజకీయంగానైనప్పటికి నిర్వచనం పూర్తి అర్థాన్ని ఇచ్చుటలేదు. ఎందుకంటే సామ్రాజ్యవాదం సర్వసాధారణంగా విద్రోహకహింసా దౌర్జన్యాలను అనుసరిస్తోంది. ఇకకాట్‌స్కీ నిర్వచనాన్ని ఆర్థికదృక్పథాన్నుంచి (కాట్‌స్కీతనంతటతానే తన నిర్వచనంలో చెప్పిన ఆర్థికవిషయాలను) చూచినప్పటికిసరియైనదిగాదని వెంటనేబోధపడుతుంది. సామ్రాజ్యవాదంయొక్క సహజలక్షణం పారిశ్రామిక పెట్టుబడికాదు. ఫైనాన్సు కాపిటలే దాని సహజలక్షణం. పారిశ్రామిక పెట్టుబడి క్రుంగిపోయి ఫైనాన్సు కాపిటల్ విపరీతంగా అభివృద్ధి అగుటవల్లనే ఫ్రాన్సులో 1880 అనంతరం వలసదేశవైఖరి తీవ్రమయి ఎక్కువగా వలసదేశాలను ఆక్రమించుట జరిగింది. తరువాత సామ్రాజ్యవాదం, ఒక్కవ్యవసాయక ప్రాంతాలనేగాక పారిశ్రామిక ప్రాంతాలను గూడా తనవశంచేసుకొనుటకు ప్రయత్నిస్తుంది. ఇదిదానిసహజలక్షణం. (ఉ॥ బెల్జియమ్‌ను ఆక్రమించాలని జర్మనీ, లారెయిన్‌నుఆక్రమించాలని ఫ్రాన్సు ప్రయత్నంచేస్తున్నాయి.) ఎందుకంటే, (1) ఇదివరకే పంపకమయిన ప్రపంచాన్ని తిరిగి పంపకం చేసుకోవాలని ప్రయత్నించేవారు ఎటువంటి ప్రాంతాన్నైనాసరే ఆక్రమించక తప్పదు. (2) నాయకత్వం కొరకు వివిధసామ్రాజ్యవాదులు ప్రయత్నిస్తున్నప్పుడు, తమ

సొంత ప్రయోజనాలకు నూటిగా లాభదాయకంకాకపోయినా తమ ప్రత్యర్థులను బలహీన పరచుటకైనా వలసదేశాలను ఆక్రమించుట సామ్రాజ్యవాదంయొక్క ఒక ముఖ్యలక్షణం. (ఇంగ్లండుకు వ్యతిరేక కేంద్రంగా బెల్జియమ్ జర్మనీకి, జర్మనీకి వ్యతిరేకంగా బాగ్దాద్ కేంద్రం ఇంగ్లండుకు కావాలి.)

'సామ్రాజ్యవాద' శబ్దానికి తానుచెప్పిన రాజకీయఅర్థాన్ని రూఢిపరిచారంటూ కాట్‌స్కీ తరచుగా ఇంగ్లీషువారిని ఉదహరిస్తూ ఉంటాడు. అందువల్ల ఇంగ్లీషు రచయిత అయిన హాబ్సన్‌వ్రాసిన "సామ్రాజ్యవాదం" (1902 లో ప్రచురించబడింది) అను గ్రంథంలో ఏంచెప్పాడో చూద్దాం.

"కొత్త సామ్రాజ్యవాదానికి పాతదానికి భేదంఉంది. పూర్వం ఏకైక సామ్రాజ్య విస్తరణవాంఛ ఉండేది. నేడు సిద్ధాంతంలోనూ ఆచరణలోగూడా పరస్పరం పోటీ పడుతున్న సామ్రాజ్యాలు బయలుదేరి, రాజకీయ ఆధిక్యత, వ్యాపారలాభాలకొరకు తహతహలాడుతున్నాయి. వ్యాపారసంస్థలలో పెట్టుబడిపెట్టి ఆర్థిక ఆధిక్యతను సంపాదించే విషయంలోగూడా భేదం ఉంది."

ఇంగ్లీషువారందరిని కలిపి కాట్‌స్కీ ఉదహరించుట శుద్ధతప్పని మనం ఇప్పుడే తెలుసుకుంటాం. (కాట్‌స్కీ మనస్సులో కఠోరులైన బ్రిటిష్ సామ్రాజ్యవాదులుగాని లేక సామ్రాజ్యవాదాన్ని సమర్థించేవారు ఉంటేతప్ప) కాట్‌స్కీ మార్క్సిజాన్ని సమర్థిస్తున్నట్లు నటిస్తూనే, మితవాద సామాజిక ఉదారవాదియైన హాబ్సన్‌కంటె ఒక అడుగు వెనక్కి వేస్తున్నాడనిగూడా మనం ఇప్పుడే తెలుసుకొనగలం. ఆధునిక సామ్రాజ్యవాదంయొక్క విస్పష్టమైన 2 చారిత్రక లక్షణాలను హాబ్సన్ లెక్కలోకి తీసుకొనుట సరియైన విషయం (తన నిర్వచనంలోనే చారిత్రిక విస్పష్టతను గురించి కాట్‌స్కీ గేలిచేశాడు). ఈ చారిత్రికలక్షణాలు ఏమిటంటే (1) వివిధ సామ్రాజ్యవాదుల మధ్యగలపోటీ (2) వ్యాపారస్థుడిమీద బ్యాంకు పెట్టుబడిదారుని ఆధిక్యత. కాని ఒక వ్యవసాయికదేశాన్ని మరొక పారిశ్రామికదేశం ఆక్రమించుటయే ప్రధాన విషయం అయినప్పుడు దానిలో వ్యాపారస్థుని పాత్రయే ప్రధానమవుతుంది.

కాట్‌స్కీయొక్క నిర్వచనం శుద్ధతప్పేగాక మార్క్సిస్టు సిద్ధాంతానికే విరుద్ధంగా ఉంది. మార్క్సిస్టుసిద్ధాంత ఆచరణలకు విరుద్ధంగాఉండే అనేక అభిప్రాయ ధోరణులు బయలుదేరుటకు కాట్‌స్కీ నిర్వచనం మూలంగా ఉపయోగపడగలదు. ఈ విషయాన్ని మరొకచోట పరిశీలిద్దాం. పెట్టుబడి విధానంయొక్క ఈ ఆధునికదశను సామ్రాజ్యవాదం అనాలా? లేక ఫైనాన్సు కాపిటల్‌దశ (బ్యాంకు పెట్టుబడియొక్క ఆధిక్యత దశ) అనాలా? అని కాట్‌స్కీ లేవదీసిన వాగ్వాదం ప్రధానమైన విషయంకాదు. మాటలవిషయమై వాగ్వాదంచేయుటకాదు ప్రధానమైనది. మీ ఇష్టంవచ్చినట్లు పిలిచినప్పటికి వచ్చేభేదం ఏమీలేదు.

సామ్రాజ్యవాద వైఖరిని, దాని ఆర్థికతత్వంనుంచి కాట్‌స్కీ వేరుచేస్తున్నాడని మాత్రం గుర్తించాలి. ఇదే ప్రధానమైన విషయం. ఆక్రమణలనేవి బ్యాంకు పెట్టుబడిదారులగు కోటీశ్వరులు ఎన్నుకొన్న పంథాయని కాట్‌స్కీ అంటాడు. ఫైనాన్సు పెట్టుబడి ఫలితంగా ఏర్పడగలదని ఆయన ఊహిస్తున్న మరొక బూర్జువాతంత్ర వైఖరితో, ఈ ఆక్రమణ పంథాను కాట్‌స్కీ సరిపోలుస్తున్నాడు. అనగా ఆర్థికరంగంలోని గుత్తసంస్థలన్నీ రాజకీయరంగంలోని గుత్తవిధానం, దౌర్జన్యహింసలు, ఆక్రమణ పద్ధతులతో ఎట్టి వైరుధ్యం లేకుండా ఉండగలవనేకదా కాట్‌స్కీ ఉద్దేశ్యం? దీనినిబట్టి ఫైనాన్సు పెట్టుబడిదశలో పూర్తిఅయిన ప్రపంచపంపకం, వివిధ పెద్దపెట్టుబడిదారీ దేశాలమధ్యగల పోటీ వైరుధ్యాలనన్నిటికి కారణమైన ప్రపంచ పంపకం, సామ్రాజ్యవాదపంథా అవలంబించకపోయినప్పటికి సాధ్యపడగలదని తేలుతుంది. దీనిఅర్థం ఏమిటి? పెట్టుబడి విధానంయొక్క ప్రస్తుత నవీనదశలోని తీవ్రవైరుధ్యాల లోతుపాతులను బట్టబయలుచేయకుండా దానికి బదులు ఆ వైరుధ్యాలనన్నిటిని కప్పిపుచ్చి లెక్కచేయకుండా త్రోసివేస్తున్నాడన్నమాట. ఫలితం ఏమిటంటే మార్క్సిజంకాదు. బూర్జువా సంస్కరణవాదం.

సామ్రాజ్యవాదాన్ని, ఆక్రమణలను మోటుగా, అతివికారంగా సమర్థించిన జర్మన్ రచయిత క్యూనోతో కాట్‌స్కీ వాగ్వాదానికి దిగాడు. క్యూనో వాదం ఇది:- ఆధునిక పెట్టుబడివిధానమే సామ్రాజ్యవాదం; పెట్టుబడివిధానం తప్పనిసరిగా అభివృద్ధి చెందుతుంది; అది అభ్యుదయానికి తోడ్పడగలదు గూడా; కనుక సామ్రాజ్యవాదం గూడా అభ్యుదయమైనదే; అందువల్ల సామ్రాజ్యవాదం ముందు తలఒగ్గి మనందరం కొనియాడాలి- క్యూనో బలపరిచిన ఈ విషయాలన్నీ 1894–1895 సంవత్సరాల్లో రష్యన్ మార్క్సిస్టులను గురించి నరోద్నిక్కులు చేసిన అపహాస్యం మాదిరిగానే ఉన్నాయి. తప్పనిసరి యని, అభివృద్ధికరమని పెట్టుబడివిధానాన్ని గురించి రష్యాలో 'మార్క్సిస్టులు' భావించే యెడల, బహిరంగంగా ఒక మందిరాన్ని ఏర్పాటుచేసి అందులో పెట్టుబడివిధానాన్ని మేపుట మంచిదని నరోద్నిక్కులు అనేవారు! క్యూనోను వ్యతిరేకిస్తూ "కాదు, సామ్రాజ్యవాదం ఆధునిక పెట్టుబడివిధానం కాదు. ఆధునిక పెట్టుబడివిధాన పంథాయొక్క వివిధ రూపాలలో సామ్రాజ్యవాదం గూడా ఒక రూపం. ఈ పంథాను మనం ఎదుర్కోవాలి. ఎదుర్కోగలం గూడా. సామ్రాజ్యవాదుల ఆక్రమణలు మొదలైనవాటినన్నిటినీ మనం ఎదుర్కొని తీరాలి. ఎదుర్కొనగలంగూడా" అన్నాడు కాట్‌స్కీ.

ఈ సమాధానం వింటానికి బాగానే వున్నట్లు కన్పిస్తుంది. యదార్థంగా ఇది చాలా ప్రమాదకరమైన ఫలితాలకు దారి తీస్తోంది. ఎందుకంటే గూఢంగానూ, జిత్తులమారిదనంగా ఈ సమాధానం సామ్రాజ్యవాదంతో సామరస్యం బోధిస్తోంది. పారిశ్రామిక సంస్థల సమ్మేళనములయొక్క, బ్యాంకులయొక్క వైఖరికి వ్యతిరేకంగా చేసే పోరాటం వల్ల వాటి ఆర్థిక పునాదులకు దెబ్బ తగలనియెడల, ఆ పోరాటం కేవలం శాంతివాదానికి,

బూర్జువా సంస్కరణవాదానికి అనుగుణ్యంగా జరిగి ధార్మికబుద్ధితో వెలిబుచ్చిన సదాశయం గానే ఉండిపోతుంది. మార్క్సిస్టు సిద్ధాంతంతో ఎక్కడా పోలికలేని కాట్‌స్కీ సిద్ధాంతం కళ్ళముందు కనబడుతున్న వైరుధ్యాలనే పేర్కొనకుండా, వాటిలో ప్రధానమైన వాటి యొక్క తీవ్రతను వెల్లడిచేయకుండా మరుగుపుచ్చుతోంది. అటువంటి "సిద్ధాంతం" క్యూనోలాంటి వ్యక్తులతో ఐక్యతను సమర్థించుటకు మాత్రం వినియోగపడుట సహజం గానే ఉంది.

కాట్‌స్కీ ఇంకా ఏం వాదిస్తున్నాడు? కేవలం ఒక ఆర్థికదృక్పథంనుంచి చూస్తే, పెట్టుబడివిధానం మరొకనూతన దశలో ప్రవేశిస్తుందని, ప్రస్తుతకార్టెల్స్ యొక్క పంథా విదేశాంగవైఖరికి విస్తరించబడిన ఫలితంగా అప్పుడు ఒక 'అతీతసామ్రాజ్యవాదం' బయలుదేరగలదని కాట్‌స్కీ అభిప్రాయం. అతీతసామ్రాజ్యవాదమంటే, తమలో తాము పరస్పరంగా పోరాడుకునే సామ్రాజ్యవాదుల కలయిక కాదని, ప్రపంచసామ్రాజ్యవాదు లందరూ ఆ అతీతదశలో ఐక్యంకాగలరని, దాని ఫలితంగా పెట్టుబడివిధానం క్రిందనే యుద్ధాలు ఆగిపోవునని కాట్‌స్కీ వాదిస్తున్నాడు అనగా "ఒక అంతర్జాతీయ ఫైనాన్సు పెట్టుబడి సమ్మేళనం ఏర్పడి ప్రపంచాన్నంతా ఉమ్మడిగా దోపిడీచేసేదశ" ఒకటి వస్తుం దని అతని అభిప్రాయం.

ఈ "అతీత సామ్రాజ్యవాదసిద్ధాంతం" మార్క్సిజానికి ఎలా విరుద్ధమో తరువాత వివరంగా చూదాం. ఈ లోపల ప్రస్తుతగ్రంథం యొక్క ఆశయప్రకారం ఈ విషయానికి సంబంధించిన ఆర్థిక ఆధారాలను పరిశీలించుట అవసరం. "కేవలం ఆర్థికదృక్పథంనుంచి చూసినప్పటికి ఈ "అతీతసామ్రాజ్యవాదం" (లేక అర్థరహితమైన ఈ చెత్తవాదం) సాధ్యమవుతుందా?

కేవలం ఆర్థికదృక్పథంతో చూడాలనటంలో ఉద్దేశ్యం ఆ విషయాన్ని ఇతర పరిస్థి తులతో సంబంధించి గాక వేరుగా ఊహావాదంలో పరిశీలించాలనే అయితే, ఈ దిగువ విధంగా చెప్పవచ్చును :– పరిణామమంతా గుత్తసంస్థలవైపుకు సాగుతోంది; అందువల్ల ఒకే ఒక ప్రపంచ గుత్తసంస్థ బయలుదేరే వైఖరి కన్పిస్తోంది. ఇది నిజమేకాని పైవిధంగా చెప్పటంలో ఎంతమాత్రం అర్థంలేదనే చెప్పాలి. శాస్త్రీయపరిశోధనాగారాల్లో పరిణామ మంతా ఆహారపదార్థాలను తయారుచేసే మార్గంలో నడుస్తోందని చెప్పటంలో ఎంత అర్థం ఉందో ఈ విషయంలో గూడా అంతే 'అతీత వ్యవసాయసిద్ధాంతం' అంటే ఎంత అర్థ హీనమో అతీత సామ్రాజ్యవాద 'సిద్ధాంతం' అన్నా అంతే.

అలాకాకుండా ప్రస్తుత ఫైనాన్సు పెట్టుబడిదశలోని ఆర్థికపరిస్థితులనన్నీ చారిత్రిక దృక్పథనుంచి 20 వ శతాబ్దప్రారంభదశలోని ప్రత్యక్షపరిస్థితులుగా పరిగణించి చర్చించా లంటే ఈ అతీతసామ్రాజ్యవాద నిర్జీవ సూత్రాలను (ప్రత్యక్షవైరుధ్యాలనుంచి దృష్టిని మర

ట్పుటకై ఉద్దేశిస్తున్న ఈ విదోౖహకర సిద్ధాంతాన్ని) ప్రస్తుతప్రపంచ ఆర్థిక విధానం యొక్క యదార్థఆర్థిక పరిస్థితులతో పోల్చిచూస్తే సరిపోతుంది. కాట్‌స్కీయొక్క అతీత సామ్రాజ్యవాదపు నిరర్థక వాదాలన్నీ ఎన్నోతప్పు అభిప్రాయాలకు దోహదమిస్తున్నాయి. సామ్రాజ్యవాదాన్ని సమర్థించేవారికి సహాయపడుతున్నాయి. ఫైనాన్సుపెట్టుబడి యొక్క ఆధిక్యత ప్రపంచఆర్థిక విధానంలోని అసమానత్వాన్ని వైరుధ్యాలను బలహీనపరస్తుందనే భావాన్నిగూడా కల్గిస్తున్నాయి. యరార్థంగా ఫైనాన్సుపెట్టుబడియొక్క ఆధిక్యత, ఈ అస మానత్వాన్ని, వైరుధ్యాలను బలపరుస్తోంది.

రిచెర్డ్‌కాల్వర్ "ప్రపంచ ఆర్థిక విధానానికి ఉపోద్ఘాతం" అనుతన చిన్నపుస్తకంలో 19 వ శతాబ్దాంతంనాటి ప్రపంచ ఆర్థిక సంబంధాలను అవగాహనచేసుకొనుటకై కొన్ని స్పష్టమైన లెక్కలను ప్రోగుచేయుటకు ప్రయత్నించాడు. ప్రపంచాన్నంతా ఆయన 5 ప్రధాన ఆర్థిక ప్రాంతాలక్రింద విభజించాడు. (1) మధ్యయూరప్ (రష్యా. బ్రిటన్లను మినహాయించి మిగిలిన యూరప్‌అంతా) (2) బ్రిటన్ (3) రష్యా (4) తూర్పు ఆశియా (5) అమెరికా. ఆయా దేశాలకు చెందిన వలసప్రాంతాలను ఆయా దేశములక్రిందనేలెక్కిస్తూ, తన విభజనలోకిరానటువంటి పర్షియా, ఆఫ్గనిస్థాన్, అరేబియా, (ఆసియాలోనివి) ఆఫ్రికా లోని మొరాకో అబిసీనియాలవంటి దేశాలను వదిలేశాడు!

ఈ విభజన ప్రకారం, పెట్టుబడి విధానం బాగా అభివృద్ధి అయినవి 3 ప్రాంతాలు (రవానా, వ్యాపారం, పరిశ్రమలు ఉచ్చస్థాయికి అభివృద్ధిచెందిన ప్రాంతాలివి) :- మధ్య యూరప్, బ్రిటన్, అమెరికా. ఈ ప్రాంతాలలో ప్రపంచంమొత్తం మీద ఆధిక్యత వహి స్తున్న జర్మనీ, బ్రిటన్, అమెరికా దేశాలున్నాయి. జర్మనీ వైశాల్యం చాలా తక్కువై వలసరాజ్యాలుగూడా బహుతక్కువగా ఉన్నందువల్ల ఈ దేశాలమధ్య సామ్రాజ్యవాద వైరుధ్యాలన్నీ తీవ్రంగా పరిణమించినాయి. ఏకైక మధ్యయూరప్ అనేది భవిష్యత్తులో ఏర్పడవలసిన సంగతే. తీవ్రపోరాటాలలోనుంచి అది బయలుదేరుతోంది. ప్రస్తుతం యూరప్‌ఖండంయొక్క ప్రధాన లక్షణం ఏమిటంటే రాజకీయంగా యూరప్ అంతా విచ్ఛిన్నమయిపోతోంది. కాని బ్రిటన్ అమెరికాలలో రాజకీయ కేంద్రీకరణం బాగా అభి వృద్ధిచెందింది. అయితే బ్రిటన్‌కు అపరిమితంగావలస దేశాలున్నాయి. అమెరికాకుచెందిన వలస దేశాలు లెక్కలోకిగూడారావు. వలసదేశాల్లో పెట్టుబడి విధానం ఇప్పుడిప్పుడే బయలుదేరుతోంది. దక్షిణ అమెరికా కొరకు పోరాటం నానాటికి మరింత తీవ్రమవుతోంది.

ఈ ప్రాంతాలను గురించి రిచెర్డ్‌కాల్వర్ ఇచ్చిన ఆర్థికలెక్కలు ఈ క్రింది పట్టి కలో ఇవ్వబడినాయి.

(10)

| ప్రపంచంలోని ప్రధాన ఆర్థిక ప్రాంతాలు | వైశాల్యం (లక్షలచదరపు కిలోమీటర్లు) | జన సంఖ్య (లక్షలలో) | రవాణా | | ఎగుమతి దిగుమతి వ్యాపారం (లక్షకోట్ల మార్కులు) | పరిశ్రమలు | | |
|---|---|---|---|---|---|---|---|---|
| | | | రైల్వేలు (1000కిలోమీటర్లు) | వ్యాపార నౌకలు (లక్షల టన్నులు) | | స॥ర బొగ్గు ఉత్పత్తి (లక్షల టన్నులలో | పిగ్ ఇనుము ఉత్పత్తి (లక్షల టన్నులలో | బట్టల మిల్లులలో కదుర్ల సంఖ్య (లక్షలలో), |
| 1. మధ్యయూరప్ | 276<br>236 * | 3880<br>1460 * | 204 | 80 | 41 | 2510 | 150 | 260 |
| 2. బ్రిటిష్ | 289<br>286 * | 3980<br>3550 * | 140 | 110 | 25 | 2490 | 90 | 510 |
| 3. రష్యన్, | 220 | 1310 | 63 | 10 | 3 | 160 | 30 | 70 |
| 4. తూర్పుఆసియా | 120 | 3890 | 8 | 10 | 2 | 80 | 0.2 | 20 |
| 5. అమెరికన్ | 300 | 1490 | 379 | 60 | 14 | 2450 | 140 | 190 |

* వలస దేశాల వైశాల్యం, జనసంఖ్యలను సూచించేగుర్తు.

కిలోమీటర్;— 100 మీటర్లు. మీటర్ = 1 గజం, 3.94 అంగుళాలు.

పై పట్టికప్రకారం తూర్పుఆసియలోనూ, రష్యాలోనూ పెట్టుబడివిధానం మరీ హీన దశలో ఉందని తెలుస్తుంది. రష్యాలో జనసంఖ్యగూడా చాలా పలచగా ఉన్నదని, తూర్పు ఆసియా జనసంఖ్యవత్తిడి ఎక్కువగా ఉన్నదనిగూడా తెలియగలదు. కాని రాజకీయ కేంద్రీకరణం రష్యాలో బాగా ఉన్నతస్థాయికి అభివృద్ధిఅయితే తూర్పు ఆసియాలో అసలేమీ కన్పించదు. చైనాపంపకం ఇప్పుడే ప్రారంభమయింది, చైనా పంపకంకొరకు జపాన్, యునైటెడ్‌స్టేట్స్ దేశాలమధ్య పోరాటం నానాటికి తీవ్రమవుతోంది

వాస్తవికంగాఉన్న యీపరిస్థితులను, ఆర్థిక రాజకీయపరిస్థితులమధ్యఏర్పడినవ్యత్యాసాన్ని, వివిధదేశాల అభివృద్ధిలోగల అపరిమితతేడాను, సామ్రాజ్యవాదులమధ్య జరిగే భయంకర పోరాటాలను కాట్‌స్కీ 'శాంతియుత' అతీత సామ్రాజ్యవాదాన్ని గురించి చెప్పే అర్థరహితమైన కట్టుకథలతో పోల్చిచూడండి. కఠోర యదార్థ పరిస్థితులనుచూసి భయపడి దాక్కుందుకు ఛోటా బూర్జువాచేసే విద్రోహకర ప్రయత్నంతప్ప కాట్‌స్కీవాదం మరొకటికాజాలదు. "అతీత సామ్రాజ్యవాదం"యొక్క అంకురాలుగా కాట్‌స్కీకి కన్పిస్తున్న అంతర్జాతీయ కార్టెల్స్‌అన్నీ (రసాయనశాలలో తయారుచేయబడే మాత్రలు అతీత వ్యవసాయ విధానంయొక్క అంకురాల్లాగా కన్పించినట్లు!) ప్రపంచ పంపకానికి, పంపకమయిన ప్రపంచాన్ని తిరిగి పంచుకొనుటకు, శాంతియుతంగాకాక దౌర్జన్య పద్ధతులలో జరిగే విభజనకు ప్రతిబింబంగా కన్పించుటలేదా? జర్మనీ సహకారంతో, అమెరికన్ తదితర ఫైనాన్సు పెట్టుబడిదారులందరూ కలిసి (ఉ॥ అంతర్జాతీయ రైల్వే సిండికేట్, అంతర్జాతీయ వ్యాపార నౌకాట్రస్టు) ప్రపంచాన్నంతా ఒకసారి పంపకం చేసుకొన్న తరువాత, ఇప్పుడు తిరిగి సంపూర్ణ దౌర్జన్య హింసాపద్ధతులద్వారా నూతన శక్తుల సంబంధాలమీద ఆధారపడి మరొకపంపకానికి తయారగుటలేదా?

ప్రపంచ ఆర్థికవిధానంలోని వివిధ భాగాలయొక్క అభివృద్ధి వేగాలలోని వ్యత్యాసాన్ని తగ్గించేబదులు, ఫైనాన్సుపెట్టుబడి, ట్రస్టులు ఈ వ్యత్యాసాన్ని మరింత తీవ్రం చేస్తున్నాయి. వివిధశక్తులమధ్యగల సంబంధాల్లో మార్పువచ్చినపుడు, పెట్టుబడి విధానం క్రింద వైరుధ్యాలన్నీ దౌర్జన్యంగాగాక మరొకవిధంగా పరిష్కారమగుటకు అవకాశం లేదు.

ప్రపంచ ఆర్థిక విధానంలో పెట్టుబడివిధానంయొక్క, ఫైనాన్సు పెట్టుబడియొక్క అభివృద్ధి వేగాల్లోగల వ్యత్యాసాన్ని సరిగా తెలుసుకోవాలంటే రైల్వే లెక్కలు చక్కగా ఉపయోగపడతాయి సామ్రాజ్యవాద అభివృద్ధిజరిగిన ఆఖరి దశాబ్దాలలో, రైల్వేలైన్‌యొక్క మొత్తంపొడవు ఈ దిగువవిధంగా మార్పుచెందింది:—

# రైల్వే లైన్లు

(వేల కిలోమీటర్లలో)

| | 1890 | | 1913 | | పెరుగుదల | |
|---|---|---|---|---|---|---|
| యూరప్ | 224 | | 346 | | 122 | |
| యునైటెడ్ స్టేట్స్ | 268 | | 411 | | 143 | |
| మొత్తం వలస దేశాలు | 82 | 125 | 210 | 347 | 128 | 222 |
| స్వతంత్ర దేశాలుగాని లేక అర్ధ స్వతంత్ర దేశాలు (ఆసియా, అమెరికాలలో) | 43 | | 137 | | 94 | |
| మొత్తం | 617 | | 1104 | | 487 | |

వలస దేశాల్లోనూ, ఆసియా, అమెరికాలలోని స్వతంత్ర అర్ధస్వతంత్ర దేశాల్లోనూ, రైల్వే నిర్మాణఅభివృద్ధి అతివేగంగా జరిగింది. ఈప్రాంతాల్లో 4 లేక 5 పెద్ద ప్రభుత్వాల ఫైనాన్సు పెట్టుబడియొక్క సంపూర్ణ ఆధిక్యత ఉండుటయే దీనికి కారణం. వలస దేశాల్లో గాని, ఆసియా అమెరికాలలోని ఇతర దేశాలలోగాని 2 లక్షల కిలోమీటర్ల పొడవుగల రైల్వేలైనును నిర్మించాలంటే 40 లక్షలకోట్ల * మార్కుల పెట్టుబడిఅవసరమైంది. లాభ కరమైన షరతులమీద, మంచి ఆదాయాన్ని గ్యారంటీచేసే ప్రత్యేక ఒడంబడికలమీద, ఉక్కుమిల్లులు మొదలైన యంత్రాలకొరకు ఇవ్వబడిన ప్రత్యేక ఆర్డర్లమీద ఆధారపడి ఈ నూతన పెట్టుబడిఅంతా పెట్టబడింది.

వలస దేశాల్లోనూ, సముద్రాంతర దేశాల్లోనూ పెట్టుబడివిధానం అతివేగంగా అభి వృద్ధి చెందుతోంది. సముద్రాంతరదేశాల్లో నూతన సామ్రాజ్యవాదశక్తులు బయలుదేరు తున్నాయి. (ఉ॥ జపాన్). ప్రపంచ సామ్రాజ్యవాదులమధ్య జరిగే పోరాటం నానాటికి తీవ్రమవుతోంది. వలస దేశాల్లోనూ, సముద్రాంతర దేశాల్లోనూ ఫైనాన్సు పెట్టుబడియొక్క దోపిడీ ఆదాయం విపరీతంగా పెరుగుతోంది. ఉత్పత్తిశక్తుల అభివృద్ధి విషయంలో అగ్రస్థానం ఆక్రమించనటువంటి దేశాలే ఈ దోపిడీసొమ్ము'లో ఎక్కువభాగాన్ని కాజే స్తున్నాయి. పెద్దపెద్ద దేశాలని పిలువబడే సామ్రాజ్యవాద దేశాల్లోని (వాటిక్రింది వలస దేశాలతోసహా) రైల్వేలైనుల పొడవు వేలకిలోమీటర్లలో ఈ దిగువ ఉదహరించబడింది:

---

* మార్కు : జర్మన్ నాణెం — మామూలురోజుల్లో 12 అణాలకు సమానవిలువ కల్గిఉండేది.

| | 1890 | 1913 | పెరుగుదల |
|---|---|---|---|
| యునైటెడ్ స్టేట్స్ | 268 | 413 | 145 |
| బ్రిటిష్ సామ్రాజ్యం | 107 | 208 | 101 |
| రష్యా | 32 | 78 | 46 |
| జర్మనీ | 43 | 68 | 25 |
| ఫ్రాన్సు | 41 | 63 | 22 |
| మొత్తం | 491 | 830 | 339 |

ఈ విధంగా ప్రపంచంలోని మొత్తం రైలుమార్గాలలో నూటికి 80 వంతులు 5 పెద్ద రాజ్యాల స్వాధీనంలో ఉన్నాయి. ఈ రైలుమార్గాల యాజమాన్యం విషయం, ఫైనాన్సు పెట్టుబడి కేంద్రీకరణ విషయం ఇంకా ఎంతో ప్రాధాన్యత వహిస్తున్నాయి. ఉదాహరణానికి అమెరికన్, రష్యన్, మరి ఇతర రైల్వేలలో ఫ్రెంచి, ఇంగ్లీషు కోటీశ్వరులకు అపారమైన భాగాలు, బాండ్లు ఉన్నాయి.

తన వలసదేశాల ధర్మమాఅంటూ, బ్రిటన్ "తన"యొక్క రైలుమార్గాల అల్లికను 1 లక్ష కిలోమీటర్లకు పైగా ఎక్కువ చేయగల్గింది. అనగా జర్మనీకంటె 4 రెట్లు అధికంగా పెరిగిందన్నమాట. ఇదేకాలంలో జర్మనీలోని ఉత్పత్తిశక్తుల అభివృద్ధి-అందులో గూడా ముఖ్యంగా బొగ్గు, ఇనుము పరిశ్రమల అభివృద్ధి—ఇంగ్లండులో కంటె అపరిమిత వేగంగా జరిగింది. ఫ్రాన్సు, రష్యాలలోకంటె ఎన్నిరెట్లు ఎక్కువగా వృద్ధి అయిందో వేరుగా చెప్పనక్కరలేదు. 1892 లో జర్మనీలో 49 లక్షల టన్నుల ఇనుము ఉత్పత్తి అయింది; ఆ సంవత్సరంలోనే బ్రిటన్ యొక్క ఉత్పత్తి 68 లక్షల టన్నులు. కాని 1912 వచ్చేసరికి జర్మనీ ఉత్పత్తి 176 లక్షల టన్నులు అయితే బ్రిటన్‌యొక్క ఉత్పత్తి 90 లక్షల టన్నులు మాత్రమే. అనగా బ్రిటన్ ఉత్పత్తికంటె జర్మనీ ఉత్పత్తి చాలా ఎక్కువయిందన్నమాట. ఒకవైపున ఉత్పత్తిశక్తుల అభివృద్ధి - పెట్టుబడి సమీకరణల మధ్యగల వ్యత్యాసం ఏర్పడుతోంది; మరోవైపున వలసదేశాల పంపకానికి, ఫైనాన్సు పెట్టుబడిదారులగు కోటీశ్వరుల పలుకుబడి వ్యాపించిన ప్రాంతాలకు మధ్యగూడా వ్యత్యాసం ఉంది. ఈ వ్యత్యాసాలను, హెచ్చుతగ్గులనూ నిర్మూలించుటకై పెట్టుబడిదారీయుగంలో యుద్ధం తప్ప మరొకసాధనం ఏమైనా ఉన్నదా అనేప్రశ్న బయలుదేరుతోంది.

# పరాన్నభుక్కు తత్వం, పెట్టుబడి విధానం యొక్క క్షీణత

సామ్రాజ్యవాదాన్ని గురించి చర్చించేటప్పుడు సాధారణంగా ఎక్కువ ప్రాముఖ్యత నివ్వని మరొక సామ్రాజ్యవాద లక్షణాన్ని గురించి ఇప్పుడుపరిశీలిద్దాం. మార్క్సిస్టు అయిన హిల్ఫర్‌డింగ్ మార్క్సిస్టు కానటువంటి హాబ్సన్ కంటెగూడా ఒకఅడుగు వెనక్కి వేశాడు. సామ్రాజ్యవాదసహజలక్షణమైన పరాన్నభుక్కు స్వభావాన్ని గురించే మనం ఇప్పుడు పరిశీలించబోయేది.

సామ్రాజ్యవాదం యొక్క మూల ఆర్థికపునాది గుత్తవిధానమేనని ఇదివరకే తెలుసుకున్నాం. గుత్తవిధానమంటే పెట్టుబడిదారీ గుత్త విధానమన్నమాట. అనగా పెట్టుబడి విధానంలోనుంచి బయలుదేరి, పెట్టుబడిదారీ సరుకుల ఉత్పత్తి, వ్యాపారపోటీలవాతావరణంలో పెరుగుతూ, ఈ వాతావరణంతో ఎడతెగని శాశ్వత వైరుధ్యాలను కల్గిన గుత్త విధానమన్నమాట. ఏమైనప్పటికి ఇతర గుత్త సంస్థలవలె, ఇదిగూడా తప్పనిసరిగా క్షీణిస్తూ క్రమేణాశిథిలమయే మార్గం పట్టకతప్పదు. గుత్త విధానంక్రింద ధరలు-తాత్కాలికంగానైనా నిర్ధారణచేయబడినకొద్దీ, శాస్త్రీయఅభివృద్ధికి, దానితోపాటు ఇతర అభివృద్ధికి, ప్రోత్సాహం తగ్గిస్తంభించిపోతుంది. కృత్రిమపద్ధతులద్వారా శాస్త్రీయఅభివృద్ధిని నిరోధించుటకు ఆర్థిక అవకాశాలు గూడా కల్గుతాయి. ఉదాహరణకు అమెరికాలో ఓయెన్స్ అను నతడు సీసాలను తయారుచేసే ఒక నూతన యంత్రాన్ని కనిపెట్టుటవల్ల అపరిశ్రమలో నూతన విప్లవం బయలుదేరే అవకాశాలు కల్గినాయి. కాని సీసాలపోతపోసే జర్మన్ కార్టెల్ ఒకటి ఓయెన్స్సనమూనాలను కొనేసి, ఆచరణలో ఉపయోగ పడకుండా దాచేసింది. పెట్టుబడి విధానం క్రింద గుత్తవిధానం ఎప్పుడైనాసరే స్వేచ్ఛాపోటీ పద్ధతిని పూర్తిగానిర్మూలించలేదు. (అతీత సామ్రాజ్యవాద సిద్ధాంతం తప్పుఅని చెప్పుటకు ఇది ఒకముఖ్యకారణం) అయితే ఉత్పత్తిఖర్చులను తగ్గించి, శాస్త్రీయ అభివృద్ధి పద్ధతులను ప్రవేశపెట్టుటవల్ల లాభాలను ఎక్కువ చేసుకునే అవకాశాలన్నీ, మార్పులు కల్గించటానికి దోహదమిచ్చేమాట నిజమే. కాని క్రమేణాక్షీణించిపోయి శిథిలమయే మార్గాన పోతున్న గుత్తవిధానంయొక్క సహజలక్షణం పరిశ్రమ యొక్క అన్ని శాఖలలో ప్రస్ఫుటం అవు

తుంది. కొంతకాలంపాటు ఒక దేశంలోనూ, మరొకప్పుడు ఇంకొక దేశంలోనూ ఈ లక్ష ణానికి పైచెయ్యివస్తూఉంటుంది.

మంచివైశాల్యం, సంపదలు కలిగిన వలస ప్రాంతాలమీద లేక అనుకూల ప్రదేశాలలో ఉన్న వలస దేశాలమీద గుత్తదారుల యాజమాన్యం గూడా ఇదే విధంగా క్షీణించి శిథిలమయ్యేమార్గంలోనే పనిచేస్తుంది.

పైగా సామ్రాజ్యవాదం అంటే ధనరూపంలో పెట్టుబడిఅంతా కొద్దిదేశాలలో అనంతంగాకూడ బెట్టబడుటయే. సెక్యూరిటీలరూపంలో ఈ కూడ బెట్టబడిన పెట్టుబడిఅంతా 100 లక్షల కోట్ల ఫ్రాంకులనుంచి 150 లక్షలకోట్ల ఫ్రాంకులవరకూ ఉంటుందని ఇదివరకే తెలుసుకున్నాం. అందువల్లనే సోమరితనమే వృత్తిగాకల్గి ఏపరిశ్రమలోనూ, ఏపని చేయకుండా 'చెక్కులను' కత్తిరించుకుంటూ, వడ్డీలమీద, డివిడెండ్లమీద బ్రతికే ఒక వర్గం విపరీతంగా వృద్ధిఅవుతోంది. సామ్రాజ్యవాద ఆర్ధికలక్షణాల్లో ఒక ప్రధానలక్షణమైన పెట్టుబడుల ఎగుమతి, ఈ సోమరివర్గాన్ని ఉత్పత్తిరంగాలనుంచి మరింత దూరం చేస్తుంది. ఎన్నోసముద్రాంతర దేశాల్లోనూ, వలసదేశాల్లోనూ కార్మికులను దోపిడిచేసి బ్రతికే పరాన్నభుక్కుల ముద్ర ఈ గుత్తవడ్డీ వ్యాపారస్థుల దేశంమొత్తంమీదపడుతుంది.

1893 లో విదేశాలలో బ్రిటన్ యొక్క పెట్టుబడి, బ్రిటన్ యొక్క మొత్తం సంపత్తిలో నూటికి 15 వంతులు ఉన్నదని హాబ్సన్ వ్రాశాడు.

1915 వచ్చేసరికి ఈ విదేశపెట్టుబడి 2½ రెట్లు ఎక్కువయిందని మనం జ్ఞాపకం పెట్టుకోవాలి.

హాబ్సన్ ఇంకా ఇలా చెప్పాడు :-

"దురాక్రమణలకై యుద్ధాలకుదిగే సామ్రాజ్యవాదం ప్రజాసామాన్యంమీద పన్నుల భారం ఎక్కువచేస్తోంది. దానివల్ల పారిశ్రామిక నిర్మాతలకు, వ్యాపారస్థులకు గూడా పెద్ద ప్రయోజనమేమీలేదు. కాని పెట్టుబడిపెట్టే కోటీశ్వరులకుమాత్రం అత్యంత లాభదాయకంగా ఉపయోగిపడుతుంది విదేశ వ్యాపారంవల్ల, వలసదేశాలతోచేసే వ్యాపారంవల్ల, ఎగుమతి దిగుమతులవల్ల బ్రిటన్‌కు 1899 లో 1 కోటి 80 లక్షల పౌనులు ఆదాయం వచ్చిందని సర్. ఆర్. గిప్పెన్ (అంచనా లెక్కలు తయారుచేయు శాస్త్రజ్ఞుడు) అంచనా వేశాడు. 1899 లో మొత్తం జరిగిన వ్యాపారం 80 కోట్లపౌనులని, నూటికి 2½ వంతులు లాభం వచ్చిందని అతని లెక్కలు తెలియచేస్తున్నాయి"

పైలెక్కలు బ్రిటిష్ సామ్రాజ్యవాద దురాక్రమణను పూర్తిగా తెలియజేయుట లేదు. విదేశపెట్టుబడులుపెట్టిన పెద్ద వడ్డీవ్యాపారస్థులకు వచ్చిన 9-10 కోట్ల పౌనుల

వడ్డీ ఆదాయాన్నిగూడా కలుపుకుంటే, బ్రిటిష్ సామ్రాజ్యవాదులదోపిడి పూర్తిగాఅర్థమవు తుంది.

ప్రపంచంలో అన్ని దేశాలకంటె ఎక్కువ వ్యాపారం సాగించే బ్రిటన్‌యొక్క విదేశ వ్యాపారంద్వారావచ్చే ఆదాయంకంటె, ఆ దేశంలోని పెట్టుబడి కోటీశ్వరుల ఆదాయం 5 రెట్లు ఎక్కువని గుర్తించాలి. సామ్రాజ్యవాదమంటే అర్థంఇదే. సామ్రాజ్య వాదుల పరాన్నభుక్కు స్వభావమంటే సారాంశం ఇదే.

ఈ కారణంవల్లనే సామ్రాజ్యవాదాన్నిగురించి ప్రచురించబడే అర్థిక సాహిత్యంలో 'రెంటియర్ ప్రభుత్వం' లేక వడ్డీవ్యాపారం సాగించే ప్రభుత్వం అనుమాట సర్వసాధారణంగా వాడుకలోకి వస్తోంది. ప్రపంచమంతా కొద్ది వడ్డీవ్యాపార ప్రభుత్వాలమధ్య పంపకమయింది. బాకీదారు ప్రభుత్వాలనేవి అధికసంఖ్యలో తయారవుతున్నాయి.

షూల్‌జే-గావర్‌నిట్జ్ అను రచయిత 'బ్రిటిష్ సామ్రాజ్యవాదం' అను గ్రంథంలో ఈ దిగువవిధంగా వ్రాశాడు :–

"విదేశాల్లో పెట్టుబడి పెట్టినవారిలో అగ్రస్థానం వహిస్తున్నదెవరు? రాజకీయంగా అస్వతంత్ర దేశాల్లోగాని, వాటికి దరిదాపులోఉండే దేశాల్లోగాని, పెట్టుబడులు పెట్టేవారిదే అగ్రస్థానం. ఈజిప్టుకు, జపాన్‌కు, చైనాకు, దక్షిణఅమెరికాకు ఇంగ్లండు అప్పులు పెట్టుంది. అవసరసమయాల్లో తన యుద్ధనౌకాదళం షెరీఫ్‌గా ఉపయోగపడుతుంది. తన బాకీదారుల ఆగ్రహాన్నుంచి రక్షించుకొనుటకు తన రాజకీయ అధికారాన్ని ఉపయోగిస్తుంది బ్రిటన్...."

'విదేశపెట్టుబడుల జాతీయ అర్థికవిధానం' అను గ్రంథంలో సార్టోరియస్‌ఫోన్ వాల్టర్‌షౌసెన్ అను జర్మన్‌రచయిత, హాలెండుదేశం వడ్డీవ్యాపార ప్రభుత్వాలకు చక్కటి నమూనాగా తయారైందని, ఇంగ్లండు ఫ్రాన్సులుగూడా తయారవుతున్నవని చెప్పాడు. ఇంగ్లండు, ఫ్రాన్సు, జర్మనీ, బెల్జియం, స్విట్జర్లండు — ఈ 5 పారిశ్రామిక దేశాలు 'ఋణప్రదాతలైన రాజ్యాంగాలని నిశ్చయంగా' చెప్పవచ్చునని షిల్డర్ అను రచయిత వ్రాశాడు. ఆ దేశాలకంటె తక్కువ పారిశ్రామిక అభివృద్ధికల్గిన కారణంవల్ల హాలండు ఈ జాబితాలో చేర్చలేదనిగూడా షిల్డర్‌అన్నాడు. యునైటెడ్ స్టేట్స్ కేవలం అమెరికన్ దేశాలకుమాత్రం అప్పులు పెట్తోంది.

షూల్జే ఇంకా ఈవిధంగా వ్రాశాడు :–

"ఇంగ్లండు క్రమేణాపారిశ్రామిక దేశంనుంచి ఋణప్రదాతదేశంగా మారుతోంది. ఇంగ్లండుయొక్క పారిశ్రామిక ఉత్పత్తి, ఎగుమతులు ఎక్కువయిపోయినమాట నిజమే. కాని జాతీయ అర్థికవిధానాన్నంతా మొత్తంమీద పరిశీలిస్తే, వడ్డీ, డివిడెండ్స్, పెట్టుబడుల

ద్వారా లాభాలు, కమీషన్లు, ఊహావ్యాపారం ద్వారావచ్చే ఆదాయంయొక్క తారతమ్య ప్రాముఖ్యత హెచ్చుతోంది. నా ఉద్దేశ్యంలో సామ్రాజ్యవాద విస్తరణయొక్క ఆర్థిక పునాదిఇదే. కొనుగోలుదారుడు అమ్మకపుదారుని వలలో చిక్కుకొన్నదానికంటె, బాకీదారుడు ఋణదాతయొక్క బంధనాల్లో ఇంకా దృఢంగా చిక్కుకొనిపోతాడు గదా"

ఇక జర్మనీవిషయంలో 'డీ బ్యాంక్' అను పత్రికకు సంపాదకుడైన ఎ. లాన్స్‌బర్గ్ 1911 లో "వడ్డీవ్యాపార ప్రభుత్వంగా జర్మనీ" అను వ్యాసంలో ఈ దిగువవిధంగా వ్రాశాడు :—

"ఫ్రెంచి ప్రజలు అంతకంతకూ ఋణదాతలుగా తయారవుతున్నారని జర్మన్ ప్రజలు ఏవగించుకుంటారు. కాని జర్మనీలోనే. మధ్యవర్గాల విషయంలో మాత్రం నానాటికి ఫ్రాన్సులో మాదిరిగానే తయారవుతున్నారనే విషయాన్ని మరిచిపోతారు."

వడ్డీవ్యాపార ప్రభుత్వం. పరాన్నభుక్కు అయి శిధిలమవుతున్న పెట్టుబడిదారీ ప్రభుత్వమే. ఇటువంటి ప్రభుత్వంయొక్క స్పర్శతగిలిన దేశాలన్నిటిలో, సామాజిక — రాజకీయ పరిస్థితులన్నిటిలో దాని ప్రతిబింబం కన్పిస్తూనే ఉంటుంది. ముఖ్యంగా ఆ దేశాల కార్మికఉద్యమం యొక్క 2 మూల ప్రవృత్తులలో ఇది ప్రస్ఫుటమవుతుంది. ఈ విషయాన్ని సాధ్యమైనంతగా స్పష్టీకరించుటకు హాబ్సన్‌నే మాట్లాడమందాం. ఎందుకంటే: హాబ్సన్ 'నమ్మదగిన' సాక్షి; శాస్త్రీయ మార్క్సిస్టు సిద్ధాంతంమీద ఆయనకు పక్షపాతం కలదని అనుకోడానికి వీలులేదు. అంతేగాక, వలసదేశసంపత్తి. ఫైనాన్సు పెట్టుబడి, సామ్రాజ్యవాద అనుభవం ఎక్కువగా కల్గిన దేశంయొక్క పరిస్థితులను గురించి,— ఇంగ్లీషువాడు గనుక - అతనికి బాగా పరిచయం ఉంది.

బోయర్ యుద్ధసంగతులన్నీ మనస్సుకు పట్టిన హాబ్సన్ సామ్రాజ్యవాదానికి, పెట్టుబడి కోటీశ్వరుల లాభాలకు గల సంబంధాన్ని గురించి, ఆయుధసామగ్రులు, సప్లయిల వల్ల పెరిగిపోతున్న వారి లాభాలకు గల సన్నిహితసంబంధాలను గురించి ఈ విధంగా వ్రాశాడు :—

"ఈ పరాన్నభుక్కు పంథాతో వ్యవహారాలను సాగించేవారు పెట్టుబడిదారులే. శ్రామికులలో గూడా కొన్ని ప్రత్యేకవర్గాలవాకి ఈ పంథా అంగీకారంగానే ఉంది; చాలా పట్టణాల్లో ముఖ్యమైన పారిశ్రామిక వ్యాపారాల్లో హెచ్చుభాగం ప్రభుత్వ ఆర్డర్లమీద, కాంట్రాక్టులమీద ఆధారపడి ఉన్నాయి. లోహపరిశ్రమ, నౌకానిర్మాణ కేంద్రాల సామ్రాజ్యవాద తత్వానికి ఈ విషయం ముఖ్యంగా వర్తిస్తుంది."

పై రచయిత అభిప్రాయంలో. ప్రాచీన సామ్రాజ్యాలు బలహీనమై పతన మగుటకు 2 కారణాలు ఉన్నాయి: (1) ఆర్థికంగా పరాన్నభుక్కుతత్వం బలపడుట (2) అస్వతంత్ర ప్రజలతో కూడిన సైన్యాలు ఏర్పడుట.

"ఆర్థికంగా ఇతరులను దోపిడీచేసే అలవాటు మొదటివిషయం. పాలకవర్గంయొక్క ఆర్థికబలాన్ని వృద్ధిచేయుటకు, తమ క్రిందివర్గాలవారి అంగీకారం బడయుటకై వారికి లంచాలు పెట్టుటకు, పాలించే ప్రభుత్వం తన ఆధీనంలోఉన్న రాష్ట్రాలను, వలస ప్రదేశాలను, తనమీద ఆధారపడియుండే దేశాలను పూర్తిగా వినియోగించింది"

పైయదార్ధ విషయానికి మరొకదాన్నికూడా చేర్చితేసరిపోతుంది. పైనచెప్పబడిన అవినీతిఅంతా ఆర్ధికంగా సాధ్యపడాలంటే, గుత్తసంస్థలద్వారా అతీతలాభాలను గడించుట అవసరం.

ఇకరెండో కారణాన్ని గురించి హాబ్సన్ ;

"సామ్రాజ్యవాదం ఎంతగుడ్డిగా ప్రవర్తిస్తున్నదో చూడాలంటే, బ్రిటన్, ఫ్రాన్సు మొదలైన సామ్రాజ్యవాదదేశాలన్నీ ఎటువంటి ప్రమాదకరమైన పరాధీనత మీద ఆధారపడుతున్నవో పరిశీలిస్తేచాలు. ఈవిషయంలో ముఖ్యంగా బ్రిటన్ హద్దులనన్నింటిని అతిక్రమించింది. మనభారతదేశసామ్రాజ్య సంపాదనకై మనం సాగించిన యుద్ధాలలో ఎక్కువభాగం ఆదేశవాసులచేతనే చేయబడ్డాయి. భారతదేశంలోనూ, ఈ మధ్యనే ఈజిప్టులోనూ పెద్దపెద్ద 'శాశ్వత' సైన్యాలు బ్రిటిష్ సైన్యాధిపతుల క్రింద సమకూర్చబడినాయి. ఆఫ్రికాలోనిమన వలసప్రాంతాలన్నీ (ఒక్కదక్షిణ ప్రాంతంతప్ప) సంపాదించుటకై చేయబడినపోరాటమంతా ఆదేశవాసులచేతనే సాగించబడింది."

చైనాను విచ్ఛిన్నంచేసి పంపకంచేసుకునే విషయాన్నిగురించి హాబ్సన్ ఆర్థికంగా ఈ క్రింది అంచనాకువచ్చాడు :

"అప్పుడు పశ్చిమయూరప్‌లో అధికభాగం, దక్షిణ ఇంగ్లండులోని కొన్నిప్రదేశాల మాదిరి, రెవీరా, ఇటలీ, స్విట్జర్లండులలోని విహారస్థలాలమాదిరి తయారుకావచ్చును. దూరప్రాచ్యంనుంచి పెన్షన్లు, డివిడెండ్లను తెచ్చుకునే చిన్నచిన్న ప్రభువుల ముఠాలు అక్కడక్కడా బయలుదేరుతాయి. పైప్రభువులతాబేదార్లు, వర్తకులు, వారిసొంత సేవకులు, రవాణా పనులలో పనిచేసేకార్మికులు, త్వరగా చెడిపోయేసరుకుల ఉత్పత్తి విధానంయొక్క ఆఖరిదశలోపనిచేసేవారు ఎక్కువగా ప్రత్యక్షమవుతారు. ప్రధాన జీవనాధారములైన పరిశ్రమలన్నీ అంతరిస్తాయి. ఆసియా, ఆఫ్రికా ఖండాలనుంచి ఆహారపదార్థాలు, ఇతరసరుకులు కప్పాలరూపంలో ఈ ప్రాంతానికి ప్రవహిస్తాయి.

పశ్చిమ యూరప్‌లోని రాజ్యాలమధ్య విశాలమైన పెద్ద సమ్మేళనం ఏర్పడటానికి అవకాశాలున్నవని లోగడ చెప్పబడింది. ఏమైనప్పటికి యూరప్‌లోని పెద్ద రాజ్యాలన్నీ ఒక ఫెడరేషన్‌గా ఏర్పడి ప్రపంచ నాగరికాభ్యుదయానికి పాటుబడేబదులు వినాశకరమైన పాశ్చాత్య పరాన్నభుక్కుతత్వమనే గొప్ప ప్రమాదాన్ని ప్రవేశపెట్టుటకు కారణం కావచ్చును. పారిశ్రామికంగా బాగా అభివృద్ధిచెందిన దేశాల్లోని పైతరగతుల వారందరూ

ఆసియా ఆఫ్రికాలనుంచి ప్రవహించే అపారమైన కప్పాలమీద జీవిస్తూ, ఆసామ్మతోనే అసంఖ్యాకులైన తాబేదార్లనుపోషిస్తూ వారిని మచ్చికచేసుకుంటారు. ఆహారపదార్థాలను ఉత్పత్తిచేసే వ్యవసాయ పారిశ్రామిక పనులు ఏమీ లేకపోవుటవల్ల అధికసంఖ్యాకులు ఈ తాబేదార్లుగా తయారయి అప్రధానమైన పరిశ్రమలలోనూ, వ్యక్తిగత సేవకులుగానూ పనిచేస్తూఉంటారు. ఈ పనులన్నీ కొత్తగా తయారవుతున్న పరాన్నభుక్కు ప్రభువుల ఆధీనంలో ఉంటాయి. ఇటువంటి సిద్ధాంతాలను అప్రస్తుతమని అనుకునే వారందరూ ఈనాటి దక్షిణ ఇంగ్లండులోని సామాజిక, ఆర్థిక పరిస్థితులను పరిశీలించుట మంచిదని నా అభిప్రాయం. దక్షిణఇంగ్లండులో పైనచెప్పబడిన పరిస్థితులన్నీ నేడు ఏర్పడిఉన్నాయి. ఆ పరిస్థితులను పరిశీలించిన తరువాత ఆవిధానమే బాహుళ్యంగా విస్తరింపచేసినందువల్ల వచ్చే ఫలితంగూడా ఊహించుకొనవచ్చును. అటువంటి చిన్నచిన్న కోటీశ్వరులముఠాలు, పెట్టుబడిదారులు, రాజకీయ వ్యాపార ఉద్యోగులు బయలుదేరి ప్రపంచం ఎన్నడూ ఎరుగనటువంటి లాభాలనివ్వగల నిధిని ఒడిసి యూరప్‌లో అనుభవించడానికై చైనాను బానిసదేశంగా తయారుచేసినప్పుడు ఎటువంటి విపరీతదృశ్యం ఏర్పడునో ఊహించుకో వచ్చును. పరిస్థితులన్నీ అతిక్లిష్టంగా ఉన్నాయి. ప్రపంచశక్తులన్నీ అంచనావేయుటకు వీలులేనంత క్లిష్టంగా పనిచేస్తున్నాయి. అందువల్ల భవిష్యత్తు ఫలానావిధంగా పరిణమించవచ్చునని చెప్పటానికి సాధ్యమగుటలేదు. కాని ఈనాటి పశ్చిమయూరప్‌లోని సామ్రాజ్య వాదధోరణి అంతా పైనచెప్పబడిన మార్గంలోనే నడుస్తోంది. దాన్ని ఎదుర్కొని ప్రతిఘటించకపోయినయెడల పైన ఉదహరించబడిన ప్రమాదకరమైన ఫలితాలు తప్పవు".

హాబ్సన్ చెప్పినదంతా సత్యం. సామ్రాజ్యవాదశక్తులను ప్రతిఘటించనియెడల సరిగ్గా ఆఫలితాలకే దారితీస్తాయి. ప్రస్తుత సామ్రాజ్యవాదదశలో 'యూరప్ సంయుక్త రాష్ట్రాల' ప్రాముఖ్యతనుగురించి హాబ్సన్ సరిగా అంచనావేశాడు, కాని కార్మికోద్యమంలో గూడా—తాత్కాలికంగా ఎక్కువదేశాల్లో అవకాశవాద ద్రోహులు విజయంపొందినా — ఈ ద్రోహులందరూ పైఫలితాలకొరకే నిర్మాణయుక్తంగా ఎడతెగకుండా 'పని' చేస్తున్నారనే విషయాన్నిగూడా పై విషయాలకు చేర్చుట అవసరం. ఒక్క చైనానేగాక ప్రపంచ పంపకానికే దారితీయు సామ్రాజ్యవాదం, అపరిమితంగా ధనవంతమైన కొన్ని దేశాలు మాత్రమే గుత్తగా విపరీతలాభాలను గడించుటకు దారితీసే సామ్రాజ్యవాదం, కార్మిక వర్గంలో పైత్తరగతులవారిని గూడా లంచాలద్వారా ఆర్థికంగా అవినీతిపరులనుచేసి విద్రోహకతత్వాన్ని పోషించి ఒక స్వరూపాన్ని కల్గించి బలపరిచే ఆర్థికఅవకాశాలు కల్పించగలదనిగూడా గుర్తించాలి.

సామ్రాజ్యవాదాన్ని సమర్థించినందులకై ఒకప్పుడు పార్టీలోనుంచి వెళ్ళగొట్టబడిన జర్మన్ ద్రోహిఅయిన గెరార్డ్ హిల్డర్ బ్రాండ్, ఈనాటి జర్మన్ సోషల్ డెమాక్రెటిక్ పార్టీకి మంచి నాయకుడుగా వినియోగపడగలడు. ఈయనగూడా హాబ్సన్ వలె 'యూర

పియన్ సంయుక్తరాష్ట్రాలు' (రష్యాను మినహాయించి) ఏర్పడాలని; 'ఆఫ్రికన్ నీగ్రోలను' మహత్తర మహమ్మదీయ ఉద్యమాన్ని' ఎదుర్కొనుటకు చైనా-జపాన్ సమ్మేళనాన్ని ప్రతిఘటించుటకై బలమైన సైనిక నౌకాదళాలను నిర్మించుటకు యూరపియన్ సంయుక్తరాష్ట్రాలు అవసరమని ఈయన వాదం. హాబ్సన్ ప్రక్కనే తాళంవేయటానికి ఈయన బాగా పనికివస్తాడు.

షూల్జే వ్రాసిన గ్రంథంలోగూడా 'బ్రిటిష్ సామ్రాజ్యవాదం' యొక్క వర్ణనంతా ఈ పరాన్నభుక్కు లక్షణాలను వెల్లడిచేస్తోంది. బ్రిటన్‌యొక్క జాతీయ ఆదాయం 1865–1898 మధ్య సుమారు రెట్టింపయితే, ఆదేకాలంలో విదేశాలనుంచివచ్చే ఆదాయం 9 రెట్లు పెరిగింది. సామ్రాజ్యవాదంయొక్క సుగుణం ఏమిటంటే 'ఎలా పనిచెయ్యాలో నీగ్రోకు శిక్షణ' (బలాత్కారంగా కాదుసుమా!) ఇస్తుంది; ఇక సామ్రాజ్యవాదంవల్లకల్గే 'అపాయం' ఏమిటంటే,

"శరీరకష్టాన్నంతా–మొదట వ్యవసాయం, గనులు; తరువాత భారమైన ప్రధాన పారిశ్రామిక పని అంతా–రంగుజాతులమీద వేసి, యూరప్ తాను మాత్రం వడ్డీవ్యాపారస్థుని పాత్రతో తృప్తిచెంది, తరువాత నెమ్మదిగా రంగుజాతులయొక్క ఆర్థిక, రాజకీయ విముక్తికి దారితీస్తుంది."

బ్రిటన్‌లోని భూమిలో హెచ్చుభాగాన్ని వ్యవసాయంలోనుంచి తప్పించి ఆటపాటల కొరకు, ధనికుల వినోదాలకొరకు వినియోగిస్తున్నారు. ప్రభువుల వేటలకు, ఇతర ఆటపాటలకు ప్రసిద్ధికెక్కిన స్కాట్లండు "తన గతంమీద, అమెరికన్ కోటీశ్వరుడైన కార్నిజీ మీద" జీవిస్తోంది అంటారు సాధారణంగా. గుర్రపుపందెములమీద, నక్క వేటలమీద బ్రిటన్ సంవత్సరానికి 1 కోటి 40 లక్షల పౌనులు ఖర్చు పెడుతోంది. బ్రిటన్‌లో వడ్డీల మీద బ్రతికేవారిసంఖ్య 10 లక్షలు. మొత్తం జనసంఖ్యలో ఉత్పత్తి చేసేవారిసంఖ్య క్రమేణా తగ్గిపోతోంది :—

| సంవత్సరం | ఇంగ్లండు, వేల్సుల జనసంఖ్య (లక్షలలో) | ప్రధానపరిశ్రమల పనిచేస్తున్న కార్మికుల సంఖ్య (లక్షలలో) | జనసంఖ్యలో నూటికి ఎన్నివంతులు |
|---|---|---|---|
| 1851 | 179 | 41 | 23 |
| 1901 | 325 | 50 | 15 |

ఈ పరిస్థితులలో, "20వ శతాబ్ద ప్రారంభంలోని బ్రిటిష్ సామ్రాజ్యవాదము"ను గురించి పరిశీలించే బ్రిటిష్ విద్యార్థులు బ్రిటిష్ కార్మికవర్గాన్ని గురించి ప్రసంగించేటప్పుడు 'పై తరగతులవారిని', 'క్రింది తరగతులకు చెందిన నిజమైన కార్మికులను' వేరువేరుగా విభజించి చెప్పవలసి వస్తోంది. సహకారసంస్థలకు చెందినవారు, కార్మికసంఘవాదులు,

ఆటలక్లబ్బులలో సభ్యులు. ఇతర అనేక మతసంస్థలకు చెందినవారంతా 'పై తరగతి'కి చెందినవారు. 'క్రిందితరగతికి చెందిన నిజమైన కార్మికులకు' ఓటింగ్ లేకుండా చేయుట వారి స్థాయికి తగినట్లుగానే ఉంది! బ్రిటిష్ కార్మికవర్గ స్థితినిగురించి సరిగా చెప్పటకై కార్మికవర్గంలో అత్యంత అల్పసంఖ్యాకులుగా ఉన్న ఈ పైతరగతి'కి చెందినవారిని గురించియే సాధారణంగా చెప్పబడుతోంది. ఉదాహరణకు :— షుల్జే వ్రాసింది చూడండి. "నిరుద్యోగసమస్య ముఖ్యంగా లండన్ పట్టణానికి సంబంధించిన క్రింది తరగతులవారి సమస్యయే. ఈ క్రిందితరగతులవారితో రాజ్యాంగవేత్తలకు ఎట్టి జోక్యంలేదు........." ఇలా చెప్పుటకంటె "బూర్జువా రాజ్యాంగవేత్తలకు గాని 'సోషలిస్టు' అవకాశవాద ద్రోహులకు గాని ఎట్టి జోక్యంలేని సమస్య" అని చెప్పటం సమంజసంగా ఉంటుంది.

సామ్రాజ్యవాదంయొక్క విచిత్ర లక్షణాల్లో మరొకటి ఈ సందర్భంలో చూడవచ్చును. సామ్రాజ్యవాద దేశాలనుంచి వలసదేశాలకు వలసపోయేవారి సంఖ్య క్రమేణా క్షీణిస్తూ, తక్కువకూలి దొరికే వెనుకబడియున్న ఇతర దేశాలనుంచి ఈ దేశాల్లోకి (సామ్రాజ్యవాద దేశాల్లోకి) దిగుతున్నవారి సంఖ్య (కార్మికులు, తిరిగి ఈ దేశాలకు వచ్చేసేవారు కలిపి) పెరుగుతోంది. హాబ్సన్ సూచించినట్లు 1884 తరువాత బ్రిటన్ నుంచి వలసపోవుట తగ్గిపోయింది. 1884 లో 242000 మంది ఇతర దేశాలకు వలస వెళ్ళారు. 1900 లో ఈ సంఖ్య 169000 కు తగ్గింది. 1881—1890 మధ్య జర్మనీ నుంచి 14 3000 మంది వలస పోయారు. ఇంత ఎక్కువగా ఎప్పుడూ వలసపోవుట జరుగలేదు. 1891-1900 మధ్య జర్మనీనుంచి 544000, 1901-1910 మధ్య 341010 మంది మాత్రమే వలసపోవుట జరిగింది. కాని ఆస్ట్రియా, ఇటలీ, రష్యా మొదలైన దేశాలనుంచి జర్మనీలోకి దిగటం ఎక్కువయింది. 1907 జనాభా లెక్కలప్రకారం జర్మనీలో 1342294 మంది విదేశస్థులు ఉన్నారు. వారిలో 440800 మంది పారిశ్రామిక కార్మికులు; 257329 మంది వ్యవసాయకూలీలు అయి ఉన్నారు. ఫ్రాన్సులో గనులలో పనిచేసేవారు ఎక్కువమంది పోలిష్, ఇటాలియన్, స్పానిష్ మొదలైన విదేశస్థులే. యునైటెడ్ స్టేట్సులో అమెరికన్ కార్మికులకు మంచికూలి దొరికితే, దక్షిణ, తూర్పు యూరప్ ప్రాంతాల నుంచి వచ్చినవారికి చాలాతక్కువకూలి గిట్టుతోంది. ఫోర్‌మన్ల సంఖ్యలో హెచ్చుభాగం అమెరికన్ దేశస్థులే. కార్మికులలో గూడా మంచి జీతాలు ఇచ్చి ఒకభాగాన్ని మిగిలినవారినుంచి వేరు చేయడానికి సామ్రాజ్యవాదులు ఎప్పుడూ ప్రయత్నిస్తూ ఉంటారు.

కార్మికులను చీలదీసి, వారిలో అవకాశవాదాన్ని బలపరచి తాత్కాలికంగానైనా కార్మిక ఉద్యమాన్ని నాశనంచేయుటకు సామ్రాజ్యవాదులు సాగించే ప్రయత్నాలు ఇంగ్లండులో 19వ శతాబ్దాంతానికిముందే ప్రారంభమయినాయి. 19వ శతాబ్దంమధ్యలోనే బ్రిటన్‌లో సామ్రాజ్యవాదంయొక్క 2 ముఖ్యలక్షణాలు కన్పించినాయి. (1) అపరిమితమైన వలస దేశాలు (2) ప్రపంచమార్కెట్లలో అగ్రస్థానం. కార్మికోద్యమంలో ప్రవేశించిన అవకాశ

వాదానికి, బ్రిటిష్ పెట్టుబడివిదానం యొక్క సామ్రాజ్యవాదలక్షణాలకుగల ఈ సంబంధాన్ని మార్క్స్, ఎంగెల్స్ అనేకదశాబ్దాలపాటు వరుసగాగుర్తించారు, 1858 అక్టోబర్ 7వ తేదీన మార్క్స్‌కు ఎంగెల్స్ ఇలావ్రాశాడు.

"బ్రిటిష్ కార్మిక వర్గం రానురాను బూర్జువావర్గంగాతయారవుతోంది. అన్ని దేశాలకంటె ఎక్కువ బూర్జువా స్వభావం కల్గిన ఈ దేశం (బ్రిటన్) తన బూర్జువావర్గం ప్రక్కనే ఒక బూర్జువా ప్రభువుల వర్గాన్ని, ఒక బూర్జువా కార్మిక వర్గాన్నిగూడా కల్పించుటకై కృషిచేస్తున్నట్లు కన్పిస్తుంది. ప్రపంచాన్నంతా దోచుకునితినే ఈ దేశవిషయంలో ఇదికొంతవరకు సాధ్యమేనని చెప్పవచ్చును"

తరువాత 25 సంవత్సరాలు గడిచినాయి. తిరిగి 1881 అగస్టు 11వ తేదీన ఎంగెల్స్ మళ్ళీ అదేధోరణిలో "మధ్యవర్గాలవారి దగ్గర సొమ్ముతింటూ అమ్ముకోబడిన వ్యక్తులచే నడుపబడుటకు సిద్ధమవుతున్న ఈ పాడు ఇంగ్లీషు.... (ట్రేడ్ యూనియన్లు)" అని వ్రాశాడు. 1882 సెప్టెంబర్ 12 వ తేదీన ఎంగెల్స్ కాట్‌స్కీకి వ్రాసిన ఉత్తరంలో ఈ దిగువ విధంగా వ్రాశాడు.

"వలసరాజ్యవైఖరిని గురించి ఇంగ్లీషుకార్మికులు ఏమనుకుంటున్నారో వ్రాయమని అడిగారు. రాజకీయాలను గురించి వారికి ఎలాంటి అభిప్రాయమున్నదో, దాన్నిగురించి గూడా అంతేనాజవాబు. ఇక్కడ కార్మికపార్టీ ఏమీలేదు. కన్సర్వేటివులు (కరడుగట్టిన మితవాదులు) ఉదారతీవ్రవాదులు మాత్రం ఉన్నారు. వారిలో కలిసిపోయి కార్మికులుగూడా బ్రిటిష్ ప్రపంచమార్కెట్టు, వలసరాజ్యాలనుంచి వచ్చేఆదాయాన్నంతా అనుభవిస్తున్నారు" (1892 లో ప్రచురించబడిన ఇంగ్లండులోని కార్మికుల పరిస్థితి" అను గ్రంధానికి వ్రాసిన పీఠికలో తిరిగి ఈ భావాలనే ఎంగెల్స్ వెలిబుచ్చాడు.)

కారణాలు, ఫలితాలు ఇక్కడ స్పష్టంగా చూపబడినాయి. కారణాలు (1) ప్రపంచాన్నంతా ఈ దేశం దోపిడీ చేస్తోంది. (2) ప్రపంచమార్కెట్టులో ఆధిక్యతగల అగ్రస్థానం వహిస్తోంది. (3) వలపదేశాల గుత్త విధానంలో దానికి ప్రధాన స్థానముంది. ఫలితాలు (1) బ్రిటిష్ కార్మికులలో ఒకభాగంలో బూర్జువా స్వభావం పెంపొందుట. (2) కార్మిక వర్గంలో ఒకభాగం బూర్జువావర్గంనుంచి లంచంతినేవారిచే నడుపబడుటకు అంగీకరించుట. మొత్తంమీద 20 వ శతాబ్ద ప్రారంభంనాటికి కొద్దిరాజ్యాల మధ్య ప్రపంచ పంపకం అంతా పూర్తిఅయింది. ఈ రాజ్యాలలో ప్రతిఒకటి ప్రపంచంలో ఒక భాగాన్ని (1858 లో ఇంగ్లండుకు ఉన్న వలసప్రాంతంకంటె కొంచెం తక్కువగా ఉన్నప్పటికి) దోపిడీచేస్తూ అతీతలాభాలను గడిస్తోంది. ట్రస్టులు, కార్టెల్స్, ఫైనాన్సు పెట్టుబడులద్వారా, ఋణదాత ఋణగ్రస్థుల సంబంధాలద్వారా, ప్రతిఒక్కసామ్రాజ్యవాద దేశానికి ప్రపంచమార్కెట్టులో ఒకగుత్తస్థానం ఉంది. ప్రతిదానికి తన యధేచ్ఛగా ఇతరుల ఆటంకంలేకుండా దోపిడి చేసుకొనుటకు వలప దేశాలున్నాయి. ప్రపంచంలోని మొత్తం 7 కోట్ల 50 లక్షల చద

రపుకిలోమీటర్లను (నూటికి 88 వంతులు) 6 పెద్దరాజ్యాలు ఆక్రమించినవని ఇది వరకే తెలుసుకున్నాం. 6 కోట్ల 10 లక్షల చదరపుకిలోమీటర్లు లేక నూటికి - 81 వంతులు 3 రాజ్యాల స్వాధీనమయినాయి)

కార్మికోద్యమంయొక్క ప్రధాన ఆశయాలకు, అవకాశవాదుల విద్రోహకరమైన ఆశయాలకు మధ్యవైరుధ్యం రోజురోజుకూ తీవ్రమయే రాజకీయ ఆర్థిక పరిస్థితులు ఏర్పడుతున్నాయి. ప్రస్తుతదశయొక్క ముఖ్యలక్షణంఇదే. అంకురాల్లోనుంచి బయలుదేరి ఆధిక్యత వహించే స్థితికి వచ్చింది సామ్రాజ్యవాదం. జాతీయ ఆర్థికరాజకీయాల్లో పెట్టుబడిదారీ గుత్తసంస్థలకు అగ్రస్థానం వచ్చింది. ప్రపంచపంపకమంతా పూర్తిఅయింది. కాని ఒకే ఒక ఏకైక బ్రిటిష్ గుత్తవిధానానికి బదులు, దాన్నిపంచుకొని భాగస్వాములగుటకు కొన్ని సామ్రాజ్యవాద ప్రభుత్వాలు తీవ్రంగా పరస్పర హోరాహోరీ పోరాటాలు సాగిస్తున్నాయి. మొత్తంమీద 20 వ శతాబ్ద ప్రారంభదశయొక్క ప్రధాన లక్షణం ఈ సామ్రాజ్య వాదుల పరస్పర పోరాటమే అనిచెప్పవచ్చును.

కొన్ని దశాబ్దాలపాటు 1850 - 1900 మధ్య ఇంగ్లండులో విజయ వంతమైనట్లుగా ఏ దేశకార్మికోద్యమంలోనైనాసరే అవకాశవాద విద్రోహకతత్వం విజయవంతం కాలేదు. కాని అనేక దేశాల్లో ఈ విద్రోహకతత్వం పండబారి ముగ్గిపోయి కుళ్ళిపోతోంది. చివరిదశలో బూర్జువాపంథాతో పూర్తిగా కలిసిపోయి జాతీయ దురహంకారంగా తయారైంది.

# సామ్రాజ్యవాదంయొక్క విమర్శనా పరిశీలన

సమాజంలోని వివిధవర్గాలు తమతమ సాధారణ భావస్ఫూర్తినిబట్టి సామ్రాజ్యవాద పంథాయందుగల వైఖరిని పరిశీలించే-విశాలదృక్పథంతో సామ్రాజ్యవాదంయొక్క విమర్శనాన్ని చూద్దాం.

హద్దులేమీలేని పరిమాణంలో వృద్ధిచెందిన ఫైనాన్సు పెట్టుబడి కొద్దిమంది చేతుల్లో కేంద్రీకరించబడి, అనేకరకములైన బంధాలు, సంబంధాలతోకూడిన దట్టమైన అల్లిక నొకదానిని బాహుళ్యంగా విస్తరింపచేసింది. ఈవిధంగా కేంద్రీకరించబడిన ఫైనాన్సు పెట్టుబడి ఒకవైపున మధ్యతరగతికి చెందిన పెట్టుబడివారులను చిన్న పెట్టుబడిదారులనే గాక మిక్కిలి చిన్న పెట్టుబడిదార్లను, కొద్దిపాటి ఆస్తిపరులనుగూడా తన అధీనం చేసుకుంటూ, మరొకవైపున ప్రపంచ పంపకంకొరకు, ఇతరదేశములమీద ఆధిక్యతకొరకు విదేశప్రభుత్వ పెట్టుబడిదారుల ముఠాలతో తీవ్రమైన పోరాటాన్ని సాగించుటవల్ల — ఆస్తిపరుల వర్గాలన్నీ ఏకైకముఠాగా సామ్రాజ్యవాద పక్షంవైపు వచ్చిచేరుటకు కారణమవుతోంది. సామ్రాజ్యవాదాన్ని బహుపట్టుదలతో సమర్థించుట, దానివల్ల రాబోయే లాభాలనుగురించి సర్వత్రా ఉత్సాహాన్ని ప్రదర్శించుట, సామ్రాజ్యవాదంయొక్క నిజస్వరూపాన్ని మరుగుబుచ్చుటకు సాధ్యమైనన్ని పన్నాగాలుపన్నుట — ఇవి ప్రస్తుత కాలపు ధోరణియొక్క చిహ్నాలు. చివరికి సామ్రాజ్యవాద సిద్ధాంతం కార్మికవర్గంలోకి గూడా వ్యాపిస్తోంది కార్మికవర్గానికి ఇతరవర్గాలకుమధ్య 'చైనా గోడవంటి అడ్డగోడ ఏమీలేదు. జర్మనీలోని సోషల్ డెమాక్రాటిక్ పార్టీ' అని పిలువబడే పార్టీయొక్క నాయకులందరిని సోషల్-సామ్రాజ్యవాదులని పిలుచుట న్యాయంగానే ఉంది. అనగా వారు మాటల్లో సోషలిస్టులు, చేతల్లో సామ్రాజ్యవాదులు, ఇంగ్లండులో అవకాశవాద తత్వాన్ని బలపరచే * 'ఫేబియన్ సమితి'కి చెందినవారంతా 'ఫేబియన్ సామ్రాజ్యవాదులని' హాబ్సన్ 1902 లోనే గుర్తించాడు.

* ఫేబియన్ సమితి—పరిణామమార్గంలో సామ్యవాదాన్ని సాధించగలమని నమ్మే 'బెర్నార్డ్‌షా' వంటి వ్యక్తులతోకూడిన సమితి. ఇంగ్లండులో స్థాపించబడింది.

బూర్జువా పండితులు ప్రచారకులు సామ్రాజ్యవాదాన్ని సమర్థించేటప్పుడు సాధారణంగా ఒక గూఢపద్ధతిని అనుకరిస్తారు. సామ్రాజ్యవాదమంటే సంపూర్ణ ఆధిక్యతగలదనే విషయాన్ని మరుగుపరచి లోతైన దాని అంకురాలను కప్పివేయుటకు ప్రయత్నిస్తారు. అప్రధానమైన ప్రత్యేక లక్షణాలమీద, విషయాలమీద తమ దృష్టినంతా కేంద్రీకరిస్తారు. ప్రధాన విషయాన్నుంచి ఎలాగైనా దృష్టిని మరల్చుటకై ట్రస్టులను, బ్యాంకులను మొదలైన వాటిని రక్షించుటకై పోలీసు యాజమాన్యం మొదలైన శుద్ధ తెలివితక్కువ సంస్కరణ పద్ధతులనెన్నో సూచిస్తారు. బాహాటంగా సామ్రాజ్యవాదాన్ని సమర్థించే సామ్రాజ్యవాదులు కొందరు, సామ్రాజ్యవాదంయొక్క ప్రధాన లక్షణాలను 'సంస్కరించే' భావాలు వెర్రివని అప్పుడప్పుడు ధైర్యంగా అంగీకరిస్తారు.

ఒక ఉదాహరణను తీసుకుందాం. 'ప్రపంచ ఆర్థిక పరిశోధనలు' అను గ్రంథంలో వలసదేశాల్లో జాతీయ స్వాతంత్ర్య పోరాటాలకు కారణాలుచెప్తూ జర్మన్ సామ్రాజ్యవాదులు ముఖ్యంగా జర్మనీకి చెందని వలసరాజ్యాలను ఉదహరించుటకు ప్రయత్నిస్తారు. ఇండియాలోని విప్లవ తిరుగుబాటును, దక్షిణ ఆఫ్రికాలోని నెటాల్ తూర్పు డచ్ దీవులలోని ఉద్యమాలను గుర్తిస్తారు. ఆఫ్రికా, ఆసియా, యూరప్‌ఖండాల్లో విదేశ పారతంత్ర్యం క్రింద క్రుంగిపోతున్న ప్రజాప్రతినిధులతో 1910 జూన్ 28–30 తేదీలలో జరిగిన సమావేశంలో ఇవ్వబడిన ఉపన్యాసములయొక్క ఇంగ్లీషు రిపోర్టులనుచూసి జర్మన్ సామ్రాజ్యవాదులలో ఒకరు ఈ దిగువ విధంగా వ్యాఖ్యానం చేశారు :—

"సామ్రాజ్యవాదంతో పోరాడాలని చెప్తారు; బానిస ప్రజలయొక్క స్వపరిపాలనా హక్కును పాలకప్రభుత్వాలు గుర్తించాలంటారు; పెద్దప్రభుత్వాలకు వాటికంటె బలహీనమైన ప్రజలకు మధ్య జరిగిన ఒడంబడికలను తనిఖీ చేయుటకై ఒక అంతర్జాతీయకమిటీ ఉండాలంటారు; ఇటువంటి గొంతెమ్మకోర్కెలను మించి ఒక మాటగూడా చెప్పరు. ప్రస్తుత పెట్టుబడివిధానరూపంతో సామ్రాజ్యవాదం అవిభాజ్యసంబంధం కల్గిఉందనే విషయాన్ని వీరు గ్రహించలేరు. అందువల్ల సామ్రాజ్యవాదంతో ప్రత్యక్షంగా పోరాటం తలపెట్టుటవల్ల ప్రయోజనంలేదని గూడా (!) వీరు గుర్తించలేరు. మరీ హేయమైన సామ్రాజ్యవాదుల కృత్యాలయెడల అసమ్మతి తెలియబరచే పోరాటం అయితే అర్థంచేసుకోవచ్చును."

సామ్రాజ్యవాదం యొక్క పునాదులను సంస్కరించుట ఉత్త భ్రమకాబట్టి, పీడిత ప్రజలయొక్క బూర్జువా ప్రతినిధులు అంతకంటె ముందుకు వెళ్ళలేరు కాబట్టి, పీడించే దేశాల ప్రతినిధులు ముందుకు సాగిపోయేమాట నిజమే! కాని శాస్త్రీయ విజ్ఞానం అనే మిషతో పరోక్షంగా సామ్రాజ్యవాదానికి లొంగిపోయి వెనక్కి పోతున్నారు. ఏమి తర్కం!

సామ్రాజ్యవాదం యొక్క పునాదులను సంస్కరించుటకు సాధ్యపడుతుందా? దానివల్ల బయలుదేరుతున్న వైరుధ్యాలనన్నింటినీ మరింత తీవ్రపరచి పక్కవచేయుటకై

ముందుకు సాగిపోవుటా లేక ఆ వైరుధ్యాల నన్నింటిని అరికట్టుటకై వెనక్కి పోవుటా? సామ్రాజ్యవాదంయొక్క విమర్శనాపరిశీలనలో వచ్చే ప్రధాన ప్రశ్నలు ఇవి. సామ్రాజ్యవాదం యొక్క రాజకీయలక్షణాలన్నీ మొదటినుంచి చివరివరకూ పొడుగూనా అభివృద్ధిని నిరోధించినాయి. పెట్టుబడి కోటీశ్వరుల హింసాదౌర్జన్యాలతోపాటు సామ్రాజ్యవాదంగూడా జాతులను పీడించింది; స్వేచ్ఛాపోటీవ్యాపారాన్ని నిర్మూలించింది. ఈ కారణాలవల్ల 20 వ శతాబ్దప్రారంభం నుంచి అన్ని సామ్రాజ్యవాద దేశాల్లోనూ, సామ్రాజ్యవాదాన్ని ఎదుర్కొనే ఛోటా-బూర్జువా-ప్రజాస్వామ్య వ్యతిరేక వ్యక్తులు బయలుదేరినాయి. ఈ వ్యతిరేక పక్షాలను ఎదుర్కొనే పద్ధతి తెలియకపోవుటవల్ల, తెలుసుకొనుటకు ప్రయత్నించకపోవుటవల్ల కాట్‌స్కీ మార్క్సిస్టు సిద్ధాంతాన్ని వదిలివేయుట, అంర్జాతీయంగా ఒక కాట్‌స్కీ పంథా బయలు చేరుట జరిగిందని గూడా గుర్తించాలి. విద్రోహకర స్వభావంకల్గిన ఈ ఛోటా బూర్జువాపక్షాన్ని ఎదుర్కొనేపద్ధతితెలియక, ఆచరణలో కాట్‌స్కీ దానితో కలిసిపోయాడు.

బూర్జువా ప్రజాస్వామ్య భక్తులెవరన్నా మిగిలిఉంటే వారిలోగూడా 1898 లో స్పెయిన్‌కు వ్యతిరేకంగా యునైటెడ్‌స్టేట్స్ సాగించిన సామ్రాజ్యవాద యుద్ధఫలితంగా, 'సామ్రాజ్యవాద వ్యతిరేకత' బయలుదేరింది. వారీ యుద్ధాన్ని గొప్పనేరమని పిలిచారు. విదేశాలను ఆక్రమించుట చట్టవిరుద్ధమని ఖండించారు. ఫిలిప్పినోస్ ప్రజల నాయకుడైన అగునాల్డోను మోసంచేసి ఫిలిప్పోనీస్ ప్రజలకు ద్రోహంచేశారని ఖండించారు. (అతని దేశానికి స్వాతంత్ర్యం ఇస్తామనిచెప్పి తరువాత అమెరికన్ సైన్యాలను ఫిలిప్పైన్సు దీవులలో దింపి ఆక్రమించారు). వారు లింకన్' చెప్పిన విషయాన్ని ఉదహరించారు :—

"తెల్లవాడు తన్నుతాను పరిపాలించుకుంటే అది స్వపరిపాలన అవుతుంది; కాని తననేకాకుండా మరొకవ్యక్తినిగూడా పాలించినప్పుడు అది స్వపరిపాలనకంటె ఎక్కువే అవుతుంది — దానిపేరే నిరంకుశ పరిపాలన"

కాని సామ్రాజ్యవాదులకు ట్రస్టులకుగల సన్నిహిత సంబంధాన్ని గుర్తించనంత కాలం అనగా పెట్టుబడిదారీ పునాదులకు సామ్రాజ్యవాదానికిగల సంబంధాన్ని గుర్తించనంతకాలం; పెట్టుబడివిధాన అభివృద్ధినుంచి బయలుదేరిన ప్రజాశక్తులతో చేరుటకుజంకినంతవరకూ, ఈ విమర్శనఅంతా అమాయకపు ఆశగామాత్రమే ఉండిపోయింది.

సామ్రాజ్యవాదాన్ని విమర్శించడంలో హాబ్సన్‌గూడా ముఖ్యంగా ఈ విషయాన్నే గుర్తించాడు. సామ్రాజ్యవాదం తప్పనిసరియైనది' అనే సిద్ధాంతాన్ని, కాట్‌స్కీగూడా వ్యతిరేకిస్తాడని, (పెట్టుబడి విధానంక్రిందనే) ప్రజాసామాన్యంయొక్క కొనుగోలుశక్తిని ఎక్కువచేయాలని ఆందోళనచేస్తాడని హాబ్సన్ ఎదురుచూశాడు. తరచుగా నేను ఉదహరిస్తూవచ్చిన అగాద్, లాన్సుబర్గ్, యల్. ఎస్వీగే రచయితలందరూ సామ్రాజ్యవాదం, బ్యాంకుల సర్వాధికారం, పెట్టుబడి కోటీశ్వరుల పరిపాలన విషయాల్లో ఛోటాబూర్జువా దృక్పథంతోనే విమర్శనలు సాగించారు. 1900 లో ప్రచురించబడిన తన "ఇంగ్లండు,

సామ్రాజ్యవాదం" అను గ్రంథంలో విక్టర్ భేరార్ అను ఫ్రెంచి రచయితగూడా లోతుకు పోకుండా ఈ పెటీబూర్జువా దృక్పథాన్నే బలపరచాడు. మార్క్సిస్టులమని చెప్పుకొని వీరందరూ స్వేచ్ఛాపోటీవిధాన, ప్రజాస్వామ్యములతో సామ్రాజ్యవాదాన్ని పోల్చిచూస్తాడు. బాగ్దాడ్ రైల్వే నిర్మాణం పేచీలకు, యుద్ధానికి దారితీయగలదని వీరందరూ ఖండిస్తారు; చివరికి అంతర్జాతీయ పెట్టుబడిషేర్ల లెక్కల అంచనాలను తయారుచేసే ఎ. నెమార్క్ గూడా అంతర్జాతీయంగా, జారీచేయబడిన కోట్లకుకోట్ల విలువగల సెక్యూరిటీలనన్నింటిని లెక్కతేల్చినతరువాత 1911 లో ఈ విధంగా ఆశ్చర్యపోయాడు.

"శాంతిభగ్నంకాగలదని నమ్మటానికి ఎలాసాధ్యమవుతుంది?.... ఈ బ్రహ్మాండమైన అంకెలన్నీ చూసినతరువాతయుద్ధానికిదిగి ఎవరైనాసరే ప్రమాదాన్ని తెచ్చుకుంటారా?"

బూర్జువా అర్థశాస్త్రజ్ఞుల ఈ బేలతనాన్ని చూచి ఆశ్చర్యపడనవసరంలేదు. తమకు తెలియనట్లునటిస్తూ సామ్రాజ్యవాద యుగంలో ఎక్కువ దీక్షతో శాంతిని గురించి చర్చించడం వారిస్వలాభం కొరకేసుమా! కాని 1914 - 1915 - 1916 సంవత్సరాల్లో ఇదే బూర్జువా-సంస్కరణ దృక్పథాన్ని తీసుకొని "శాంతిని గురించి మేమంతా (సామ్రాజ్యవాదులు, నామమాత్రమైన సోషలిస్టులు, సోషల్-శాంతివాదులు) ఏకాభిప్రాయానికివచ్చాం" అని నొక్కిచెప్పిన కాట్స్కీలో మార్క్సిజం ఏంమిగిలిందని అనుకుంటాం? సామ్రాజ్యవాదాన్ని పరిశీలించి దానియొక్క వైరుధ్యాల లోతుపాతుల నన్నింటిని బట్టబయలు చేయుటకుబదులు అసలు విషయాన్నివదిలేసి దారితప్పించే అమాయకపు ఆశలను ప్రకటిస్తూ ప్రవర్తించే శుద్ధసంస్కరణవాదిలా తయారైనాడు కాట్స్కీ,

కాట్స్కీ సామ్రాజ్యవాదాన్నిగురించి ఆర్థికంగా ఎలా విమర్శనచేశాడో ఒక ఉదాహరణ తీసుకుందాం. 1872, 1912 సంవత్సరాల్లో బ్రిటన్‌కు ఈజిప్టుకు మధ్యజరిగిన ఎగుమతి దిగుమతి వ్యాపారలెక్కలను తీసుకుంటాము. బ్రిటన్‌యొక్క ఎగుమతి దిగుమతి వ్యాపారంకంటె నెమ్మదిగా ఈజిప్టువ్యాపారం వృద్ధిఅయిందని ఈ లెక్కలవల్ల తెలుస్తుంది. దీన్నిబట్టి కాట్స్కీ :-

"ఈజిప్టును మిలటరీగా ఆక్రమించక పోయినప్పటికి, ఒక్క ఆర్థికకారణాలబట్టి చూస్తే ఈజిప్టుతో బ్రిటన్‌యొక్క వ్యాపారం అంతగా అభివృద్ధికాదని అనుకోడానికి కారణాలులేవు ఆక్రమణలద్వారా తమ విస్తీర్ణాన్ని విస్తరింపచేసుకొనుటకు వివిధప్రభుత్వాలుచేసే ప్రయత్నాలన్నీ సామ్రాజ్యవాద దౌర్జన్య హింసాపద్ధతులలోగాక శాంతియుతమైన ప్రజాస్వామ్య పద్ధతులలో నెరవేరగలవు" అనే అభిప్రాయానికి వచ్చాడు.

కాట్స్కీ అంగరక్షకుడైన స్పెక్టేటర్ (స్వదేశ దురహంకారవాదమును లేవదీసిన రష్యన్ దేశస్థుడు) ఈ కాట్స్కీవాదాన్ని మాటిమాటికి ఉదహరించేవాడు. సామ్రాజ్యవాద విమర్శనా పరిశీలనలో కాట్స్కీ ప్రధానవాదం ఇదే. అందువల్ల ఈ వాదాన్ని ఇంకా ఎక్కువ వివరంగా పరిశీలించుట అవసరం. హిల్ఫర్‌డింగ్ అభిప్రాయాలను "సోషలిస్టు

సిద్ధాంతులందరూ ఏకగ్రీవంగా ఆమోదించారని" కాట్‌స్కీ అనేక సమయాల్లో—1915 ఏప్రిల్‌లోగూడా చెప్పాడు. అందువల్ల ఆ హిల్ఫర్‌డింగ్ చెప్పిన విషయాన్ని ఉదహరిస్తూ మన పరిశీలనను ప్రారంభిద్దాం:—

"అభివృద్ధికరమైన ఈనాటి పెట్టుబడిదారీ వైఖరిని అంతరించిపోయిన స్వేచ్ఛా వ్యాపార యుగంయొక్క పంథాతోనూ ప్రభుత్వం యందు విరోధభావం పెంపొందిన కాలం నాటి పంథాతోనూ పోల్చి చూపుట కార్మికవర్గంయొక్క పనికాదు. సామ్రాజ్యవాదానికి, ఫైనాన్సు పెట్టుబడియొక్క ఆర్థిక వైఖరికి కార్మికవర్గం యొక్క సమాధానం సోషలిజం గాని స్వేచ్ఛావ్యాపారం కాదు. స్వేచ్ఛాపోటీ వ్యాపారాన్ని పునరుద్ధరించుట నేటి కార్మిక వర్గ ఆశయం కానేరదు. ఇది విద్రోహకరమైన ఆశయమని స్పష్టమైపోయింది. పెట్టుబడి దారీ విధానాన్ని నాశనంగావించి తద్వారా పోటీవిధానాన్ని పూర్తిగా నిర్మూలించుటయే కార్మికవర్గ ఆశయం."

ఫైనాన్సు పెట్టుబడియుగంలో విద్రోహకరమగు ఆదర్శములైన 'శాంతియుత ప్రజా స్వామ్యాన్ని,' 'కేవలం ఆర్థికఘటనల ఫలితాలను' ప్రధానంగా తీస్కుకొని వాదించుటవల్ల కాట్‌స్కీ మార్క్సిజానికి దూరమయ్యాడు. ఎందుకంటే కార్యరంగంలో ఈ ఆదర్శాలన్నీ పెట్టుబడిదారీ గుత్తవిధానం నుంచి గుత్తవిధానంలేని పెట్టుబడి విధానానికి దారితీసి మన లను తిరిగి వెనక్కి తీసుకొనిపోవుటకు ఉపయోగపడతాయి. అందువల్ల కాట్‌స్కీ వాద మంతా సంస్కారవాద మోసం తప్ప మరేమీ కానేరదు.

మిలటరీఆక్రమణ లేకుండానే, సామ్రాజ్యవాదం ఫైనాన్సు పెట్టుబడులు లేకుండానే, ఈజిప్టుతో (లేక ఏ ఇతర వలసదేశంతోగాని అర్ధవలసదేశంతోగాని) వ్యాపారం ఇంకా బాగా అభివృద్ధి కాగలదని చెప్పటంలో అర్థం ఏమిటి? గుత్తవిధానంవల్ల నిర్బంధాలేమీ లేనప్పుడు ఫైనాన్సు పెటుబడివల్ల వలసదేశాలను గుత్తగా వ్యక్తిగతదేశాలు ఆక్రమించు టకు ప్రతిబంధకాలు ఏమీ కలుగనప్పుడు స్వేచ్ఛగా పోటీవ్యాపారాన్ని సాగించేవిధానం క్రింద పెట్టుబడివిధానం ఇంకా అభివృద్ధి కాగలదనే అర్థం.

కాట్‌స్కీవాదనలకు మరొకఅర్థం ఏమీలేదు; ఈ అర్థం గూడా అర్థంలేనిచెత్తయే: అయినప్పటికి గుత్తసంస్థలేమీ లేవనుకుందాం. స్వేచ్ఛాపోటీ విధానంక్రింద ఎక్కువ వేగంగా పెట్టుబడివిధానం వ్యాపారం అభివృద్ధిచెందుతుందనే అనుకుందాం. పెట్టుబడి విధాన వ్యాపారాలు ఎంతత్వరగా అభివృద్ధిఅయితే వాటితోపాటు ఉత్పత్తి, పెట్టుబడులు గూడా అంతత్వరగా కేంద్రీకరించబడి గుత్తసంస్థలకు దారితీయవా? గుత్తసంస్థలు ఇప్ప టికే బయలుదేరినాయి — స్వేచ్ఛాపోటీ విధానంలోనుంచే సరిగ్గా ఇవన్నీ ఉద్భవించాయి! అయితే గుత్తసంస్థలు ఈనాడు అభివృద్ధి నిరోధకంగా తయారవుతున్నవంటే తిరిగి స్వేచ్ఛాపోటీ విధానమే రావాలని వాదించుటలో అర్థంలేదు. ఒకసారి స్వేచ్ఛావిధానంలో నుంచి గుత్తవిధానం బయలుదేరిన తరువాత తిరిగి స్వేచ్ఛావిధానం ఏర్పడుట అసంభవం.

కౌట్‌స్కీవాదాన్ని ఎంత మెలిపెట్టి ఎటువైపునుంచిచూసినా అందులో బూర్జువా సంస్కరణవాదం, విద్రోహకతత్వం తప్ప మరొకటి కన్పించదు. ఈ వాదాన్ని సరిదిద్ది స్పెక్టేటర్ చెప్పినట్లుగా, ఇతరదేశాలతో అభివృద్ధి చెందినంతవేగంగా బ్రిటన్‌తో బ్రిటిష్ వలసదేశముల వ్యాపారం అభివృద్ధి అగుటలేదని వాదించినప్పటికి కాట్‌స్కీ రక్షింపబడలేడు. ఎందుకంటే ఇతరదేశాల గుత్తవిధానంవల్ల, సామ్రాజ్యవాదంవల్ల (అమెరికా, జర్మనీ) బ్రిటన్‌గూడా దెబ్బతింటోంది. కార్టెల్స్‌వల్ల కొత్తరకమైన రక్షణసుంకాలు — ఎగుమతిచేయుటకు పనికివచ్చే సరుకులకు రక్షణ ఏర్పడింది — బయలుదేరినవనే విషయం అందరికి తెలిసిందే. ('పెట్టుబడి' 3వ సంపుటంలో ఈ విషయాన్ని ఎంగెల్స్ గుర్తించాడు), బహు చవుకధరలకు సరుకులనన్నిటినీ అపారంగా ఎగుమతిచేసే విచిత్రమైన పద్ధతిఒకటి కార్టెల్స్‌కు ఫైనాన్సుపెట్టుబడికి కలదనే విషయంగూడా అందరికీ తెలిసిందే. దీనినే ఇంగ్లీషువారు ఇతరదేశాలను తమ సరుకులతో 'ముంచివేయడం' అంటారు :— తమస్వదేశంలో గుత్తవిధానానికి అనుగుణ్యంగా ఒకేరకంగా విపరీతమైన హెచ్చుధరలకు కార్టెల్స్ తమ సరుకులను అమ్ముతాయి; విదేశాల్లో ఆ సరుకులనే అంతకంటె ఎంతో తక్కువధరలకు అమ్ముతాయి విదేశాల్లో తమ పోటీదారులను ఓడించి తమ ఉత్పత్తిని గరిష్ఠస్థాయికి తీసుకొనివెళ్ళుటకై కార్టెల్స్ ఇలాచేస్తాయి. బ్రిటన్‌కుచెందిన వలస దేశాల్లో బ్రిటన్‌కంటె జర్మనీకే ఎక్కువవ్యాపారం ఉందంటే కారణం జర్మన్ సామ్రాజ్యవాదం కొత్తగా బయలుదేరి బ్రిటన్‌కంటెఎక్కువ నిర్మాణయుక్తంగానూ, బలిష్ఠంగానూఉండి బ్రిటన్‌కంటె ఉన్నతస్థాయికి అభివృద్ధిఅగుటయే. అందువల్ల స్వేచ్ఛావ్యాపారమే శ్రేయమని వాదించుటలో అర్థంలేదు. ఎందుకంటే రక్షణలకు వలసదేశాల అస్వతంత్రతకు వ్యతిరేకంగా స్వేచ్ఛావ్యాపారం పోరాటంచేయుటలేదు ఒకసామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగామరొక సామ్రాజ్యవాదం, ఒకగుత్తసంస్థకువ్యతిరేకంగా మరొక గుత్తసంస్థ, ఒక ఫైనాన్సు పెట్టుబడికి వ్యతిరేకంగా మరొకఫైనాన్సుపెట్టుబడి పోరాటంచేయుటయే కారణం. వలసదేశాల సరిహద్దుగోడలకంటె, రక్షణసుంకాల ప్రతిబంధకాలకంటె బ్రిటిష్ సామ్రాజ్యవాదాన్ని మించిన జర్మన్ సామ్రాజ్యవాదంయొక్క శ్రేష్ఠతయే బలీయమైనది. ఈ విషయాలనుంచి "స్వేచ్ఛావ్యాపారాన్ని" శాంతియుత ప్రజాస్వామ్యాన్ని' బలపరచే వాదనలనులేవదీయుటలో అర్థంలేదు. అలాచేసిన యెడల సామ్రాజ్యవాదంయొక్క ప్రధాన గుణవిశేషణాలకు తప్పు అర్థంకల్గించి మార్క్సిజానికి బదులు బూర్జువాసంస్కరణవాదాన్ని ప్రవేశపెట్టుటయే అవుతుంది.

బూర్జువా అర్థశాస్త్రజ్ఞుడైన ఎ. లాన్స్‌బర్గ్ యొక్క సామ్రాజ్యవాద విమర్శన కాట్‌స్కీవిమర్శనవలె చోటాబూర్జువా వైఖరిలోనడిచింది. కాని వ్యాపారలెక్కల పరిశీలనలో లాన్స్‌బర్గ్ యొక్కవైఖరి శాస్త్రీయదృక్పధానికి దరిదాపుకు వచ్చింది. ఏదోఒక దేశాన్నిగాని లేక, ఏదోఒక వలస రాజ్యాన్నిగాని తీసుకొని ఇతరదేశాలతో అతడు పోల్చ

లేదు. ఒక సామ్రాజ్యవాదాన్ని తీసుకుని దాని ఎగుమతి వ్యాపారాన్ని మొదటదానిమీద ఆర్థికంగా ఆధారపడే దేశాలతోనూ తరువాత స్వతంత్ర దేశాలతోనూ, పోల్చిపరిశీలించాడు. ఆయన పరిశోధనా ఫలితాల పర్యవసానం ఇది.

### జర్మనీనుంచి ఎగుమతులు
### (లక్షల మార్కులలో)

జర్మనీమీద ఆర్థికంగా ఆధారపడిన దేశాలకు :-

| దేశం | 1889 | 1908 | పెరుగుదల నూటికి |
|---|---|---|---|
| రుమేనియా | 482 | 708 | 47 |
| పోర్చుగల్ | 190 | 328 | 73 |
| అర్జెంటీనా | 6 7 | 1470 | 143 |
| బ్రెజిల్ | 487 | 845 | 73 |
| చిలీ | 283 | 524 | 85 |
| టర్కీ | 299 | 640 | 114 |
| మొత్తం | 2318 | 4515 | 92 |

జర్మనీతో సంబంధంలేని ఆర్థిక స్వాతంత్ర్యం గల దేశాలకు :-

| | | | |
|---|---|---|---|
| బ్రిటన్ | 6518 | 9974 | 53 |
| ఫ్రాన్సు | 2102 | 4379 | 108 |
| బెల్జియమ్ | 1372 | 3228 | 135 |
| స్విట్జర్లండు | 1774 | 4011 | 127 |
| ఆస్ట్రేలియా | 212 | 645 | 205 |
| తూర్పు డచ్ దీవులు | 88 | 407 | 363 |
| మొత్తం | 12066 | 22644 | 87 |

లెక్కలన్నీ వేశాడుగాని లాన్స్‌బర్గ్ వాటిని కూడటం మరిచిపోయాడు. అందువల్ల పై లెక్కలన్నీ ఏవిషయాన్నైనా రుజువుచేస్తే తన వాదాన్ని వ్యతిరేకించే విషయమేనని లాన్స్‌బర్గ్ గుర్తించలేకపోయాడు. ఎందుకంటే పైఅంకెలన్నీ కూడితే, జర్మనీమీదఆధార పడనటువంటి దేశాలతో కంటె ఆధార డే దేశాలతో జర్మనీ వ్యాపారం కొద్దిగానైనా ఎక్కువైందని తెలుస్తుంది! (మరొకలోపంగూడా ఉంది. లాన్స్‌బర్గ్ లెక్కలు సంపూర్ణమైన లెక్కలుకావు)

ఎగుమతి వ్యాపారానికి అప్పులకు గల సంబంధాన్ని పరిశీలిస్తూ లాన్స్‌బర్గ్ ఈ దిగువ విధంగా వ్రాశాడు :—

"1890–91 లో జర్మన్ బ్యాంకులద్వారా రుమేనియాకు ఒక ఋణం ఇవ్వబడింది. అంతకుపూర్వమే ఈ ఋణంలో కొంతభాగం అడ్వాన్సుగా రుమేనియాకు జర్మనీ ఇచ్చి ఉంది. జర్మనీలో రైల్వేసామానులను కొనుటకై ఈ అప్పుధనాన్ని ముఖ్యంగా ఉపయోగించుట జరిగింది. 1891 లో రుమేనియాకు జర్మనీ ఎగుమతులు మొత్తం విలువ 550 లక్షల మార్కులు. మరుసటిసంవత్సరం ఈ ఎగుమతుల విలువ 394 లక్షలకు పడిపోయింది. తరువాత హెచ్చుతూ, తగ్గుతూ 1900 నాటికి 254 లక్షలకు వచ్చింది. కొన్ని కొత్త అప్పులను ఇచ్చుటవల్ల ఈమధ్యనే మళ్ళీ 1891 స్థాయిని చేరగల్గింది జర్మనీ.

1888–'889 మధ్య పోర్చుగల్‌కు జర్మనీ అప్పులు పెట్టుటవల్ల జర్మన్ ఎగుమతుల (పోర్చుగల్‌కు) విలువ 211 లక్షల మార్కులకు పెరిగింది. మరుసటి రెండు సంవత్సరాల్లో వరుసగా 162,74 లక్షలకు పడిపోయింది. తిరిగి మళ్ళీ పూర్వస్థాయి 1903 లో వచ్చింది.

అర్జెంటీనాతో జర్మనీ చేసే వ్యాపారాన్ని చూస్తే ఈ విషయం ఇంకా విస్పష్టం కాగలదు. 1888, 1891 లలో ఇచ్చిన అప్పుల ఫలితంగా 1889 లో అర్జెంటీనాకు జర్మన్ ఎగుమతుల విలువ 607 లక్షల మార్కులకు పెరిగింది. 2 సంవత్సరాల తరువాత 186 లక్షల మార్కుల విలువగల ఎగుమతులే చేయబడినాయి. అనగా మూడోవంతుకు పడిపోయినాయి. తరువాత అర్జెంటీనా ప్రభుత్వ, మ్యునిసిపాలిటీలు కొత్తఅప్పులు తీసుకున్నందువల్ల, విద్యుచ్ఛక్తి ఉత్పత్తికేంద్రాలు మొదలైన నూతన నిర్మాణాలకై అడ్వాన్సులు తీసుకున్నందువల్ల 1901 లో జర్మన్ ఎగుమతులు 1889 స్థాయిని మించి పెరిగిపోయినాయి.

ఇక చిలీవిషయం. 1889 అప్పువల్ల 1892 లో ఎగుమతులు 452 లక్షల మార్కుల వరకూ పెరిగినాయి. మరుసటిసంవత్సరం సగానికిపైగా తగ్గినాయి (225 లక్షలు మాత్రమే). తరువాత 1906 లో జర్మన్ బ్యాంకులు కొత్త అప్పులు పెట్టుటవల్ల 1907 లో ఎగుమతులు 847 లక్షల మార్కుల వరకూ పెరిగినాయి. 1908 లో 524 లక్షలకు పడిపోయినాయి."

పై విషయాలనుబట్టి లాన్స్‌బర్గ్ తేల్చిన సారాంశమేమిటి ? ఎగుమతి వ్యాపారానికి, అప్పులకు సంబంధం ఉంటే, ఎగుడుదిగుడుగా హెచ్చుతూ తగ్గుతూ ఎగుమతి వ్యాపారం జరుగుతుందనే ఛోటాబూర్జువా తీర్మానానికి వచ్చాడు! స్వదేశంలో చక్కగా సహజంగా పెట్టుబడులుపెట్టి స్వదేశ పరిశ్రమలను అభివృద్ధి చేయుటకుబదులు విదేశాల్లో పెట్టుబడి పెట్టుటవల్ల ఎంతో నష్టదాయకమని, విదేశ అప్పులను ప్రోగుచేయుటకు క్రూప్‌కంపెనీవారు దేశంలోని మారుమూలలలోఉన్న సొమ్మునంతా గోకి తెచ్చుకోవలసివస్తుందని లాన్స్‌బర్గ్ వాపోయాడు. కాని యదార్థవిషయాలన్నీ స్పష్టంగానే ఉన్నాయి. ఎగుమతుల పెరుగుదలకు, ఫైనాన్సు పెట్టుబడియొక్క దొంగ వ్యవహారాలకు ఎంతో దగ్గరసంబంధం ఉంది.

ఫైనాన్సుపెట్టుబడీ బూర్జువా నీతినిగూడా లెక్కచెయ్యకుండా ఎడాపెడా లాభాలు కొడుతుంది. మొదట అప్పుఇచ్చేటప్పుడు వచ్చేలాభాన్ని సంగ్రహించి, తరువాత ఆ అప్పు ద్వారా క్రూప్సుకంపెనీ సరుకులనుగాని, లేక ఏ ఇతర ఉక్కు సిండికేట్ నుంచి రైల్వే సామగ్రులను కొనునప్పుడుగాని అమ్మకంమీద మళ్ళీ లాభంకొడుతుంది.

లాన్స్‌బర్గ్‌యొక్క లెక్కలన్నీ సరియైనవికావని మళ్ళీ చెప్తున్నాను. కాని కాట్‌స్కీ, స్పెక్టేటర్ లెక్కలకంటె అవి శాస్త్రీయంగా ఉండుటవల్ల వాటిని ఉదహరించుట జరిగింది. అంతేగాక అసలు సమస్యను శాస్త్రీయదృక్పథంతో పరిశీలించుటకు దిగాడు లాన్స్‌బర్గ్. ఎగుమతుల విషయంలో ఫైనాన్సుపెట్టుబడియొక్క ప్రాముఖ్యతను చర్చించేటప్పుడు ఎగుమతులకు పెట్టుబడి కోటీశ్వరుల మోసకారితనానికిగల సంబంధాన్ని ముఖ్యంగా చూపగల్గాలి. 'కార్టెల్స్' మొదలైన గుత్తసంస్థలచే ఉత్పత్తిచేయబడు సరుకుల అమ్మకంతో వారికిగల జిత్తులమారి సంబంధాన్ని చూపగల్గాలి. వలసదేశాలను స్వతంత్ర దేశాలతో పోల్చుటగాని; లేక ఒక సామ్రాజ్యవాదాన్ని మరొక సామ్రాజ్యవాదంతో పోల్చుటగాని; లేక ఒక అర్ధవలస రాజ్యాన్నో లేక వలసదేశాన్నో (ఈజిప్టు) ఇతర దేశాలతో పోల్చుటగానిచేస్తే, అసలు సమస్యయొక్క ప్రధానాంశమును మరుగుబుచ్చుటయే అవుతుంది.

కనుక కాట్‌స్కీయొక్క సామ్రాజ్యవాద విమర్శనమునకు మార్క్సిజానికి ఎట్టి పోలికాలేదు. అవకాశవాద ద్రోహులతోనూ, జాతీయ దురహంకార వాదులతోనూ చేతులు కలిపి శాంతికొరకై చేసే ప్రచారానికి ఉపోద్ఘాతంగామాత్రం కాట్‌స్కీవాదం బాగా పనికి వస్తుంది. ఎందుకంటే సామ్రాజ్యవాదంలో ప్రస్ఫుటంగా కనిపిస్తున్న ప్రధాన వైరుధ్యాలనన్నింటిని మరుగుపరచి అలాంటివేమీ లేనట్టుగా కాట్‌స్కీవాదం నటిస్తుంది. స్వేచ్ఛాపోటీవిధానం ప్రక్కనే బహిర్గతమవుతున్న గుత్తసంస్థల వైరుధ్యాలు, ఫైనాన్సుపెట్టుబడి దోపిడీచేసే అతీతలాభాలకు బహిరంగ మార్కెట్లలో 'న్యాయమైన' వ్యాపారంవల్ల కల్గే లాభాలకుగల వైరుధ్యాలను, ట్రస్టులు మొదలైన గుత్తసమ్మేళనములకు గుత్తవిధానం అనుసరించని పరిశ్రమలకుగల వైరుధ్యాలను—వీటినన్నిటిని కాట్‌స్కీవాదం గుర్తించుట గూడా జరుగలేదు. అందువల్లనే కాట్‌స్కీవాదానికి మార్క్సిజానికి ఎక్కడా పోలికలు గూడా లేవు.

కాట్‌స్కీ సృష్టించిన 'అతీతసామ్రాజ్యవాద సిద్ధాంతం' గూడా అప్రతిష్ఠమైన విద్రోహక సిద్ధాంతం. ఈ సిద్ధాంతాన్నిగురించి 1915 లో కాట్‌స్కీ చేసినవాదాన్ని 1902 లో హాబ్సన్ చేసిన వాదంతో పోల్చిచూడండి.

కాట్‌స్కీ ఈ విధంగా వ్రాశాడు.

"ఈనాటి సామ్రాజ్యవాదపంథాస్థానే ఒక నూతన అతీత సామ్రాజ్యవాద పంథాను నెలకొల్పుటసాధ్యపడుతుందా? వివిధ-జాతీయ ఫైనాన్సు పెట్టుబడుల మధ్యగల పరస్పర

పోటీ పోరాటాలబదులు ప్రపంచాన్నంతా ఉమ్మడిగా దోచుకునే అంతర్జాతీయసమ్మేళనం పొందిన ప్రపంచఫైనాన్సు పెట్టుబడి సాధ్యపడుతుందా ? పెట్టుబడివిధానంలో ఈ నూతన దశగూడ రావచ్చునని అనుకోటానికి అవకాశాలున్నాయి. ఈ ఆశయంనెరవేరుతుందా ? ఈ ప్రశ్నకుసమాధానం ఇచ్చుటకు చాలినంతసాక్ష్యంఇంకాలభించుటలేదు" ఇక హాబ్సన్ వ్రాసింది చూద్దాం.

"అనాగరిక - పరాధీన దేశాల పరివారంతో కూడుకొన్న కొన్ని పెద్ద ఫెడరల్ సామ్రాజ్యాలలోని క్రైస్తవ రాజ్యాంగం ప్రస్తుతకాలపు ధోరణులయొక్క న్యాయమైన పరిణామక్రమమనీ, దృఢమైన అంతస్సామ్రాజ్యవాదపు పునాదులమీద శాశ్వత శాంతిని నెలకొల్పగలదనే ఆశలను కల్గిస్తోందని చాలామంది అభిప్రాయపడుతున్నారు"

13 సంవత్సరాల క్రిందటదేనిని 'అంతస్సామ్రాజ్యవాదమని' హాబ్సన్‌పిలిచాడో కాట్‌స్కీ నేడు దాన్ని 'అతీత సామ్రాజ్యవాదమ'ని పిలుస్తున్నాడు. ఒకలాటిన్ ఉపసర్గను చేర్చిమంచి తెలివిగా ఒకకొత్తమాటను సృష్టించుటతప్ప రెంటికీ భేదం ఏమీలేదు. ఇంగ్లీషు మతబోధకుల పాటలని హాబ్సన్ వర్ణించిన దానికి కాట్‌స్కీ మార్క్సిజం అనేముద్ర గొట్టాడు. అంతకుతప్పిదే అతనిలో వైజ్ఞానిక అభివృద్ధి ఏమీకనపడదు. దక్షిణాఫ్రికాయుద్ధ రంగాల్లో అనేకమంది బంధువులను కోల్పోయి. బ్రిటిష్ కోటీశ్వరులకు ఇంకాలాభాలను గ్యారంటీచేయుటకై హెచ్చుపన్నులను చెల్లిస్తున్న బ్రిటిష్ ఛోటాబూర్జువా వర్గానికి చెందిన వారిని కార్మికులను ఓదార్చుటకై బోయరు యుద్ధానంతరం ఈ యోగ్యుల' ముఠాబయలు దేరి శక్తివంచనలేకుండా పనిచేశారంటే ఆశ్చర్యమేమీలేదు. ఈ పరిస్థితులలో సామ్రాజ్య వాదం అంతచెడ్డదికాదని. శాశ్వతశాంతిని సమకూర్చే అంతస్సామ్రాజ్యవాదమునకు (లేక అతీతసామ్రాజ్యవాదమునకు) చాలా దగ్గరలోఉన్నామని చేసే ప్రచారంకంటె ఎక్కువగా ఓదార్చగలసిద్ధాంతం మరొకటి ఉంటుందా ? బ్రిటిష్‌మతబోధకులకు ఎన్నిమంచి ఉద్దేశ్యము లున్నా, తియ్యనిమాటలు చెప్పేకాట్‌స్కీ నిజఉద్దేశ్యాలు ఏమైనప్పటికి అతని సిద్ధాంతం' యొక్కసామాజిక ప్రాముఖ్యతఇదియే.

ప్రస్తుత తీవ్రసమస్యలనుంచి. తీవ్రవైరుధ్యాలనుంచి దృష్టినిమరల్చి భవిష్యత్తులో ఒక నూతన అతీత సామ్రాజ్యవాదం ఏర్పడగలదనే భ్రమలను కల్గించి పెట్టుబడివిధానం క్రిందనే శాశ్వత శాంతి సమకూరగలదనే ఆశలను చూపించి ప్రజాసామాన్యమునుమోసం చేసి ఓదార్చుటతప్పమరేమీకాదు. ప్రజాసామాన్యం యొక్క భ్రమఒక్కటితప్ప కాట్‌స్కీ 'మార్క్సిస్టు' సిద్ధాంతంలో మిగిలినదంతా శూన్యం.

జర్మన్ కార్మికులకు, ఇతరదేశకార్మికులకు కాట్‌స్కీ చూపుతున్న ఆశాభవిష్యత్తు అంతా పచ్చిఅబద్ధం. ఈ విషయాన్ని దృఢపరుచుకొనుటకు ప్రపంచానికంతకూ తెలిసినటు వంటి. నిరాకరించడానికి వీలులేనటువంటి విషయాలను కొన్నింటిని మనస్సులో ఉంచు కుంటే సరిపోతుంది. ఇండియా. ఇండో - చైనా, చైనా విషయాలను తీసుకుందాం.

ఈమూకు వలస, అర్ధవలస దేశాల్లో 80, 70 కోట్లమంది బానిసప్రజలు వివిధసామ్రాజ్యవాదుల ఫైనాన్సు పెట్టుబడియొక్క దోపిడీకి గురిఅవుతున్నారని అందరికీ తెలిసిన విషయమే. బ్రిటన్, ఫ్రాన్సు, జపాన్, యునైటెడ్ స్టేట్సు మొదలైన దేశాలన్నీ ఈ 3 రాజ్యాలను విపరీత దోపిడిచేస్తున్నాయి. ఈ ఆసియాదేశాల్లో తమ ప్రయోజనాలను, తమవలస దేశాలను, 'తమపలుకుబడి రంగాలను' రక్షించుకొని విస్తరింపచేసుకొనుటకై ఈసామ్రాజ్యవాదులందరూ ఒకరికి వ్యతిరేకంగా ఒకరు పరస్పరసంబంధాలను ఏర్పరుచుకున్నారనుకుందాం, ఆ సంబంధాలే అంతస్సామ్రాజ్యవాద సంబంధాలులేక అతీత సామ్రాజ్యవాద సంబంధాలు అవుతాయి. ఈ ఆసియాదేశాలనన్నిటినీ "శాంతియుతంగా పంచుకొనుటకై ఈ సామ్రాజ్యవాద శక్తులన్నీ కలిసి ఒడంబడికచేసుకున్న వనుకుందాం. ఈ ఒడంబడికయే "అంతర్జాతీయ ఐక్యఫైనాన్సు పెట్టుబడి" అవుతుంది. అటువంటి సంబంధాన్నిప్రత్యక్షంగా చూడాలంటే 20 వ శతాబ్దచరిత్రలో ఉదాహరణ లేకపోలేదు. చైనాపంపకం విషయంలో వివిధసామ్రాజ్యవాదుల మధ్యజరిగిన ఒడంబడిక ఒకచక్కని ఉదాహరణ. అయితే పెట్టుబడివిధానం చెక్కుచెదరకుండా ఉంటుందనుకున్నప్పటికీ, ఏరూపంలోగూడా ఎటువంటి పేచీలు, వైరుధ్యాలు, పోరాటాలులేకుండా ఈ ఒడంబడికలన్నీ శాశ్వతంగా పనిచేయునని అనుకోటానికి అవకాశం ఉందా అనేదే ముఖ్యమైనప్రశ్న.

ఈ ప్రశ్నను స్పష్టంగా విశదీకరించినప్పుడే, లేదు అనేజవాబుగాక ఈ ప్రశ్నకు మరొక జవాబు ఇచ్చుట అసంభవమని తేలుతోంది. ఎందుకంటే పలుకుబడిరంగాలను, ప్రయోజనాలను, వలసదేశాలను మొదలైన వాటిని పంపకంచేసుకొనుటకు పెట్టుబడిదారీ యుగంలో వివిధ సామ్రాజ్యవాదులయొక్క శక్తిని వారి ఆర్థిక, పెట్టుబడి, మిలటరీబలాలను అంచనావేసే పద్ధతి తప్పమరొక పద్ధతిలేదు అయితే ఈ సామ్రాజ్యవాదులతారతమ్య బలం ఒకే విధంగా సమానంగాఅభివృద్ధిచెందుటలేదు. ఎందుకంటె పెట్టుబడిదారీయుగంలో వివిధ దేశాల్లోని పారిశ్రామిక శాఖలు, ట్రస్టులు మొదలైన సంస్థలన్నీ ఎగుడు దిగుడుగా అసమానంగావృద్ధి అవుతూ ఉంటాయి. 50 సంవత్సరాలక్రిందట పెట్టుబడిదారీ బలాబలాల విషయంలో బ్రిటన్‌తో పోలిస్తే జర్మనీ ఊరుపేరులేకుండా లెక్కలోకి రావటానికి గూడా వీలులేకుండా ఉండేది. అదే విధంగా రష్యాతో పోలిస్తే జపాన్ పరిస్థితిగూడాఅలాగే ఉండేది. 10 లేక 20 సంవత్సరాలకాలంలో వివిధ సామ్రాజ్యవాదులతారతమ్య బలాల్లో మార్పులేమీ రావనుకొనుటకు ఎంతమాత్రం అవకాశంలేదు.

కాబట్టి, ఇంగ్లీషు మతబోధకుల యొక్క, "మార్క్సిస్టు" కాట్‌స్కీయొక్క చోటా బూర్జువా ఊహలను బట్టిగాక యదార్థపెట్టుబడిదారీ విధాన పరిస్థితులనుబట్టిచూస్తే ఈ 'అంతస్సామ్రాజ్యసంబంధాలు; "అతీత సామ్రాజ్య" సంబంధాలన్నీ ఒక సామ్రాజ్యవాదులముఠాకు వ్యతిరేకంగా మరొక సామ్రాజ్యవాదుల ముఠాగాని, లేక సామ్రాజ్యవాదులందరితో ఏర్పడిన సమ్మేళనంగాని లేక మరి ఏరూపంలోనైనాసరే యుద్ధాలమధ్య కొద్ది

పాటి వ్యవధిని కల్గించుటకు మాత్రం వినియోగపడవచ్చును. శాంతియుతమైన ఒడంబడిక లన్నీ యుద్ధానికి దారితీస్తాయి. తిరిగి యుద్ధాలలోనుంచి శాంతియుతమైన ఒడంబడికలు బయలుదేరుతాయి. ఒకదానిలోనుంచి మరొకటి బయలుదేరుతూ ఒకప్పుడు శాంతియుత మైన పోరాటం. మరొకప్పుడు శాంతిరహితమైన దౌర్జన్యపోరాటం ఒకదానివెంట ఒకటి జరుగుతూ ఉంటాయి. కాని వీటన్నిటికి పునాది ఒకటే ప్రపంచఆర్థికరాజకీయాల్లో ఏర్ప డిన అంతస్సామ్రాజ్య సంబంధ బాంధవ్యాలే ఈ పోరాటాలన్నిటికి మూలం. కాని కాట్స్కీ మహాశయుడు, కార్మికులను శాంతింపచేసి బూర్జువావర్గంతో చేరిపోయిన జాతీయ దురహంకారవాదులతో వారిని ఐక్యం చేయుటకై, గొలుసులోని ఒక లింకును మిగిలిన వాటినుంచి త్రెంచివేసి, చైనాను శాంతింపచేయుటకై (బాక్సర్ తిరుగుబాటును అణిచి వేశారని ఇక్కడ గుర్తుపెట్టుకోవాలి) సామ్రాజ్యవాదులందరి మధ్య ఏర్పడిన ఈనాటి శాంతియుతమైన (అతీత సామ్రాజ్యవాదమైన లేక అంతస్సామ్రాజ్యవాదమైన) ఒడం బడికను రేపు జరుగబోయే దౌర్జన్య పోరాటంనుంచి వేరుచేస్తాడు. రేపు జరుగబోయే పోరాటంనుంచి మరొక దేశాన్ని (ఉ॥ టర్కీ లేక ఆ మరునాడు ఇంకొకదేశాన్ని) పంపకం చేసుకొనుటకై ఇంకొక 'శాంతియుతమైన' ఒడంబడిక బయలుదేరుతుందని కాట్స్కీ గుర్తించడు. సామ్రాజ్యవాద శాంతికాలానికి, సామ్రాజ్యవాదయుద్ధాల కాలానికి గల సజీవసంబంధాన్ని చూపించుటకు బదులు, నిర్జీవమైన నాయకులతో కార్మికులు చేతులు కలుపుటకై వారిముందర నిర్జీవమైన ఊహాసిద్ధాంతాలను పెట్టుటకు కాట్స్కీ ప్రయత్నిస్తాడు.

"యూరప్‌యొక్క అంతర్జాతీయ అభివృద్ధిలో రాజ్యాంగతంత్రం యొక్క చరిత్ర" అను గ్రంథాన్ని రచించిన అమెరికన్ రచయిత అయిన హిల్, ఆ గ్రంథపీఠికలో ఆధు నిక రాజ్యాంగతంత్రచరిత్రను (1) విప్లవదశ (2, చట్టసమ్మతమైన ఉద్యమం (3) 'వ్యాపార సామ్రాజ్య'మను ప్రస్తుతదశ - అని 3 భాగాలుగా విభజించాడు.

మరొక గ్రంథకర్త బ్రిటన్ యొక్క విదేశాంగ వైఖరి చరిత్రను 1870 నుంచి 4 దశలుగా విభజించాడు :— (1) ఆసియాఖండదశ : మధ్య ఆసియాలో ఇండియావైపుకు వ్యాపించిన రష్యాదాడికి వ్యతిరేకంగా పోరాటం; (2) ఆఫ్రికాఖండదశ (సుమారుగా 1885-1902) : ఆఫ్రికా పంపకాన్ని గురించి ఫ్రాన్సుతో పోరాటాలు (1898 లో జరిగిన ఫాషొడా ఉదంతం - ఆనాడు తలవెంట్రుకవాసిలో ఫ్రాన్సుతో యుద్ధం తప్పిపోయింది); (3) రెండవ ఆసియాఖండదశ (రష్యాకు వ్యతిరేకంగా జపాన్‌తో సంధి); (4) యూరపి యన్ దశ, ముఖ్యంగా జర్మనీకి వ్యతిరేకంగా కేంద్రీకరించినకాలం.

1905 లో రీసర్ అను బ్యాంకర్ "రాజకీయ యుద్ధాలయొక్క సరిహద్దు ఘర్షణ లన్నీ పెట్టుబడి రంగంలో జరుగుతున్నాయి" అని వ్రాశాడు. ఇటలీలో పనిచేస్తున్న ఫ్రెంచి ఫైనాన్సు పెట్టుబడి ఆ రెండు దేశాలమధ్య రాజకీయ ఒడంబడిక వచ్చుటకై ఎలా ప్రయత్నించేస్తున్నదీ, పర్షియానుగురించి బ్రిటన్ జర్మనీలమధ్య పోరాటం ఎలా పెరుగు

తున్నదీ, చైనాకు అప్పులిచ్చే విషయంలో యూరపియన్ పెట్టుబడిదారులందరిమధ్య పోరాటం ఎలా వృద్ధి అవుతున్నదీ మొదలైన విషయాలన్నీ నిరూపిస్తూ పైవాక్యాన్ని రీసర్ వ్రాశాడు. చూడండి! సాధారణ సామ్రాజ్యవాద పోరాటాలకు శాంతియుతమైన అతీత సామ్రాజ్యవాద ఒడంబడికలకు గల అభేద్యమైన సజీవ సంబంధాలను గుర్తించండి!

సామ్రాజ్యవాదం యొక్క తీవ్ర వైరుధ్యాల నన్నిటినీ చూసి చూడకుండా కాట్స్కీ దాటివేయుటవల్ల సామ్రాజ్యవాదానికి ఒకరకమైనఅలంకారాన్ని చేయుటయే అవుతుంది. కాని కుళ్లును బయటపెట్టకుండా సామ్రాజ్యవాదాన్ని రాజకీయంగా విమర్శనచేసే రచయితయొక్క రచనలోగూడా ఈకప్పదాటు లక్షణాలన్నీ కన్పించక తప్పదు. ఫైనాన్సు పెట్టుబడియొక్క సంస్థలయొక్కయుగమే సామ్రాజ్యవాదం. ఫైనాన్సుపెట్టుబడి, గుత్తసంస్థలు సర్వత్రా గుత్త తమ ఆధిక్యత కొరకే గాని స్వేచ్ఛా స్వాతంత్ర్యాలను సంపాదించుటకు ప్రయత్నించవు. ఫలితం ఏమిటంటే పొడుగూనా, ఏరాజకీయవిధానంలోనైనాసరే, వైరుధ్యాలన్నీ మరింత తీవ్రమయి విద్రోహతత్వం ప్రస్ఫుటమవుతుంది. ముఖ్యంగా బానిసజాతుల ప్రజలను దౌర్జన్యంగా హింసించుట, వివిధజాతులయొక్క స్వయంనిర్ణయహక్కును భగ్నంచేయుట, జాతీయ స్వాతంత్ర్యం భగ్నంచేసి దురాక్రమణలు సాగించుట మొదలైనవి యింకా తీవ్రమవుతాయి. సామ్రాజ్యవాదానికి జాతీయ పీడనకుగల సంబంధాన్ని హిల్ఫర్డింగ్ మన కళ్ళముందు చూపించుటసరిగానే ఉంది :—

"క్రొత్తగా ఆక్రమించబడిన దేశాల్లో వైరుధ్యాలన్నీ తీవ్రమయి, దురాక్రమణవల్ల కల్గిన జాతీయ చైతన్యఫలితంగా జాతీయ స్వాతంత్ర్య పోరాటాలు వృద్ధిఅగుటకు మూల కారణం ఆదేశాల్లోకి దిగుమతి అవుతున్న విదేశ పెట్టుబడియే ఈ స్వాతంత్ర్య పోరాటాలన్నీ విదేశ పెట్టుబడికి వ్యతిరేకంగా ప్రమాదకరమైన సంఘటనలుగా సులభంగా పరిణమిస్తాయి. అంతక్రితం ఉండే సామాజిక సంబంధాలన్నిటిలో విప్లవ కరమైన మార్పులు పూర్తిగా వచ్చేస్తాయి. ఒక 1000 సంవత్సరాలపాటు చరిత్రలో సాధ్యంకాకుండా పోయిన జాతుల యొక్క వ్యవసాయ సంకెళ్ళన్నీ బ్రద్దలయి, అవ్యవసాయిక జాతులుగూడా పెట్టుబడిదారీ సుడిగుండంలోకి లాగబడతాయి పరాధీనమయిన జాతుల విముక్తికై అవసరమైన పద్ధతులను, మార్గాలను పెట్టుబడిదారీ విధానమే క్రమేణా చూపిస్తుంది. ఒకప్పుడు యూరపియన్ దేశాలన్నిటికి ఉన్నత ఆదర్శంగాఉన్న - ఆర్థిక వైజ్ఞానిక స్వాతంత్ర్యానికి సాధనమైన- జాతీయ ఐక్య ప్రభుత్వ నిర్మాణానికి విముక్తికల్గిన జాతులన్నీ అప్పుడు పూనుకుంటాయి. యీ స్వాతంత్ర్య వుద్యమాలన్నీ యూరపియన్ పెట్టుబడికి ఎక్కడైతే ఎక్కువ లాభదాయంగాఉండి విపరీతమైన దోపిడీకి అవకాశాలున్నవో సరిగ్గా ఆ కీలక స్థానాల్లోనే దెబ్బ కొట్టాయి ఆ పరిస్థితులలో తన ఆధిక్యతను రక్షించుకోవాలంటే, యూరపియన్ పెట్టుబడి తన సైనికదళాలను ఎక్కువచేయుటతప్ప మరొకమార్గం ఉండదు" అని హిల్ఫర్డింగ్ వ్రాశాడు.

హిల్ఫర్‌డింగ్ చెప్పిన పైవిషయాలకు ఇంకొకసంగతిచేర్చాలి. కొత్తగా ఆక్రమించిన దేశాల్లోనేగాక పాతవాటిలోగూడా సామ్రాజ్యవాదంయొక్క జాతీయపీడన ఎక్కువయి దురాక్రమణయొక్క ఉధృతం పెరుగుటవల్ల, అక్కడగూడా తీవ్రమైన స్వాతంత్ర్య పోరాటాలు బయలుదేరుతాయి. సామ్రాజ్యవాదంవల్లకల్గే రాజకీయఫలితాలను అంగీకరించక పోవుటయేగాక, కాట్‌స్కీ మరొక ప్రధానసమస్యకు సమాధానం ఇవ్వకుండా గోప్యంగా వదిలేశాడు. సామ్రాజ్యవాదయుగంలో అవకాశవాద ద్రోహులతో ఐక్యత అసంభవమనే విషయాన్ని ఎత్తుకోలేదు. దురాక్రమణలకు అభ్యంతరంచెప్తూ, అవకాశవాద ద్రోహులకు ఏమాత్రం నొప్పికల్గించకుండా వారి అంగీకారంపొందే పద్ధతులలో తన అభ్యంతరాలను తెలియజేశాడు. జర్మన్ ప్రజలను సంబోధిస్తూ, జర్మనీ ఆల్సేజ్-లారెయిన్ ప్రాంతాన్ని దురాక్రమణ చేసిందనే ముఖ్యవిషయాన్ని చెప్పకుండా ప్రధానసమస్యల నన్నిటినీ వదిలేశాడు. కాట్‌స్కీయొక్క ఈ 'మానసిక వికారాలను' సరిగా తెలుసుకొనుటకై మరొక ఉదాహరణచూడండి: ఫిలిప్పైన్‌దీవులను అమెరికన్లు ఆక్రమించిన విషయాన్ని జపాన్ ఖండిస్తోందనుకుందాం. దానినిబట్టి దురాక్రమణల నన్నింటినీ జపాన్ ఖండిస్తోందని అనుకోటానికి వీలుందా? ఫిలిప్పైన్‌దీవులను తాను ఆక్రమించాలనే కోరికవల్లనేగా జపాన్ ఈవిధంగా ఖండించేది? అంతేకాదు. దురాక్రమణలకు వ్యతిరేకంగా జపానీస్ వారుచేసే 'పోరాట'మంతా నిజమైన రాజకీయంగా నమ్మకమైన పోరాటంగా ఎప్పుడు తయారవుతుందంటే, జపాన్‌యొక్క కొరియా ఆక్రమణకు వ్యతిరేకంగా పోరాడుతూ, జపాన్‌నుంచి విడిపోయే కొరియాప్రజల స్వాతంత్ర్యహక్కును బలపరచినప్పుడే

సామ్రాజ్యవాదాన్ని గురించి కాట్‌స్కీయొక్క సిద్ధాంతపరిశీలన, అతని సామ్రాజ్యవాద ఆర్థికరాజకీయ విమర్శన మొదటినుంచి చివరివరకూ, పొడుగూనా, మార్క్సిజానికి వ్యతిరేకమైన ధోరణితో నిండిఉంది. సామ్రాజ్యవాదంయొక్క ప్రధాన వైరుధ్యాలన్నిటినీ దాటవేస్తూ, యూరపియన్ కార్మిక ఉద్యమంలో నానాటికి శిథిలమవుతున్న అవకాశవాద ద్రోహులతో ఐక్యతను ఎలాగైనాసరే కాపాడాలని కాట్‌స్కీ మార్క్సిస్టు వ్యతిరేకధోరణియొక్క ఆశయం.

# చరిత్రలో సామ్రాజ్యవాదానికిగల స్థానం

పెట్టుబడిదారీ గుత్తవిధానమే సామ్రాజ్యవాదంయొక్క ఆర్థిక సారాంశమని తెలుసుకున్నాం. చరిత్రలో సామ్రాజ్యవాదంయొక్క స్థానాన్ని నిర్ణయించేది ఈవిషయమే. ఎందుకంటే స్వేచ్ఛాపోటీ విధానంలోనుంచి పుట్టిపెరిగిన గుత్తవిధానం పెట్టుబడిదారీ దశనుంచి మరొక ఉన్నత సామాజిక ఆర్థికవిధానానికి దారితీస్తోంది. ఈపెట్టుబడిదారీ గుత్తవిధానంయొక్క 4 ప్రధాన లక్షణాలనుగురించి మనం ప్రత్యేకంగా పరిశీలించవలసియున్నది. ఎందుకంటే ప్రస్తుతదశయొక్క ముఖ్యలక్షణాలుగూడా అవే.

(1) ఉత్పత్తి కేంద్రీకరణయొక్క అత్యున్నతదశలోనుంచి గుత్తవిధానం బయలుదేరింది. ఈవిధంగా కార్టెల్స్, సిండికేట్లు, ట్రస్టులు మొదలైన గుత్తపెట్టుబడిదారీ సమ్మేళనాలన్నీ ఏర్పడినాయి. ఆధునిక ఆర్థిక జీవితంలో ఈసంస్థలకుగల ప్రాముఖ్యతను గురించి ఇదివరకే తెలుసుకున్నాం. అభివృద్ధిఅయిన దేశాల్లో 20వ శతాబ్ద ప్రారంభం నాటికి గుత్తసంస్థల సర్వాధిక్యత ప్రస్ఫుటమయింది. ఈసమ్మేళనాలను స్థాపించే మొదటి ప్రయత్నాలన్నీ ఉన్నతరక్షణ సుంకాల విధానాన్ని అనుసరించిన జర్మనీ అమెరికా మొదలైనదేశాలు చేసినప్పటికి, స్వేచ్ఛావ్యాపారాన్నిఅనుసరించిన బ్రిటన్‌గూడా ఈప్రధాన విషయాన్ని — ఉత్పత్తి కేంద్రీకరణలోనుంచి గుత్తవిధానం బయలుదేరుతుందని — నిరూపించింది.

(2) ప్రధాన ముడిసరుకుల నిధులను, ముఖ్యంగా పెట్టుబడిదారీ సమాజంలోని ప్రధాన, గుత్తపరిశ్రమలైన బొగ్గు, ఇనుము పరిశ్రమలకొరకై ముడిసరుకుల నిధులను స్వాధీనపరచుకొనుట గుత్తసంస్థలు వచ్చినతరువాత అతివేగంగా జరిగింది. ముఖ్యమైన ముడిసరుకుల నిధులనన్నీ గుత్తవిధానంక్రింద కంట్రోల్ చేయుట ప్రారంభమైన తరువాత పెద్ద పెట్టుబడిదారులశక్తి విపరీతంగాహెచ్చి, గుత్తపారిశ్రామిక సంస్థలకు, సాధారణ పారిశ్రామిక సంస్థలకు మధ్యగల వైరుధ్యం మరింత తీవ్రమయింది.

(3) బ్యాంకులలోనుంచి గుత్తవిధానం ఉద్భవించింది. వెంటనే, సాధారణ మధ్యవర్తిత్వంచేసే బ్యాంకులన్నీ ఫైనాన్సుపెట్టుబడియొక్క గుత్తసంస్థలుగా మారిపోయినాయి.

బాగా అభివృద్ధిఅయిన దేశాల్లో ఏమూడో లేక అయిదో పెద్దబ్యాంకులద్వారా పారిశ్రామిక పెట్టుబడికి బ్యాంకింగ్ పెట్టుబడికిమధ్య 'వ్యక్తిగత సమ్మేళనం' సాధించబడింది. ఆదేశంలోని ఆదాయపెట్టుబడుల మొత్తంలో అత్యధికభాగమైన కోట్లకుకోట్ల ధనంమీద ఆ 3 లేక 5 బ్యాంకులకు కేంద్రఅధికారం లభించింది. ప్రస్తుత బూర్జువా సమాజంలోని (మినహాయింపులేమీ లేకుండా) ఆర్థిక రాజకీయ సంస్థలన్నిటికిమధ్య దట్టమైన బానిస సంబంధాల అల్లికను కల్గించే కొద్దిమంది పెట్టుబడి కోటీశ్వరుల నిరంకుశ పరిపాలనయే గుత్తవిధానంయొక్క మూర్తీభవించిన స్వరూపం.

(4) వలసదేశ వైఖరిలోనుంచి గుత్తవిధానం బయలుదేరింది. వలసదేశ వైఖరి యొక్క అనేక 'పాత' ఆశయాలకు తోడుగా ఫైనాన్సుపెట్టుబడివచ్చి ముడిసరుకుల కొరకు, పెట్టుబడులఎగుమతికొరకు, 'పలుకుబడిప్రదేశాల' కొరకు (అనగా మంచి వ్యాపారం, ఆర్థిక సౌకర్యాలూ, గుత్తలాభాలు మొదలైనవన్నీ లభించే ప్రదేశాలు), చివరికి ఆర్థిక ఆధిక్యత సంపాదించుకొనుటకై నూతన భూభాగాలకొరకు పోరాటాన్నిగూడా లేవదీసింది. 1876 లో ఆఫ్రికాలో 10 వ వంతు మాత్రమే వలసప్రాంతం క్రింద యూరపియన్‌రాజ్యాల వశమయింది. ఆరోజుల్లో గుత్తవిధానానికి దిగకుండా స్వేచ్ఛగా భూమిని ఎవరికి ఇష్టంవచ్చినట్లు వారు ఆక్రమించారు లూటీచేసినట్లుగా. కాని 1900 వచ్చేసరికి ఆఫ్రికాలో 10 వ వంతుమాత్రమే మిగిలి $\frac{9}{10}$ వంతులూ వలసప్రాంతంగా మారినప్పుడు, ప్రపంచమంతా పంపకమయినప్పుడు, గుత్తగా వలస దేశాలను ఆక్రమించేవిధానం తప్పనిసరిగా బయలుదేరి ప్రపంచపంపక — పునఃపంపక విషయాల్లో తీవ్రమైన పోరాటాలు ప్రారంభమయినాయి.

గుత్తపెట్టుబడులవల్ల పెట్టుబడిదారీ విధానంయొక్క వైరుధ్యాలన్నీ ఎంతతీవ్రమయినవో అందరికీ తెలిసిన విషయమే. జీవితప్రమాణం హెచ్చడం కార్టెల్స్‌కు ఏర్పడిన అతీత అధికారం — ఈరెండు విషయాలుచూస్తే ఎంత తీవ్రపరిస్థితి కల్గిందో తెలుస్తుంది.

ప్రపంచ ఫైనాన్సుపెట్టుబడికి వచ్చిన అంతిమవిజయంతో వైరుధ్యాలన్నీ తీవ్రమగుట ప్రారంభించింది. పరిణామకాలంయొక్క చరిత్రలో పరిస్థితులనన్నిటినీ ముందుకు నడిపే బలీయమైన అతీతశక్తి ఈ వైరుధ్యాల తీవ్రతయే.

గుత్త సంస్థలు, కొద్దిమంది కోటీశ్వరుల సర్వాధికారం, స్వేచ్ఛా స్వాతంత్ర్యముల బదులు ఆధిక్యత కొరకు కృషిచేయుట, ఏవోకొన్ని శక్తివంతమైన ధనిక దేశాలు అసంఖ్యాకమైన బలహీనమైన దేశాలను దోపిడీచేయుట - ఇవన్నీ కలిసి సామ్రాజ్యవాదం యొక్క ప్రధాన లక్షణాలుగా తయారైనాయి. అందువల్లనే సామ్రాజ్యవాదాన్ని పరాన్నభుక్కు, లేక శిధిలమవుతున్న పెట్టుబడి విధానమని నిర్వచించవలసివచ్చింది. రోజు రోజుకు సామ్రాజ్యవాద ప్రధాన లక్షణాల్లో ఒకటిగా తయారవుతున్న లక్షణం- వడ్డీవ్యాపార ప్రభుత్వం. ఈ ప్రభుత్వంక్రింద బూర్జువావర్గం పెట్టుబడుల ఎగుమతిమీద, చెక్కులను

స్వీకరించుటమీద ఆధారపడి బ్రతకడం రోజురోజుకూ ఎక్కువగుతుంది. ఈ శిధిలమయే ధోరణి పెట్టుబడిదారీ విధాన అభివృద్ధికి విరోధకంగా అడ్డుపడుతుందనుకొనుట పొరపాటు. అలా అడ్డుపడదు. సామ్రాజ్యవాద యుగంలో ఇప్పుడు ఒక లక్షణం, మరొకప్పుడు మరొకలక్షణం - కొన్ని పరిశ్రమలలోనూ, బూర్జువావర్గాల్లో కొన్ని భాగాల్లో, వ్యక్తిగత దేశాల్లోనూ హెచ్చుతగ్గులుగా ప్రస్ఫుటమవుతూఉంటాయి. మొత్తంమీద చూస్తే పెట్టుబడి దారీ విధానం పూర్వకంటె ఎక్కువ వేగంగా అభివృద్ధి అవుతోంది. కాని ఈ అభివృద్ధి అంతా ఎగుడు దిగుడుగా జరుగుటయేగాక, పెట్టుబడులు ఎక్కువగాగల దేశాల (ఇంగ్లండు మొదలైనవి) క్షీణతలో ఈ అసమానత్వం మరింత ప్రస్ఫుటమవుతోందనిగూడా గుర్తించాలి.

పెద్ద జర్మన్ బ్యాంకులనుగురించి పరిశోధనలు చేసిన రీసర్ జర్మనీ ఆర్థిక అభివృద్ధిని గురించి ఈ దిగువ విధంగా చెప్పాడు :—

" 848-1870 ల మధ్య జర్మనీ దేశపు ఆర్థికవిధానం (జర్మన్ పెద్ద బ్యాంకులతో సహా) పొందిన అభివృద్ధి స్వల్పమని చెప్పుటకు వీలులేదు. కాని ఆ అభివృద్ధిని 1870-1905 మధ్య కల్గిన అభివృద్ధితో పోల్చిచూస్తే, పవిత్ర రోమన్ సామ్రాజ్యంనాటి జర్మన్ దేశపు గుర్రపు బగ్గియొక్క వేగానికీ, ఈనాటి మోటారు యొక్క వేగానికీ ఎంత తేడా ఉందో అంత తేడా ఉన్నట్లు కనపడుతుంది. నేటి మోటార్‌కార్ విపరీత వేగంతో నడుస్తూ దారిన పోతున్న అమాయక బాటసారికీ, కారులోనివారికిగూడా ప్రమాదం కల్గిస్తోంది."

అంత విశేష వేగంతో వృద్ధిచెందిన ఫైనాన్సు పెట్టుబడి, ఆక్రమించుకొనకుండా మిగిలిపోయిన వలసదేశాలను శాంతియుతంగానూ, పేచీ- పొందూ లేకుండాను స్వాధీన పరుచుకొనుటకు అయిష్టత చూపుటలేదు. అంత వేగంగా అభివృద్ధి చెందుటయే ఈ వైఖరికి కారణం. ధనిక దేశాలనుంచి లాక్కొందుకు దౌర్జన్య పద్ధతులను అనుసరించటానికి గూడా తయారుగానే ఉంది. గతించిన కొన్ని దశాబ్దాలలో జర్మనీలోకంటె యునైటెడ్ స్టేట్సులో ఆర్థికాభివృద్ధి త్వరగా జరిగింది. అందువల్లనే అమెరికన్ పెట్టుబడిదారీవిధానం యొక్క పరాన్నభుక్కులక్షణం మరీ ఎక్కువగా ప్రస్ఫుటమవుతోంది. ప్రజాస్వామ్యవాదులైన అమెరికన్ బూర్జువావర్గాన్ని రాజరికాన్ని సమర్థించే జపానీస్ లేక జర్మన్ బూర్జువా వర్గంతో పోల్చిచూస్తే వారిమధ్యగల రాజకీయ విభేదాలు సామ్రాజ్యవాద యుగంలో చాలా వరకు మెత్తనైపోయినట్లు తెలుస్తుంది. కారణం ఆ విభేదాల ప్రాముఖ్యత తగ్గిపోయికాదు. అన్ని దేశాల్లోనూ బూర్జువావర్గంలో పరాన్నభుక్కులక్షణం విస్పష్టమగుటయే దీనికికారణం.

వివిధ పారిశ్రామిక శాఖలలో ఏ ఒక శాఖకు చెందిన పెట్టుబడిదారులుగాని లేక అసంఖ్యాకమైన దేశాల్లో ఏ ఒక దేశంలోని పెట్టుబడిదారులుగాని అత్యధిక గుత్త లాభాలను సంపాదించగల్గినప్పుడు, దానిద్వారా కార్మికులలో ఒక భాగానికిగాని లేక కొద్దిమందికిగాని లంచాలుపెట్టి ఆ పరిశ్రమకు లేక ఆదేశానికి చెందిన బూర్జువావర్గంవైపుకు తిప్పు

కొనుటకు (మిగిలిన బూర్జువావర్గమునకు వ్యతిరేకంగా) ఆర్థిక అవకాశాలు ఏర్పడుతాయి. వివిధ సామ్రాజ్యవాద దేశాలమధ్య ప్రపంచ పంపకంవిషయంమీద తీవ్రమవుతున్న వైరుధ్యాలు ఈ వైఖరిని మరీ ఎక్కువచేస్తాయి. ఈవిధంగా సామ్రాజ్యవాదానికి అవకాశవాదానికి మధ్య సంబంధం కుదురుటకు సాధ్యపడుతుంది. ఇతర దేశాలకంటే ముందుగా సామ్రాజ్యవాద అభివృద్ధియొక్క కొన్ని లక్షణాలు ఇంగ్లండులో ప్రస్ఫుటమయినందువల్ల ఈ సంబంధాలు ఇంగ్లండులో మొదట బయలుదేరుట జరిగింది.

యల్. మార్టోవంటి రచయితలు కొందరు కార్మికోద్యమంలోని అవకాశవాదమునకు, సామ్రాజ్య వాదమునకు గల సంబంధాన్ని కప్పిపుచ్చుటకు ప్రయత్నిస్తూ ఉంటారు. కాని యీ సంబంధాలు నాడుదాస్తే దాగేవికావు. కాని ఏవో కొన్ని అధికారరీత్యా ఆశాకరమైన' కారణాలను చూపించి మోసంచేయుటకు (ఉ॥ కాట్‌స్కీ, హ్యూస్‌మన్) వారు చూస్తూ ఉంటారు. ఉదాహరణకు వారు చెప్పే ఒక కారణం చూడండి:— అభివృద్ధిపొందిన పెట్టుబడిదారీ విధానంకాదు అవకాశవాదానికి కారణం. పెద్ద జీతాలు తెచ్చుకునే కార్మికులే అవకాశవాదులుగా తయారైనారని వారి వాదన. ఇటువంటి ఆశాజనితమైన' వాదనలను చూచి మనం భ్రమపడకూడదు. ఇవన్నీ అవకాశవాదాన్ని బలపరిచే ఆశావాదాలు. అవకాశవాదానికి ముసుగుగా ఉపయోగపడుతోంది ఈ ఆశావాదం. నిజానికి ఈ హేయమైన అవకాశవాదం ఎంత శీఘ్రంగా వృద్ధి అయితే అంత శాశ్వతంగా అది విజయవంతం కాగలదని అనుకొనుట పొరపాటు. ఆరోగ్యకరమైన శరీరంమీద అసహ్యకరమైన కురుపు ఎంతత్వరగా పెరిగితే అంత త్వరగా చితికి శరీరబాధానివారణ అవుతుంది. ఈవిషయంలో సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాటాన్ని అవకాశవాదానికి వ్యతిరేకంగాచేసే పోరాటంనుండీ వేరుచేయటానికి వీలులేదని రెంటిని కలిపి సాగించాలని గ్రహించుటకు ఇష్టంలేని వ్యక్తులు మహాప్రమాదకరమైనవారని గుర్తించాలి. రెంటిని వేరుచేసి సాగించేపోరాటం వట్టిమోసంతప్ప మరొకటికాదు.

సామ్రాజ్యవాదంయొక్క ఆర్థిక సారాంశమునుగూర్చి పైనచెప్పబడిన విషయాలవల్ల, మార్పుచెందుతున్న పెట్టుబడివిధానం లేక — ఇంకా సరిగ్గాచెప్పాలంటే — క్షీణిస్తున్న పెట్టుబడివిధానమే సామ్రాజ్యవాదమని స్పష్టమవుతుంది. ఈ సందర్భంలో నూతనంగా అభివృద్ధిఅవుతున్న ఈ పెట్టుబడివిధానాన్ని వర్ణించేటప్పుడు బూర్జువా అర్థశాస్త్రవేత్తలు "కలిసిపోవుట", "వ్యక్తిగత స్వభావ నిర్మూలనం" మొదలైన శబ్దాలనువాడుతూ, "బ్యాంకులు కేవలం వ్యక్తిగత సంస్థలుకాజాలవు. వాటికార్యవిధానం, అభివృద్ధిగతిని చూస్తే ఈవిషయం బోధపడుతుంది. రానురాను అవి వ్యక్తిగత వ్యాపార రంగపు హద్దులనుదాటిపోతున్నాయి" అని వాదిస్తున్న విషయాన్ని గుర్తించాలి. పైమాటలను చెప్పిన రీసరే బహుగంభీరంగా "సమాజపరంచేసే విధానాన్ని" గురించి మార్క్సిస్టుల 'జోస్యాలు' నెరవేరలేదని ప్రకటించాడు:

అయితే ఈ "కలిసిపోవుట" అనే ఈ చిన్నమాటకు అర్థంఏమిటి? మన కళ్ళ ముందర జరుగుతున్న విధానంయొక్క లక్షణానికి ఇది బాగా సమన్వయిస్తుంది. చెట్లకు బదులు అడివిని చూడలేమనే దానిభావం. బాహ్యప్రపంచానికి చెందిన అరాచక బాహ్య విషయాలకే అది ప్రాముఖ్యతనిస్తోంది. అనంతమైన విషయవస్తువులో మునిగిపోయి రీసర్ దాని ప్రాధాన్యతనుగాని, అర్థాన్నిగాని తెలుసుకోలేకపోయాడు. షాపులయొక్క షేర్లు కల్గియుండుట, వ్యక్తిగత ఆస్తిపరులమధ్యగల సంబంధాలు "ఆకస్మికంగా కలిసిపోతాయి!" కాని ఇలా కలిసిపోవుటకుగల మూలకారణం ఉత్పత్తివిధానంలో మార్పు చెందుతున్న సాఘాజిక సంబంధాలే. ఒక పెద్దపరిశ్రమ బ్రహ్మాండమైన పరిశ్రమగామారి సరియైన అంచనా లెక్కలప్రకారం లక్షలకొలదీ ప్రజల కవసరమైన సరుకులను తయారుచేయుటకు కావలసిన ప్రధాన ముడివస్తువులలో $\frac{3}{4}$ లేక $\frac{2}{3}$ వంతులు క్రమమైన పద్ధతిలో సప్లయి అగునట్లు చేయగల్గినప్పుడు ఈ ముడివస్తువుల నన్నిటినీ అనుకూలమైన ఉత్పత్తి కేంద్రాలకు — ఒక్కొక్కప్పుడు ఒకదానికి. మరొకదానికి - మధ్య వేలమైళ్ళు ఉండవచ్చును — నిర్మాణయుక్తంగా ఒక క్రమపద్ధతిలో రవానా చేయగల్గినప్పుడు; ముడి వస్తువులను సమకూర్చుటనుంచి అనేకరకాల తయారీవస్తువులను ఉత్పత్తిచేసే విధానంలో గల ఉత్పత్తిదశల నన్నింటినీ ఒకే ఒక కేంద్రం నిర్వహించగల్గినప్పుడు; ఈ సరుకుల నన్నింటినీ ఒకే ప్లానుప్రకారం అనేక కోట్లమంది ప్రజలకు (అమెరికన్ నూనెట్రస్టు ద్వారా జర్మనీ అమెరికాలలో పంపకమవుతున్న నూనెవిషయం చూడండి) పంపకం చేయగల్గినప్పుడు — అప్పుడు ఉత్పత్తివిధానం సమాజపరమగుట మన కళ్ళముందరే చూస్తాం. అంతేగాని 'కలిసిపోవుట' ద్వారా సమాజపరమగుట జరుగదు. ప్రైవేట్ వ్యాపార సంబంధాలు, ప్రైవేట్ ఆస్తిసంబంధాలు ఒక పొరలాంటివి. కాని ఆ పొర లోపలివస్తువుకు ఇప్పుడు ఆ పొర ఎంతమాత్రం సరిపడుటలేదు. మనం ఆపొరను వెంటనే తీసిపారవేయనియెడల అది కుళ్ళటం ప్రారంభిస్తుంది. ఆ కుళ్ళుదశలోనే అది కొంచెం దీర్ఘకాలం (ముఖ్యంగా అవకాశవాద కురుపును త్వరగా నిర్మూలించకపోతే) ఉండవచ్చును. కాని చివరికి అది నిర్మూలించబడకతప్పదు.

జర్మన్ సామ్రాజ్యవాదాన్ని అతిఉత్సాహవంతంగా అభినందించే షూల్జే-గెవిర్‌నిట్జ్ వ్రాతలుచూడండి :—

"జర్మన్ బ్యాంకులకు సంబంధించిన నిర్వహణ అధికారమంతా ఒక డజన్‌మంది చేతుల్లో ఉన్నదంటే, వారి కార్యకలాపం రాజ్యాంగంలోని చాలామంది మంత్రుల (బ్యాంకర్లు, మంత్రులు, పెద్ద పారిశ్రామిక యజమానులు, వడ్డీవ్యాపారస్థులంతా కలిసిపోయిన విషయాన్ని వాటంగా మరిచిపోయాడు) కార్యకలాపాలకంటె ఎక్కువ ప్రజోపయోగకరమైనవిషయం అవుతుంది.... పైనచెప్పబడిన అభివృద్ధిఅంతా అత్యున్నతస్థితికి వచ్చిందనుకుందాం; ధనరూపంలో పెట్టుబడిఅంతా బ్యాంకులలోఐక్యమయింది. బ్యాంకులు కార్టెల్స్‌తో

విక్రయమయినాయి; పెట్టుబడికి అనువైన రంగాలకోరకు వెదుగుతున్న దేశంలోనిధనమంతా సెక్యూరిటీలరూపం ధరించింది. అనగా సెయింట్ సైమన్ యొక్క అద్భుతజోస్యమంతా నిజమైందన్నమాట; ఆర్థిక సంబంధాలన్నీ ఒక సమానగతి క్రమంలో అభివృద్ధిచెంద నందువల్ల ప్రస్తుత ఉత్పత్తివిధానంలో అరాజకం ఏర్పడింది. మానవుల అవసరాలను లెక్కలోనికి తీసుకొనకుండా స్వతంత్రించి ఎవరికివారు వేరువేరుగా సాగించే వ్యక్తిగత ఉత్పత్తివిధానం ఇకముందు సాగలేదు. ఉత్పత్తినంతా ఒక ప్రత్యేక సామాజిక సంస్థ పరంచేయాలి. కార్యనిర్వహణకై స్థాపించబడిన ఆ కేంద్రసంస్థ ఉన్నతస్థానంనుంచి చూడగల్గుటవల్ల విశాలతరమైన ఆర్థిక కార్యరంగాన్ని పర్యాలోకనచేసి మొత్తం సమాజ మంతకూ ఉపయోగపడునట్లు ఉత్పత్తివిధానాన్ని చక్కపెట్టుటకై ఉత్పత్తిసాధనాలను సరియైన వ్యక్తులచేతుల్లో ఉంచి ఉత్పత్తి - వినియోగాల మధ్య ఎల్లప్పుడూ సామరస్యం ఉండునట్లు చేయగలదు. ఆర్థిక క్రమ నిర్మాణయుక్తంగా సాగించుటగూడా తమ కర్తవ్యా లలో ఒకభాగంగా పరిగణించే సంస్థలు కొన్ని ఉన్నాయి. అపేక్ష్యాంకులు" ఈ భవిష్యత్ కథనం అంతా నెరవేరుటకు ఇంకా చాలాకాలంపదుతుంది. ఇదంతా మార్క్సుఊహించినట్లు గాకపోయినా, రూపంలో మాత్రం వేరుగా ఉన్నా. నిజానికి ఇదిగూడా మార్క్సిజమే!" అన్నాడు రీసర్.

ఏంచక్కగా వ్యతిరేకించాడు మార్క్సును! ఒక అడుగు వెనక్కువేసి మార్క్స యొక్క సరియైన శాస్త్రీయమైన పరిశీలననుంచి సెయింట్ సైమన్ కాలంనాటి ఊహాకాలంలో ప్రవేశించాడు షూల్జే; ఇదంతాగొప్పమేధావియొక్క ఊహాజాలమే. అయితేనేంఊహాజాలం తప్పమరొకటికాదు!

# మరికొన్ని ఆధారాలు

— వార్గా.

## ఆధునిక పెట్టుబడి విధానముయొక్క సంక్షోభాన్ని గురించిన ఆధారాలు, లెక్కలు.

యుద్ధానంతరం పెట్టుబడివిధానముయొక్క సంక్షోభం పూర్వంఎన్నడూ ఎరుగనంత క్లిష్టమై కొన్ని ప్రత్యేకరూపాలను దాల్చింది. ఈ అపూర్వక్లిష్టతను, రూపాలను నిరూపించే విషయాలు, లెక్కలు మరికొన్ని ఈక్రింద ఉదహరించబడినాయి.

## 1. సమాజంయొక్క మూలఉత్పత్తి శక్తియగు శ్రమశక్తిని వినియోగించుటకు పెట్టుబడివిధానముయొక్క అసమర్థత

### ఎడతెగని నిరుద్యోగం

యుద్ధానికిపూర్వం వాణిజ్యవ్యాపారాలు బాగా వృద్ధిగాఉన్న సమయాల్లో నిరుద్యోగులు దాదాపు అందరూ పనిలో పెట్టుకొనబడుతూ ఉండేవారు. [1]కాని యుద్ధానంతరం ఒక స్పష్టమైన మార్పు కనపడుతుంది. యుద్ధానంతరం, పరిశ్రమ వ్యాపారాలు అత్యున్నత స్థితిలో ఉన్నప్పుడుకూడా నిరుద్యోగం చెప్పరానంత ఎక్కువగా ఉంటూవచ్చింది. యుద్ధానంతరం ఎడతెగనటువంటి క్లిష్టసమస్యగా నిరుద్యోగసమస్య తయారైందని ఈక్రింది లెక్కలవల్ల తెలుస్తుంది.

1929 లో పరిశ్రమవ్యాపారాలు బాగా అభివృద్ధిగా ఉన్నదశలో నిరుద్యోగం అతి హీనస్థాయిలో ఉన్నప్పుడు, యునైటెడ్ స్టేట్స్‌లో 30 లక్షలనుంచి 40 లక్షలవరకూ, బ్రిటన్‌లో 15 లక్షలనుంచి 20 లక్షలవరకూ నిరుద్యోగులు ఉండేవారు.

యుద్ధానికిపూర్వం, యుద్ధానంతరం నిరుద్యోగసమస్య అత్యుచ్చస్థాయిలో ఉన్నప్పుడు, అతిహీనస్థాయిలో ఉన్నప్పుడు కార్మికసంఘాలలో సభ్యులుగాఉన్న కార్మికులలో నూటికి ఎంతమంది నిరుద్యోగులుగాఉన్నారో ఈక్రింది లెక్కలవల్ల తెలుస్తుంది.

---

1. 1914–18 యుద్ధంతరువాత

| | 1900—1913. | | 1924—1929 | | 1932 |
|---|---|---|---|---|---|
| | అతితక్కువ | అతిఎక్కువ | అతితక్కువ | అతిఎక్కువ | |
| బ్రిటన్* | 2.1 | 7.8 | 9.7 | 12.5 | 22.1 |
| జర్మనీ | 1.1 | 2.9 | 6.7 | 18 | 43.8 |

యుద్ధానంతరం పరిశ్రమలలో పనిచేస్తున్న కార్మికుల సంఖ్యలో తగ్గుదల,

యునైటెడ్ స్టేట్స్ పరిశ్రమలలో

| సంవత్సరం | పనిలోఉన్న వారిసంఖ్య | సాంవత్సరిక సగటుమార్పు |
|---|---|---|
| 1869[1] | 20 లక్షల 54 వేలు | —— |
| 1899[1] | 53 ,, 6 ,, | [4] + 108 వేలు |
| 1899[2] | 47 ,, 13 ,, | —— |
| 1914[2] | 70 ,, 24 ,, | + 154 వేలు |
| 19'4[3] | 68 ,, 88 ,, | —— |
| 1919[3] | 89 ,, 90 ,, | + 420 వేలు |
| 1929[3] | 88 . 22 ,, | — 17 వేలు |
| 1931[3] | 65 ,, 7 ,, | — 1,158 వేలు |
| 1933[4] | 60 ,, 56 ,, | — 226 వేలు |

• 1924–32 మధ్య బ్రిటన్ యొక్క సంఖ్యలు నిరుద్యోగభీమాచేసుకున్న కార్మికులలో నిరుద్యోగాన్ని తెలియజేస్తాయి.

* జర్మనీకి సంబంధించిన లెక్కలు 1903–1913 కు చెందినవి. 1900–1913కు చెందినవికావు.

1. ఫాక్టరీలలోనూ, చేతిపరిశ్రమలలోనూ పనిచేసేవారి సంఖ్యలు.

2. 5౦0 డాలర్ల విలువకు మించిన వస్తువులను తయారుచేసే పరిశ్రమలలో పని వారి సంఖ్యలు.

3. 5000 డాలర్ల విలువకు మించిన వస్తువులను తయారుచేసే పరిశ్రమలలో పని వారి సంఖ్యలు.

4. + హెచ్చుదలను - తగ్గుదలను తెలియజేస్తాయి.

జర్మన్ పరిశ్రమలలో

| సంవత్సరం | పనిలో ఉన్నవారిసంఖ్య | సాంవత్సరిక సగటుమార్పు |
|---|---|---|
| 1895 | 55 లక్షల 30 వేలు | ―― |
| 1907[1] | 79 ,, 28 ,, | + 199 వేలు |
| 1907[2] | 73 ,, 67 ,, | ―― |
| 1925 | 94 ,, 39 ,, | + 115 వేలు |
| 1928 | 86 ,, 78 ,, | ― 255 ,, |
| 1933 | 57 ,, 18 ,, | ― 592 ,, |

బ్రిటన్‌లో నిరుద్యోగ భీమాచేసుకున్న పారిశ్రామిక, ఆఫీసుపనివారిలో నిజంగా పనిలో ఉన్నవారి సంఖ్యలు. (వేలలో)

| | 1924 | 1929 | 1933 | 1936 |
|---|---|---|---|---|
| మొత్తం పరిశ్రమలలో | 7273 | 7234 | 6444 | 7876 |
| బొగ్గు, ఇనుము, ఉక్కు నౌకానిర్మాణం, బట్టల మిల్లులలో........ | 2919 | 2564 | 2014 | 2084 |

మరుగుగా ఉన్న నిరుద్యోగం-వ్యవసాయంమీద ఆధారపడవలసివస్తున్న అధికజనాభా.

## యునైటెడ్ స్టేట్స్

1933 డిసెంబరు 30 వ తేదీన ఫిలడెల్ఫియాలో జరిగిన అర్థశాస్త్ర నిపుణుల సమావేశంలో వ్యవసాయక శాఖాసహాయమంత్రియైన టుగ్‌వెల్ ఉపన్యసిస్తూ, ఆర్థిక సంక్షోభ కాలంలో (1929-33) 20 లక్షల మంది తిరిగి వ్యవసాయ వృత్తిలోకివచ్చారని చెప్పాడు. అందువల్ల వ్యవసాయదారులసంఖ్య చాలా హెచ్చిందని, దేశానికి అవసరమైన పంటలను పండించుటకు అప్పుడు ఉన్న పొలాలలోసగం సరిపోవునని గూడా ఆయన చెప్పాడు.

## పోలెండు

భూస్వామ్యవిధానం ఇంకా అమలులోఉన్న దేశాల్లో, ప్రధానంగా వ్యవసాయంమీద ఆధారపడే జనాభా రోజురోజుకు ఎక్కువైపోతోంది. అందువల్ల ఆదేశాల్లో భూమివత్తిడి తీవ్రమై రైతులకు భూతృష్ణ ఎక్కువగుతోంది.

1. యుద్ధానికి పూర్వపుజర్మనీ లెక్కలు
2. యుద్ధానంతర జర్మనీ లెక్కలు

పోలెండు బూర్జువా సమాజశాస్త్రజ్ఞుడైన పియాట్కోవిజ్ తయారుచేసిన లెక్కల ప్రకారం పోలెండు దేశంలో వ్యవసాయంమీద ఆధారపడేవారి శ్రమశక్తి, ఒకసంవత్సరం పాటు 389 కోట్ల పనిరోజులలో కార్మికులు వ్యయంచేయవలసిన శ్రమశక్తితో సమాన మవుతుంది. కాని మొత్తం పోలెండు వ్యవసాయదారులు 185 కోట్ల 10 లక్షల పనిరోజు లలోమాత్రమే పనిచేస్తారు. అందువల్ల వ్యవసాయంమీద ఆధారపడేవారిలో సగంపైన వ్యవసాయానికి అసలు అనవసరమని తేలుతుంది.

హంగెరీ

1933 లో హంగెరీ ప్రభుత్వ ఆర్థిక పరిశోధనాసంస్థయొక్క మామూలు అంచనాల ప్రకారమే, "ప్రస్తుత భూస్వామ్య విధానాన్నిబట్టి, శిస్తుపద్ధతినిబట్టి, జనసంఖ్యనుబట్టి, వ్యవసాయంమీద ఆధారపడేవారిలో నూటికి 24 గురు వ్యవసాయానికి అనవసరమని" తేలింది.

## దరిద్రం

"పోల్చిచూస్తే అధికజనాభాలోని అడుగుభాగంలో ఉండేవారికందరికి దరిద్రమే గతి" అన్నాడు కారల్‌మార్క్సు (కాపిటల్ : 1 వ సంపుటం, 25 వ ప్రకరణం) కార్మిక మంత్రివర్గ లెక్కలప్రకారం, బ్రిటన్‌లో రిజిష్టరుకాబడిన దరిద్రులసంఖ్య 15 లక్షలకు పైగాఉన్నది. 1929 లో వ్యాపారం బాగా వృద్ధిలోఉన్నకాలంలో, బ్రిటన్‌లో ప్రతి 1000 మందిలోనూ 320 మంది నిరుద్యోగభృతి సహాయంమీదనే ఆధారపడియున్నారు.

జర్మనీలో 1929 ఆర్థికసంక్షోభానికి పూర్వం, 10 లక్షలనుంచి 15 లక్షలవరకు ఉండేది దరిద్రులసంఖ్య. సంక్షోభకాలంలో (1929-33) ఈసంఖ్య 30 లక్షలకుపైగా పెరిగింది.

యునైటెడ్ స్టేట్స్‌లోగూడా లక్షలమంది దరిద్రులు ఉన్నారు.

## వలసదేశాల్లోనూ అర్ధవలసదేశాల్లోనూ అధికజనాభా సమస్య

చైనాదేశంలోని అధికజనాభాను గురించి జర్మన్ అర్థశాస్త్ర పరిశోధనాసంస్థ ఇలా చెప్తోంది :-

"1925 కు సంబంధించిన లెక్కలప్రకారం స్వతంత్ర జీవనంమీద ఆధారపడి యున్న 30½ కోట్ల జనసంఖ్యలో 17 కోట్లమందికి మాత్రమే ఏదోరకం పనిఉన్నది. ఈలెక్కలు సుమారుగా ఇవ్వబడినలెక్కలే. అయినప్పటికి ఇతర విషయాలతోగూడా కలిపిచూస్తే, చైనా ప్రజలయొక్క జీవితప్రమాణం ఎంత హీనస్థితిలోఉన్నదీ, ఖార్చి కొను గోలుశక్తి ఎంత క్షీణతలోఉన్నదీ తెలుస్తుంది."

బూర్జువా పరిశోధకుడైన సోనీ లెక్కలప్రకారం (1932 లో తయారు చేయబడినాయి) ఇండియాలో పల్లెలలో జీవనోపాధిలేక పట్టణాల్లోగూడా ఏపని దొరకకుండాఉండే దరిద్రుల మొత్తంసంఖ్య 11 కోట్లు. నిరుద్యోగంతో బాధపడే దరిద్రులసంఖ్య 10 కోట్లు ఉంటుందని నిరూపిస్తూ "ఇండియాలో పరిస్థితులను గురించి ఏమాత్రం తెలిసినవారైనా, మొత్తం జనాభాలో 3 వ వంతు సంఖ్య నిత్యదరిద్రంలో మునిగియున్నారని, కనీస జీవితావసరాలకైనా వారికి తక్షణనివారణ అవసరమని.... ఇండియాలో ఎక్కువమంది ఎల్లప్పుడూ కడుపునిండీ నిండకుండా కాలంగడుపుతున్నారని అంగీకరిస్తారు" అని సోనీ వ్రాశాడు. *

## జనాభా అభివృద్ధిలో తగ్గుదల

జనాభాఅభివృద్ధి సక్రమంగా జరుగుటలేదు. అభివృద్ధిలో తగ్గుదల కన్పిస్తుంది. అయినప్పటికీ నిరుద్యోగులసంఖ్య అపారంగా పెరిగిపోతున్నదంటే అర్థంఏమిటి ? సహజంగా వృద్ధికావలసిన శ్రమశక్తి తగ్గుతున్నప్పటికి నిరుద్యోగసమస్య తీవ్రమవుతున్నదని తెలుస్తుంది. జనాభాఅభివృద్ధిలో తగ్గులనుసూచించే లెక్కలు ఈక్రింద ఇవ్వబడినాయి. ప్రతి 1000 మందికి మరణాలకంటె జననాలు ఎంతహెచ్చో తెలియజేసే సంఖ్యలుఇవి.[1]

| సంవత్సరాలు | యునైటెడ్ స్టేట్స్ | ఇంగ్లండు, వేల్సు | జర్మనీ | ఫ్రాంసు |
|---|---|---|---|---|
| 1861—70 | — | — | 10.3 | 2.7 |
| 1871—80 | — | 15.1 | 11.9 | 1.7 |
| 1881—90 | — | 14 | 11.7 | 1.8 |
| 1891-1900 | — | 12.4 | 13.9 | .7 |
| 1901—10 | — | 12.4 | 14.3 | 1.2 |
| 1911—20[2] | — | 6.8 | 3.7 | -6.5 |
| 1921—30 | 9.3 | 5.9 | 7.7 | 1.8 |
| 1933 | 5.9 | 2.1 | 3.5 | .5 |
| 1935 | — | 3 | 7 | .5 |

* "భారతపరిశ్రమ — దానికి సంబంధించిన సమస్యలు" అనే గ్రంధాన్ని హెచ్. ఆర్. సోనీ 1932 లో బొంబాయినుంచి ప్రచురించాడు.

1. పైసంఖ్యలు ఆయాదేశపు వార్షిక పుస్తకాలనుంచి, ఇవ్వబడినాయి.

2. యుద్ధకాలంలో మరణించిన వారితోసహా.

## 2. శ్రమశక్తి క్షీణించుట (ప్రత్యక్షంగా, పరోక్షంగా)

### 1914-18 యుద్ధంలో నాశనమైన శ్రమశక్తి

| | |
|---|---|
| చంపబడినవారు | 99,98,771 |
| తీవ్రంగా గాయపడినవారు | 62,95,512 |
| కొంచెం గాయపడినవారు | 1,40,02,039 |
| యుద్ధఖైదీలు, కనపడనివారు | 59,83,600 |
| 1918 లో 'ఇన్‌ఫ్లుయెంజా' జ్వరంవల్ల మరణించినవారు | 1,10,00,000 |

1914-18 ప్రపంచ యుద్ధంలో జరిగిన నాశనమునకు 1918 తరువాత జరిగిన యుద్ధాలలోని నాశనాన్ని కలిపితే మొత్తం నాశనమైన శ్రమశక్తిని అంచనావేయ వచ్చును. 1918 తరువాత జరిగిన యుద్ధాల జాబితా తరువాత ఇవ్వబడింది.

### సామ్రాజ్యవాదుల నిర్బంధాలకు గురియైనవారు (1925—35)

| | |
|---|---|
| అరెస్టుచేయబడినవారు | 51,87,000 |
| గాయపడ్డవారు | 38,20,000 |
| మరణించినవారు | 34,09,000 |
| ఉరిదీయబడినవారు | 2,43,000 |
| శిక్షలు వేయబడినవారు | 3,19,000 |
| మొత్తం | 1,29,78,000 |

### పెరిగిపోతున్నదరిద్ర ఫలితం - శ్రమశక్తియొక్క నశింపు

జర్మనీ

జాతిసమితియొక్క ఆరోగ్యశాఖచే నియమించబడిన ఒకకమిటీ నిరుద్యోగులపరిస్థితిని గురించి విచారణజరిపింది. ఈకమిటీతయారుచేసినరిపోర్టుప్రకారం జర్మనీలోని నిరుద్యోగుల యొక్క దుర్భర పరిస్థితులు బయటపడినాయి. ఏదోకొద్దిగా దాచుకున్నందువల్లగాని, లేక తమ బంధువులయొక్క సహాయంకొద్దిగాఉండుటవల్లగాని 1931 వరకు జర్మన్‌లోని నిరుద్యోగులు ఏదోవిధంగాకాలంగడిపారు. 1931 తరువాత వారిపరిస్థితివిషమించి క్షీణతప్రారంభమయింది. "ఆహారం సరిగాలేక అనేకజబ్బులు ఆరంభమైనాయి. పిల్లలు సరిగా పెరుగకపోవుట, రక్తహీనత, కామిర్లు, ఏటికపాము (టేప్ వరమ్ జబ్బు) పబ్బు సప్లయి తగ్గించుటవల్ల అత్యుత్రత హెచ్చిదంత జబ్బులు, నరరోగాలు బయలుదేరినాయి. బెర్లిన్‌పట్టణంలోని కార్మికపేటలలో నిరుద్యోగుల పిల్లల విషయం చెప్పనవసరంలేదు. మామూలుగా ఉండవలసిన బరువు, ఎత్తు లేక క్షయ, చర్మరోగాలు, అంగవైకల్యం బయలుదేరే సూచనలుకన్పడ్డ.... క్రూట్జ్‌బర్గ్ ఆస్పత్రికివచ్చిన నిరుద్యోగులు కొన్ని నెలలలోనే 7 నుంచి 10 పౌనులబరువును కోల్పోయారు"

గెల్సెన్‌కిర్షన్ అను ఊళ్ళోజరిపిన విచారణ ప్రకారం క్షయరోగం వల్ల బాధపడు తున్నపిల్లలయొక్క సంఖ్య ఒక్క 1931 లోనే నూటికి 38 వంతున ఎక్కువయింది.

బ్రి ట న్

బ్రిటన్‌లో 1932 సంవత్సరంలో 1000 కి 65 చొప్పున శిశుమరణాలు సంభవించి నాయి. కార్మిక పేటలలో ఈ సంఖ్యఇంకా చాలా ఎక్కువగాఉన్నది. ఈ క్రిందిసంఖ్యల వల్ల ఈ విషయం బోధపడుతుంది.

1932 లో శిశు మరణాలు (1000 మందికి)

| | | | |
|---|---|---|---|
| గ్లాస్గో | | లీడ్స్ | |
| డాల్‌మర్‌నాక్ | 127 | పశ్చిమవీధి | 137 |
| కాల్టన్ | 140 | అయిలెన్‌సందు | 141 |
| ఎక్స్ఛేన్జ్ | 150 | లండన్ | |
| లివర్‌పూల్ | | బెత్‌నాల్‌గ్రీన్ | 88 |
| ఎక్ఛేంజ్ | 117 | పాడింగ్‌టన్ | 116 |
| ఆబర్‌క్రాంబీ | 133 | సెయింట్‌పాన్‌క్రాస్ | 139 |

లండన్‌లో ఒక కార్మికవర్గ పేటలో (బెర్‌మాన్డ్‌సే) ఒక బహిరంగ సమావేశంలో మాట్లాడుతూ ఫీల్డ్‌మార్షల్ (సైన్యాధిపతి) లార్డ్ మిల్నీ ఈవిధంగాచెప్పాడు. "సైన్యంలో చేరుటకు ప్రస్తుత నిబంధనలన్నీ పూర్వంవాటికంటె తక్కువ కఠినంగా ఉన్నాయి. (ఎత్తు. బరువు మొదలైన విషయాల్లో) అయినప్పటికి ఈ నిబంధనలకు గూడా సరిపోనటువంటి యువకుల సంఖ్య చూస్తే నాకు ఆశ్చర్యం కల్గుతోంది. పిల్లల క్లబ్బులకు యజమానులుగా ఉన్న వారందరికి ప్రస్తుత కాలంలోని యువకులకు దేహదార్ఢ్యతలు లేక పోవుట చూస్తే ఆందోళన కల్గుతోంది. జాతి యొక్క దేహదార్ఢ్యత క్షీణిస్తోంది."

యునై టెడ్‌స్టేట్స్

1932 లో న్యూయార్క్ పట్టణ ఆరోగ్యశాఖవారు తయారుచేసిన లెక్కల ప్రకారం స్కూలుకువెళ్ళే వయస్సుగల పిల్లలలో 100 కి 22.1 మంది సరియైన ఆహారంలేక జబ్బు లతో బాధపడుతున్నారని తేలింది. 1927 లెక్కలతో పోల్చిచూస్తే పిల్లలలో రోగుల సంఖ్య 100 కి 55 వంతులు హెచ్చింది; తల్లితండ్రులకు ఆదాయం ఏమీలేకపోవుటవల్ల 1930 లో యునైటెడ్‌స్టేట్స్‌లో 61 లక్షల కంటె ఎక్కువమంది పిల్లలు చాలినంత ఆహారం లేక బాధ పడ్డారు. 1930 తరువాత ఈ సంఖ్య మరింత ఎక్కువయింది.

1929 తో పోల్చిచూస్తే సంక్షోభకాలమందు (1929-33) నిరుద్యోగులలోని రోగుల సంఖ్య 100 కి 55 వంతులు అధికమయిందని యునైటెడ్‌స్టేట్స్ ప్రభుత్వ ఆహారశాఖవారు తయారుచేసిన లెక్కలవల్ల తేలింది.

## ఆత్మహత్యల పెరుగుదల

| సంవత్సరం | ఆత్మహత్యల సంఖ్య | | | జనాభాలో 1 లక్షమందికి ఎన్ని ఆత్మహత్యలు ? | | | |
|---|---|---|---|---|---|---|---|
| | యునైటెడ్ స్టేట్స్ | బ్రిటన్ | జర్మనీ | యునైటెడ్ స్టేట్స్ | బ్రిటన్[3] | జర్మనీ మొత్తంజర్మనీ | జర్మనీ బెర్లిన్‌నగరం |
| 1913 | 9988 | 3791 | 15564[1] | 15.8 | 8.3 | 23.4[1] | 38.5 |
| 1925 | 12495 | 4531 | 15273[2] | 13.1 | 10.1 | 24.5[2] | — |
| 1929 | 16260 | 5529 | 16665 | 15.6 | 12.1 | 26.1 | 42.2 |
| 1932 | 20927 | 6314 | 18934 | 19.3 | 13.6 | 29.2 | 53.1 |
| 1934 | 19993[4] | 6148 | 18801 | 17.5[4] | 13.2 | 28.3 | — |

1. యుద్ధానికి పూర్వసరిహద్దులు
2. యుద్ధానంతర సరిహద్దులు
3. ప్రభుత్వ లెక్కలలోనుంచి ఇచ్చివ సంఖ్యలు
4. 1933

## ఉత్పత్తివేగాధిక్యతవల్ల క్షీణిస్తున్న శ్రమశక్తి

న్యూయార్కు పట్టణంలోనూ పరిసరప్రాంతాల్లోనూ, కార్మికుల పరిస్థితినిగురించి అమెరికన్ బూర్జువా అర్థశాస్త్రవేత్తయైన డాక్టర్ హెచ్. మేయర్-డాక్స్‌లాండర్ విచారణచేసి జాతిసమితియొక్క కార్మికశాఖకు ఒక రిపోర్టును పంపాడు. అందులో ఉదహరించిన విషయాలు :— పారిశ్రామిక వస్తువులను మోసుకొనివెళ్ళే యంత్రాలయొక్క వేగాధిక్యత ఎక్కువగుటవల్ల ప్రమాదములసంఖ్య, వృత్తిజబ్బులసంఖ్య హెచ్చిందని నిరూపించబడింది. (వృత్తిజబ్బు అంటే ఆ ప్రత్యేకపనిలో పనిచేస్తున్నందువల్లవచ్చే ప్రత్యేకజబ్బు) వేగాధిక్యత హెచ్చించుటవల్ల పెట్టుబడివిధానంలో సర్వసాధారణంగా కనిపిస్తున్న లక్షణంఇది. ఇంతేకాదు. పారిశ్రామిక కార్మికులలో మానసికవ్యాధులు (పిచ్చి మొదలైనవి) గూడా ప్రతిసంవత్సరం ఎక్కువగుతున్నవనిగూడా స్పష్టపడింది. 1920—1924 మధ్యకాలంలో న్యూయార్కు ప్రభుత్వమునకుచేరిన ప్రమాదములసంఖ్య 441830. అనగా సగటున సంవత్సరానికి 88366 ప్రమాదాలు సంభవిస్తున్నాయి. 1928 లో ఈసంఖ్య 95365 కు పెరిగింది. 1928 నాటికి న్యూయార్కురాష్ట్రంలో పరిశ్రమల వేగాధిక్యత నూటికి 85 వంతులు పెరుగుటయే దీనికి మూలకారణం. ఒక ప్రైవేట్ కంపెనీలో రిజిష్టర్‌చేయబడిన ప్రమాదాలసంఖ్య ఎలా పెరిగిందీ ఈక్రింది సంఖ్యలు తెలియజేస్తాయి.

| సంవత్సరం | ప్రమాదముల సంఖ్య | నరాలశక్తి పూర్తిగా క్షీణించినవారు | పిచ్చిఎక్కిన వారిసంఖ్య |
|---|---|---|---|
| 1926 | 2535 | 696 | 39 |
| 1927 | 2553 | 768 | 35 |
| 1928 | 2693 | 870 | 40 |
| 1929 | 2931 | — | 55 |

మరొక ఉదాహరణ. ఒక ఫ్యాక్టరీలో 3000 మంది కార్మికులు పనిచేస్తారు. ఆఫ్యాక్టరీలోగూడా జబ్బులు, ప్రమాదాలు, నరపటుత్వం పూర్తిగాక్షీణించుటవల్ల పతనమగుట — అన్నీ జరుగుతూనేఉన్నాయి. మొత్తం ప్రమాద, జబ్బులసంఖ్యలో నరపటుత్వం పూర్తిగా క్షీణించినవారి సంఖ్య నూటికి ఎన్నోవంతో ఈక్రింది సంఖ్యలు తెలియజేస్తాయి :—

| సంవత్సరం | 1926 | 1927 | 1928 | 1929 |
|---|---|---|---|---|
| నరాలపటుత్వం క్షీణించినవారు | 12 | 18 | 29 | 34 |

మరొక ఫ్యాక్టరీ. అందులో 1200 మంది ఆడపిల్లలు పనిచేస్తున్నారు పనిలో చేరే టప్పుడు వారిలో 312 మందికి కంటిఅద్దాలు (కంటి జబ్బుకై) ఉండేవి. 1 సంవత్సరం తరువాత కంటి అద్దాలవారిసంఖ్య 731 అయింది!

పనిలో వేగాధిక్యతవల్ల పారిశ్రామిక కార్మికులు రోజురోజుకు నిస్సారులైపోతున్నా రని, అందులోగూడా పురుషులకంటె స్త్రీలు మరీఎక్కువగా బాధపడుతున్నారని రిపోర్టు చివరిభాగంలో చెప్పబడింది.

జర్మనీ వైద్యశాస్త్రజ్ఞుల సంస్థయొక్క 1930 రిపోర్టులో ఈవిధంగా చెప్పబడింది: "నిరుద్యోగభీమా చేసుకున్న కార్మికుల ఆరోగ్యపరిస్థితి క్షీణించుటకు ముఖ్యకారణం ఏమిటి? ఉత్పత్తి వేగాధిక్యత ఎక్కువగుటవల్ల. శ్రమశక్తిని ఎక్కువ తీవ్రంగా వ్యయం చేయుటవల్ల త్వరగా దుర్బలులై జబ్బులకు గురిఅవుతున్నారు. పరిశ్రమలయొక్క వేగాధి క్యత ఎక్కువగుటవల్ల, ప్రధానంగా కార్మికునియొక్క నరములపటుత్వం క్షీణించి అనేక రకాల మానసికజబ్బులు కల్గుతున్నాయి."

శ్రమశక్తి ఎక్కువవేగముగా వినియోగించబడుటవల్ల, జర్మనీలో ప్రమాదాలు నూటికి ఎన్నిరెంతులు ఎక్కువైనవో క్యుజిన్స్కీ ఈక్రింది సంఖ్యలవల్ల తెలియ జేస్తున్నాడు:—

| 1924 | 1925 | 1926 | 1929 |
|---|---|---|---|
| 6 | 7 | 9 | 10 |

## 3. నిరర్ధకమైన శ్రమశక్తియొక్క పెరుగుదల

పరిశ్రమలలో పనిచేసే కార్మికులసంఖ్య తారతమ్యంగా ఎలా తగ్గిపోతున్నదో చూద్దాం.

బ్రిటన్‌లో పరిశ్రమాభివృద్ధితోపాటు కార్మికులసంఖ్య తగినంతగా పెరుగుటలేదనీ, తారతమ్యంగా పడిపోతున్నదని నిరూపించుటకు అవసరమైన లెక్కలను ఇదివరకే ఉదహరించాం. జర్మనీ, యునైటెడ్‌స్టేట్స్ దేశాలలోగూడా యుద్ధానంతరం (1918 తరువాత) సరిగా ఇదే సంభవించిందని ఈక్రింది లెక్కలవల్ల తెలుస్తుంది.

యునైటెడ్ స్టేట్స్

| సంవత్సరం | జనసంఖ్య | పరిశ్రమలలోని కార్మికుల సంఖ్య | జనసంఖ్యలో నూటికి ఎన్నివంతులు |
|---|---|---|---|
| 1899[1] | 748 లక్షలు | 47 లక్షల 10 వేలు | 6.3 |
| 1914[1] | 979 ,, | 70 ,, 20 ,, | 7.2 |
| 1914[2] | 979 ,, | 69 ,, | 7 |
| 1919[2] | 10౨0 ,, | 90 ,, | 8.6 |
| 1929[2] | 1215 ,, | 88 ,, 40 ,, | 7.3 |
| 1933[2] | 1257 ,, | 60 ,, 60 ,, | 4.8 |

జర్మనీ

| సంవత్సరం | జనసంఖ్య | పరిశ్రమలలోని కార్మికులసంఖ్య | జనసంఖ్యలో నూటికి |
|---|---|---|---|
| 1895 | 5 కోట్ల 20 లక్షలు | 55 లక్షలు | 10.6 |
| 1907 | 6 ,, 20 ,, | 79 ,, | 12.7 |
| 1925 | 6 ,, 24 ,, | 94 ,, | 15.1 |
| 1928 | 6 ,, 36 ,, | 87 ,, | 13.7 |
| 1933 | 6 ,, 52 ,, | 57 ,, | 8.8 |

1928 కి చెందిన సంఖ్యలు ఫ్యాక్టరీ ఇన్‌స్పెక్టర్ల రిపోర్టులలోనుంచి తీసుకొనబడినాయి. 5 గురు కార్మికులకంటె తక్కువ పనిచేసే చిన్న చిన్న పరిశ్రమలలోని సంఖ్యలను వాటికి కలిపాం. మిగిలిన సంవత్సరాలకుచెందిన సంఖ్యలన్నీ ప్రభుత్వ జనాభా లెక్కలలోనుంచి ఇవ్వబడినాయి. 1895, 1907 కు ఇవ్వబడిన సంఖ్యలు ఆ క్రిందటి సంవత్సరాల్లోని సరిహద్దులప్రకారం అంచనా వేయబడిన సంఖ్యలు. 1925, 33 కు ఇవ్వబడిన సంఖ్యలు ప్రస్తుత జర్మన్ సరిహద్దులకు (సార్‌రాష్ట్రం మినహా) చెందినవే.

## పంపకపు పన్నులలోనూ, ఇంటిపనులలోనూ ఉన్న కార్మికుల తారతమ్య సంఖ్యలో పెరుగుదల

యుద్ధానంతర పరిశ్రమలలో ఉత్పత్తిరంగంలో లాభకరంగా పనిచేస్తున్నవారి సంఖ్య క్రమేణా ఎలా క్షీణిస్తున్నదో ఇంతవరకూ చూచాం. అయితే ఆవార, పంపకరంగంలోనూ, ఇంటిపనుల విషయంలోనూ పనిచేసేవారిసంఖ్య పెరుగుతోంది. ఈక్రింది లెక్కలన్నీ ఈవిషయాన్ని రుజువుచేస్తాయి.

1. 500 డాలర్లకుపైగా విలువగల్గిన సరుకులను ఉత్పత్తిచేయు పరిశ్రమలలో.
2. 5000 డాలర్లకుపైగా విలువకల్గిన సరుకులను ఉత్పత్తిచేయు పరిశ్రమలలో.

| వృత్తి | (సంఖ్యలు వేలలో) | | | (నూటికి ఎన్ని వంతులు) | | |
|---|---|---|---|---|---|---|
| | 1910 | 1920 | 1930 | 1910 | 1920 | 1930 |
| వ్యవసాయం. అడవులు. చేపలు పట్టుట. | 12630 | 10936 | 10723 | 33.1 | 26.3 | 21.9 |
| గనులు. మాన్యుఫాక్చర్. | 11622 | 13922 | 15095 | 30.5 | 33.5 | 30.9 |
| సరఫరాశాఖ. రాకపోకలశాఖ. | 2665 | 3097 | 3843 | 7 | 7.4 | 7.9 |
| మొత్తం ఉత్పత్తి రంగంలో పనిచేస్తున్నవారి సంఖ్య. | 26317 | 27955 | 29661 | 70.6 | 67.2 | 60.7 |
| టీచర్లు. డాక్టర్లు. లాయర్లు. మొదలైన వృత్తులు. | 1711 | 2171 | 3254 | 4.5 | 5.2 | 6.7 |
| వాణిజ్యం. బ్యాంకింగు వగైరా.... | 6352 | 7369 | 10107 | 14 | 17.7 | 20.7 |
| ఇంటిపనులు వ్యక్తిగతసేవచేసేవారు. | 3756 | 3380 | 4952 | 9.8 | 8.1 | 10.1 |
| ప్రభుత్వ ఉద్యోగాల్లో. | 431 | 739 | 856 | 1.1 | 1.8 | 1.8 |
| ఉత్పత్తిరంగంలో గాకుండా ఇతర వృత్తులలో పనిచేసేవారి మొత్తంసంఖ్య. | 9539 | 11488 | 15915 | 24.9 | 27.6 | 32.6 |
| మొత్తం లాభకరమైన వృత్తులలో నిమగ్నులై ఉన్నవారిసంఖ్య. | 38167 | 41614 | 48838 | 100 | 100 | 100 |

బ్రిటన్ : నిరుద్యోగ భీమాచేసుకున్నవారిలో ఉత్పత్తి రంగాల్లో ఎంతమంది, అనుత్పత్తి రంగాల్లో ఎంతమంది ?

| వృత్తి | (వేలలో) | | | (నూటికి ఎంత మంది) | | |
|---|---|---|---|---|---|---|
| | 1923 | 1929 | 1933 | 1923 | 1929 | 1933 |
| ఉత్పత్తిరంగాల్లో(పరిశ్రమలు, బిల్డింగ్, సరఫరా) | 7879 | 7927 | 7110 | 77.6 | 73.4 | 69.2 |
| అనుత్పత్తి రంగాల్లో (వాణిజ్యం, బ్యాంకింగ్) | 2272 | 2875 | 3165 | 22.4 | 26.6 | 30.8 |
| మొత్తం | 10151 | 10802 | 10275 | 100 | 100 | 100 |

ఉత్పత్తి రంగాల్లో సంఖ్య క్రమేణా తగ్గిపోతుంటే, ఆవార అనుత్పత్తి రంగాల్లో వారి సంఖ్య క్రమేణా పెరుగుతోంది.

జర్మనీ: ఉత్పత్తిరంగం; వాణిజ్యం, బ్యాంకులు, ఇంటిపనులు మొ॥ అనుత్పత్తిరంగాల్లోపనిచేస్తున్నవారి సంఖ్యలు

| వృత్తి | (వేలలో) | | | (నూటికి ఎంతమంది) | | |
|---|---|---|---|---|---|---|
| | 1907 | 1925 | 1933 | 1907 | 1925 | 1933 |
| పరిశ్రమలలో | 9839 | 12693 | 8499 | 78 | 75.9 | 68.2 |
| వాణిజ్యం, బ్యాంకింగ్, భీమా, హోటళ్లు వగైరా | 2776 | 4032 | 4205 | 22 | 24.1 | 31.8 |
| మొత్తం | 12615 | 16725 | 13204 | 100 | 100 | 100 |

ఉత్పత్తిరంగాల్లో తగ్గిపోతుంటే, అనుత్పత్తిరంగాల్లో సంఖ్య విపరీతంగా ఎక్కువవుతోంది.

జర్మనీ : 5 గురికంటె ఎక్కువమందిని పనిలోపెట్టుకున్న వాణిజ్య, బ్యాంకింగ్ సంస్థలలోనూ, గృహకృత్యములుచేసే సేవకులసంఖ్య పెరుగుతోంది.

| వృత్తి | (వేలలో) | | (నూటికి) | |
|---|---|---|---|---|
| | 1928 | 1932 | 1928 | 1932 |
| పరిశ్రమలు | 9073 | 5191 | 87.9 | 82.5 |
| వాణిజ్యం, బ్యాంకింగ్, భీమా, హోటళ్ళు | 1254 | 1098 | 12.1 | 17.5 |
| మొత్తం | 10327 | 6289 | 100 | 100 |

# 4. ఉత్పత్తిపెరుగుదల క్షీణించుట

(మొత్తం పారిశ్రామిక ఉత్పత్తిలో నూటికి ఎన్నివంతులు క్షీణిస్తున్నదీ ఈక్రింది సంఖ్యలు తెలియజేస్తాయి.)

| సంవత్సరం | యునైటెడ్ స్టేట్స్ | బ్రిటన్ | జర్మనీ | ఫ్రాన్సు | మొత్తం పెట్టుబడిదారీ ప్రపంచం[1] | పరిశ్రమ, వ్యవసాయాల్లో ప్రపంచ ఉత్పత్తిసూచిక |
|---|---|---|---|---|---|---|
| 1897–1913 (16 సం) | +100 | +35.1 | +79.5 | +58.7 | +81.8 | +68.2 |
| 1913–1929 (16 సం) | +69.8 | — .9 | +3[2] | +38 | +42.6 | +31.1 |
| 1929–1933 (4 సం) | —35.1 | —11.8 | —31.3 | —22.9 | —28.8 | — |

\+ పెరుగుదలను, — క్షీణతను సూచిస్తాయి.

1. 1897–1913 మధ్యలో మొత్తం ప్రపంచసంఖ్యగా పరిగణించాలి.
   1913–1933 మధ్యలో సోవియట్ యూనియన్ మినహా మిగిలిన కాపిటలిస్టు ప్రపంచసంఖ్యగా పరిగణించాలి.
2. యుద్ధానంతర సరిహద్దులతోగూడిన జర్మనీ సంఖ్యఇది.

ముఖ్యపరిశ్రమలలో ప్రపంచఉత్పత్తి నూటికి ఎన్నివంతులు తగ్గిపోతున్నదీ ఈ క్రింది సంఖ్యలు తెలియజేస్తాయి.

| సంవత్సరం | బొగ్గు | ఇనుము | ఉక్కు | నౌకానిర్మాణం | బట్టల పరిశ్రమ |
|---|---|---|---|---|---|
| 1897—1913 (16 సం) | +112 | +139.6 | +254.1 | +150.4 | +64.7 |
| 1913—1929 (16 సం) | +15.8 | + 27.3 | + 61.6 | — 17.1 | + 8.8 |
| 1929—1933 (4 సం) | —31.4 | — 57.5 | — 47.4 | — 82.4 | —18.1* |

* 1929—31

# 5 టెక్నికల్ అభివృద్ధి క్షీణించుట

పెట్టుబడివిధానం క్రింద టెక్నికల్ అభివృద్ధిఅతివేగముగా జరిగినందువల్లఉత్పత్తిలో అభివృద్ధి లేకపోగా క్షీణత ఏర్పడుతోంది. పెట్టుబడి విధానంబాగా అభివృద్ధి అయిన దశలో బాహుళ్యమైన గుత్తవ్యాపారం (మొనాపలీ విధానం) బయలుదేరుతుంది. ఈ గుత్త వ్యాపార లక్షణాల్లో ఒకటి ఉత్పత్తిలో క్షీణత - అని లెనిన్ చెప్పాడు. స్థిరమైన పెట్టుబడి (ఫ్యాక్టరీలు, యంత్రాలు మొదలైన పెట్టుబడిలో స్థిరమైన భాగం) యొక్క శక్తికి తగినంతగా పనికల్పించకపోవుట ఈ క్షీణతకు ఒకప్రధానకారణం. అనగా ఫ్యాక్టరీలను యంత్రాలను.... పూర్తిగా వినియోగించలేక పోవుట జరుగుతున్నదన్నమాట.

ఘనవత్తిడి బాయిలర్లు : ఈనాడువిద్యుచ్ఛక్తి ఉత్పత్తికేంద్రాలన్నీ తమశక్తికిఎంతో తగ్గిపనిచేస్తున్నందువల్ల ఘనవత్తిడి బాయిలర్లను ఉపయోగించుట అనవసరమవుతోంది. ఈ సందర్భంలో ప్రొఫెసర్ మ్యూన్జింగర్ చెప్పిన మాటలు గుర్తించతగినవి : "జర్మన్ విద్యుచ్ఛక్తి కేంద్రాల పరిస్థితి ఎలాఉంది ? నూటికి 9 వంతులు పెట్టుబడిని హెచ్చించుట వల్ల బాయిలర్లయొక్క ప్రస్తుత వాతావరణ వత్తిడిని 5 రెట్లు హెచ్చించి దానిద్వారా విద్యుచ్ఛక్తి ఉత్పత్తికయే ఖర్చును నూటికి 15 వంతులు తగ్గించవచ్చును. కానివిద్యుచ్ఛక్తి ఉత్పత్తికేంద్రాలన్నీ ఈ రోజున తమశక్తికి ఎంతో తగ్గిపనిచేస్తున్నాయి. అందువల్ల బాయిలర్ల వత్తిడిని ఎక్కువచేయుటకు అనగా ఘనవత్తిడి బాయిలర్లను ఉపయోగించుటకు సాధ్యమగుటలేదు"

మరొకచక్కటి ఉదాహరణ చూడండి. 'డోగ్లస్‌లామాంత్' అనే పరిశోధకుడు ఒక కొత్తరకం ఘనవత్తిడి బాయిలర్ను కనిపెట్టాడు, ఇంజనీయరింగ్‌లో నిపుణులగు ప్రొఫెసర్ ఇబర్లే, డుహర్ట్ మొదలైనవారు ఈ కొత్తరకం బాయిలరు అన్నిబాయిలర్లకంటె శ్రేష్టమైనదని అంగీకరించినప్పటికి, బాయిలర్ల నిర్మాణ విషయంలో డోగ్లస్‌లామాంత్ గొప్పవిప్లవకరమైన మార్పులు తీసుకొనివచ్చినప్పటికి, యూరపుఖండంలో పెద్దపెట్టుబడి దారులలో కొందరు ఈ కొత్తరకం బాయిలర్లను తయారుచేయుటకు అవసరమైన హక్కులను సంపాదించుకున్నప్పటికీ, యదార్థంగా ఈ నూతన బాయిలర్లను తయారుచేసే విషయంలో ఇంతవరకూ జరిగిందేమీలేదు, పాతరకం బాయిలర్లతో ఉత్పత్తిచేస్తున్న పెట్టుబడి దార్లకు దెబ్బతగులుతుందనే భయంవల్ల, ఆర్థిక సంక్షోభ పరిస్థితులలో నూతన బాయిలర్ల ఉత్పత్తివల్ల కొద్దిపాటినష్టం రావచ్చుననే భయంవల్ల పెద్దపెద్ద పెట్టుబడిదారులుగూడా కొత్తరకంబాయిలర్లను తయారుచేయుటలేదు. ఇవేకావు. ఇలాంటి నూతన పరిశోధనలెన్నో ఈ విధంగా నిరుపయోగంగా ఉండిపోతున్నాయి."

విద్యుచ్ఛక్తి ఉత్పత్తిసంపకాలను కేంద్రీకరించుటకు అవసరమైన టెక్నికల్ వివరాలన్నీ నిర్ణయించబడినాయి. ఘనవత్తిడి సూత్రాలను వర్తింపజేయుటవల్ల ఘనవత్తిడి బాయి

ల్ల సహాయంద్వారా ఈ కేంద్రీకరణ సాధ్యపడుతుంది. కాని పెట్టుబడి విధానంక్రింద సాధ్యమగునట్లు కన్పించుటలేదు. ఎందుకంటే ఈ కేంద్రీకరణను వ్యతిరేకిస్తూ పారిశ్రామిక నిర్మాతలు ప్రకటనలు చేస్తున్నారు. అటువంటి ప్రకటనలకు ఈక్రింది ఉదాహరణలను చూడండి :—

(అ) కేంద్రీకరణను వ్యతిరేకిస్తూ జర్మనీలో 1931-32 సంవత్సరాల్లో పెద్దచర్చలు జరిగినాయి. 'ETZ' (ఎట్జ్) అను పత్రికలో ఈవైఖరి వెల్లడిఅయింది. 1929 లో ఆర్. ఫ్రాంక్, ష్రేడర్, బ్లాక్ లు వ్రాసిన వ్యాసాలుగూడా దీనికి దృష్టాంతరాలుగా ఉన్నాయి. ఈపత్రికలలోనూ, వ్యాసాలలోనూ, కేంద్రీకరణను వ్యతిరేకిస్తూ సూచించబడిన ప్రధాన కారణంఏమిటి? వ్యక్తిగత పెట్టుబడిదారులకు నష్టం సంభవిస్తుందనే సుమా!

(ఆ) N. E. L. A. సంస్థయొక్క వార్షికసమావేశంలో ఫిలడెల్ఫియా ఎలక్ట్రిక్ కంపెనీ అధ్యక్షుడైన H V. లివర్ సిడ్జ్ రిపోర్టుఇస్తూ, కేంద్రీకరణవల్ల పెద్దఎక్కువ విశాలప్రాంతానికి విద్యుచ్ఛక్తి సప్లయికాలేదని, బహుశా ఇప్పుడున్న ఏరియా గూడా తగ్గవచ్చునని చెప్తూ కేంద్రీకరణ విధానాన్ని వ్యతిరేకించాడు.

సమ్మెలు ఎక్కువకావచ్చునని, మిలటరీ ఆవశ్యకత ఎక్కువవుతుందని భయపడి ఈ విధంగా వీరందరూ కేంద్రీకరణను ప్రతిఘటిస్తున్నారు. కేంద్రీకరణను వ్యతిరేకించుటకు ఇవేప్రధాన కారణాలు. ఉదాహరణకు జి. డినే ఇలా వ్రాస్తున్నాడు. "విద్యుచ్ఛక్తి ఒకే కేంద్రంలో ఉత్పత్తిచేయుటవల్ల, ఎక్కువ ఏరియాలో విద్యుచ్ఛక్తిని సప్లయిచేసేబాధ్యత ఎవరో కొద్దిమంది వ్యక్తులమీదపడుతుంది. అందువల్ల యుద్ధకాలంలోగాని. సమ్మెలు మొదలైన తిరుగుబాట్లు జరిగినప్పుడుగాని ఉత్పత్తి ఆగిపోయినయెడల పెద్దపెద్ద పారిశ్రామిక కేంద్రాలకు విద్యుచ్ఛక్తి సప్లయి ఆగిపోవచ్చును"

రైల్వేలను విద్యుచ్ఛక్తితో నడిపేపద్ధతి ఇంకా ప్రథమదశలోనే ఉన్నదని ఈక్రింది సంఖ్యలవల్ల తెలుస్తుంది. 1936 లో నూటికి ఎన్ని రైల్వేలు విద్యుచ్ఛక్తి సహాయంవల్ల నడుపబడేది తెలియజేయు సంఖ్యలు ఇవి :—

| | |
|---|---|
| యునైటెడ్ స్టేట్స్ | 1.1 |
| బ్రిటన్ | 3.9 |
| జర్మనీ | 4.1 |
| ఫ్రాన్సు | 6.1 |
| పశ్చిమయూరప్ మొత్తం | 4.5 |

బొగ్గు, జలాధారములు సమృద్ధిగాలేని ఇటలీ, స్వీడెన్, స్విట్జర్లండు దేశాలలో మాత్రం రైల్వేలు ఎక్కువగా విద్యుచ్ఛక్తి సహాయంతో నడుపబడుతున్నాయి. ఇటలీలో నూటికి 21.1 వంతులు (4846 కిలోమీటర్లు పొడవుగల్గినవి) స్వీడెన్ లో 14.6 వంతులు

(2450 కిలోమీటర్లు) స్విట్జర్లండులో 71.1 వంతులు (2081 * కిలోమీటర్లు) రైల్వేలు విద్యుచ్ఛక్తి సహాయంతో నడుపబడుతున్నాయి.

రైల్వేలు ఎక్కువగా విద్యుచ్ఛక్తి సహాయంతో నడపకపోవుటకు కారణాలు పరిశీలిద్దాం.

రైల్వేలను విద్యుచ్ఛక్తి సహాయంతో నడుపుటనుగురించి సమగ్రంగా పరిశీలించుటకు బ్రిటన్‌లో ప్రభుత్వంచే నియమించబడిన కమిటీ 1930 లో తనరిపోర్టును ప్రకటించింది. ఈకమిటీ 20 సంవత్సరాలమీద అమలుచేయుటకు ఒక కొద్దిపాటి ప్లానును సూచించింది. దానికే పెద్ద ఆందోళనబయలుదేరి, ముఖ్యంగా బొగ్గుయజమానులు, రవానా యజమానులు తీవ్రంగా ఆప్లానును ప్రతిఘటించారు. వీరిలో ఒక నాయకుడైన రాబర్ట్ స్మిత్ యొక్క నిరసన, భయంకరమైనది. 'ఆధునిక రవానాపద్ధతులు' అను పత్రికలో వరుసగా వెలువడిన వ్యాసాలే ఈ ప్రతిఘటనకు నిదర్శనాలు. అయితే రైల్వేలను విద్యుచ్ఛక్తి సహాయంతోనడుపుటకు వీరుసమ్మతించకపోవుటకు చెప్పబడినకారణాలు కొన్నిచూద్దాం :—

(1) విద్యుచ్ఛక్తికేంద్రాలు తయారైతే ఆవిరియంత్రముల సహాయంతో నడుపబడే రైల్వేలన్నీ దెబ్బతింటాయి. అందువల్ల బొగ్గు అమ్మకం చాలావరకూ పడిపోతుంది.

(2) బొగ్గుసప్లయి పడిపోవుటవల్ల రైల్వేలద్వారా జరిగే రవానావ్యాపారం దెబ్బతింటుంది. (బ్రిటిష్‌రైల్వేల ఆదాయంలో దాదాపు మూడోవంతు బొగ్గురవానావల్లవస్తోంది)

(3) అందువల్ల ఎక్కువ మంది కార్మికులు అవసరం లేక, నిరుద్యోగ సమస్య ఎక్కువవుతుంది.

(4) సమ్మెలభయం.

(5) యుద్ధాలభయం.

"దేశరక్షణ దృక్పథాన్నుంచి చూస్తే, విద్యుచ్ఛక్తివల్ల నడిచే రైల్వే విధానాన్ని విదేశ శత్రువులుగాని లేక దేశంలోనే అసంతృప్తిచెందిన కార్మికులుగాని సులభంగా ధ్వంసంచేయగలరు. అదికాకుండా అక్కడక్కడా ఉండే ఆవిరి కేంద్రములద్వారా రైల్వేలను నడిపినయెడల అంత ప్రమాదం ఉండదు. ఇది గుర్తించదగిన ముఖ్యకారణాలలో ఒకటి."

## గనులలో బొగ్గును వాయువుగాతయారుచేయుట ;

1890 ప్రాంతాల్లోనే ఇది సాధ్యపడుతుందని సర్. విలియమ్‌రామ్సే అను శాస్త్రజ్ఞుడు నిరూపించినా, లెనిన్ చెప్పినట్లుగా, ఇంతవరకూ పెట్టుబడి దేశాల్లో ఎక్కడా ఇది ఆచరణలోకి రాలేదు.

* కిలోమీటర్ 4 ఫర్లాంగుల 213 గజాల 2 అంగుళాలకు సమానం.

## బర్గియస్ పద్ధతిద్వారా బొగ్గును ద్రవరూపంలోకి మార్చుట:

ఈపద్ధతిగూడ ఎపుడో చాలాకాలంక్రిందనే కనిపెట్టబడినప్పటికీ, యుద్ధానంతరదశలోగూడ విరివిగా ఆచరణలోకిరాలేదు. పేటెంట్ వస్తువులనుగు తకుతీసుకొనుట, నూనెకంపెనీల యజమానులయొక్క వ్యతిరేకతయేదీనికి కారణాలు. బర్గియస్ పేటెంట్స్‌ను విరివిగామలుజరపకుండా స్టాండర్డ్ ఆయిల్ కంపెనీకి, జర్మన్, ఐ. జి. ఫార్బెన్ పరిశ్రమాధికార్లకుజరిగిన ఒడంబడికయే దీనికి నిదర్శనం. ప్రపంచ ఆర్థిక సంక్షోభదశలో మాత్రం యుద్ధ సన్నాహాల సందర్భంలో బర్గియస్ పద్ధతిద్వారా కృత్రిమంగా సొలైన్ తయారుచేయుటకు కొంత ప్రోత్సాహంవచ్చింది.

## 6. ఉత్పత్తిసాధనాలను పూర్తిగా వినియోగించలేకపోవుట.

ఉత్పత్తి సాధనాలను పూర్తిగా వినియోగించకపోవుట పెట్టుబడి విధానంయొక్క ఒక శాశ్వతలక్షణంగా తయారైంది. పరిశ్రమలయొక్క మొత్తం ఉత్పత్తిశక్తిలో నూటికి ఎన్నివంతులు వినియోగించబడుతున్నది ఈక్రింది సంఖ్యలు తెలియజేస్తాయి.

| జర్మనీ | 1929 | 1932 |
|---|---|---|
| మొత్తం పరిశ్రమలన్నీ కలిసి | 67 | 36 |
| ఉత్పత్తి సాధనాల ఉత్పత్తి | 68 | 30 |
| వినియోగసాధనాల ఉత్పత్తి | 67 | 43 |
| ఇనుము, ఉక్కుల ఉత్పత్తి | 30 | 35 |
| ఇనుము మినహా ఇతర లోహాల ఉత్పత్తి | 78 | 35 |
| ఇంజనీయరింగ్ | 68 | 27 |
| బట్టల మిల్లులలో | 72 | 50 |
| సూపర్ ఫాస్ఫేట్స్ | 53 | 40 |
| వస్త్రజని పరిశ్రమ | 51 | 37 |
| **యునైటెడ్ స్టేట్స్** | **1929** | **1932** |
| బొగ్గు | 78 | 57 |
| ఉక్కు | 87 | 19 |
| రాగి | 78 | 19 |
| * మోటార్ పరిశ్రమ | 54 | 14 |
| పోర్ట్‌లాండ్ సిమెంట్ | 67 | 28 |
| కాగితం | 86 | 55 |
| వస్త్రజని | 68 | 30 |

* 1929-32 మధ్య మోటారు పరిశ్రమలన్నీ మొత్తం సంవత్సరానికి 1 కోటి మోటార్ కార్లను తయారుచేయగలవనే అంచనానుబట్టి ఇచ్చినలెక్కలు.

బ్రిటన్

| | 1929 | 1932 |
|---|---|---|
| ఇనుము (పిగ్) | 52 | 30 |
| ఉక్కు | 59 | 42 |
| గంధక ద్రావకం | 69 | 63 |
| వస్త్రజని | 67 | 66 |

ఫ్రాన్స్

| | 1929 | 1932 |
|---|---|---|
| సూపర్ ఫాస్ఫేట్స్ | 61 | 39 |
| వస్త్రజని | 45 | 41 |

ఇవన్నీ ప్రభుత్వములచేగాని, అనధికార బూర్జువాసంస్థలచేగాని తయారుచేయబడిన లెక్కలని జ్ఞాపకం ఉంచుకోవాలి. వీరందరూ కేవలం ఒకషిఫ్ట్‌తో ఎంతఉత్పత్తికాగలదో, దానితోపోల్చి ప్రత్యక్షంగా ఎంత తక్కువ ఉత్పత్తిజరుగుతున్నదో చూపించుటకు తయారు చేసిన లెక్కలుఇవి. అలాగాక 2 లేక 3 షిఫ్ట్‌లను లెక్కలోకి తీసుకొనిచూస్తే, ఉత్పత్తి పైన చెప్పబడినదానికంటె ఇంకా తగ్గిపోతున్నట్లు రుజువుకాగలదు.

## 7. శాశ్వత పెట్టుబడియొక్క నశింపు.

### మొదటి ప్రపంచ యుద్ధంలో

1914–18 యుద్ధంలో ఎంత విలువగల శాశ్వతపెట్టుబడి నాశనమయిందో సరిగా అంచనావేయబడలేదు. కాని చాలా ఎక్కువగా నాశనమయిందనే విషయం నిస్సందేహం.

### యుద్ధానంతరం

పెట్టుబడిదారీ విధానాన్ని అనుసరించే యూరపియన్ దేశాల్లోనూ, యునైటెడ్ స్టేట్స్‌లోనూ బట్టలపరిశ్రమలో ఎన్నిలక్షల కదుళ్లు ఎక్కువయినవో, ఎన్నితగ్గినవో ఈక్రింది సంఖ్యలు తెలియజేస్తాయి :

| | 1908—13 | 1924—28 | 1928—36 |
|---|---|---|---|
| బ్రిటన్ | +37 | +3 | —157 |
| జర్మనీ | +15 | +17 | —10* |
| యునైటెడ్ స్టేట్స్ | +45 | —23 | —74 |

* ఈసంఖ్య 1928—34 దశకు చెందినది.

1924–30 మధ్య యునైటెడ్‌స్టేట్స్‌లో 93 • బ్లాస్ట్‌ఫర్నేసులు నిర్మించబడినాయి. అయినప్పటికి ఇనుము (*పిగ్) యొక్క మొత్తం ఉత్పత్తిలో మార్పులేదు. కారణం? అదేసమయంలో 109 ఫర్నేసులకు స్వస్తిచెప్పడం గూడా జరిగింది!

అదేకాలంలో బ్రిటన్‌లోని బ్లాస్ట్‌ఫర్నేసుల యొక్క మొత్తం ఉత్పత్తిశక్తి సంవత్సరానికి 163 లక్షల టన్నులనుంచి 147 లక్షల టన్నులకు క్షీణించింది.

1929–1933 జూలై మధ్య యునైటెడ్‌స్టేట్స్‌లో 92 బ్లాస్ట్‌ఫర్నేసులు పనిచేయటం మానేసినాయి.

1930–1934 అక్టోబరు మధ్య బ్రిటన్‌లో 72 బ్లాస్ట్‌ఫర్నేసులు పనిచేయలేదు. అదే కాలంలో జర్మనీలో 28, ఫ్రాన్సులో 10 బ్లాస్ట్‌ఫర్నేసులు ఉత్పత్తివిధానం నుంచి తొలగించబడినాయి.

ఒక్క 1932 లోనే యునైటెడ్‌స్టేట్స్‌లో 40 లక్షల టన్నుల ఉత్పత్తిశక్తిగల ఉక్కు ఫర్నేసులు ఎత్తివేయబడినాయి.

అదేసమయంలో శాక్సనీలోని హార్టమాన్ ఇంజనీయరింగ్‌వర్క్సు ఎత్తివేయబడింది. బాగా ఉత్పత్తిజరిగిన రోజుల్లో దీనిలో 15000 కార్మికులు పనిచేసేవారు.

బ్రిటన్‌లో నేషనల్‌షిప్ బిల్డింగ్ సెక్యూరిటీస్ లిమిటెడ్ అను కంపెనీ ఒకదాన్ని పెద్దపెద్దనౌకానిర్మాణ సంస్థలన్నీ కలిసి ఏర్పాటుచేసినాయి.. 'అనవసరమైన' నౌకానిర్మాణ పరిశ్రమలను కొనేసి వాటిని దగ్ధంచేయుటయే ఈ సంస్థయొక్క ఆశయం!

వ్యాపారనౌకలు ఎంతఎక్కువగా ధ్వంసంచేయబడుతున్నవో ఈ క్రింది లెక్కలు తెలియజేస్తాయి. వ్యాపారనౌకలు భరించే టన్నులబరువులో ఈ లెక్కలు ఇవ్వబడినాయి.

ముఖ్యపెట్టుబడిదారీ దేశాలన్నిటిలో కలిసి (వేలటన్నులలో)

| | |
|---|---|
| 1913 | 87.7 |
| 1929 | 943 6 |
| 1930 | 848.5 |
| 1931 | 1018.2 |
| 1932 | 1346.1 |
| 1933 | 2115.2 |
| 1934 | 1740.9 |
| 1935 | 1151.3 |

• బ్లాస్ట్‌ఫర్నేస్:–ముడి లోహములను కరిగించే సాధనం.

* పిగ్ :–ముడియినుమును బ్లాస్ట్‌ఫర్నేసులో కరిగించగా వచ్చిన ఇనుము.

యునైటెడ్ స్టేట్స్‌లో వ్యాపారనౌకాశాఖ ఆజ్ఞప్రకారం 10 లక్షల టన్నుల బరువు మోయగల 124 నౌకలు తునకలు తునకలుగా చేయబడినాయి. అదేవిధంగా జర్మనీలో 4 లక్షలటన్నుల నౌకలను ధ్వంసంచేశారు.

## రైల్వేలైనులపొడవులో క్షీణత

యునైటెడ్ స్టేట్స్ మైళ్ళలో

| సంవత్సరం | కొత్తగాతయారైనవి | ధ్వంసంచేయబడినవి | మార్పు |
|---|---|---|---|
| 1929 | 666 | 475 | +191 |
| 1930 | 513 | 694 | –181 |
| 1931 | 748 | 795 | –47 |
| 1932 | 163 | 1452 | –1289 |
| 1933 | 24 | 1876 | –1852 |
| 1934 | 76 | 1995 | –1919 |
| 1935 | 45 | 1843 | –1798 |
| 1936 | 93 | 1519 | –1426 |

'రైల్వేయుగం' అను పత్రిక అంచనాలప్రకారం 1930-36 మధ్య నూతనంగా వేయబడిన రైల్వేలైనుకంటె 8500 మైళ్ళ ఎక్కువ పొడవుగల్గిన రైల్వేలైన్ ధ్వంసం చేయబడింది. అందువల్ల యునైటెడ్ స్టేట్స్‌లో 1936 లో ఉన్న రైల్వేలైన్‌యొక్క పొడవు చాలా తగ్గిపోయింది. 1910 తరువాత ఇంత తక్కువ రైల్వేలైన్ యునైటెడ్ స్టేట్స్‌లో ఎప్పుడూలేదు. అంతేకాదు. 1934 లోని రైల్వేలైన్ పొడవు 1916 లోని రైల్వేలైన్‌కంటె 13500 మైళ్ళ పొడవుతగ్గింది!

ప్రపంచ ఆర్థిక సంక్షోభదశలో శాశ్వత పెట్టుబడియొక్క నశింపునుగురించి గుర్తించ దగిన ముఖ్య లక్షణం ఒకటి ఉంది. అది ఏమిటంటే. సంవత్సరంమీద అవసరమైన అరుగుదల రిపెయిర్లను భర్తీచేసే నూతన శాశ్వత పెట్టుబడి పెట్టకపోవుటయే. ఉదాహరణానికి 1934 ప్రారంభంలో యునైటెడ్ స్టేట్స్ రైల్వేలలో 50 లక్షల టన్నుల పాతరైలుపట్టాలు మాత్రమే ఉన్నాయి. కాని అరుగుదలను భర్తీచేయుటకు మామూలుగా అప్పుడు 9 కోట్ల టన్నుల రైలు పట్టాలు అవసరం.

## 8. ప్రపంచ ఆర్థికసంక్షోభదశలో నిలవసరుకుల నాశనం.

యునైటెడ్ స్టేట్స్‌లో ధాన్యం :— గోధుమలు చాలా చవుకగా ఉండుటవల్ల గోధుమలను వంట చెరుకుగా ఉపయోగించి పబ్లిక్ స్కూళ్ళలో వేడిని తయారుచేయుటకు

నేబ్రాస్కాలోని కోల్ఫాక్స్‌జిల్లా విద్యాశాఖాధికారులు నిశ్చయించారు. (1932 సెప్టెంబరు 12 వ తేదీన మాంట్రియల్ గెజెట్‌లో ప్రచురించబడిన రిపోర్టు.)

ఫ్రాన్సులో చేపలు :— 100 కిలోగ్రాముల చేపలు 20 ఫ్రాంకుల చొప్పున కనీసపు ధరకు కొనుటకు కొనుగోలుదారులు నిరాకరించినందువల్ల పెద్ద చేపల నిల్వ దోర్నేరేపు పట్టణంలో సముద్రంలో పారవేయబడింది. (1933 మే 5 వ తేదీన హ్యూమనైట్ పత్రికలో ప్రచురించబడిన రిపోర్టు.)

చిలీలో గొర్రెలు :— చిలీలో 225000 గొర్రెలను చంపి, మాంసముగా ఎగుమతి చేయుటకు బదులు, పారిశ్రామిక ఉపయోగముకొరకు, గ్రీజ్‌గా తయారుచేయుట కొరకు వినియోగించబడినాయి. (1933 జూన్ 28 వ తేదీన డెయిలీవర్కర్ పత్రిక ప్రచురించిన రిపోర్టు.)

అర్జెంటీనాలో గొర్రెలు:—మాంసమునకు వూల్‌కు డిమాండులేనందువల్ల తోళ్ళను, కొవ్వును అమ్మినయెడల, గొర్రెలు కసాయిఇండ్లకు రవానాఅయే ఖర్చులుగూడా రావనే నెపంతో కొండ, పచ్చికప్రదేశాల్లో లక్షలాలక్షల ముసలిగొర్రెలు చంపబడినాయి. (విర్ట్‌షాఫ్ట్స డీన్ట్స పత్రిక 1933 జూలై 7 వ తేదీన ప్రకటించింది.)

బల్గేరియాలో ధాన్యం :—క్రానియోజినోస్ కంపెనీవారు ఎగుమతులకై కొన్న 6 వేల టన్నులధాన్యం, ధాన్యపుకొట్లలో మురిగిపోయింది, (ఇఖో పత్రిక 1933 నవంబరు 9 వ తేదీన ప్రకటించింది)

బ్రిటన్‌లో *హాప్స్ :—హాప్స్‌కమిషన్ విచారణకమిటీ ముందు కెంట్‌ప్రాంతంలోని స్టీవర్ట్‌మే అను రైతు ఈవిధంగా చెప్పాడు : ధరలు పెంచాలనే అభిప్రాయంతో 20 లక్షల పౌనుల విలువగల హాప్స్ 1926—29 మధ్య దగ్ధంచేయబడినాయి. (1933 సెప్టెంబరు 13 వ తేదీన మార్నింగ్‌పోస్టు పత్రిక ప్రకటించింది.)

యునైటెడ్‌స్టేట్స్‌లో ప్రత్తి :—4 కోట్లఎకరాల్లో వేయబడిన ప్రత్తిపంటలో 1కోటి 4 లక్షల 2 వేల ఎకరాలపంట దున్నివేయబడిందని యునైటెడ్‌స్టేట్స్ వ్యవసాయశాఖ రిపోర్టు తెలియజేస్తోంది. (1933 సెప్టెంబరు 14 వ తేదీన 'ప్రావదా' పత్రిక న్యూయార్క్‌టైమ్స్ పత్రికనుంచి ఉదహరించింది.)

బ్రెజిల్‌లో కాఫీ :—1933 సెప్టెంబరువరకు సుమారు 2 కోట్ల 20 లక్షలబస్తాల కాఫీ దగ్ధంచేయబడింది. ఇదిచాలక 1934 లో అయ్యే 3 కోట్లబస్తాల కాఫీలో 2 కోట్ల బస్తాల కాఫీని తగులబెట్టవలెనని సూచించబడుతోంది. (1933 సెప్టెంబరు 27 వ తేదీ 'డాయిచ్ఛె ఆల్‌గెమైనే సైటింగ్' పత్రిక ప్రచురించిన రిపోర్టు).

---

* హాప్స్ :—పానీయములకు నిషా కల్పించుటకు ఉపయోగించబడే మొక్కలు.

ఇంగ్లండులో నారింజపండ్లు :—1933 అగస్టులో 15 లక్షల స్పానిష్ నారింజపండ్లు సముద్రంలో పారవేయబడినాయి. (1933 అగస్టు 1 వ తేదీ 'ఎల్‌సోల్' అనుపత్రిక, 1933 అగస్టు 3 వ తేదీ 'ముందోబ్రెరో' పత్రిక ప్రకటనలు).

జెకోస్లోవేకియాలో హాప్స్ :—సాట్జ్ జిల్లాలో 7000 టన్నుల హాప్స్‌ను దగ్ధం చేయుటకు హాప్స్ సిండికేట్ అవసరమైన చర్యలు తీసుకుంటోంది. (1933 సెప్టెంబరు 13 వ తేదీ 'సోషల్ డెమాక్రాటిక్' పత్రిక నుంచి).

డెన్మార్క్‌లో పశువులు :—1933 అక్టోబరు 1 వ తేదీవరకూ 117000 పశువులను చంపి దగ్ధంచేసినట్లు వ్యవసాయశాఖా మంత్రివర్గ రిపోర్టులు తెలియజేస్తున్నాయి. ప్రభుత్వంయొక్క అనుమతితోనే ఇది జరిగింది.

యునైటెడ్ స్టేట్స్‌లో హాప్స్ :—1933 వ సంవత్సరంలో 64 లక్షల బస్తాల హాప్స్‌పంట దగ్ధంచేయబడింది.

యునైటెడ్ స్టేట్స్‌లో పాలు :—1933 మేనెలలో లాస్‌ఎంజిలీస్‌లో 20 వేల క్వార్టులపాలు మురుగుగుంట్లపాలు చేయబడినాయి.

సిలోన్‌లో టీ :—10 కోట్ల పౌనుల టీ సిలోన్‌లో దగ్ధంచేయబడింది.

యునైటెడ్ స్టేట్స్‌లో పీచ్‌పండ్లు ;—పండ్లుఉత్పత్తిచేయు పెద్ద వ్యాపారస్థులందరూ కలిసి మొత్తం 80000 పీచ్‌పండ్లను దగ్ధంచేశారు. (ఎకనామిక్ నోట్సు : 2 వ సంపుటం : 3 వ సంచిక : 1934 మార్చి)

## 9. పంపకం ఖర్చుల పెరుగుదల.

పంపకం రంగంలో పనిచేసే వ్యక్తులసంఖ్య, మొత్తం జనాభాతో పోల్చిచూస్తే ఎంత ఎక్కువగా పెరుగుతున్నదో తెలియజేసేసంఖ్యలు 21,22 పేజీలలో ఇవ్వబడినాయి.

యునైటెడ్ స్టేట్స్‌లో ఎడ్వర్టయిజ్‌మెంట్లకై సంవత్సరానికి లక్షకోట్ల డాలర్లు ఖర్చుపెట్టబడుతున్నదని స్టూఆర్ట్ కేస్ లెక్కలతో నిరూపిస్తున్నాడు. ఈపనిలో 6 లక్షల మంది పనిచేస్తున్నారని, వార్తాపత్రికలకై వినియోగించబడే మొత్తం కాగితంలో నూటికి 58 వంతులు ఎడ్వర్టయిజ్‌మెంట్లకే వినియోగించబడుతున్నదని తేలుతుంది.

4500 డాలర్లకు అమ్మబడే మోటారుకారుయొక్క మొత్తం అమ్మకపు ఖర్చులన్నీ కలిసి 2000 డాలర్లు అవుతున్నవని 'ఎలక్ట్రికల్ ప్రపంచం' అను పత్రిక 1934 మార్చి 2 వ తేదీన వ్రాసింది. అదేవిధంగా పదార్థములను చల్లబరచి నిలువచేసే యంత్రం. (రెఫ్రిజిరేటర్) 200 డాలర్లఖరీదయితే, దాని అమ్మకపుఖర్చులే 100 డాలర్లు అవుతున్నాయి।

ప్రస్తుతకాలంలో ఉత్పత్తిదారులనుంచి కొనుగోలుదారులవద్దకు చేరేసరికి సరుకుల ధర రెట్టింపు అవుతోందని * స్టూఆర్ట్‌కేసు వాదిస్తున్నాడు. ప్రత్యేకంగా రొట్టెవిషయం తీసుకుంటే రొట్టె అమ్మకంలో ప్రతిడాలరుకు సగం పంపకపుఖర్చు లవుతున్నవని వ్యవసాయశాఖా కమిషన్ చెప్తోంది.

•వారన్ & పియర్‌సన్ తయారుచేసిన లెక్కలప్రకారం 1910-14 లోని పంపకపు ఖర్చులకంటె 1933 ఏప్రియల్‌లోని పంపకపుఖర్చులు నూటికి 38 వంతులు పెరిగినాయి. అదేసమయంలో రైతులనుంచి వ్యాపారస్తులుకొనే ధరలు నూటికి 42 వంతులు పడిపోయినాయి!

(పంపకపు ఖర్చులంటే, అమ్మకపుధరకు నికరంగా ఉత్పత్తిదారునికి చేరేధరకు గల భేదం)

పంపకపు ఖర్చులు పెరుగుటయేగాక, గుత్తవ్యాపారస్థుల ధరల పాలిసీవల్ల ఈవిపరీతపరిస్థితి ఏర్పడిందని గుర్తించాలి.

## 10 యుద్ధసామగ్రులు, యుద్ధాలు, పోలీసుదళాల పెరుగుదల

### యునైటెడ్ స్టేట్స్‌లో అధికారవర్గం.

1910 = 100

| | 1910 | 1920 | 1930 |
|---|---|---|---|
| సివిల్‌సర్వీస్ ఉద్యోగులసంఖ్య | 100 | 138 | 199 |
| పోలీసు | 100 | 132 | 213 |

### బ్రిటన్‌లో అధికారవర్గం.

1922 = 100

| | |
|---|---|
| 1922 | 100 |
| 1930 | 106 |
| 1933 | 118 |

### యుద్ధసామగ్రుల ఖర్చుయొక్క పెరుగుదల

ప్రపంచపారిశ్రామిక, వ్యవసాయ ఉత్పత్తిలో వచ్చిన మార్పులను యుద్ధసామగ్రుల ఖర్చులో కల్గిన మార్పులతో పోల్చి జర్మన్ ఆర్థికపరిశోధనాసంస్థ తయారు చేసిన సంఖ్యలు ఈ క్రింద ఇవ్వబడినాయి :-

*1927 లో స్టూఆర్ట్‌కేస్ ప్రచురించిన Tragedy of Waste నుండి.

• 1933 లో G. A. వారన్, F. పియర్‌సన్‌గార్లురచించిన ధరలు' అనుగ్రంథంనుండి.

1913 = 100 (డబ్బు విలువలో)

| | యుద్ధసామగ్రులమీద అయినఖర్చు | ప్రపంచఉత్పత్తి |
|---|---|---|
| 1913 | 100 | 100 |
| 1925 | 135 | 133 |
| 1929 | 157 | 145 |
| 1936 | 300—350 | 121 |

ఈ విధంగా 1936 లో 53 దేశాల్లో యుద్ధసామగ్రుల నిమిత్తం చేయబడిన ఖర్చు, 1913 లో కంటె 3-3½ రెట్లు పెరిగింది. అదేకాలంలో ప్రపంచ ఉత్పత్తి నూటికి 20 వంతులు (1/5) మాత్రమే పెరిగింది.

## యుద్ధ సామగ్రులకై చేయబడిన ఖర్చును తెలియజేసే ప్రభుత్వ లెక్కలు.

1912—13 = 100

| దేశాలు | 1912-13 | 1928-29 | 1932-33 | 1934-35 | 1937-38 |
|---|---|---|---|---|---|
| యునైటెడ్ స్టేట్స్ | 100 | 235.7 | 238 7 | 278.1 | 325.0 |
| జపాన్ | 100 | 259.1 | 343.9 | 471.9 | 706.2 |
| బ్రిటన్ | 100 | 147.0 | 133.3 | 147.1 | 374.0 |

## 1914—18 ప్రపంచయుద్ధం తరువాత జరిగినయుద్ధాలు, సాయుధపోరాటాలు.

సోవియట్ భూమిపై జరిగిన విద్రోహకయుద్ధాలు :

1918 సోవియట్ రష్యామీద, సోవియట్ యుక్రెయిన్ మీద జర్మన్ దాడులు; సోవియట్ యుక్రెయిన్ ఆక్రమణ.

1918 సోవియట్ బెసరేబియాను రుమేనియా స్వాధీనపరచుకొనుట.

1918 మర్మన్స్కలో బ్రిటిష్ సైన్యాలు దిగినాయి.

1918 ఒడెస్సాలో ఫ్రెంచిసైన్యాలు దిగినాయి.

1918—22 దూరప్రాచ్యంలో జపాన్ సోవియట్ పై యుద్ధం సాగించింది.

1919 వసంతకాలం — సోవియట్ రష్యాపై మిత్రరాజ్యాలదాడి (పోలెండు, కోల్చాక్, డెనికిన్, యుడెనిచ్, టర్కీస్థాన్, ఆర్చేంజెల్ లోని ఆంగ్లో-రష్యన్ సైన్యాల దాడులు)

1919 ఆకురాలుకాలం—సోవియట్ రష్యాపై మిత్రరాజ్యాల రెండవదాడి (డెనికిన్, యుడెనిచ్, పోలెండు)

1920 సోవియట్‌రష్యాపై మిత్రరాజ్యాల మూడవదాడి (పోలెండు, రాంగెల్).

1921–22 సోవియట్ కెరిలియాను ఆక్రమించుటకు ఫిన్లండు ప్రయత్నించింది.

1929 రష్యాకుచెందిన తూర్పుచైనా రైల్వేను వశంచేసుకొనుటకు చైనా మిలటరీ అధికార్లదాడి.

1931–38 సోవియట్-మంచూరియా సరిహద్దులను - అతిక్రమించుటకు ఎడతెగకుండా జపానీస్-మంచూరియన్ సైన్యాలు ప్రయత్నించినాయి.

## 1914–18 సామ్రాజ్యవాద యుద్ధంతరువాత జరిగిన ఎన్నో చిన్నచిన్నయుద్ధాలు.

యూరప్

1919 హంగేరియన్ సోవియట్ ప్రభుత్వమును కూలద్రోయుటకు మిత్రరాజ్యాలు, జెకోస్లోవేకియా, రుమేనియా చేసినదాడులు.

1919 గేబ్రియల్‌అన్న్యూజో నాయకత్వంక్రింద ఇటాలియన్ వలంటీర్లు ఫిమూమ్‌ను స్వాధీనపరచుకొనుట.

1920 ఫ్రెంచిసైన్యాలు ఫ్రాంక్‌ఫ్యూర్ట్‌ను, దారమ్‌స్టాట్‌ను ఆక్రమించుట.

1920 విల్నాను పోలెండు ఆక్రమించుట.

1921 పూర్వం జర్మన్ ఉత్తరసిసీలియామీద పోలెండుదాడి.

1923 రూర్‌ప్రాంతాన్ని ఫ్రాన్స్ ఆక్రమించుట.

1923 మెమెల్‌ను లిథూనియా ఆక్రమించుట.

1923 కొర్ఫ్యూను ఇటలీ తాత్కాలికంగా ఆక్రమించుట.

1925 బల్గేరియాను గ్రీసు ఆక్రమించుట.

1936–38 మిలిటరీ ఫాసిస్టులదాడులు; స్పెయిన్‌లో ఇటలీ జర్మన్ ఫాసిస్టులు జోక్యం చేసుకొనుట.

1938 జర్మనీ ఆస్ట్రియాను ఆక్రమించింది.

ఆఫ్రికా

1919–26 ఉత్తరఆఫ్రికాలో రిఫ్స్‌కు వ్యతిరేకంగా స్పానిష్‌యుద్ధం.

1925–26 ఉత్తరఆఫ్రికా నివాసులమీద ఫ్రెంచి-స్పానిష్ మిలటరీదాడులు.

1929–32 మొరాకోలో ఫ్రెంచి మిలటరీయుద్ధాలు.

1930 ట్రిపోలిటానియాను ఇటలీ సంపూర్ణంగా ఆక్రమించుట.

1934–35 అబిసీనియాను ఇటలీసైన్యాలు పూర్తిగా ఆక్రమించుట.

1935–36 అబిసీనియాయుద్ధం. ఇటలీ అబిసీనియాను ఆక్రమించుట.

దక్షిణ అమెరికా

1928 బొలీవియాకు పెరాగ్వేకు యుద్ధం.

1928–32 నికారాగ్వామీద యునైటెడ్ స్టేట్స్ దాడి.

1932–33 పెరూకు-కొలంబియాకు యుద్ధం.

1932–34 బొలివియాకు పెరాగ్వేకు రెండవయుద్ధం.

ఇండియా, ఇండోచైనా

1919 పశ్చిమోత్తర ఇండియా సరిహద్దులలో బ్రిటిష్‌వారికి తిరుగుబాటుదార్లకు మధ్య యుద్ధం.

1927 ఇండొనీసియాలో డచ్‌వారి దాడులు.

1930 ఇండోచైనాలో అన్నామీస్ ప్రజలమీద ఫ్రెంచిదాడులు.

1930-31 బర్మాలోను, పశ్చిమోత్తరఇండియాలోను బ్రిటిష్‌వారుసాగించిన యుద్ధాలు.

1930–37 సరిహద్దురాష్ట్రంలోని (ఇండియా) కొండజాతులకు బ్రిటిష్‌వారికి - మధ్య ఎడతెగని యుద్ధాలు.

దగ్గర, మధ్యప్రాచ్యప్రాంతంలో

1919 ఆంగ్లో-ఆఫ్గన్‌యుద్ధం.

1918–22 గ్రీక్-టర్కిష్‌యుద్ధం.

1919–22 ఇరాక్, ట్రాన్స్‌జోర్డానియా, మధ్యఅరేబియాలలోని అరబ్బులమీద బ్రిటిష్‌దాడులు.

1919–26 సిరియాతిరుగుబాట్లను ఫ్రెంచివారు అణిచివేయుట.

1925 అరేబియాలో నెజ్డ్, హీజాద్‌కుమధ్య యుద్ధం.

1928–29 బ్రిటిష్ ఏజెంట్లు ఆఫ్గనిస్థాన్‌లో అంతర్యుద్ధాన్ని ప్రేరేపించారు.

1930 బ్రిటిష్ సామ్రాజ్యవాదులమద్దతుతో సరిహద్దుజాతులు కొన్ని హీజాద్-నెజ్డ్ మీద దాడిచేశారు.

1932 ఇరాక్‌లోని స్వతంత్ర కుర్డ్‌జాతులమీద బ్రిటిష్ విమానదాడి.

1934 ఇమెన్‌కు, సౌదీఅరేబియాకుమధ్య యుద్ధం.

1936–38 పాలెస్టయిన్‌లో అరబ్బులకు బ్రిటిష్‌సైన్యాలకు మధ్యజరిగిన సాయుధ పోరాటం.

దూరప్రాచ్యం

1925 చైనాలో సామ్రాజ్యవాదులదాడి.

1927 షాంగ్‌హైలో ప్రపంచ సామ్రాజ్యవాదుల ఉమ్మడిదాడి - నాంకింగ్‌పైదాడి.

1928 జపాన్ షాంటుంగ్‌ను ఆక్రమించింది.

1930 చైనీస్ ఎర్రసైన్యం ఆక్రమించిన షాంగ్‌షాపై దాడి.

1930 సోవియట్‌ప్రాంతాలమీద, చైనాఎర్రసైన్యంమీదచేసిన ప్రథమనాంకింగ్‌దాడి.

1931–37 చైనామీద జపాన్‌యుద్ధం. మంచూరియాను, చైనాలో కొన్నిభాగాలను జపాన్ ఆక్రమించుట.

1931 ఏప్రియల్ సోవియట్ చైనామీద నాంకింగ్ ప్రభుత్వపు రెండవ దాడి.

1931 మే రెండవ దాడి విఫలమయింది.

1931 ఆగస్టు మూడవ దాడి ప్రారంభం.

1931 సెప్టెంబరు మూడవ దాడి విఫలమయింది.

1932 షాంగ్‌హైమీద జపాన్‌దాడి.

1932 ఫిబ్రవరి సోవియట్‌చైనాపై నాంకింగ్ ప్రభుత్వపు నాల్గవ దాడి.

1932 మే నాల్గవ దాడి విఫలమయింది.

1933 జూన్ ఐదవ దాడి ప్రారంభం.

1933 జూలై ఐదవ దాడి విఫలమయింది.

1933 అక్టోబర్ ఆరవ దాడి ప్రారంభం.

1933 జిహోల్‌ను, హోపైరాష్ట్రంలోని ఈశాన్యభాగాలను జపాన్ ఆక్రమించింది.

1933 పసిఫిక్‌లో 9 కొరాల్‌దీవులను ఫ్రాంసు ఆక్రమించింది.

1934 చహార్ (లోపలి మంగోలియా)లో ఎక్కువభాగాన్ని జపాన్‌ఆక్రమించింది.

1934 నవంబరు సోవియట్‌చైనాపై నాంకింగ్ ప్రభుత్వపు ఆరవ దాడి ఆఖరయింది.

1934–35 చైనా ఎర్రసైన్యాలు దక్షిణ మధ్యచైనాలనుంచి వాయవ్యప్రాంతానికి కదిలినాయి.

1935 నవంబరు జపాన్ ఆక్రమించిన తూర్పుహోపైరాష్ట్రంలో కమ్యూనిష్టు వ్యతిరేక కీలుబొమ్మ ప్రభుత్వాన్ని స్థాపించుట.

1936 జూన్-ఆగస్టు నాంకింగ్‌ప్రభుత్వంమీద క్వాంటుంగ్, క్వాంగ్సీ సైన్యాలదాడి

1936 అక్టోబర్ కాన్సూ, షెన్సీరాష్ట్రాలలోని చైనా ఎర్రసైన్యాలు ఐక్యమగుట.

1936 అక్టోబర్-డిసెంబర్-మంగోలియన్-మంచూరియన్ సైన్యాలు సూయాన్ మీద దాడిచేయుట.

1936 సియాన్-పూ రాష్ట్రంలో నాంకింగ్ ప్రభుత్వంమీద షాన్‌హిసూయేలింగ్ తిరుగుబాటు.

1935–36 జపానీస్-మంచూరియన్ సైన్యాలు మంగోలియన్ ప్రజాప్రభుత్వంమీద దాడిచేసినాయి.

1937–38 చైనాపై జపాన్ దురాక్రమణయుద్ధం.

# "సామ్రాజ్యవాదం పెట్టుబడివిధానంయొక్క అత్యున్నతదశ" అను గ్రంధానికిచెందిన నూతన ఆధారాలను గురించి

— లియోమాండల్‌జోన్.

"సామ్రాజ్యవాదం పెట్టుబడిదారీ విధానంయొక్క అత్యున్నతదశ" అను గ్రంధాన్ని లెనిన్ 1916 ప్రారంభంలో వ్రాశాడు. అప్పటినుంచి 20 సంవత్సరాలు గడిచినాయి. 20 సంవత్సరాలంటే మానవచరిత్రలో పెద్ద దీర్ఘకాలంకాదు. కాని ఈ కొద్దికాలంలో మానవసమాజంలో ఎప్పుడూ రానటువంటి మార్పులుకల్గి మానవచరిత్ర అపూర్వవేగాధి క్యతతో ముందుకు నడిచింది. ఈదశలో జరిగిన ముఖ్యమైన చారిత్రికఘటనలు ఇవి :— ప్రపంచాన్నంతా తారుమారుచేసే పెద్ద ఆర్థికసంక్షోభాన్ని కల్గించిన ప్రపంచయుద్ధం; ప్రపంచమంతటా, అన్నిదేశాల్లో గొప్ప విప్లవాలవెల్లువను ప్రవేశపెట్టిన 1917 నవంబర్ సోషలిస్టువిప్లవం; సోవియట్‌భూమిలో జరిగిన చారిత్రికమైన అంతర్యుద్ధాలు; పెట్టుబడి విధానం కొంతవరకు స్థిరపడినట్లు కనపడుట (తారతమ్య స్థిరత్వం); చైనావిప్లవం; పెట్టుబడిదారీదేశాల్లో ఎడతెగనటువంటి కఠోరసంక్షోభం; అదేకాలంలో సోవియట్ యూనియన్‌లో 2 పంచవర్ష ప్రణాళికలు జయప్రదమగుట; సోవియట్‌భూమిలో సోషలిజం అఖండవిజయాన్నిపొంది స్టాలిన్ నూతన రాజ్యాంగచట్టం ప్రవేశపెట్టబడుట; పెట్టుబడి విధాన స్థిరత్వం త్వరలోనేక్షీణించి తిరిగి నూతన విప్లవాలవెల్లువ బయలుదేరుట — ఇవే ఈదశలో జరిగిన ప్రధానఘటనలు. ప్రపంచ ప్రాముఖ్యతగల ఈఘటనలవల్ల గడించిన అపూర్వఅనుభవంవల్ల సామ్రాజ్యవాదాన్ని గురించి లెనిన్ 1916లో చేసిన సిద్ధాంతాలన్నీ సత్యమని నిరూపించబడినాయి. మొత్తంమీదనేకాదు. సిద్ధాంత వివరాల్లోగూడా సత్యమని రుజువుచేయబడినాయి. కమ్యూనిస్టు ఇంటర్నేషనల్‌యొక్క కార్యక్రమానికి పునాదిగా తయారైంది లెనిన్ సామ్రాజ్యవాదసిద్ధాంతం. ప్రపంచమంతటా పీడితప్రజలు సాగించే స్వాతంత్ర్య పోరాటాలకు ఈసిద్ధాంతం గొప్ప శక్తివంతమైన ఆయుధంగా ఉపయోగ పడింది.

'సామ్రాజ్యవాదం' అను గ్రంధంలో లెనిన్ ఉదహరించిన విషయాలు, లెక్కలు, అన్నీ యుద్ధకాలానికి పూర్వదశకు (1914 కు పూర్వం) చెందినవి. అయినప్పటికి తరువాత 20 సంవత్సరాలకాలంలో పెట్టుబడివిధానమునకు సంబంధించిన లెక్కలన్నీగూడా లెనిన్ యుద్ధపూర్వలెక్కలను ఆధారంగాతీసుకొని నిరూపించిన విషయాలనన్నిటినీ

మరింత బలపరుస్తున్నాయి. మొదటివిషయం — ఈ 20 సంవత్సరాలకాలంలో గుత్త వ్యాపారసంస్థల అధికారం మరింత వృద్ధిఅయి దోపిడిగూడా ఎక్కువయినందువల్ల పరాన్నభుక్కుల దోపిడిపెరిగి పెట్టుబడివిధానం క్షీణించింది. పెట్టుబడి విధానంయొక్క వైరుధ్యముల ఫలితంగాఏర్పడే ముఖ్యలక్షణాలలో ఇదిఒకటి. పెట్టుబడివిధానం ఎడతెగని సంక్షోభంలో చిక్కుకున్న ఈదశలో ఇది అతి ప్రధానలక్షణంగా బయటపడుతుంది.

## 1. ఉత్పత్తి కేంద్రీకరణయొక్క వృద్ధి

'పెట్టుబడి వ్యాపార పరిమాణమములే గుత్తవ్యాపారమునకు దారితీస్తాయి' అను మూలసూత్రంనుంచి లెనిన్ సామ్రాజ్యవాద సిద్ధాంతం బయలుదేరింది.

'ఆర్థిక దృక్పథంనుంచి పెట్టుబడి విధానంయొక్క అత్యున్నతదశయే సామ్రాజ్య వాదం. అంటే అర్థం ఏమిటి? పెట్టుబడి విధానంలో మొదట స్వేచ్ఛగా పోటీచేసే పద్ధతికి అవకాశం ఉంటుంది. కాని పెట్టుబడి విధానం క్రమేణా అభివృద్ధిఅయి, ఉత్పత్తి బాహుళ్యంగా, ఊహించలేనంత బాహుళ్యంగా జరిగినప్పుడు, స్వేచ్ఛగా పోటీచేసే పద్ధతి నశించి, దానిస్థానే (సామ్రాజ్యవాదయుగంలో) గుత్తవ్యాపారం ఆరంభమవుతుంది. సామ్రాజ్య వాదం యొక్క ఆర్థిక సారాంశం ఇదే.'

అందువల్లనే పెట్టుబడివిధానంక్రింద జరిగే ఉత్పత్తి కేంద్రీకరణను పరిశీలించుటతో సామ్రాజ్యవాదమును పరిశీలించుటకు ప్రారంభించాడు లెనిన్. 1907 లో జర్మన్ పరిశ్రమ లకు సంబంధించిన పారిశ్రామిక లెక్కలు మాత్రం లెనిన్‌కు లభించినాయి. ఆ పైన లెక్కలు లెనిన్‌కు దొరకలేదు. కాని ఇప్పుడు మనకు 1925, 1933 సంవత్సరాలకు చెందిన జర్మన్ లెక్కలు; 1929, 1933 లకు చెందిన యునైటెడ్‌స్టేట్స్ లెక్కలు అందుబాటులో ఉన్నాయి. అంతేకాదు. ఫ్రాన్సు, జపాను దేశాలలో జరుగుతున్న పెట్టు బడివిధాన ఉత్పత్తి కేంద్రీకరణకు సంబంధించిన లెక్కలుగూడా ఇప్పుడు మనకు లభ్య మవుతున్నాయి. లెనిన్‌కు అవి దొరుకకపోవుటవల్ల ఈ 2 దేశాలను గురించి అతడు ఉదహరించలేదు. కాని సామ్రాజ్యవాద దేశాలలో ముఖ్యస్థానాలను ఆక్రమిస్తున్న ఈ రెండు దేశాలకు సంబధించిన విషయాలు, లెక్కలు లెనిన్‌యొక్క సామ్రాజ్యవాదసిద్ధాంతాన్ని మరింత బలపరుస్తున్నాయి. ఆఖరుకు బ్రిటిష్ వుత్పత్తి కేంద్రీకరణకు సంబంధించిన లెక్కలన్నీ 1934 లో లభించినాయి.

ఉత్పత్తి కేంద్రీకరణను గురించి లెనిన్ ఉదహరించిన లెక్కలను ప్రస్తుత ఉత్పత్తి కేంద్రీకరణ లెక్కలతో పోల్చిచూస్తే కేంద్రీకరణ ఎంత ఎక్కువగా అభివృద్ధి అయిందో బోధపడుతుంది. గుత్తవ్యాపారంయొక్క అధికార దోపిడీలు గూడా దానితోబాటు విపరీ తంగా హెచ్చినవని వెంటనే నిర్ణయించవచ్చును.

ఉత్పత్తి కేంద్రీకరణ విపరీతంగా పెరిగి పోయిందని నిరూపించే లెక్కలు కొన్ని ఈ క్రింద ఇవ్వబడినాయి.

జర్మనీ లో

50 మంది పనివారికి పైగా పెట్టుకునే పరిశ్రమలలో పనిచేసేవారి కార్మికుల సంఖ్యను మొత్తం జనాభాతో పోల్చిచూస్తే 1907 నాటికి నూటికి 39.4 వంతులయితే 1925 నాటికి నూటికి 47.6 కు పెరిగింది. 1000 మంది కార్మికులను పైగా పనిలోపెట్టుకునే పరిశ్రమలసంఖ్య దాదాపు రెట్టింపయింది. 1907 లో ఇవి 586 ఉండేవి. 1927 లో 1122 కు పెరిగినాయి. ఈ పెద్ద పరిశ్రమలు వినియోగించుకునే హార్స్‌పవర్ నూటికి 32 నుంచి 41.2 వరకూ పెరిగింది.

"లెక్కలోకి వచ్చేవన్ని వేలలో ఉన్న బాహుళ్యమైన పెద్ద పరిశ్రమలే. అధికారమంతా వాటిదే. చిన్న పరిశ్రమలు లక్షలలో ఉన్నా శూన్యంక్రిందనే లెక్క-" 1907 కు చెందిన జర్మన్ పారిశ్రామిక లెక్కలను పరిశీలించినపుడు లెనిన్ ఈ తీర్మానానికి వచ్చాడు. ఈనాడో! అధికారమంతా కల్గిన పెద్దపరిశ్రమలు వేలలోగూడా లేవు. వాటిసంఖ్య మరింత తగ్గిపోయింది. ఉదాహరణానికి 1925 లో జర్మనీలో 5000 కార్మికులుగాని 5000 కు పైగాగాని కార్మికులు పనిజేసే పరిశ్రమలసంఖ్య 67 మాత్రమే ఉన్నాయి. కాని ఈ 67 పరిశ్రమలు వినియోగించుకునే యంత్రశక్తియో? 16 లక్షల చిన్న పరిశ్రమలలో వినియోగపడే * మోటివ్‌ఫోర్సుకి రెట్టింపుసుమా! సరియైన లెక్కలు ఇవిగో:—

| పరిశ్రమలలో కార్మికులు ఎంతమంది? | పరిశ్రమల సంఖ్య | మొత్తం యంత్రశక్తి (1000 హార్సుపవరు) |
|---|---|---|
| 1 నుంచి 5 గురు వరకూ | 1614069 | 1358 |
| 5000 నుంచి పైన | 67 | 2738 |

1933 కు చెందిన జర్మన్ పారిశ్రామిక లెక్కలను పరిశీలిస్తే ఉత్పత్తికేంద్రీకరణ మరింత ఎక్కువయిందని బోధపడుతుంది. 1925—1933 మధ్య ప్రతి పరిశ్రమలోనూ యంత్రశక్తి నూటికి 26 వంతులు హెచ్చింది. దీనివల్ల సాధారణ జర్మన్ పరిశ్రమలన్నీ గూడా వృద్ధిపొందినవని తేలుతుంది. అదేకాలంలో (1925—1933) 11 పరిశ్రమలకు చెందిన చిన్న ఫ్యాక్టరీలు 124000 ఆర్థిక సంక్షోభంవల్ల మూసివేయబడినవని గూడా లెక్కలవల్ల తెలుస్తోంది. నిజమే. మరొక 8 పరిశ్రమలలో 65000 చిన్న సంస్థలు కొత్తగా బయలుదేరినాయి. కాని మొత్తం మీద ఆకాలంలో 58000 చిన్న ఉత్పత్తి కేంద్రాలు నాశనం చేయబడినాయి. ప్రపంచ ఆర్థిక సంక్షోభదశలో కొన్ని పరిశ్రమలలో చిన్న ఉత్పత్తి కేంద్రాలు పెరగటానికి కారణం, తీవ్రమవుతున్న నిరుద్యోగ సమస్య తప్ప

---

* మోటివ్‌ఫోర్సు :—యంత్రాన్ని నడిపేశక్తి. దీనిని హార్సుపవర్లలో కొలుస్తారు.

మరొకటికాదు. ఆకలి బాధలవల్ల చావకుండా ఏదో విధంగా బ్రతుకుటకై నిరుద్యోగులైన వారు కొందరు చిన్న చిన్న మరమ్మతు కార్ఖానాలనుగాని, ఇతర గృహపరిశ్రమలనుగాని సాగించారు. అంతమాత్రాన చిన్న చిన్న పారిశ్రామిక సంస్థల పరిస్థితి అభివృద్ధి చెందిందని చెప్పుటకు వీలులేదు. పైగా ఆర్థిక సంక్షోభంలో అవి త్వరగా నాశనమగుటకు ప్రారంభించినవనే చెప్పాలి.

## యునైటెడ్ స్టేట్స్‌లో

1909 లెక్కలను 1929 లెక్కలతో పోల్చిచూస్తే తేలినవిషయాలు :— 10 లక్షల డాలర్ల విలువగలసరుకును తయారుచేసే పరిశ్రమల ఉత్పత్తి దేశంయొక్క మొత్తం ఉత్పత్తిలో 1909 లో నూటికి 43.8 వంతులుఉంటే 1929 నాటికి నూటికి 69.3 కు పెరిగింది. 1000 కార్మికులకుపైగా పనిచేసే పెద్ద పారిశ్రామికసంస్థలు 540 నుంచి 996 కు పెరిగినాయి. ఈ పెద్దసంస్థలయొక్క యంత్రశక్తి 120 లక్షల హార్స్‌పవర్‌కు పెరిగింది. అనగా 1925లో జర్మన్ పరిశ్రమలన్నిటియొక్క మొత్తం యంత్రశక్తిలో $\frac{2}{3}$ వంతులు 996 అమెరికన్ పెద్దపరిశ్రమలలో వినియోగించబడు తున్నదన్నమాట. జర్మనీలో 1925 లో చిన్నవిగాని పెద్దవిగాని మొత్తం 30 లక్షల పారిశ్రామిక ఉత్పత్తి కేంద్రాలున్నవని జ్ఞాపకంచేసుకుంటే అమెరికాలోని పెద్ద పరిశ్రమలలోని ఉత్పత్తి కేంద్రీకరణ మరింత తేటతెల్లమవుతుంది.

ప్రపంచ ఆర్థిక సంక్షోభకాలంలో అమెరికాలో ఈ ఉత్పత్తికేంద్రీకరణ మరింత ఎక్కువ వేగంతోజరిగింది. ఈకాలంలో చిన్న పరిశ్రమలు ఎంతత్వరగా తుడిచివేయబడినవో ఈక్రింది లెక్కలు తెలియజేస్తాయి :—

యునైటెడ్‌స్టేట్స్‌లో పారిశ్రామిక కేంద్రాల పెరుగుదల లేక తగ్గుదల నూటికి ఎన్నివంతులు ?

| | |
|---|---|
| 1925—1929 | +12.3 |
| 1929—1931 | —17.1 |
| 1931—1933 | —18.4 |
| 1929—1933 | —32.4 |

1931—33 సంవత్సరాలకుచెందిన లెక్కలమీద వ్యాఖ్యానంచేస్తూ 'కాన్ఫరెన్సు బోర్డు బుల్లిటెన్' అను పత్రిక 1934 అక్టోబరు 10 వ తేదీన ఈవిధంగా వ్రాసింది :— ఆర్థిక సంక్షోభంయొక్క తీవ్రతను తెలియజేయుటకు, యునైటెడ్‌స్టేట్స్‌లో 1931—33 మధ్య చిన్నపరిశ్రమలు నూటికి 18 వంతులు క్షీణించిపోయినవనే విషయంచాలు. ఈ విధంగా చిన్నపరిశ్రమలసంఖ్య క్షీణించుటవల్ల 1931-33మధ్య పనిచేస్తున్న పరిశ్రమలలోని కార్మికులసంఖ్య నూటికి 11.4 వంతులుపెరిగినా, దేశం మొత్తంమీద నూటికి 8.8 మంది నిరుద్యోగులుగా తయారైనారనే విషయం గుర్తించదగింది.

ఫ్రాన్సులో

50 మందికంటె ఎక్కువగాఉన్న పరిశ్రమలలోని కార్మికులసంఖ్యను మొత్తం దేశంలోని కార్మికవర్గసంఖ్యతో పోల్చిచూస్తే 1906 లో నూటికి 30.6 గురుఉంటే 1926 నాటికి 44.8 కి పెరిగింది. అదేకాలంలో 1000 మందిని గాని 1000 కి పైగాగాని కార్మికులు పనిచేస్తున్న పరిశ్రమసంఖ్య 207 నుంచి 362 కు పెరిగింది. ఈ పెద్ద పరిశ్రమలలో మాత్రం పనిచేసే కార్మికుల సంఖ్యను మొత్తం దేశంలోని కార్మికవర్గసంఖ్యతో పోల్చిచూస్తే నూటికి 8.1 నుంచి 13.4 కి పెరిగింది.

జపాన్‌లో

ఉత్పత్తికేంద్రీకరణలో పెట్టుబడిదారులు అద్భుతమైన విజయాలను పొందారని చెప్పవచ్చును. 50 లక్షల *యెన్నుల పెట్టుబడిగల పెద్ద వాణిజ్యసంస్థలు 1909 లో 38 ఉండేవి. వాటి సంఖ్య 1927 నాటికి 687 అయింది. అనగా 18 సంవత్సరాల్లో 18 రెట్లు ఎక్కువయినవన్నమాట : వాటి మొత్తం పెట్టుబడి 49 కోట్ల 50 లక్షల యెన్నుల నుంచి 811 కోట్ల 30 లక్షల యెన్నులకు పెరిగింది. వాటియొక్క వసూలైన పెట్టుబడి యే నూటికి 36.2 నుంచి 64.2 కు పెరిగింది. 5 గురి కంటె ఎక్కువమంది పనిచేసే జపానీస్ పరిశ్రమలలోని కార్మికులలో ప్రతి 100 మందికి, 1000 మందిని పెట్టుకునే పరిశ్రమలలో 1914 లో 17 మంది, 1925 లో 25 మంది కార్మికులు ఉన్నారు. కాని ఆర్థికసంక్షోభదశలోమాత్రం 1000 మంది కార్మికులు ఉన్నారు. కాని ఆర్థికసంక్షోభదశలో మాత్రం 1000 మంది కార్మికులు పనిచేసే పరిశ్రమలలోని పనివారిసంఖ్య మాత్రం కొంత తగ్గింది. దీనికి కారణం ఉత్పత్తిలో ఏర్పడిన తగ్గుదలయే.

బ్రిటన్‌లో

బ్రిటన్‌లో గూడా ఉత్పత్తి కేంద్రీకరణ విషయంలో చెప్పుకోదగిన విజయాలే సాధించబడినాయి. 1930లో ఇవ్వబడిన పారిశ్రామిక లెక్కలప్రకారం బట్టల పరిశ్రమలు. లోహపరిశ్రమలు, కలిపిచూస్తే 353 పెద్ద ఉత్పత్తిసంస్థలు ఉన్నవని తేలింది. ఇవన్నీ 1000 మంది కార్మికులకు పైగా పనిలోపెట్టుకున్న సంస్థలే. యునైటెడ్‌స్టేట్స్‌తో (667) పోల్చిచూస్తే ఈ సంఖ్య చాలతక్కువగాని జర్మన్‌సంఖ్యకంటె (430) మరీ తక్కువకాదు. ఇక ఈ పెద్ద పరిశ్రమలలో పనిచేసే కార్మికులసంఖ్య విషయంలో 1930 లో బట్టల మిల్లులు, మెకానికల్ ఇంజనీయరింగ్, ఎలక్ట్రికల్ ఇంజనీయరింగ్ శాఖలు మాత్రం జర్మన్‌సంఖ్యలతో సమానంగాగాని లేక కొంచెం ఎక్కువగాగాని ఉంటాయి. దీనినిబట్టి సాధారణంగా ప్రపంచ ఆర్థికరంగంలో చెప్పుకునేదానికంటె బ్రిటన్‌లో ఉత్పత్తికేంద్రీకరణ

---

* యెన్ :— యుద్ధానికిపూర్వం ఈ జపానీస్ నాణెముయొక్క విలువ సుమారు రు 1-9-6 కు సమానం.

ఎక్కువగానే ఉన్నదని చెప్పాలి. యుద్ధానంతరం బ్రిటన్‌లో వృద్ధిఅయిన గుత్తవ్యాపారం యొక్క ప్రధానలక్షణం ఈ కేంద్రీకరణయే.

పెట్టుబడివిధానంలో ఉత్పత్తి కేంద్రీకరణను పరిశీలించేటప్పుడు లెనిన్ ఒక ముఖ్య విషయాన్ని గుర్తించాలని నొక్కి చెప్పాడు. కొత్త సమ్మేళనములవల్ల (ఉదాహరణ:— రసాయనశాస్త్రం. విద్యుచ్ఛక్తి సమ్మేళమగుట) ఉత్పత్తి కేంద్రీకరణయొక్క వేగం తీవ్రం అవుతుందని లెనిన్ నిరూపించాడు. యుద్ధానంతరం ఈ కొత్త సమ్మేళన పద్ధతిలో అనేక మార్పులు వచ్చినాయి. ఈ సమ్మేళనాలు అమలులో ఉన్న పరిశ్రమలయొక్క పరిమాణములు యుద్ధానంతరం ఎన్నోరెట్లు అధికమగుటయేగాక, రసాయన శాస్త్రమును విద్యుచ్ఛక్తితో మేళవించినయెడల ఉత్పత్తి విధానంలో అద్భుతమైన అభివృద్ధి అవకాశాలు కలుగగలవని వెల్లడి అయింది. ఈ నూతన సమ్మేళనంవల్ల కొత్తరకం పారిశ్రామిక సంస్థలు గూడా బయలుదేరుట తటస్థించింది. ఈ సమ్మేళనంతో ఉత్పత్తిరంగాన్ని మరింత బాహుళ్యపరచవచ్చుననిగూడా తెలియవచ్చింది. అదేసమయంలో ఈ నూతన సమ్మేళనంతో ఉత్పత్తి సాగించే పద్ధతులు అనేక పారిశ్రామిక శాఖలలో అమలులోకి వచ్చినాయి. జెకోస్లోవేకియాలో బూట్సును తయారుచేయు బాటాకంపెనీలోనూ, మాంసమును ప్యాకింగుచేయు పరిశ్రమలు మొదలైన వాటిలో ఈ నూతన సమ్మేళన విధానం అమలు పరచబడింది.

ఉత్పత్తి కేంద్రీకరణలో వచ్చిన గొప్ప అభివృద్ధికి (సున్నితంగా, సూటిగా కానప్పటికి) ప్రత్యేక వివరణ ఇవ్వనవసరంలేదు. పెట్టుబడివిధాన అభివృద్ధిని గురించి మార్క్సు ఎప్పుడో చాటిన సూత్రాల నన్నిటిని ఈ కేంద్రీకరణ అభివృద్ధి బలపరుస్తోంది. పెట్టుబడి విధానంయొక్క అంతిమదశను గురించి పరిశీలించుటకు లెనిన్ ఏ మార్క్సిస్టు సూత్రాలతో ప్రారంభించాడో ఆ సూత్రాల నన్నిటినీ ఈ కేంద్రీకరణ అభివృద్ధి మరొకసారి బలపరుస్తోంది. కాని ఈ 20 సంవత్సరాలకాలంలో ఉత్పత్తి కేంద్రీకరణను తీవ్రపరచిన ప్రత్యేక పరిస్థితులు కొన్ని ఉన్నవని మరిచిపోగూడదు. వాటిలో కొన్నిటిని ఇక్కడ చూద్దాం:—

(1) ప్రపంచ సామ్రాజ్యవాద యుద్ధంవల్ల కేంద్రీకరణయొక్క వేగాధిక్యత మరింత తీవ్రమయింది. యుద్ధకాలంలో భారమైన పరిశ్రమలకు-తేలిక పరిశ్రమలకు మధ్య, పాత పరిశ్రమలకు-కొత్త పరిశ్రమలకుమధ్య అభివృద్ధిలోగల తేడా ప్రాధాన్యతవహించింది. ఏయే పరిశ్రమలలో ఉత్పత్తికేంద్రీకరణ అతిహీనస్థాయిలోవున్నదో ఆపరిశ్రమలే యుద్ధకాలంలో బాగా దెబ్బతిన్నాయి. అదేసమయంలో కార్మికుల సంఖ్య చాలినంత లేకపోవుటవల్లనూ, స్టాండర్డు ఉత్పత్తి జరుగుట అవసరమైనందువల్లనూ, బట్టలు, బూట్స్, చెప్పులు మొదలైన సరుకులను ఉత్పత్తిచేయు పరిశ్రమలలోగూడా యంత్రములను ప్రవేశపెట్టి బాహుళ్యంగా ఉత్పత్తి చేయుట జరిగింది. ఈ పరిశ్రమలలో అంతకుపూర్వం చాల కొద్దిపాటి

ఉత్పత్తి జరుగుతూఉండేది. ఈ నూతన ఉత్పత్తి కేంద్రీకరణ పద్ధతులు యుద్ధానంతరం మరింత ఎక్కువగా అభివృద్ధిఅయినాయి.

(2) యుద్ధానంతరం ఉత్పత్తిశక్తుల పెరుగుదల:— యుద్ధానికి పూర్వంకంటె ఈ ఉత్పత్తిశక్తుల పెరుగుదల తగ్గినప్పటికీ, సాఫీగా అభివృద్ధి కానప్పటికి, పూర్వం ఉత్పత్తికేంద్రీకరణ బాగా అభివృద్ధిఅయిన యునైటెడ్‌స్టేట్స్‌వంటి దేశాల్లోనూ, 'భారమైనటువంటి', 'కొత్త' పరిశ్రమలలోనూ ముఖ్యంగా ఈఉత్పత్తిశక్తుల పెరుగుదల ప్రధానంగా కనిపిస్తుంది. అందువల్ల ప్రపంచపెట్టుబడి పరిశ్రమరంగంలో ఈదేశాల యొక్క, ఈ పరిశ్రమలయొక్క ప్రాముఖ్యత హెచ్చింది. ఉత్పత్తిశక్తుల పెరుగుదలవల్ల గూడా కేంద్రీకరణ హెచ్చుతున్నది.

(3) ముఖ్యమైన టెక్నికల్‌మార్పులు:—బ్లాస్ట్‌ఫర్నేసులయొక్క పరిమాణములు హెచ్చుట ఒకచక్కని ఉదాహరణ. బహిరంగ హార్త్‌ఫర్నేసులు, ఇనుము ఉక్కు పరిశ్రమలలో రోలింగ్‌మిల్స్, పవర్‌ఉత్పత్తి కేంద్రాలలో టర్బైనులు మొదలైనవన్నీ టెక్నికల్‌మార్పులనే సూచిస్తాయి. బాహుళ్యమైన పరిశ్రమలలోమాత్రం ప్రవేశపెట్టుటకు వీలైన అమెరికన్ పద్ధతులుగూడా టెక్నికల్‌మార్పులే.

(4) యుద్ధానంతరం గుత్తవ్యాపారం వృద్ధిఅయి మార్కెట్లసమస్య తీవ్రమగుట వల్ల భయంకరమైన పోటీ సంఘర్షణలు ప్రారంభమగుట మరియొక ప్రత్యేకకారణం. ఈ పోటీలవల్ల కొద్దిపాటి ఉత్పత్తిసాగించే చిన్న పరిశ్రమలకు బాహుళ్యంగా ఉత్పత్తి చేయు పెద్దపరిశ్రమలకు మధ్య పోరాటం తీవ్రమయింది. స్వేచ్ఛావ్యాపారానికి మార్కెట్లు తగ్గిపోవుటవల్ల చిన్న పరిశ్రమలు, మధ్యరకం పరిశ్రమలు దివాలాదీసి పెద్దపరిశ్రమలలో కలిసిపోవుటవల్ల ఉత్పత్తికేంద్రీకరణ ఎక్కువయింది. ఉత్పత్తికేంద్రీకరణవల్ల బయలుదేరిన గుత్తవ్యాపారమే కేంద్రీకరణపద్ధతులను అభివృద్ధిచేసిందిగూడా. గుత్తవ్యాపారస్థుల ప్రత్యేక అపూర్వపోటీ పద్ధతులద్వారా, తమ పలుకుబడినంతా వినియోగించి టెక్నికల్ అభివృద్ధియొక్క స్వభావవేగాధిక్యతలవల్ల ప్రత్యర్థులను అణిచివేయుటద్వారా ఉత్పత్తి కేంద్రీకరణ మరింత బలపడింది. అందువల్ల గత 20 సంవత్సరాల్లో అభివృద్ధిఅయిన గుత్తవ్యాపారవిధానం ఉత్పత్తికేంద్రీకరణయొక్క వేగాధిక్యతను వృద్ధిచేయుటలో ఎక్కువగా తోడ్పడిందని చెప్పవచ్చును.

అయినప్పటికీ మార్కెట్లసమస్య తీవ్రమగుటవల్ల, ఉత్పత్తికేంద్రాలన్నీ ఉత్పత్తి చేయగల్గిన పరిమితికి ఎంతో తక్కువఉత్పత్తి చేయుటవల్ల, ఉత్పత్తికేంద్రీకరణ జరుగుతున్నప్పటికి యుద్ధానంతరం ఉత్పత్తిశక్తుల పెరుగుదల ఎక్కువగా వృద్ధికాకపోవుటవల్లనూ కేంద్రీకరణకు అనేక అడ్డంకులుకల్గి పెట్టుబడివిధానం క్రింద కేంద్రీకరణయొక్క వైరుధ్యాలన్నీ బయటపడి దాని సంకుచిత హద్దులను బట్టబయలుచేస్తాయి. అందువల్లనే ఉత్పత్తి కేంద్రీకరణయొక్క అభివృద్ధి పెట్టుబడివిధానంయొక్క అభివృద్ధిమీద ఆధారపడి

యున్నదని లెనిన్ చెప్పాడు. "పెట్టుబడివిధానం ఎంత వేగంగా అభివృద్ధి అయితే అంత వేగంగా ఉత్పత్తికేంద్రీకరణగూడా జరుగుతుంది" అని లెనిన్ వ్రాశాడు. యునైటెడ్ స్టేట్స్‌వంటి దేశాల్లోనూ, భారమైన కొన్ని ప్రధాన పరిశ్రమలలోనూ కేంద్రీకరణ పద్ధతులు త్వరగా అభివృద్ధి అగుట ఆకస్మికంగా జరిగిన విషయంకాదు. కాని బ్రిటన్ విషయంలో అక్కడక్కడా వెదజల్లబడియున్న ఇనుము ఉక్కు పారిశ్రామిక కేంద్రములనన్నీ కేంద్రీకరించుట తటస్థపడలేదు. అది జరిగియున్నట్లయితే బ్రిటన్‌లోగూడా బ్రహ్మాండమైన పారిశ్రామిక కేంద్రాలు నిర్మించబడియుండేవి. అప్పుడు అమలులోఉన్న పారిశ్రామిక కేంద్రాలే పూర్తి శక్తిని వినియోగించి పనిచేయకపోవుటవల్ల, వాటి నన్నిటిని కేంద్రీకరించి బ్రహ్మాండమైన ఉత్పత్తి కేంద్రాలను నిర్మించుటకు ప్రోత్సాహం లేకపోయింది. యునైటెడ్ స్టేట్స్‌లో బాహుళ్యంగా మోటార్లను ఉత్పత్తిచేయు బ్రహ్మాండమైన పారిశ్రామికసంస్థ అయిన ఫోర్డు కంపెనీ మార్కెట్ల సమస్యను తీవ్రంగా ఎదుర్కోవలసివస్తోంది. ముఖ్యంగా ఆర్థిక సంక్షోభకాలంలో నష్టంతో పనిచేయుటగూడా తటస్థించుటవల్ల ఉత్పత్తిగూడా చాలా పడిపోయింది. పరిశ్రమనంతా ముక్కలుముక్కలుగావిభజించి కేంద్రీకరణకు స్వస్తిచెప్పే నష్టముండదని అకస్మాత్తుగా ఫోర్డుకు తట్టింది. యూరపియన్ దేశాల్లో ఇంత పెద్ద బాహుళ్యమైన పరిశ్రమలను కలలోగూడా నిర్మించుటకు వీలులేదు. ఎందుకంటే మిగతా మోటారు పరిశ్రమలనన్నీ మూసివేసినప్పటికి ప్రస్తుత మార్కెట్ల పరిస్థితినిబట్టి యూరప్‌లోని ఏ ఒక్క మోటారు కంపెనీగూడానూటికి 20 వంతుల శక్తినిగూడా వినియోగించుటకు వీలు లేదని స్పష్టమవుతోంది. ఆధునిక పెట్టుబడివిధానంక్రింద ఉత్పత్తి కేంద్రీకరణయొక్క బాహుళ్యం, వేగము హెచ్చినప్పటికి ఆధునిక టెక్నిక్‌వల్ల కల్గిన అవకాశ అవసరాలకు తగినట్లుగా హెచ్చుటలేదు. అంతేకాదు. పెట్టుబడి కేంద్రీకరణం ఎంత వేగముగానూ, బాహుళ్యంగానూ జరుగుతున్నదో దానితో సమానముగానైనా ఉత్పత్తి కేంద్రీకరణయొక్క బాహుళ్యతావేగములు హెచ్చుటలేదు. ప్రస్తుతం అమలులోఉన్న టెక్నికల్ పరిశోధనల వల్ల సాధ్యపడే సమ్మేళన పద్ధతులనుగూడా పెట్టుబడిదారీవిధానం పూర్తిగా వినియోగించుకోలేక పోతోంది.

వెనుకబడియుండిన వ్యవసాయాన్ని కొద్దికాలంలో యంత్రసహాయంద్వారా ప్రపంచంలోకంతటా ఏదేశంలోలేనంత బాహుళ్య వ్యవసాయఅభివృద్ధిని పొందిన సోవియట్ యూనియన్‌తో పోల్చినయెడల, యూరపియన్ దేశాలు ఎన్నడూఎరుగని బ్రహ్మాండమైన పారిశ్రామిక సంస్థలను నిర్మిస్తున్న సోవియట్‌యూనియన్‌తో పోల్చినయెడల, పెట్టుబడి విధానంయొక్క సంకుచితహద్దులన్నీ మరింత ప్రస్ఫుటంకాగలవు.

పెట్టుబడి విధానంక్రింద ఉత్పత్తికేంద్రీకరణ సమస్య క్రమంగా క్లిష్టమవుతుందంటే అర్థంఏమిటి ? పెట్టుబడివిధానం క్రమేణా క్షీణిస్తోందన్నమాట. ఈవిధంగా క్షీణిస్తున్నప్పటికి, యుద్ధానంతరంగూడా, చివరికి ఆర్థిక సంక్షోభకాలంలోగూడా ఉత్పత్తికేంద్రీకరణ

కొంతవరకూ జరిగిందనే విషయాన్ని గుర్తించాలి. అయితే కేంద్రీకరణను ఎదుర్కొనే కష్టాలు అడ్డంకులు అన్నీ కేంద్రీకరణయొక్క క్లిష్టతనుమాత్రం నిరూపిస్తూ దానికి నూతన రూపాలను కల్పిస్తూఉంటాయి. నిజానికి యుద్ధానికిపూర్వం జరిగినంతగా ఉత్పత్తి కేంద్రీకరణ యుద్ధానంతరం జరుగలేదు. నూతన యంత్రముల సహాయంతో పాత పరిశ్రమలను వృద్ధిచేసి విస్తరింపచేయుటగాని లేక నూతన పరిశ్రమలను విరివిగా స్థాపించుటగాని జరుగకపోవుటవల్ల ఈవిషయం మరింత రూఢిఅవుతోంది. కనుక యుద్ధకాలానికి పూర్వంకంటె తరువాత అభివృద్ధి తగ్గిపోవుటవల్ల ఉత్పత్తికేంద్రీకరణయొక్క వేగం క్రమేణా తగ్గిపోయింది. కాని మరొక ముఖ్యవిషయాన్ని గుర్తించితీరాలి. చిన్నపరిశ్రమలెన్నో నిర్మూలమై పెద్దపరిశ్రమలు కొంతవరకూ పెరిగినాయి. ఈపెద్ద పరిశ్రమల అభివృద్ధి ముఖ్యంగా లిమిటెడ్ కంపెనీలనుచూస్తే తెలుస్తుంది. చిన్నచిన్న పారిశ్రామిక సంస్థలను కొనివేయుటవల్ల అవి నిర్మూలమవుతున్నాయి. అనగా చిన్నసంస్థలను నిర్మూలించి పెద్దవాటిని వృద్ధిచేస్తూ విస్తరింపచేయుటయే జరుగుతున్నదిగాని యంత్రసహాయంతో పాతవాటిని అభివృద్ధిచేయుటగాని లేక పెద్దసంస్థలను కొత్తగా స్థాపించుటగాని జరుగుట లేదనేచెప్పాలి. అయినప్పటికి కేంద్రీకరణ జరిగినంతవరకూ గుత్తవ్యాపారసంస్థలుగూడా అభివృద్ధిఅగుటకు అవసరమయిన పరిస్థితులు ఏర్పడుతున్నాయి.

పెట్టుబడివిధానం క్రింద ఉత్పత్తి కేంద్రీకరణయొక్క సంకుచితహద్దులు మరొక విధంగాగూడా వెల్లడిఅవుతున్నాయి. చాలినంత మార్కెట్ లేనందువల్ల ఫోర్డు మోటారు కంపెనీ లేక గేరీ (ఇనుము, ఉక్కు) కంపెనీవంటి బాహుళ్యమైన ఉత్పత్తిసంస్థలను స్థాపించుటకు అవకాశాలు తగ్గిపోతున్నాయి. ఏవో చిన్నచిన్న పరిశ్రమలను ప్రారంభించి వాటిలో సాధ్యపడేఉత్పత్తిలో నూటికి 60 లేక 70 వంతులనుమాత్రం ఉత్పత్తిచేస్తూ లాభం పొందవచ్చునుగాని పెద్దపెద్ద పరిశ్రమలనుస్థాపించి వాటిలో సాధ్యపడే ఉత్పత్తిలో నూటికి 20 నుంచి 40 వంతులవరకూ మాత్రం ఉత్పత్తినిసాగిస్తూ ఉండుటవల్ల నష్టమే గతిఅవుతుంది. ఈవిధంగా ఉత్పత్తి కేంద్రీకరణ సమస్యను మార్కెట్లసమస్య మరింత క్లిష్టంచేస్తోంది.

పెట్టుబడివిధానం సాఫీగా సూటిగా క్రమాభివృద్ధి చెందకపోవుటవల్ల ఉత్పత్తి కేంద్రీకరణయొక్క వైరుధ్యాలుగూడా పెరుగుతున్నాయి. సాఫీగా క్రమంగా అభివృద్ధి పొందుట పెట్టుబడివిధాన లక్షణంకాదు. అది ఎప్పుడూ అంతే. కాని పెట్టుబడివిధానంయొక్క ఈ వైరుధ్యం, గుత్తవ్యాపార విధానం అమలులోకివచ్చిన తరువాత, మరింత ప్రస్ఫుటమవుతున్నది. యుద్ధానంతరం పెట్టుబడిదారులమధ్య పోటీ పోరాటాలు ఇంకా తీవ్రమగుటవల్ల వైరుధ్యము లెక్కువయి ఉత్పత్తి కేంద్రీకరణకోగూడా క్రమాభివృద్ధిని నిరోధించినాయి. ఉత్పత్తికేంద్రీకరణలో క్రమాభివృద్ధి లేనందువల్లనే గుత్తసంస్థలు అన్ని పారిశ్రామికశాఖలలో అభివృద్ధి కాలేకపోయినాయి. కొన్ని ముఖ్యపరిశ్రమలలోమాత్రం

గుత్తసంస్థలు వృద్ధిచెందినాయి. కేంద్రీకరణ సాఫీగా అభివృద్ధిపొందలేదనిచెప్తూ, లెనిన్ "పరిశ్రమయొక్క అన్నిశాఖలలో బాహుళ్యమైన గుత్తసంస్థలు అభివృద్ధికాలేదు" అన్నాడు. ఈవిధంగా ఏవోకొన్ని పెద్ద పరిశ్రమలలోమాత్రం కేంద్రీకరణ వృద్ధిఅయి ఆసంస్థలయొక్క ఆర్థిక అధికారపెత్తనం విపరీతంగా పెరుగుటవల్ల, లక్షలుగాఉన్న చిన్న పరిశ్రమలకు - ఈ పెద్దపరిశ్రమలకు మధ్య వైరుధ్యం పెరిగిపోయింది. పోతే మధ్యరకం సంస్థలవిషయం — 20, 30 సంవత్సరాలక్రింద బ్రహ్మాండ పరిశ్రమ లనుకొనబడినవన్నీ ఈనాడు మధ్యరకపు పరిశ్రమలుగా తయారైనాయి. ఈవిధంగా ఏవో కొన్ని పెద్దపరిశ్రమలయొక్క అధికారం అతీతంగా పెరుగుటవల్ల గుత్తవ్యాపారసంస్థల యొక్క దోపిడీగూడా అతీతంగా పెరిగింది.

## 2. గుత్త పరిశ్రమలయొక్క అభివృద్ధి.

గుత్తసంస్థల అభివృద్ధిని నిరూపించుటకు లెనిన్ ఉదహరించిన లెక్కలను ప్రస్తుత లెక్కలతో పోల్చిచూస్తే (1) గుత్త సంస్థలయొక్క మహత్తర అభివృద్ధియేగాక (2) యుద్ధకాలంలోనూ యుద్ధానంతరం గుత్తసంస్థలు యుద్ధానికిపూర్వంకంటె త్వరగా వృద్ధి అయినవని స్పష్టపడుతుంది. ఈ క్రింది విషయాలను చూడండి :—

జర్మనీలో గుత్తవ్యాపార సంస్థలు, కార్టెల్స్ ఏవిధంగా వృద్ధిచెందినవో చూద్దాం. 1896 లో 250 ఉండేవి. 1911 వచ్చేసరికి 550 నుంచి 600 వరకూ పెరిగినాయి. 1930 లో 2100 కు పెరిగినాయి. అధికార అధిక్యతలు కల్గిన కార్టెల్స్‌కు ఉదాహరణలుగా లెనిన్ ఈ క్రింది సంస్థలను ఉదహరించాడు :—

రైన్ వెస్ట్‌ఫేలియన్ బొగ్గు సిండికేట్
గెల్సిన్‌కిర్షన్ గనుల కంపెనీ
జర్మనీ రసాయన పరిశ్రమల సమ్మేళనం
యునైటెడ్ ఉక్కు కార్పొరేషన్
యునైటెడ్‌స్టేట్స్ స్టాండర్డు ఆయిల్ కంపెనీ మొదలైనవి.

యుద్ధానికిపూర్వం గెల్సెన్‌కిర్షన్ కంపెనీకంటె 4,5 రెట్లు బాహుళ్యమైన ఉక్కు పారిశ్రామిక సంస్థ జర్మనీలో వృద్ధిచెందింది. లెనిన్ ఉదహరించిన రసాయన కంపెనీల కంటె ప్రస్తుత జర్మన్ రసాయన ట్రస్టు 20 రెట్లు ఎక్కువ పెట్టుబడి కల్గిన సంస్థ. 1908 లో 1 కోటి 40 లక్షల టన్నుల ఉక్కును తయారుచేస్తూఉండే యునైటెడ్‌స్టేట్స్ ఉక్కు కార్పొరేషన్ ప్రస్తుతం 2 కోట్ల 70 లక్షల టన్నుల ఉక్కును ఉత్పత్తి చేస్తోంది.

అనగా 1932 లో బ్రిటన్, ఫ్రాన్సు, జర్మనీ, ఇటలీ దేశాల్లో తయారయే మొత్తం ఉక్కుకంటె ఈనాడు యునైటెడ్‌స్టేట్స్ ఉక్కు కార్పొరేషన్ ఎక్కువ ఉక్కును తయారుచేస్తోంది. కాని అమెరికాలో ఉక్కును ఉత్పత్తిచేసే బెథెల్‌హామ్ ఉక్కు కార్పొ

రేషన్ వంటి ఇతర గుత్త సంస్థలు బయలుదేరుటవల్ల యునైటెడ్ స్టేట్స్ ఉక్కు కార్పొరేషన్ ఉత్పత్తిచేసే ఉక్కు పరిమాణం క్రమేణాతగ్గిపోతోంది. బెధెల్‌హమ్ కార్పొరేషన్ ఉత్పత్తిచేసే ఉక్కు (సంవత్సరానికి 1 కోటిటన్నులు) యుద్ధానంతరం బ్రిటన్‌లో ఏ ఒక సంవత్సరంలో ఉత్పత్తిచేయబడిన ఉక్కుకంటె ఎక్కువయే. గుత్తసంస్థలకు వ్యతిరేకంగా చేయబడిన శాసనములు వర్తించకుండా తప్పించుకొనుటకై స్టాండర్డు నూనెకంపెనీ 1911 లో రద్దుచేయబడి అనేక చిన్నకంపెనీలుగా విభజించబడినది. 1910 లో ఆకంపెనీకి ఉన్నపెట్టుబడి కంటె ఈ నాడు పెట్టుబడి 20 రెట్లుపెరిగించి. ఆకంపెనీ కంట్రోల్‌చేసే మొత్తం స్టాకులయొక్క విలువ 500 కోట్ల డాలర్లకు పెరిగింది. ఈ విషయాలన్నీ గుత్తవ్యాపారసంస్థలయొక్క పెరుగుదలనే సూచిస్తాయి. ఈ అభివృద్ధిఅంతా లెనిన్ తన సామ్రాజ్యవాదమును రచించిన తరువాతవచ్చినదే.

ఈ గుత్తపరిశ్రమలు గడించే లాభాలనుచూస్తే వాటియొక్క అధికారం ఎంతవరకు పెరిగిందో బోధపడుతుంది. కొన్నిఉదాహరణలను చూద్దాం. యుద్ధానికిపూర్వం జనరల్ మోటార్సుకంపెనీకి సంవత్సరానికి 1 కోటిడాలర్లకు మించిఎప్పుడూలాభం రాలేదు. 1928 లో ఆకంపెనీకి 27 కోట్ల 20 లక్షల డాలర్లకుపైగా లాభంవచ్చింది! ఇక బెధెల్‌హామ్ ఉక్కుకార్పొరేషన్ విషయంలో 1929 కి పూర్వం గత 10 సంవత్సరాల్లోవచ్చిన మొత్తం లాభంకంటె 1929 లో ఎక్కువగా లాభంవచ్చింది. 1922-1928 మధ్యఆరుసంవత్సరాల్లో అమెరికా రేడియో కార్పొరేషన్ యొక్క లాభాలు 7రెట్లు పెరిగినాయి. నిజానికియీలెక్కలలో చూపినంతకంటే ఎక్కువలాభాలేవచ్చి ఉంటాయి. ఎందుకంటే, రహస్యంగా పంచిపెట్టబడే లాభాలు ఈ లెక్కలలోకిరావుగదా! సమాజంనుంచి పెద్దపెద్దగుత్తవ్యాపారసంస్థలు ఎంతెంతవిపరీత లాభాలు గడిస్తున్నవో ఇంకాకొన్ని ఉదాహరణలను చూద్దాం. 1901 నుంచి 1930 వరకూ యునైటెడ్ స్టేట్స్ ఉక్కుకార్పొరేషన్‌కువచ్చిన మొత్తంలాభం 450 కోట్లు డాలర్లు1912-1930 మధ్య స్టాండర్డుఆయిల్‌కంపెనీకి వచ్చిన లాభం 400 కోట్ల డాలర్లు 1909-1932 మధ్యజెనరల్ మోటార్సు కంపెనీకి వచ్చినలాభం 160 కోట్లడాలర్లు. 1915-1932 మధ్య డుపాంత్ నెమెర్ అండ్ కంపెనీకివచ్చిన మొత్తం లాభం 110 ,కోట్ల డాలర్లు. 1900 నుంచి 1932 వరకూ అమెరికన్ టెలిఫోన్ అండ్ టెలిగ్రాఫ్ కంపెనీకి వచ్చిన మొత్తంలాభం (దానిసహాయ కంపెనీఅయిన బెల్ టెలిఫోన్‌కంపెనీకి 1915-1932 మధ్యవచ్చిన లాభాలతోసహా) 420 కోట్లడాలర్లకంటె ఎక్కువే. ఉత్పత్తికి సంబంధించిన గుత్తసంస్థలు ఎంతవరకు అభివృద్ధి అయినవో సుమారుగా తెలియజేసే సంఖ్యలు ఈ క్రింది పట్టికలో ఇవ్వబడినాయి.

యునైటెడ్ స్టేట్స్

| పరిశ్రమ | సంవత్సరం | గుత్తసంస్థల సంఖ్య | పరిశ్రమలో ఈసంస్థల పరిమితి (నూటికి) | ఆపరిశ్రమలో అన్నిటికంటె పెద్దసంస్థ యొక్క పరిమితి (నూటికి) |
|---|---|---|---|---|
| ఆన్‌థ్రసైట్ (ఒకరకంబొగ్గు) | — | 6 | 90 | 45 |
| ముడిఇనుము | 1931 | 4 | 60 | 43 |
| నూనె | 1932 | 1 | 45-50 | 45-50 |
| ఉక్కు | 1932 | 3 | 60 | 40 |
| రాగి | 1933 | 5 | 98 | 37 |
| అల్యూమినియమ్ | 1928 | 1 | 95-100 | 95-100 |
| ప్రేలుడు పదార్థాలు | 1917 | 1 | 65-80 | 65-80 |
| సోడియమ్ | 1930 | 1 | 60 | 60 |
| సిల్కు (కృత్రిమం) | 1933 | 6 | 80 | 33 |
| మోటార్ పరిశ్రమ | 1933 | 3 | 89 | 60 |
| వ్యవసాయికయంత్రాలు | 1918 | 1 | 65 | 65 |
| ఎలక్ట్రికల్ ఇంజనీరింగ్ | 1923 | 2 | 75-80 | 40-50 |
| టెలిఫోన్ అండ్ టెలిగ్రాఫ్ | 1930 | 1 | 75 | 75 |
| రేడియో | 1930 | 1 | 95-100 | 95-100 |
| మాంసంప్యాకింగ్ | 1929 | 4 | 70 | — |
| పంచదార | 1928 | 2 | 46 | — |
| రొట్టెలు | 1928 | 3 | 18 | — |
| పొగాకు | 1930 | 4 | 79 | 41 |
| రైల్వేలు | 1930 | 14 | 86 | 12 |
| విద్యుచ్ఛక్తి | — | 8 | 74 | 23 |
| **బ్రిటన్** | | | | |
| ఇనుము, ఉక్కు | 1934 | 10 | 70-75 | 16 |
| అల్యూమినియమ్ | 1928 | 1 | 100 | 100 |
| మోటారు | 1933 | 1 | 50 | 50 |
| నౌకానిర్మాణం | 1926 | 10 | 66 | — |
| ముఖ్య రసాయన పదార్థాలు | 1928 | 1 | 95 | 95 |

| | | | | |
|---|---|---|---|---|
| కృత్రిమనత్రజని | 1928 | 1 | 100 | 100 |
| కృత్రిమ రంగులు | 1928 | 1 | 40 | 40 |
| కృత్రిమ సిల్కు | 1930 | 1 | 80 | 80 |
| సిమెంటు | 1926 | 2 | 60-70 | — |
| ప్రత్తి | 1932 | 1 | 20-25 | 20-25 |
| దారం | 1926 | 1 | 80 | 80 |
| పొగాకు | 1923 | 1 | 60-70 | 60-70 |
| సారాయి | 1926 | 1 | 80 | 80 |
| సబ్బు | 1926 | 1 | 90 | 90 |
| మార్గరైన్ | 1932 | 1 | 90 | 90 |
| రబ్బర్ టైర్లు | 1926 | 1 | 90 | 90 |
| గోడకాగితం | 1926 | 1 | 90 | 90 |
| రైల్వేలు | 1931 | 4 | 95 | — |
| నౌకాపరిశ్రమ | 1932 | 6 | 50 | — |
| బొగ్గు | 1933 | 10 | 45 | 17-20 |
| పిగ్ ఇనుము | 1932 | 5 | 86 | 53 |
| ఉక్కు | 1932 | 5 | 73 | 38 |
| అల్యూమినియమ్ | 1928 | 1 | 80-85 | 80-85 |
| మోటార్లు | 1932 | 4 | 71 | 30 |
| ఎలక్ట్రికల్ ఇంజనీయరింగ్ | 1932 | 2 | 60-80 | — |
| కృత్రిమ రంగులు | 1928 | 1 | 95-100 | 95-100 |
| కృత్రిమనత్రజని | 1932 | 1 | 80 | 80 |
| లోహద్రావకాలు | 1928 | 1 | 90 | 90 |
| కృత్రిమసిల్కు | 1930 | 3 | 70 | — |
| పొటాష్ | 1932 | 6 | 100 | 41 |
| మార్గరైన్ | 1928 | 1 | 75-80 | 75-80 |
| నౌకానిర్మాణం | 1929 | 3 | 75 | 36 |
| నౌకాపరిశ్రమ | 1930 | 1 | 61 | 61 |
| **ఫ్రాన్స్** | | | | |
| ఇనుము, ఉక్కు | 1933 | 10 | 72 | 16 |
| అల్యూమినియమ్ | 1928 | 2 | 100 | 90 |
| ముఖ్య రసాయన పదార్థాలు | 1928 | 1 | 70 | 70 |

| | | | | |
|---|---|---|---|---|
| కృత్రిమ నత్రజని | 1928 | 1 | 40 | 40 |
| కృత్రిమ రంగులు | 1928 | 1 | 80 | 80 |
| ఎలక్ట్రికల్ ఇంజనీయరింగ్ | 1931 | 1 | 60 | 60 |
| ఎలక్ట్రికల్ సప్లయి | 1931 | 2 | 90-100 | 50 |
| రైల్వేలు | 1931 | 4 | 70 | — |
| మోటారు పరిశ్రమ | 1932 | 3 | 75 | 33 |
| **జపాన్** | | | | |
| బొగ్గు | 1930 | 2 | 50 | 30 |
| ఇనుము ఉక్కు | 1929 | 3 | 75 | 42 |
| రాగి | 1927 | 5 | 87 | 23 |
| కృత్రిమనత్రజని | 1928 | 2 | 79 | 43 |
| సిమెంటు | 1932 | 2 | 70 | 50 |
| ప్రత్తి | 1929 | 5 | 54 | 14 |
| కాగితం | 1928 | 1 | 76 | 76 |
| పిండిమరలు | 1929 | 2 | 82 | 45 |
| పంచదార | 1928 | 2 | 78 | 44 |
| ఎలక్ట్రికల్‌సప్లయి | 1930 | 5 | 50 | — |
| కృత్రిమసిల్కు | 1933 | 4 | 73 | 24 |

గుత్తసంస్థలయొక్క అభివృద్ధి యదార్థంగా పైపట్టికలో సూచించబడిన దానికంటె ఎక్కువగానే ఉంటుంది. మొదటివిషయం—గుత్తసంస్థలు బయలుదేరిన అన్నిపరిశ్రమల పేర్లు పైపట్టికలో పేర్కొనబడలేదు. రెండవవిషయం — పేర్కొనబడిన పరిశ్రమలలో గూడా పెద్దపెద్ద గుత్తసంస్థలు మాత్రమే చెప్పబడినాయి. మూడవది — వేరువేరుగా ఇవ్వబడిన పరిశ్రమలు ఒక్కొక్కప్పుడు ఒకేఒక గుత్తసంస్థయొక్క అధీనంలో ఉండవచ్చును. నాల్గవది— అనేక గుత్తసంస్థలమధ్య తరచుగాఉండే దగ్గరసంబంధాలు పట్టికలో సూచించబడలేదు. చివరివిషయం— పెద్దపెద్ద ట్రస్టులకు సంబంధించిన లెక్కలుమాత్రమే పట్టికలో ఇవ్వబడినాయి. చిన్నచిన్న కార్టెల్స్ మొదలైన సంస్థలకు చెందిన ఒడంబడికలు వదిలివేయబడినాయి.

ఈ చివరివిషయానికి ఉదాహరణ చూడండి:— జర్మనీలో బొగ్గుపరిశ్రమకుచెందిన పెద్దపెద్ద గుత్తసంస్థలు 10 ఉన్నాయి. వీటిలో అన్నిటికంటె పెద్దదయిన ఉక్కుట్రస్టు దేశంలోని మొత్తంబొగ్గులో నూటికి 17 నుంచి 20 వంతులవరకూ కంట్రోల్‌చేస్తుంది. కాని కార్టల్ సిండికేట్ల విషయంగూడా లెక్కలోకితీసుకుంటే రైన్‌వెస్ట్‌ఫేలియన్ బొగ్గు

సిండికేట్ ఒక్కటే రూర్‌గనులలోని 99.6 వంతులబొగ్గును; దేశంమొత్తం బొగ్గులో నూటికి 74.5 వంతుల బొగ్గును కంట్రోల్‌చేస్తోంది.

ఈనాడు జర్మనీలోని కార్టెల్స్ వివిధ ఉత్పత్తిరంగాల్లో ఎంతవరకూ కంట్రోల్‌కల్గి ఉన్నవో ఈక్రింది సంఖ్యలు తెలియజేస్తాయి :—

| కార్టెల్స్ కంట్రోల్‌చేసే పరిశ్రమలు | దేశం మొత్తం పరిశ్రమలో నూటికి ఎన్నివంతులు ? |
|---|---|
| పొటాషియమ్, పిగ్‌ఇనుము, బొగ్గు, ఇనుపకడ్డీలు, తగరపు రేకులు, తీగలు, ఎలక్ట్రిక్ మీటర్లు, కుమ్మరిపరిశ్రమ. కృత్రిమ నత్ర జని, పంచదార, సున్నం, సబ్బు, గాజు, సిమెంట్. సిగరెట్లు, మోటార్‌టైర్లు, పొగాకు, రసాయనపదార్థాలు, మందులు. | 95—100 |
| యంత్రాలు, బాయిలర్లు, శాస్త్రీయపరికరాలు, రైల్వేకార్లు, అచ్చుకాగితం, నూలు, జనుపనార, గుడ్డలు, సిల్కులు, కృత్రిమ సిల్కు. | 80—95 |
| మిశ్రమఉక్కులు, ఉప్పు, గుడ్డ బెల్టులు | 60—70 |
| కిటికీఅద్దాలు, గుడ్డలు | 40—50 |

ఫ్రాన్సు, బ్రిటన్ దేశాలకు చెందిన సంఖ్యలు సరిగా దొరుకుటలేదు. కాని సుమారుగా ఫ్రాన్సు, బ్రిటన్ దేశాలలోని మొత్తం కార్టెల్స్‌సంఖ్యలు ఈ క్రింద ఇవ్వబడినాయి :

| | ఫ్రాన్సు | బ్రిటన్ |
|---|---|---|
| మొత్తం కార్టెల్స్‌సంఖ్య | 87 | 181 |
| ప్రధాన పరిశ్రమలు (గనులు, ఇనుము, ఉక్కు, మెకానికల్ ఇంజనీయరింగ్, ఎలక్ట్రికల్ ఇంజనీయరింగ్, రసాయన పదార్థాలు) | 64 | 109 |
| సామాన్యపరిశ్రమలు (గుడ్డలు, తోలు, కాగితం, ఆహార పదార్థాలు) | 16 | 42 |
| గృహనిర్మాణ పరిశ్రమ, నిర్మాణపరికరాలు | 5 | 29 |

గుత్తసంస్థలయొక్క పరిమితిని తెలియజేసే పైసంఖ్యలన్నీ యదార్థసంఖ్యలకు కొంచెం తగ్గేఉంటాయి. అయినప్పటికి గుత్తసంస్థలయొక్క అతీతఅధికారమును తెలుసుకొనుటకు పైసంఖ్యలు సహాయపడతాయి. గుత్తసంస్థలయొక్క అభివృద్ధి పరిశ్రమలను బట్టి, దేశాన్నిబట్టి వేరువేరుగా కన్పిస్తుంది.

పెట్టుబడివిధానం అన్నివిధాలా సంక్షోభంలో చిక్కుకొని పోతూఉన్న పరిస్థితులలో గుత్తసంస్థలయొక్క అధికారం ఇంతఎక్కువగా పెరుగుటకు కారణంఏమిటి? యుద్ధ

కాలంలోనూ యుద్ధానంతరం పెట్టుబడి పరిశ్రమలలోవచ్చిన కేంద్రీకరణ గుత్తసంస్థల యొక్క అభివృద్ధికి ముఖ్యంగా తోడ్పడింది. అంతేగాకుండా గుత్తసంస్థలయొక్క అభివృద్ధికి ఈక్రింది విషయాలుగూడా సహాయపడినాయి.

(1) సామ్రాజ్యవాద యుద్ధంవల్ల గుత్తసంస్థలు వేగంగా అభివృద్ధిఅయినాయి. గుత్తసంస్థల వృద్ధినిగురించిచెప్తూ "యుద్ధంవల్ల గుత్తసంస్థలయొక్క సంఖ్య, ప్రాముఖ్యతలు 10 రెట్లు హెచ్చినాయి" అని లెనిన్‌చెప్పాడు. యుద్ధకాలంలో పరిశ్రమలమీద ప్రభుత్వపెట్టుబడి సంస్థలయొక్క కంట్రోల్ ఎక్కువగుట గుత్తసంస్థలకు దారితీసింది. (ఉదాహరణకు జర్మనీ, యునైటెడ్‌స్టేట్స్ మొదలైన దేశాల్లోని యుద్ధసామగ్రుల పరిశ్రమలు, ఇతర యుద్ధకార్పొరేషన్లు) ఈ పరిస్థితులలో యుద్ధంద్వారా లాభాలను విపరీతంగా పొందుటకేగాక, విదేశపరిశ్రమలను నిర్మూలించి తమ పరిశ్రమలను బాహుళ్యంగా వృద్ధిచేసుకొనుటకు నూతన పరిశ్రమలనుగూడా కంట్రోల్‌చేయుటకు గుత్తసంస్థలు వృద్ధి అయినాయి. ప్రభుత్వసహాయ ప్రోత్సాహములుగూడా దొరుకుటవల్ల ఈసంస్థలు బాగా వృద్ధిఅగుట తటస్థించింది. ఒక్కొక్కప్పుడు ప్రభుత్వ బలత్కారంవల్లగూడా గుత్తసంస్థలు బయలుదేరుట జరిగింది. గుత్తసంస్థలయొక్క ఆధిక్యతద్వారా యుద్ధకాలంలో ప్రభుత్వ గుత్తసంస్థలే బయలుదేరినాయి. ఈవిధంగా గుత్తసంస్థలయొక్క ఆధిక్యత మరింత బలపడింది.

(2) యుద్ధకాలంలోనూ, యుద్ధానంతరం జరిగినంతగా పెట్టుబడి కేంద్రీకరణ పెట్టుబడివిధాన చరిత్రలో ఎన్నడూ జరుగలేదు. అందువల్లనే ఈదశలలో గుత్తసంస్థలు గూడా ఎక్కువగా అభివృద్ధిఅయినాయి. యుద్ధకాలంలో కొద్దిమంది గుత్తవ్యాపారస్థులకు గొప్పలాభాలు వచ్చినందువల్ల ఇతర ప్రపంచమంతా దరిద్రస్థితిలో చిక్కుకొనుటగూడా తటస్థించింది. యుద్ధానంతరం మొదటిసంవత్సరాల్లో ధరలు విపరీతంగాపెరిగి కొన్నినెలల లోనే గుత్తవ్యాపారస్థులందరూ అంతులేనిలాభాలు గడించారు. ప్రజాసామాన్యమంతా అదేసమయంలో బాగా దెబ్బతిని నాశనమయ్యారు. యుద్ధానంతరం బయలుదేరిన తీవ్రమైన పోటీలు, తరువాతవచ్చిన తీవ్ర ఆర్థికసంక్షోభం — ఇవన్నీ పెట్టుబడి కేంద్రీకరణ యొక్క వేగాన్ని ఎక్కువచేసి గుత్తసంస్థలయొక్క అభివృద్ధికి కారణమయినాయి.

(3) యుద్ధకాలంలోనూ, యుద్ధానంతరం 'నూతన' పరిశ్రమలుగూడా వృద్ధిఅయినాయి, ఇవన్నీ ప్రారంభంనుంచీ గుత్తసంస్థలుగానే బయలుదేరుటవల్ల మొత్తంమీద గుత్తసంస్థలయొక్క అభివృద్ధికి తోడ్పడినాయి. ముఖ్యంగా రసాయన, మోటార్, అల్యూమినియమ్, నూనె, కృత్రిమసిల్కు మొదలైన పరిశ్రమలలో గుత్తసంస్థలు బాగా వృద్ధిచెందినాయి. ఈ పరిశ్రమలలో హెచ్చుస్థాయికివచ్చిన ఉత్పత్తికేంద్రీకరణ పద్ధతులు, పెట్టుబడియొక్కస్వభావం, గుత్తసంస్థలయొక్కవృద్ధికి సహాయపడినాయి. ఈపరిశ్రమలు ఏయే దేశాల్లో ప్రవేశపెట్టబడినవో ఆదేశాల్లో వెంటనే అవి శక్తివంతమైన గుత్తసంస్థ

టుగా తయారైనాయి. గుత్తపరిశ్రమలయొక్క పరిమితిని తెలియజేసేపట్టికలో (146, 147, 148 పేజీలలో ఇవ్వబడిన పట్టిక చూడండి) ఈ పరిశ్రమలు ఎటువంటి ముఖ్య స్థానాన్ని ఆక్రమిస్తున్నవో చూడవచ్చును.

(4) యుద్ధానంతర దశలో పారిశ్రామిక యంత్రాలన్నీ తమశక్తికి ఎంతోతగ్గి పని చేయుటతోపాటు మార్కెట్ల సమస్యగూడ క్లిష్టమగుటవల్ల గుత్తపరిశ్రమలు అభివృద్ధి చెందినాయి. ఉదాహరణకు 1926 లో స్థాపించబడిన జర్మన్ ఉక్కుట్రస్టును చూడండి. అనేకచిన్న ఉక్కుపరిశ్రమలను వెనుకబడియున్న ఉక్కుపరిశ్రమలను నిర్మూలించి, నూతన టెక్నికల్ పరికరాలతో యంత్రములను పూర్తిగా పనిచేయించుటకై చేసిన ప్రయత్నాలఫలితమే 'జర్మన్ ఉక్కుట్రస్టు'. వివిధపరిశ్రమలలో నిపుణత్వము కలుగజేయుటకై జరిగిన తీవ్రప్రయత్నాలుగూడా గుత్తసంస్థలనిర్మాణానికి మద్దతునిచ్చినాయి. ఈ ప్రయత్నాలతో వేరుచేయుటకువీలులేని * 'రేషనలైజేషన్'గూడా గుత్తసంస్థల ఉద్యమానికి ప్రోత్సాహం కల్గించింది. మార్కెట్ల సమస్య తీవ్రమవుతున్నప్పుడు, పరిశ్రమలన్నీ శక్తికి తగినట్లుగా పనిచేయకుండా కుంటుపడుతున్నప్పుడు ప్రపంచ మార్కెట్టుకొరకు వివిధపెట్టుబడి సంస్థలమధ్య పోరాటాలు ఎక్కువగుతున్నప్పుడు అతీతలాభాలను గడించుటకై గుత్తపరిశ్రమలు అనుసరించినమార్గాలు రెండు (1) అదివరకే ఏర్పాటుచేయబడిన గుత్తసంస్థలను విశాలపరచి బలపరచుట (2) కొద్దిపరిమితిలో నడుపబడుతున్న గుత్తసంస్థల స్థాయిని అభివృద్ధిచేసి హెచ్చుస్థాయికి తీసుకునిపోవుట.

(5) గుత్తసంస్థలు ఎక్కువగా అభివృద్ధిగాకుండా అంతవరకూ వెనుకబడియున్న దేశాల్లోగూడా, ప్రపంచమార్కెట్లకై ప్రారంభమయిన తీవ్రపోరాటంవల్ల గుత్తసంస్థలు ఎక్కువగా అభివృద్ధిఅయినాయి. ఉదాహరణగా బ్రిటన్ తీసుకుందాం. బ్రిటన్‌లో నూతన పరిశ్రమలస్థాపనలో (ముఖ్యంగా సంక్షోభకాలంలోనూ సంక్షోభం ప్రారంభమయే దశలోనూ) గుత్తసంస్థలుముందుకువచ్చినాయి. ప్రపంచప్రత్తి పరిశ్రమలలో ఒకపెద్ద గుత్తసంస్థఅయిన లంకషైర్ ప్రత్తికార్పొరేషన్ ఒకచక్కటి ఉదాహరణ. బ్రిటన్‌లో గుత్తసంస్థలు 1926-29 మధ్య వృద్ధిఅయినవని నిరూపించుటకు అవసరమైన లెక్కలు ముందే ఇవ్వబడినాయి. ఈసంస్థలన్నీ ప్రపంచ ఆర్థిక సంక్షోభకాలంలో మరింత వృద్ధిఅయినాయి. జర్మనీ, యునైటెడ్‌స్టేట్స్ దేశాలతో సమానంగా బ్రిటన్ అభివృద్ధికాలేదు. ఆవిషయంలో బ్రిటన్ ఇంకా వెనుకబడియే ఉన్నదనిచెప్పాలి. బ్రిటన్‌లోని పాతపరిశ్రమలన్నీ ఉత్పత్తికేంద్రీకరణ విష

---

* రేషనలైజేషన్ : యంత్రపరికరాలను తగ్గించి మానవ శ్రమశక్తిని ఎక్కువ వ్యయం చేయుటద్వారా యంత్రచలన శక్తిని ఎక్కువచేసి ఉత్పత్తిని వృద్ధిచేసేపద్ధతి. నూతన పరిశోధలనన్నిటినీ వినియోగించి 'రేషనలైజ్' చేయుటకు పారిశ్రామిక యజమానులు ప్రయత్నిస్తారు.

యంలో జర్మన్, యునైటెడ్ స్టేట్స్ పరిశ్రమలతో పోల్చిచూస్తే ఎంతో వెనుకబడియుండు టయే దీనికికారణం.

(6) యుద్ధానంతరం పెట్టుబడివిధానం సాఫీగా అభివృద్ధికాలేదు. మిట్టపల్లాలలో కొట్టుకుంటూ పెట్టుబడివిధానం ఎగుడుదిగుడుగా అభివృద్ధి అయింది. గుత్తసంస్థల నిర్మాణానికి ఇది గూడా ఒక కారణమనే చెప్పాలి. యూరప్‌ఖండంలో ఫ్రాన్సులోనూ, ఆసియాలో ఫ్రాన్సుకంటె వేగంగా అభివృద్ధిఅయిన జపాన్‌లోనూ గుత్తసంస్థల అభివృద్ధి ఎక్కువగా జరిగింది.

జపాన్‌లోని మొత్తం పెట్టుబడివ్యాపారంలో సుమారు సగభాగాన్ని 4 పెద్ద పెట్టుబడి సంస్థలు కంట్రోల్ చేస్తున్నవంటే గుత్తసంస్థలు జపాన్‌లో ఎంత హెచ్చుస్థాయికి వెళ్ళినవో తెలుస్తుంది. భూస్వామ్య జమీందారీ విధానమే ఇంకా ప్రధానంగా ఆధిక్యత వహిస్తున్న జపాన్‌లో ఇంత ఎక్కువగా గుత్తవ్యాపారం పెరిగిపోతున్నదంటే గుత్త వ్యాపారస్థులు జపానీస్ ప్రజలను ఎంత ఎక్కువగా దోపిడిచేస్తున్నారో తెలుస్తుంది.

ఆర్థిక సంక్షోభకాలంలో పోటీని ఎదుర్కొనలేక గుత్తవ్యాపారసంస్థలే కొన్ని నాశనమయినవంటే, సంక్షోభదశలో బ్రహ్మాండమైన గుత్తసంస్థలు మాత్రమే నిలబడి అభివృద్ధి పొందినవని, అందువల్ల సంక్షోభదశలో గుత్తవ్యాపారం ఉచ్చదశకు వృద్ధిఅయిందని తెలుస్తుంది. దానితోపాటు దోపిడీగూడా వృద్ధి అయిందన్నమాటే!

ఆర్థిక సంక్షోభదశలో గుత్తవ్యాపారరంగంలో వచ్చిన మార్పులను తెలియజేయుటకు ఈ క్రిందిసంఖ్యలు సహాయపడతాయి. అసంపూర్ణమైనప్పటికీ ఈ సంఖ్యలు గుత్త వ్యాపార అభివృద్ధిని స్పష్టంగా తెలియజేస్తున్నాయి :—

ఆర్థికసంక్షోభదశలో గుత్తవ్యాపార సంస్థలు
(1930 జనవరినుంచి 1934 ఆగస్టువరకూ)

| | 11 యూరపియన్ దేశాల్లో | ఒక జర్మనీలో |
|---|---|---|
| పునరుద్ధరించబడిన గుత్తసంస్థలు | 132 | 61 |
| నాశనమయినవి | 89 | 49 |
| కొత్తగా బయలుదేరినవి | 277 | 142 |

సంక్షోభకాలంలో అనేక కార్టెల్స్ నాశనమయి. సంక్షోభానంతరం వాటిలో చాలా భాగం పునరుద్ధరించబడినాయి. సంక్షోభకాలంలో మొదటి సంవత్సరంలోనే కొన్నికార్టెల్స్ ఆగిపోయినా వాటిపేర్లు మాత్రం కార్టెల్స్‌లిస్టునుంచి తొలగించబడలేదు. అటువంటి వాటిని గూడా కల్పుకొన్నప్పటికీ, సంక్షోభకాలంలో మొత్తం నాశనమయిన కార్టెల్స్ సంఖ్యకంటె క్రొత్తగా స్థాపించబడినవే ఎక్కువగా ఉన్నాయి. అనగా సంక్షోభఫలితంగా గుత్త వ్యాపార సంస్థలు కొంతవరకూ వృద్ధిపొందినాయి. కార్టెల్స్ ఎక్కువగా అభివృద్ధిచెందిన

జర్మనీవిషయాన్ని చూద్దాం. సంక్షోభదశలో మొదటి రెండుసంవత్సరాలతో పోల్చిచూస్తే 1932 జూలైనుంచి 1934 ఆగస్టువరకూ క్రొత్తకార్టెల్స్ ఎక్కువత్వరగా వృద్ధిచెందినయి. అదేకాలంలో కార్టెల్స్ క్షీణించుటగూడా చాలావరకు తగ్గిపోయింది.

## జర్మనీలో నేషనల్ కార్టెల్స్

| | సగటున సంవత్సరానికి | |
|---|---|---|
| | 1930 జనవరి నుంచి 1932 జూన్‌వరకూ | 1932 జూలైనుంచి 1934 జూలైవరకూ |
| పునరుద్ధరించబడిన కార్టెల్స్ | 13 | 14 |
| నాశనమయినవి | 15 | 5 |
| క్రొత్తగా స్థాపించబడినవి | 18 | 47 |

1932 జూలైనుంచి 1934 జూలైవరకూ కార్టెల్స్ అంతత్వరగా వృద్ధిఅగుటకు కారణం? ఈ 2 సంవత్సరాలలో సంక్షోభకాలంలోని పరిశ్రమలమాంద్యం తీవ్రమయింది. దానికితోడు జర్మనీలోని ఫాసిస్టుప్రభుత్వం బలాత్కారంగా చిన్నపరిశ్రమలను నాశనం చేస్తూ కార్టెల్స్‌ను వృద్ధిచేయుటకు పూనుకుంది.

పెద్దపెద్ద గుత్తసంస్థలతో 'పోటీచేసే పారిశ్రామిక సంస్థలయొక్క షేర్లవిలువ పడిపోయినప్పుడు (స్టాక్ ఎక్స్ఛేంజ్ మాంద్యంవల్ల) ఆ షేర్లన్నిటిని కొనుటద్వారా పోటీసంస్థలు నాశనమయి గుత్తసంస్థలు బలపడుటగూడా జరిగింది. సంక్షోభకాలంతో గుత్తసంస్థలన్నీ తమ సొంత అధికారబలంతోనేగాక ప్రభుత్వ సహాయంతోగూడా బలపడినాయి.

సంక్షోభకాలంలో దివాలాఎత్తుటకు సిద్ధమయిన గుత్తసంస్థలకు ప్రభుత్వాలు కోట్లకు కోట్లధనాన్ని సహాయంగా ఇచ్చుటవల్ల నాశనంగాకుండా "పునర్నిర్మించ"బడినాయి. ఉదాహరణకు జర్మన్ ప్రభుత్వం ఒక్క డ్రెస్‌డ్నెర్ బ్యాంకుకే 50 వేలకోట్ల మార్కులను సహాయంగా ఇవ్వవలసి వచ్చింది. దివాలా ఎత్తకుండా గుత్తసంస్థలకు వివిధదేశాల్లోని ప్రభుత్వాలు ఏవిధంగా తోడ్పడినవో ఇదివరకే ఉదాహరణలు ఇవ్వబడినయి. సహాయం అంటే కేవలం ధనసహాయమే కాకపోవచ్చును. యుద్ధసామగ్రులను తయారుచేయు ఫ్యాక్టరీల నిర్మాణానికి సహాయం, గవర్నమెంటు ఆర్డర్లు, ముఖ్యంగా యుద్ధసామగ్రులకై ఆర్డర్లు.... ఇవన్నీ గుత్తసంస్థలకు సహాయపడే విషయాలే. పన్నులను విధించుటవల్ల ప్రజాసామాన్యంయొక్క జీవితప్రమాణం పడిపోయినప్పుడు, గుత్తసంస్థలు ఎక్కువగా అభివృద్ధికాగలవు.

సంక్షోభంనుంచి బయటపడుటకు వివిధదేశాల్లో పెట్టుబడిదారులు, ప్రభుత్వాలు అవలంబించిన పద్ధతులన్నీ గుత్తసంస్థలు బలపడుటకు సహాయపడినయి. ఉదాహరణకు

యునైటెడ్ స్టేట్స్ పరిశ్రమల విషయంలో రూజువెల్ట్ ప్రవేశపెట్టిన "న్యాయమైనపోటీల" శాసనం గుత్తసంస్థల అభివృద్ధికి మద్దతునిచ్చింది. ఉత్పత్తిని బలాత్కారంగా తగ్గించి వేయుట; (యునైటెడ్ స్టేట్స్‌లో నూనెగనులను మిలటరీ సహాయంతో మూసివేయుట చక్కని ఉదాహరణ) బలవంతంగా కార్టెల్స్‌ను, సిండికేట్లను వృద్ధిచేయుట; కార్టెల్స్ లోనూ సిండికేట్లలోనూ బలవంతంగా విదేశస్థులనుచేర్పించుట; (జర్మనీలోని తీగకార్టెల్స్, సిమెంట్ సిండికేట్లు, సిగరెట్ కార్టెల్స్, కాగితపుకార్టెల్స్, గ్లాస్‌కార్టెల్స్, ఉప్పుకార్టెల్స్, పాలు వెన్నసిండికేట్లు మొదలైనవాటిలో తప్పనిసరిగా సభ్యులుచేరవలెనని నియమించ బడింది. ఇటలీలో ఇనుము, ఉక్కు సంస్థలన్నీ తప్పనిసరిగా కార్టెల్స్‌గా ఉండితీరాలి. జపాన్‌లో ప్రభుత్వసహాయంతో అనేక పరిశ్రమలు కార్టెల్స్‌గా వృద్ధిచెందుట) నూతన పరిశ్రమల నిర్మాణంమీద ప్రభుత్వకంట్రోల్ ప్రవేశపెట్టుట; జర్మనీ, ఇటలీ తదితరదేశాల్లో కొన్ని ప్రాంతములందు నూతన పరిశ్రమలనిర్మాణాన్ని నిషేధించుట, మొదలైన ప్రభుత్వ చర్యలన్నీ గుత్తసంస్థలు వృద్ధిఅగుటకు తోడ్పడినయి. గుత్తసంస్థలయొక్క వ్యాపార రంగాలను తగ్గిస్తున్నామనే పేరుతో కొన్నిదేశాల్లో గుత్తసంస్థలను బలపరిచే చర్యలు తీసుకొనబడినయి. ఇది ముఖ్యంగా ఫాసిస్టు జర్మనీలోజరిగింది. 'జర్మన్ ఉక్కుట్రస్టు' విషయం ఇదివరకేచూశాం. 1932 లో ట్రస్టు డైరక్టర్లందరీ ఆర్థికచిక్కులలోపడి కొట్టు కుంటున్నప్పుడు, ఆ ట్రస్టుయొక్క షేర్లను కంట్రోల్‌చేసే గెల్సెన్ కిర్చన్‌గనుల కంపెనీ యొక్క ట్రస్టు షేర్లనన్నిటిని జర్మన్‌ప్రభుత్వం కొనివేయుటవల్ల, జర్మన్ ఉక్కుట్రస్టు జర్మన్ ప్రభుత్వ వశమయింది. మార్కెట్ రేటుకంటె ఎంతో ఎక్కువరేటుకు ఆషేర్లను కొంటూ జర్మన్‌ప్రభుత్వం ఏంకారణం చెప్పింది? అలా అధికరేట్లకు జర్మన్ ప్రభుత్వం కొనకపోతే 'ఉక్కుట్రస్టు' అంతా విదేశస్థులపరం కావచ్చును! 1933 లో పరిశ్రమాధి కార్ల బలాత్కారంవల్ల ప్రభుత్వం ఆ 'ఉక్కుట్రస్టు' పునర్నిర్మించుటకు పూనుకున్న ప్పుడు జర్మన్ ప్రభుత్వానికివచ్చిన ఆధిపత్యం నశించింది. పునర్నిర్మాణఫలితంగా 'ఉక్కుట్రస్టు' ముక్కలు ముక్కలుగా చేయబడి 13 వేరువేరు కంపెనీలుగా విభజించ బడిన ఫలితంగా పారిశ్రామిక నాయకుల ప్రాబల్యమే తిరిగి ఏర్పడింది. ఈ 13 కంపె నీలకు సంబంధించిన కమిటీలన్నిటిలో అధ్యక్షత వహించేది ఆ ట్రస్ట్ అధిపతియైన థిస్సెన్. వేరువేరుగా చేయబడిన 13 కంపెనీలయొక్క కమిటీలకు నిజానికి ఏఅధికారం లేదు. డబ్బువిషయంగాని, పెట్టుబడి, ముడిసరుకుల కొనుగోలు మొదలైన విషయాల్లో గాని ఈకమిటీలకు ఏ అధికారాలులేవు. ఈ విషయాలన్నిటిమీద కేంద్రకమిటీదే అధికా రం. మొదట్లో ప్రభుత్వం ఉక్కుట్రస్టుమీద కంట్రోల్ సంపాదించి చివరికి తిరిగి పెద్ద పరిశ్రమాధికార్లచేతుల్లో వప్పగించుటఅంతా "ప్రజాక్షేమం" కొరకే చేయబడినా దాని ఫలితంగా ఉక్కుట్రస్టుయొక్క నాయకులకు 10 కోట్ల మార్కులు లాభం వచ్చింది!

గుత్త సంస్థలను ప్రభుత్వాలు ఈవిధంగా బలపరుస్తుంటే, దాని నిజ అర్థాన్ని గ్రహించలేక సోషల్ డెమాక్రాట్లు తప్పు అర్థాలను కల్పించి ఒక నూతన యుగం ప్రారంభమయిందని చెప్పటం ప్రారంభించారు. ప్రభుత్వ పెట్టుబడి యుగమని దీన్ని పిలి చారు. ఈ నూతన యుగంలో పరిశ్రమలన్నీ ప్రభుత్వపరం అవుతున్నందువల్ల వ్యక్తిగత పెట్టుబడిదారులయొక్క ఆధిక్యత నశిస్తోందని వారు వాదించారు. సంక్షోభకాలంలో వృద్ధి అయిన ప్రభుత్వ పెట్టుబడివిధానం నిజానికి ఫైనాన్సు కాపిటల్ యొక్క అధికారాన్ని మరింత యెక్కువచేసి విపరీతంగా దోపిడి ఎక్కువగుటకు కారణమయింది. "పెట్టుబడి సమాజంలో ప్రభుత్వమే గుత్తవ్యాపారాన్ని సాగించుటవల్ల, పతనమయి దివాలా ఎత్తుటకు తయారైన కోటీశ్వరుల యొక్క ఆదాయాన్ని గ్యారంటీచేసి వృద్ధిచేయుటకు జరుగుతుంది గాని మరొకటి కాదని" బాగా రుజువైంది.

## 3. గుత్తబ్యాంకుల అభివృద్ధి—పెట్టుబడి కోటీశ్వరుల పరిపాలన

పెట్టుబడివిధానంలో రోజురోజుకూ హెచ్చుస్థాయికి వస్తున్న ఉత్పత్తి కేంద్రీకరణ, దానితోపాటు గుత్తపరిశ్రమల యొక్క సంఖ్య, పరిమితి, ప్రాముఖ్యతలు గూడా విపరీతంగా వృద్ధిఅగుట—ఇవన్నీ లెనిన్ సామ్రాజ్యవాదసిద్ధాంతం యొక్క సత్యాన్ని పూర్తిగా నిరూపించినయి. "ఉత్పత్తి కేంద్రీకరణద్వారా గుత్తసంస్థలు అభివృద్ధి అవుతయి. ఇది పెట్టుబడివిధాన అభివృద్ధియొక్క ప్రస్తుత సర్వసామాన్య లక్షణం" అని లెనిన్ వ్రాశాడు. లెనిన్ చెప్పిన ఈ విషయం చారిత్రకపరీక్షకు నిలబడి సత్యమని రుజువైంది. అదేవిధంగా బ్యాంకుల కేంద్రీకరణ, గుత్తబ్యాంకుల అభివృద్ధికి సంబంధించిన నూతన ఆధారాలన్నీ లెనిన్ యొక్క సిద్ధాంతం సత్యమని నిరూపిస్తున్నాయి.

బ్యాంకుల కేంద్రీకరణయొక్క స్థాయి, పెట్టుబడివిధానంలో బ్యాంకుల పాత్రలో కల్గిన మార్పులు, ప్రధానంగా బ్యాంకు డిపాజిట్ల అభివృద్ధిమీద ఆధారపడి ఉండునని లెనిన్ ఉద్దేశ్యం. అయితే యుద్ధానంతరం జరిగినంతగా బ్యాంకు డిపాజిట్ల అభివృద్ధి అంతకుపూర్వం ఎన్నడూ జరుగలేదు. బ్యాంకు డిపాజిట్ల అభివృద్ధికి ఉదాహరణగా లెనిన్, యుద్ధకాలానికి పూర్వం 5 సంవత్సరాల్లో జర్మన్ బ్యాంకులలో 280 కోట్ల మార్కులు ఎక్కువగా డిపాజిట్ చేయబడినవనీ అనగా డిపాజిట్లు 40 వంతులు పెరిగినవనీ చెప్పాడు. * ఇన్‌ఫ్లేషన్ దశలో జర్మన్ బ్యాంకులలో డిపాజిట్లు విపరీతంగా పడిపోయినయి. 1924 లోని డిపాజిట్లు మొత్తం 1912—13 నాటి డిపాజిట్ల మొత్తంలో 5 వ వంతు మాత్రమే. కాని 1924—1927 మధ్య 7 రెట్లు పెరిగి 1912—13 నాటికంటె నూటికి 40 వంతులు ఎక్కువ అయినయి. 1928—1929 సంవత్సరాల్లో 350 కోట్ల మార్కులు అధికంగా డిపా

* ఇన్‌ఫ్లేషన్ :—ఎక్కువ కరెన్సీని ప్రవేశపెట్టి చలామణిని ఎక్కువచేసే విధానం.

జిట్ చేయబడినయి. తరువాత 1929 లో ప్రారంభమయిన సంక్షోభదశలో డిపాజిట్లు క్షీణించినయి. మొత్తంమీద 1880–1913 మధ్య 33 సంవత్సరాల్లో 4 పెద్ద సామ్రాజ్య వాద దేశాలైన బ్రిటన్, జర్మనీ, ఫ్రాన్సు, యునైటెడ్ స్టేట్సు దేశాల్లోని బ్యాంకులలోని డిపాజిట్లు 12700 కోట్ల మార్కులకు పైగా హెచ్చినయి. తరువాత 15 సంవత్సరాల్లోనే (1913– 1928 మధ్య) 18300 కోట్ల మార్కులకు పైగా డిపాజిట్లమొత్తం హెచ్చింది. అనగా పెట్టుబడివిధానం సంక్షోభదశలో ప్రవేశించిన తరువాతనే సమాజం యొక్క ధనమంతా కొద్దిమంది కోటీశ్వరుల అధీనమయిందని స్పష్టపడుతుంది.

బ్యాంకింగ్ విధానంలో గుత్తసంస్థలయొక్క పాత్ర ప్రాముఖ్యతలు త్వరగా వృద్ధి చెందినయి. 1914–1933 మధ్య 6 జర్మన్‌బ్యాంకులు (వాటిలో బెర్లిన్‌పట్టణ బ్యాంకులు3) 1699 శాఖలు కల్గిన 191 బ్యాంకులను తమలో కలుపుకున్నాయి. దేశంలోని అప్పు విధానాన్నంతా కంట్రోలుచేసే పెద్ద బ్యాంకులయొక్క సంఖ్య ఎలా తగ్గిపోతున్నదో గుర్తింపదగిన విషయం. 1912–13 సంవత్సరంలో బెర్లిన్‌లో 9 పెద్ద బ్యాంకులు ఉండేవని, వాటిలో 6 చాలా పెద్దబ్యాంకులని లెనిన్ ఉదహరించాడు. తరువాత అనేక బ్యాంకులు నాశనమగుటవల్ల కాని, లేక పెద్దబ్యాంకులలో కలిసిపోవుటవల్ల గాని వాటిసంఖ్య మరింత తగ్గిపోయి ఆర్థికసంక్షోభదశలో బెర్లిన్‌లో 4 పెద్దబ్యాంకులే నిలిచినయి. వాటిలో 3 మాత్రం బ్రహ్మాండమైన రాక్షసిబ్యాంకులు. ఈ 4 బ్యాంకులలోని డిపాజిట్లమొత్తం 1931 లో దేశంలోని అన్నిబ్యాంకుల మొత్తంలో నూటికి 63 వంతులు ఉండేది. 1912–13 లో ఉన్న 9 పెద్ద బ్యాంకుల డిపాజిట్లమొత్తం అప్పటి బ్యాంకులన్నిటి మొత్తంలో నూటికి 49 వంతులు మాత్రమే! యుద్ధానికి పూర్వం బెర్లిన్‌పట్టణలోని 6 పెద్ద బ్యాంకులక్రింద శాఖలు ఏజెన్సీలు అన్నీ కలిసి 450 ఉండేవి. 1932 లో 3 పెద్దబ్యాంకులకే శాఖలు గాని ఏజెన్సీలు గాని మొత్తం 844 ఉన్నాయి.

ఒక్క జర్మనీలోనే కాదు. ఇతర దేశాలకు సంబంధించిన లెక్కలు పరిశీలించినా యుద్ధానంతరం ఫినాన్సు కాపిటల్ అధికారం త్వరత్వరగా పెరిగిపోతున్నదని స్పష్టపడుతూంది. యునైటెడ్‌స్టేట్స్‌లో 1923–1934 మధ్య 50 లక్షలకు పైగా పెట్టుబడిగల బ్యాంకులలోని డిపాజిట్లమొత్తం రెట్టింపయింది. (నూటికి 22 నుంచి 48 వంతుల వరకూ పెరిగింది.) జపాన్‌లో 1926–1935 మధ్య 9 సంవత్సరాల్లో 5 పెద్ద బ్యాంకులయొక్క డిపాజిట్లమొత్తం నూటికి 24 నుంచి 43 వంతులవరకూ పెరిగింది. బ్రిటన్‌లో గూడా యుద్ధానికి పూర్వంకంటె యుద్ధానంతరం గుత్తబ్యాంకుల విధానం బాగా వృద్ధిఅయింది. 5 పెద్ద బ్రిటిష్‌బ్యాంకుల యొక్క మొత్తం నిలవ 1900 లో నూటికి 20 వంతులు ఉండేది; 1913లో నూటికి 40 వంతులు, 1924లో నూటికి 70 వంతులవరకూ పెరిగింది. ఈవిధంగా వృద్ధిఅయిన బ్యాంకులన్నిటినీ కలిపి "పెద్ద అయిదు బ్యాంకులు" అను పేరుతో ఒక బ్రహ్మాండమైన బ్యాంకును నిర్మించుట జరిగింది. 1910 లో బ్రిటిష్ బ్యాంకులకు 7100

శాఖలున్నవని లెనిన్ చెప్పాడు. 1935 లో (ఈ 7100 శాఖలు గాక) కొత్తశాఖలు 5000 స్థాపించబడినాయి.

ఫ్రెంచి బ్యాంకులయొక్క శాఖలసంఖ్య యుద్ధంపూర్వంకంటె యుద్ధం తరువాత 1⅓ రెట్లు పెరిగినయి.

ఈక్రింది పట్టికవల్ల బ్యాంకులయొక్క కేంద్రీకరణ విశదమవుతుంది :—

అన్నిటికంటె పెద్దబ్యాంకుయొక్క నిలవను తెలియజేసే సంఖ్యలుమాత్రం లక్షలలో ఇక్కడ ఇవ్వబడినయి.

| | | 1913 | 1936 |
|---|---|---|---|
| బ్రిటన్ | (పౌనులలో) | 8 కోట్ల 90 లక్షలు | 48 కోట్ల 70 లక్షలు |
| జర్మనీ | (మార్కులలో) | 157 కోట్ల 30 లక్షలు | 285 కోట్ల 20 లక్షలు |
| యునైటెడ్ స్టేట్స్ | (డాలర్లలో) | 18 కోట్ల 10 లక్షలు | 228 కోట్ల 60 లక్షలు |

ప్రపంచ ఆర్థిక సంక్షోభదశలో బ్యాంకుల కేంద్రీకరణ మరీతీవ్రంగా జరిగింది. చాలా దేశాల్లో సంక్షోభదశలో బ్యాంకులలో డిపాజిట్లు తగ్గినయి. సంక్షోభంయొక్క తీవ్రతకు బ్యాంకులన్నీ వణికిపోయినయి. చివరికి పెద్ద బ్రహ్మాండమైన బ్యాంకులైన డానట్ బ్యాంకు, డ్రెస్‌డ్నెర్ బ్యాంకు (జర్మనీ)ల వంటి బ్యాంకులుగూడా దివాలాతీయుట జరిగింది. అప్పులు దొరకకపోవుటవల్ల దివాలాకు తయారవుతున్న బ్యాంకులు నిలబడటానికి ప్రభుత్వ ట్రెజరీలమీద వత్తిడి ఎక్కువయింది. చిన్న బ్యాంకులన్నీ ఎవరికి తెలియకుండానే దివాలా తీసినయి. ఉదాహరణానికి యునైటెడ్‌స్టేట్స్‌లో 1921—1929 మధ్య బ్యాంకుల కేంద్రీకరణ తీవ్రంగా జరిగినసమయంలో 4000 చిన్నబ్యాంకులు దివాలా ఎత్తినయి. సంక్షోభకాలంలో యునైటెడ్‌స్టేట్స్‌లో 1930 లో 1352, 1931 లో 2294, 1932 లో 1456 దివాలాతీసినయి. 1929 లో యునైటెడ్‌స్టేట్స్‌లోఉన్న 25000 బ్యాంకులు 1933 డిసెంబరునాటికి 15000 కు తగ్గిపోయినయి.

జపాన్‌లోగూడా బ్యాంకుల కేంద్రీకరణ ఇదేమాదిరిగా జరిగింది. 1914 లో జపానులో మొత్తం 2155 బ్యాంకులుఉండేవి. 1929 లో వాటిసంఖ్య 1001 కు పడిపోయింది. 1935 లో 563 బ్యాంకులుమాత్రమే పనిచేస్తున్నయి.

1929 సంక్షోభకాలంలో, సంక్షోభం బయలుదేరే సమయంలోనూ అనేక బ్యాంకులు కలిసిపోయి పెద్ద బ్రహ్మాండమైన బ్యాంకులు ఎక్కువగా బయలుదేరినయి. ప్రక్కనే ఆదేసమయంలో పెద్దపెద్ద గుత్తపరిశ్రమలు బయలుదేరుటయే దీనికి కారణం. గుత్తపరిశ్రమల కేంద్రీకరణయొక్క ప్రతిబింబమే బ్యాంకుల కేంద్రీకరణఅని చెప్పవచ్చును. నిజానికి గుత్తపరిశ్రమల కేంద్రీకరణ, బ్యాంకుల కేంద్రీకరణను తీవ్రవపరచిందిగూడా.

గుత్తబ్యాంకుల అభివృద్ధితోపాటు గుత్తబ్యాంకులు గుత్తపరిశ్రమలు కలిసిపోవుట గూడా జరిగింది. ఈవిషయాన్ని నిరూపించుటకై లెనిన్, జైడల్స్ తయారుచేసిన లెక్క

లను ఉదహరించాడు. ఆ లెక్కల ప్రకారం 1903లో 6 బెర్లిన్ బ్యాంకుల ప్రతినిధులకు 751 కంపెనీలలో ప్రాతినిధ్యంఉండేది. తరువాత కొన్ని బ్యాంకులు కలిసిపోవుటవల్ల 1932 నాటికి మొత్తం బ్యాంకులసంఖ్య సగానికి పడిపోయింది. కాని 6 బెర్లిన్ బ్యాంకుల ప్రతినిధులుమాత్రం రెట్టింపయినారు! ఈ లెక్కలన్నీ బ్యాంకులకు పరిశ్రమలకు మధ్య జరిగిన సమ్మేళనాన్ని కొంతవరకే రుజువుచేస్తాయి.

"ఇతరరకాల పెట్టుబడు లన్నిటికంటె ధనరూపంలో పెట్టుబడికిగల ఆధిక్యత యొక్క అర్థం పెట్టుబడి కోటీశ్వరులయొక్క పరిపాలనాధికారమేగాని మరొకటికాదు" అని లెనిన్ చెప్పాడు. యుద్ధకాలంలోనూ యుద్ధానంతరం విపరీతంగా అభివృద్ధిపొందిన గుత్తపరిశ్రమలు గుత్తబ్యాంకులతోపాటు పెట్టుబడి కోటీశ్వరులయొక్క గుత్తదారుల యొక్క అధికారంగూడా విపరీతంగా పెరుగుట తప్పనిసరియైంది. బ్యాంకు పెట్టుబడి దారులయొక్క సర్వాధికార పెరుగుదలను ఉదహరిస్తూ లెనిన్ ఈవిధంగా చెప్పాడు :— 1900—1910 మధ్య బ్యాంకులు జారీచేసిన మూలధనం మొత్తం విపరీతంగా పెరిగి పోయింది. ఆ పదిసంవత్సరాలలో జారీచేయబడిన మూలధనం 1 కోటికోట్ల * ఫ్రాంకుల నుంచి 1 కోటి 80 లక్షలకోట్ల ఫ్రాంకులకు పెరిగింది. 1921—1930 మధ్య ఇది 5 కోట్ల 50 లక్షలకోట్లకు పెరిగింది. 1926—1930 మధ్య (5 సంవత్సరాల్లోనే) 3 కోట్ల 53 లక్షల కోట్ల ఫ్రాంకుల మూలధనం క్రొత్తగా జారీచేయబడింది అనగా యుద్ధానికి పూర్వంకంటె నూతనంగా జారీచేయబడిన ఈ మూలధనమే 3 రెట్లు ఎక్కువయింది. ఇక కర్రెంట్ సెక్యూరిటీలు ఎంత ఎక్కువగా పెరిగినవో చెప్పనక్కరలేదు. 1929 జనవరినెలలో న్యూయార్కుపట్టణ స్టాక్ఎక్స్చేంజ్‌లో ఉదహరించబడిన సెక్యూరిటీలమొత్తం. 1910లో మొత్తం పెట్టుబడి. ప్రపంచంలోఉన్న సెక్యూరిటీల మొత్తం విలువకంటె ఎక్కువవిలువ కలిగిఉన్నాయి!

పెట్టుబడి కోటీశ్వరులయొక్క అధికారం పెరుగుతున్నదంటే అర్థం సమాజమును దోచుకొనుట ఎక్కువయిందన్నమాటే. మొదటివిషయం— బ్యాంకులను ప్రోత్సహించే వారి లాభాలు యుద్ధపూర్వంకటె యుద్ధానంతరం బాగా వృద్ధి అయినాయి. జర్మనీలోని పరిశ్రమలలో బ్యాంకులకు గల షేర్లద్వారానే నూటికి 50 వంతుల లాభం వస్తోందని లెనిన్ లెక్కలతో నిరూపించాడు. తరువాత సెక్యూరిటీల అమ్మకం ఎంతో ఎక్కువయి నందువల్ల, సెక్యూరిటీలద్వారా వచ్చిన ధనాన్ని పెట్టుబడి పెట్టుటవల్ల లాభాలుగూడా వృద్ధి అయినాయి. ముఖ్యంగా యుద్ధానంతరం పెద్ద పెద్ద గుత్త పరిశ్రమలయొక్క మూలధ నాన్ని ఒక్కొక్కప్పుడు తగ్గించవలసి వచ్చిందంటే, కోటీశ్వరుల లాభాలు ఎంత ఎక్కు వయినవో ఊహించవచ్చును. మూలధనాన్ని తగ్గించుటవల్ల పరిశ్రమల యజమానుల

---

* ఫ్రాంకు — 1928 తరువాత 2 అణాల విలువకల్గిన ఫ్రెంచినాణెం,

లాభాలు పూర్తిగావచ్చుటయేగాక యదార్థంగావచ్చే లాభాన్ని ప్రజలకు తెలియకుండా మరుగు పరుచుటగూడా సాధ్యపడుతుంది.

పెట్టుబడి కోటీశ్వరుల లాభాలకు తోడ్పడేవి ప్రధానంగా స్టాక్ ఎక్స్ఛేంజిలో జరిగే ఊహా వ్యాపారం. ఈ వ్యాపారం యుద్ధానంతరం విపరీతంగా వృద్ధిఅయింది. ఒక్క యునైటెడ్‌స్టేట్స్‌లో 2, 3 సంవత్సరాలకు సంక్షోభం ప్రారంభమవుతుందనగా స్టాకుల ధరలు 2, 3 రెట్లు పెరుగుట జరిగింది. సంక్షోభకాలంలో ధరలు రోజురోజుకు, వారం వారానికి నూటికి 20, 30, 40 వంతులు అటూ ఇటూ ఊగులాడుట ప్రారంభించినాయి. ఈ విధంగా ధరలు ఊగులాడుతుంటే చిన్న పెట్టుబడిదార్లను నాశనంచేసి లాభాలన్నీ తామే మ్రింగివేయుటకు పెద్ద స్టాక్ ఎక్స్ఛేంజి తిమింగిలాలకు మంచి అవకాశాలు లభించినాయి. సంక్షోభకాలంలో ఒక్క యునైటెడ్‌స్టేట్స్‌లోనే స్టాక్ ఎక్స్ఛేంజి విలువలలో కల్గిన నష్టం కొన్ని లక్షల కోట్ల డాలర్లు ఉంటుంది. కాని స్టాక్ ఎక్స్ఛేంజిలో జరిగే ఊహా వ్యాపారంలో కొంతమంది నష్టపడుటద్వారానే ఇతరులు లాభం పొందేది. నష్టపడ్డ వారి నుంచి వారి పరిశ్రమలకు చెందిన షేర్లను బహు చవుకగా కొనివేయుటకు పెద్ద కోటీశ్వరులు ముందుకు వచ్చారు.

"ఇప్పటికిగూడా పెట్టుబడివిధానం యొక్క ఆర్థిక పునాది సరుకుల ఉత్పత్తియే అయినప్పటికి ఈనాడు పెట్టుబడివిధానం ఎటువంటి స్థాయికి వచ్చిందంటే కొద్దిమంది కోటీశ్వరులకు విపరీత లాభాలు వచ్చుటయేగాక 'సరుకుల ఉత్పత్తి' అను ఆర్థిక పునాదికి దెబ్బతగిలి 'సామాజిక ఉత్పత్తి' బయలుదేరింది. కాని ఈ సామాజిక ఉత్పత్తిని సాగిస్తున్న మానవకోటియొక్క శ్రమఫలితమంతా లాభాల రూపంలో ఊహావ్యాపారస్థులపరం అవుతోంది" అని లెనిన్ చెప్పాడు.

సంక్షోభకాలంలోఉత్పత్తి పడిపోవుటవల్ల అసంఖ్యాకులుగా కార్మికులు పనినుంచి తొలగించబడితారు. అందువల్ల కల్గిన నష్టాన్ని, మిగిలిన వారిని ఎక్కువగా దోపిడీ చేయుటవల్ల భర్తీ చేయుటకు సాధ్యపడనప్పుడు, గుత్త పరిశ్రమలమీద వచ్చే ఆదాయం కంటె, ఊహా వ్యాపారంద్వారా వచ్చేలాభాలు అపరిమితంగా పెరుగుతాయి. ఈవిధంగా ఊహావ్యాపారంద్వారా గడించే 'లీగల్' లాభాలతో తృప్తిచెందక ఫ్రాన్సులో జరిగిన * 'స్టావిస్కీ' మోసంలాంటి మోసాలు గూడా బయలుదేరుతాయి. 1934 లో జరిగిన 'స్టావిస్కీ' మోసంలో 1 లక్ష కోట్ల ఫ్రాంకులు కోటీశ్వరుల పరమయింది. పెట్టుబడి కోటీశ్వరుల యొక్క దోపిడీ ఈవిధంగా నగ్నరూపం దాల్చింది.

---

* స్టావిస్కీ మోసం:—1933 నాటికి ఫ్రెంచి ప్రభుత్వ రాజకీయాలన్నీ పూర్తిగా అవినీతికరంగా తయారైనాయి. పెట్టుబడిదారీ కార్మికవర్గాలమధ్య పోరాటం తీవ్రమయింది. ఆర్థిక సంక్షోభఫలితంగా ఆర్థికంగా పరిస్థితులన్నీ విషమించినాయి. జర్మనీలో

పెట్టుబడి కోటీశ్వరులయొక్క అధికారం పెరుగుటకు షేర్లుకొనే విధానంగూడా బాగా సహాయపడింది. ఈ షేర్ల రంగంలోగూడా గుత్తవ్యాపారస్థులు అగ్రస్థానాన్ని అలంకరించారని లెనిన్ ఉదహరించిన లెక్కలన్నీ నిరూపిస్తయి. జాయింట్‌స్టాక్ బ్యాంకుల పాత్రగూడా బాగా వృద్ధిఅయింది. లెక్కలేనన్నిరూపాల్లో గుత్తవ్యాపారస్థులు షేర్లుకల్గిఉండుట, కంట్రోల్‌ను ఎక్కువ చేసుకొనుట జరుగుతోంది. లోగడ ఇచ్చిన లెక్కలనుబట్టియే గుత్తదారులు ఎన్నిరకాలలో మెట్టుమెట్టుకి, వివిధ జాయింట్‌స్టాక్ కంపెనీలమీద, చివరికి కొన్ని కంపెనీలలో నూటికి 1 వంతుగాని అంతకంటె తక్కువ షేర్లుగాని కల్గిఉండుటద్వారా కంట్రోల్ ఎలా సంపాదించినదీ తెలుస్తుంది. ఒకే కేంద్రం నుంచి అనేక పరిశ్రమలను కంట్రోల్‌చేసే విధానం బాహుళ్యంగా వృద్ధిఅయింది. ఉదాహరణకు మార్గన్ తన భాగస్థులతోకలిసి సంక్షోభం బయలుదేరబోయేనాటికి 7400 కోట్ల డాలర్ల పెట్టుబడిని కంట్రోల్ చేస్తున్నారని L. కోరీ తన "మార్గన్‌సంస్థలు" అను గ్రంథంలో అంచనావేశాడు. 2000 కోట్లడాలర్లఆస్తిని కంట్రోల్‌చేసే 72 పారిశ్రామికసంస్థలు వారిచేతుల్లో ఉన్నాయి. 1929 మేలో అమెరికన్ బ్యాంకర్సు అసోసియేషన్‌వారు ప్రచురించిన లెక్కలప్రకారం 24 గురు న్యూయార్కుబ్యాంకర్లు మొత్తం 438 సంస్థలకు డైరెక్టర్లుగా ఉన్నారు. ఈ 438 లో 297 పారిశ్రామిక, వ్యాపారసంస్థలు. ఈ 24 గురులో

---

హిట్లరు అధికారంలోకి వచ్చాడు. ఫ్రాన్సులోగూడా ఫాసిస్టు అంకురాలన్నీ బాగా తలయెత్తుట ప్రారంభించినాయి. ఆ పరిస్థితులలో ఈ 'మోసం' జరిగింది.

స్టావస్కీ పెద్ద మోసకారియైన దొంగ. అంతకుపూర్వం 10 సంవత్సరాలనుంచే అనేక పెద్ద దొంగ వ్యవహారాలను చేశాడు. కాని ప్రభుత్వం, పోలీసు డిపార్టుమెంటు అతన్ని స్వేచ్ఛగా వదిలివేశారు. పెద్ద పెద్ద ఉద్యోగులు, పెట్టుబడిదార్లకు గొప్ప లంచాలు పెట్టి కోట్లకు కోట్ల దొంగ వ్యాపారాన్ని చేశాడు స్టావస్కీ చివరికి 'బామన్' మ్యునిసిపల్ బాండ్సును ఫోర్జరీ చేశాడు.

1934 జనవరిలో కథఅంతా బయటపడింది. మంత్రివర్గ సభ్యులమీద నిందవచ్చింది. ప్రధాన మంత్రి అయిన 'ఛెటిమ్' బావమరిది అయిన దాలిమీర్ కొద్దికాలంక్రింద స్టావస్కీ నమ్మకస్థుడని అతని వ్యాపారంలో పెట్టుబడి పెట్టవచ్చునని శిఫార్సు చేశాడట.

1934 ఫిబ్రవరిలో ఈ దొంగ వ్యాపారిని రహస్యంగా బలపరిచిన ప్రభుత్వంయందు గల అసంతృప్తివల్ల ప్రజలు తిరుగుబాటు చేశారు. మంత్రివర్గం రాజీనామా ఇవ్వవలసి వచ్చింది.

తమాషా ఏమిటంటే, పైగాధనంతా ఉపయోగించి, ప్రభుత్వాన్ని కూలద్రోసి తమ ప్రభుత్వాన్ని నెలకొల్పాలని ఫాసిస్టులు తీవ్ర ప్రయత్నం చేశారు.

ఒకరు 47 సంస్థలకు అధ్యక్షుడు! యునైటెడ్‌స్టేట్స్ కాంగ్రెసులో ఉదహరించబడిన ఒక ప్రభుత్వ డాక్యుమెంటుప్రకారం ప్రజోపయోగ సంస్థలలోనే, కనీసం 50 కంపెనీల డైరెక్టర్లబోర్డులలో సభ్యత్వంకల్గినవ్యక్తులు 90 మంది ఉన్నారని, వారిలో 15 గురు 2117 సంస్థలకు డైరెక్టర్లని వెల్లడిఅయింది. ఇంత బాహుళ్యంగా కాకపోయినా ఇతరదేశాల పరిస్థితిగూడా ఇంతే.

ఈవిధంగా పెట్టుబడి సమాజంయొక్క సంపత్తినంతా యదార్ధంగా కంట్రోల్ చేయు కోటీశ్వరులసంఖ్య క్రమంగా తగ్గిపోతోంది. జర్మనీని పరిపాలించేవారు వాస్తవంగా 300 పెట్టుబడుదారులని లెనిన్‌చెప్పాడు. యుద్ధానంతరం వీరిసంఖ్య ఇంకా తగ్గిపోయింది. ఫాసిస్టు అనుకూలుడైన ఫెర్డినాండ్ ఫ్రీడ్ అను రచయిత అంచనాల ప్రకారం జర్మనీ యొక్క ఆర్థిక కీలక స్థానాలనన్నిటినీ కంట్రోలు చేసేవారి సంఖ్య 100 నుంచి 140 వరకూ ఉంటుంది. పూర్వం బెర్లిన్‌లో ఉన్న యునైటెడ్‌స్టేట్స్ రాయబారి అయిన గిరార్డ్, యునైటెడ్‌స్టేట్స్ సంపదనంతా 64 గురు వ్యక్తులు కంట్రోల్ చేస్తున్నారని చెప్పాడు. జర్మన్ ప్రధాన పరిశ్రమల తరపున ప్రచురించబడే 'బెర్గ్‌వెర్క్' పత్రిక ప్రకారం ఫ్రాన్సులోని జాయంటుస్టాక్ కంపెనీలన్నీ 100 గురు వ్యక్తుల చేతుల్లో ఉన్నవని ఈ 100 మందికి నాయకత్వం వహించే ఇద్దరు ఫ్రాన్సుదేశంలోని బ్యాంకు పెట్టుబడినంతా కంట్రోల్ చేస్తున్నారని విశదమయింది.

## 4. పెట్టుబడియొక్క ఎగుమతి.

పెట్టుబడియొక్క ఎగుమతికి సంబంధించిన లెక్కలుగూడా లెనిన్ యొక్క సామ్రాజ్యవాద సిద్ధాంతం యొక్క సత్యాన్ని నిరూపించుటయేగాక సామ్రాజ్యవాద సూత్రాలన్నీ రోజురోజుకు అభివృద్ధి చెందినవనిగూడా తెలియజేస్తున్నాయి. లెనిన్ సిద్ధాంత ప్రకార్ధం, పెట్టుబడి యొక్క ఎగుమతి 'సామ్రాజ్యవాద లక్షణాలలో ఒక ముఖ్య లక్షణం' ఈ విషయాన్ని గురించి లెనిన్ ఉదహరించిన ఆధారాలను, తరువాత కనుగొనబడిన ఆధారాలతో పోల్చిచూసినప్పుడు ఈ క్రింది విషయాలు తెలుస్తున్నాయి :—

(1) విదేశ పెట్టుబడులమొత్తం విపరీతంగా వృద్ధిఅయింది. బ్రిటన్, యునైటెడ్ స్టేట్స్, జర్మనీ, ఫ్రాన్సు దేశాలయొక్క విదేశ పెట్టుబడుల మొత్తం విలువ 1914 లో కంటె 1930 లో 20 లక్షల కోట్ల నుంచి 40 లక్షల కోట్ల ఫ్రాంకులు వృద్ధి అయింది. సామ్రాజ్యవాద యుద్ధంవల్ల, రష్యన్ విప్లవంవల్ల విదేశ పెట్టుబడులకు కొంత వరకు నష్టం కల్గినప్పటికీ ఇంత అభివృద్ధి జరిగిందనే విషయాన్ని గుర్తించాలి. జర్మనీ యొక్క విదేశ పెట్టుబడులన్నీ (44 లక్షల కోట్ల ఫ్రాంకులు) నాశనమయినాయి. ఫ్రాన్సుకు 23 లక్షల కోట్ల ఫ్రాంకుల పెట్టుబడి నష్టమయింది. బ్రిటన్‌గూడా యుద్ధ కాలంలో భరించవలసి వచ్చిన ఖర్చులకై తన విదేశ పెట్టుబడులలో నాల్గవవంతు కోల్పోయింది. అయిన

ప్పటికి మొత్తంమీద 1914 నుంచి 1930 వరకూ పెట్టుబడులు ఎంత ఎక్కువగా పెరిగినవో మొదటనే చూశాం.

(2) పెట్టుబడి ఎగుమతి మార్కెట్టులో వివిధ దేశాలయొక్క పాత్రలలో కల్గిన మార్పులు :—

ఈ మార్పులలో ముఖ్యమైనవి రెండు. (i) విదేశ పెట్టుబడి ఎగుమతుల విషయంలో బ్రిటన్‌కు ఉండే ప్రధాన పాత్ర నశించి దాని స్థానే యునైటెడ్ స్టేట్స్ ప్రధాన పాత్ర వహిస్తోంది. (ii) జర్మనీనుంచి పెట్టుబడి ఎగుమతులు పూర్తిగా ఆగిపోయినాయి. ఈనాడు యునైటెడ్ స్టేట్స్ యొక్క విదేశ పెట్టుబడులు 8 నుంచి 9 రెట్లు వరకూ పెరుగుటయే గాక, యుద్ధ అప్పులను గూడా కలిపితే, ఎంతోకాలంనుంచి కూడబెట్టబడిన బ్రిటన్ విదేశ పెట్టుబడులను మించిపోయింది. యుద్ధానంతర సుభిక్ష దశలో (1924-1929) విదేశ పెట్టుబడులు చాలా ఎక్కువయినప్పటికీ బ్రిటన్ ఫ్రాన్సుల పెట్టుబడి మాత్రం యుద్ధపూర్వం కంటె కించిత్ గూడా పెరుగని సమయంలో యునైటెడ్ స్టేట్స్ యొక్క పెట్టుబడులు విపరీతంగా వృద్ధి అయినవనే విషయం గుర్తించవలసి యున్నది.

(3) పెట్టుబడి ఎగుమతి చేయబడే దేశాలలో కల్గిన మార్పులు :— (i) రష్యాలో పెట్టుబడి పెట్టుటకుగాని లేక రష్యాను దోపిడిచేసి అతీత లాభాలను గడించుటకుగాని విప్లవం తరువాత సాధ్యపడలేదు. (ii) జర్మనీ ఇప్పుడు విదేశాలనుంచి పెట్టుబడిని దిగుమతి చేసుకునే దేశాల లిస్టులో చేరింది. (iii) యునైటెడ్ స్టేట్స్ బాగా అభివృద్ధి అవుతున్న కొలదీ, మధ్య, దక్షిణఅమెరికాలలో పెట్టుబడి పెట్టుటకు అవకాశాలు ఎక్కువయినాయి. పెట్టుబడులు పెరిగి ఆర్థిక అధికారం హెచ్చినకొలదీ యునైటెడ్ స్టేట్స్ ఈ మధ్య దక్షిణ అమెరికా దేశాలనుంచి బ్రిటన్‌ను తరిమివేసి తన పెట్టుబడులను ఎక్కువచేసుకొనుటకు, అమెరికా ఖండంమీద తన పలుకుబడిని వృద్ధిచేసుకొనుటకు ప్రయత్నిస్తోంది. (iv) చైనాలో గూడా పెట్టుబడులు ఎక్కువయినాయి. రీమర్ అంచనా ప్రకారం, 1914-1929-30 మధ్య చైనాలో విదేశ పెట్టుబడులు 161 కోట్ల డాలర్లనుంచి 324 కోట్ల 30 లక్షల డాలర్లకు పెరిగినాయి. ఈ మొత్తంలో జపానీస్ పెట్టుబడి 22 కోట్ల డాలర్లనుంచి 113 కోట్ల 70 లక్షల డాలర్ల వరకూ పెరిగింది. బ్రిటిష్ పెట్టుబడి 60 కోట్ల 80 లక్షల డాలర్లకుమించి 11కోట్ల 89లక్షల డాలర్ల వరకూ పెరిగింది. యునైటెడ్ స్టేట్స్ పెట్టుబడి 4 కోట్ల 90 లక్షల డాలర్లనుంచి 19 కోట్ల 70 లక్షల డాలర్ల వరకూ పెరిగింది. (యునైటెడ్ స్టేట్స్ లెక్కలు సరియైనవికావని చాలా తగ్గించి చెప్పబడినవని సంఖ్యలను చూస్తేనే తెలుస్తుంది.)

(4) పెట్టుబడుల ఎగుమతియొక్క వేగాధిక్యతలో క్షీణతకన్పిస్తుంది. సుభిక్ష దశలో (1924—1929) యునైటెడ్ స్టేట్స్ మొదలైన దేశాలనుంచి చేయబడే పెట్టుబడుల ఎగుమతియొక్క వేగాధిక్యత బాగా హెచ్చుతూఉన్నప్పుడు ఇతర సామ్రాజ్యవాద దేశాల

యొక్క పెట్టుబడుల ఎగుమతియొక్కవేగం (ఏవోకొన్ని సంవత్సరాల్లోతప్ప) బాగా క్షీణించింది. ఒక ఉదాహరణచూద్దాం. 1902–1914 మధ్య 4 దేశాల విదేశపెట్టుబడుల పెరుగుదల 70 లక్షలకోట్ల ఫ్రాంకులనుంచి 100 లక్షలకోట్ల ఫ్రాంకులవరకూ అధిక మయింది. కాని ఆదేశాలయొక్క పెట్టుబడి పెరుగుదల 1914–1930 మధ్య 20 లక్షల కోట్లనుంచి 40 లక్షల కోట్ల ఫ్రాంకులవరకూ మాత్రమే ఎక్కువయింది.

ఈవిధంగా పెట్టుబడి ఎగుమతులయొక్క వేగాధిక్యత క్షీణించుటకు కారణం పెట్టుబడిని ఎగుమతిచేసే దేశాలలో జర్మనీ లేకపోవుటకాదు. ఎందుకంటే ఆగండిని భర్తీచేసేదానికంటె ఎక్కువగానే యునైటెడ్‌స్టేట్స్‌నుంచి పెట్టుబడుల ఎగుమతి వృద్ధి అయిందికదా.

ఇక పలుకుబడిరంగాలను వృద్ధిచేసుకునే విషయంలోనూ ముఖ్యంగా మార్కెట్ల కొరకూ జరిగే పోరాటంలోనూ ఒక ముఖ్యఆయుధంగా పెట్టుబడుల ఎగుమతియొక్క ప్రాముఖ్యత హెచ్చిందనేచెప్పాలి. యుద్ధానంతరం పలుకుబడి రంగాలకొరకు, మార్కెట్ల కొరకు పోరాటం మరింత తీవ్రమయినప్పుడు దానితోపాటు పెట్టుబడుల ఎగుమతిగూడా ఎక్కువయింది. అయితే పెట్టుబడుల ఎగుమతియొక్కవేగం క్షీణించిందంటే, ఎగుమతి చేయుటకు పెట్టుబడులు లేకనా ? ఎంతమాత్రం కాదు. యుద్ధానంతరం బ్రిటన్ ఫ్రాన్సు దేశాల్లో ఎగుమతిచేయుటకై స్వేచ్ఛగాఉన్న పెట్టుబడులమొత్తం చాలా ఎక్కువయింది. కాని ఈ పెట్టుబడిఅంతా వేగంగా ఎగుమతికాలేదు. అయితే ఈ మొత్తంలో ఎక్కువ భాగం వివిధదేశాల్లో సూక్ష్మకాల పెట్టుబడులరూపంలో తిరగటం ప్రారంభించింది. ప్రపంచ డబ్బుమార్కెట్ అస్థిరత్వంతో ఊగులాడుతున్నప్పుడు ఈ సూక్ష్మకాల పెట్టుబడులు కొంతవరకు పరిస్థితిని అభివృద్ధిచేసి స్టాక్ ఎక్స్‌ఛేంజి ఊహావ్యాపారాన్ని వృద్ధి చేయుటకు సహాయపడినయి. యుద్ధానికిపూర్వం దీర్ఘకాల పెట్టుబడులకున్నంత ప్రోత్సాహం యుద్ధానంతరం లేకపోవుటకు కారణాలేమిటి ? సంక్షోభంలో చిక్కుకొనిపోయిన పెట్టుబడి విధానంయొక్క అస్థిరత్వం, సోవియట్‌యూనియన్ బయలుదేరుటవల్ల పెట్టుబడి రంగం క్రుంగిపోవుట, వలసదేశాల్లో విప్లవాలు కారణాలు. ప్రపంచ ఆర్థిక సంక్షోభదశలో కరెన్సీవిలువ పడిపోవుటవల్ల, బంగారపు ఎగుమతులమీద పెట్టిన నిషేధంవల్ల విదేశ అప్పులను వ్యాపారనియమాలను పాటించకపోవుటవల్ల ప్రపంచవ్యాపారం స్తంభించి పోయినప్పుడు పెట్టుబడుల ఎగుమతిగూడా కొంతవరకు స్తంభించింది.

రష్యాలో సోవియట్ విప్లవం రాకపూర్వం ఆదేశంలో విదేశస్థులు కొన్నికోట్లధనం పెట్టుబడిపెట్టేవారు. విప్లవం తరువాత ఈ పెట్టుబడికి అవకాశం లేనందువల్ల పెట్టుబడులకు రష్యాలాభసాటి అయిన మార్కెట్టుగాకుండాపోయింది.

ఇకవలస దేశాల్లోని విప్లవాలు, వాటిలోగూడా ముఖ్యంగా చైనావిప్లవం, సామ్రాజ్యవాదులకు ఆందోళన కల్గించినయి. ఈ వెనుకబడియున్న దేశాల్లో విప్లవోద్యమాలు చెల

రేగుతున్నప్పుడు క్రొత్తగా పెట్టుబడిపెట్టేవిషయం లేకపోగా ఉన్నపెట్టుబడుల యొక్క భద్రత విషయంలో విదేశపెట్టుబడిదారులకు భయంహెచ్చింది. పోతే యూరపియన్ దేశాల్లోగూడా రాజకీయ ఆర్థిక పరిస్థితులన్నీ తారుమారు అవుతున్నందువల్ల ఆదేశాల్లో పెట్టుబడి పెట్టుటకుగూడా ధైర్యం చాలడంలేదు.

ఇక ఫాసిస్టుదురాక్రమణ దారులు చైనా, స్పెయిన్, అబిసీనియా దేశాల్లో సాగిస్తున్న యుద్ధాలవల్ల, త్వరలోనే ఫాసిస్టు ముఠా ప్రపంచయుద్ధాన్నే ప్రేరేపించవచ్చుననే భయంవల్ల పెట్టుబడుల ఎగుమతి మరింత క్షీణించింది. మొత్తంమీద గత 12, 15 సంవత్సరాలనుంచి పెట్టుబడుల ఎగుమతికి కొన్నిప్రత్యేక అడ్డంకులు ఏర్పడినవనిగూడా గుర్తించాలి. (1) యుద్ధకాలంలో యుద్ధంసాగించే దేశాలకు బయట ప్రపంచంతో సంబంధాలు తెగిపోయినవి. (2) యుద్ధానంతరం ఇన్‌ఫ్లేషన్ ఎక్కువయినందువల్ల విదేశాల్లో దీర్ఘకాలపెట్టుబడులకు అడ్డంకులు ఏర్పడినవి. (3) ప్రపంచఆర్థిక సంక్షోభకాలంలో అనేక దేశాలు దివాలా ఎత్తుటకు సిద్ధమయి విదేశ అప్పులమీద వడ్డీలుగూడ చెల్లించేస్థితిలో లేకపోయినవి. ఆ సంక్షోభదశలో కరెన్సీవిలువబడిపోవుటవల్ల విదేశాల్లో పెట్టినపెట్టుబడుల విలువగూడా క్షీణించి వాటిమీదవచ్చే ఆదాయంగూడా పడిపోయింది. ఈ పరిస్థితులలో కొత్తగా పెట్టుబడి ఎగుమతిచేయుట చాలావరకూ తగ్గిపోయింది. ఈ విషయాలన్నీ పెట్టుబడులఎగుమతికి అడ్డుతగిలే నిరోధకాలుగా తయారైనవి.

యుద్ధానంతరం పెట్టుబడుల ఎగుమతియొక్క వేగాధిక్యత క్షీణించిందంటే అర్థం పరాన్నభుక్కులైన పెట్టుబడిదారుల దోపిడీ క్షీణించిందనికాదు. పెట్టుబడివిధానంయొక్క అవినీతికరమైన ఆర్థిక విధానంలో మార్పుకల్గిందనికాదు. ప్రపంచాన్ని తిరిగి విభజించుకొనుటకై సామ్రాజ్యవాదులు సాగిస్తున్న పోరాటంలో ఒకముఖ్యఆయుధంగా పెట్టుబడుల ఎగుమతియొక్క ప్రాముఖ్యత తగ్గిందనికాదు. ఈ విషయాలను గురించి వివరాలతో ఈ క్రింద పరిశీలిద్దాం.

## 5. అంతర్జాతీయ గుత్తసంస్థల అభివృద్ధి.

ప్రపంచ ఆర్థికవిభజనకు దారితీసే అంతర్జాతీయ కార్టెల్‌సంస్థల, (అతీతమైన ప్రపంచ గుత్తసంస్థలు) విషయం పరిశీలిస్తే బహిర్గతమైన నూతన ఆధారాలన్నీ లెనిన్ యొక్క సామ్రాజ్యవాద సిద్ధాంతాన్ని బలపరుచుటయేగాక సామ్రాజ్యవాదంయొక్క లక్షణాలన్నీ మరింత ప్రస్ఫుటమవుతున్నాయి.

యుద్ధకాలంలో యుద్ధంసాగించే దేశాల్లోని గుత్తసంస్థలు బాగా బలపడటం, అంతర్జాతీయ కార్టెల్‌సంస్థలకు దెబ్బతగిలి వాటిలో చాలాభాగం పతనమవటం సంభవించింది. అయితే యుద్ధంసాగించే దేశాల్లోని గుత్తసంస్థలు బలపడటానికి కారణం ఆ దేశాల్లోని పెట్టుబడిదారుల దేశభక్తి కాదుసుమా! యదార్థానికి యుద్ధకాలంలోగూడా కొన్ని అంత

ర్జాతీయ గుత్తసంస్థలు ఏదో ఒకరూపంలో నడుస్తూనేవచ్చినాయి. ఉదాహరణనికి అంత ర్జాతీయ కార్బైడ్ సిండికేట్, నోబెల్ డైనమైట్ సిండికేట్ మొదలైన మిలటరీ ప్రాముఖ్యతగల గుత్తసంస్థలు కొన్ని అంతర్జాతీయంగా పనిచేసినాయి. యుద్ధంలోపోరాడే రెండు పక్షాలకుచెందిన దేశాలు ఈసంస్థలలో పాల్గొనేవి. కాని యుద్ధంవల్ల ప్రపంచమార్కెట్ దెబ్బతిన్నది. దానికితోడు యుద్ధంసాగించే దేశాలలోని ప్రధానపరిశ్రమలన్నీ యుద్ధ ఆర్డర్లను పూర్తిచేయుటలో నిమగ్నమైనందువల్ల వాటినుంచి ప్రపంచమార్కెట్కువచ్చే సప్లయిలు పడిపోయినాయి. ఈ కారణాలవల్ల ప్రపంచమార్కెట్టును విభజించుకొనుటకై చేయబడిన ఒడంబడికలన్నీ అర్థరహితమయినాయి.

యుద్ధానంతరం మొదటిసంవత్సరాల్లో అంతర్జాతీయకార్టెల్స్ నెమ్మదిగా తిరిగి తలయెత్తటం ప్రారంభించినాయి. కాని ఇనఫ్లేషన్వల్ల ఈ పునరుద్ధరణకు దెబ్బతగిలింది. విలువ తగ్గిపోయిన కరెన్సీవిధాన సహాయంతో ప్రపంచమార్కెట్లలో సరుకులను పోర్లించుటకు వీలులేని ఒడంబడికలకు బద్ధులైఉండుటకు అనేకదేశాలు అంగీకరించలేదు. తరువాత మళ్ళీ అంతర్జాతీయకార్టెల్స్ తలయెత్తినది పెట్టుబడివిధానం స్థిరపడుతున్నదశలోనే. (1924–1929) 1931 వచ్చేసరికి అంతర్జాతీయకార్టెల్ ఒడంబడికలసంఖ్య 320కు పెరిగింది. అనగా 1910 నాటి సంఖ్యకంటె 3 రెట్లు పెరిగిందన్నమాట. పెట్టుబడి విధానం స్థిరపడేలక్షణాలు కనపడేసరికి అంతర్జాతీయ కార్టెల్స్ ఎంతవేగంగా బయలుదేరినవో ఈ సంఖ్యలవల్ల స్పష్టపడింది. గత 10 సంవత్సరాల్లో బయలుదేరిన ముఖ్య అంతర్జాతీయ కార్టెల్స్. సిండికేట్లయొక్క పేర్లు, మొత్తం ప్రపంచఉత్పత్తిలో అవి ఎన్నోవంతు భాగాన్ని కంట్రోల్ చేస్తున్నదీ సుమారుగా తెలియజేసేసంఖ్యలు ఈక్రింద ఇవ్వబడినవి.

| | సంవత్సరం | ప్రపంచఉత్పత్తిలో 100కి ఎన్నివంతులు? |
|---|---|---|
| యూరపియన్ ఉక్కుకార్టెల్ | 1929 | 32 |
| | 1936 | 45 |
| రాగికార్టెల్ | 1932 | 90 |
| రైల్వేపట్టాలకార్టెల్ | 1932 | 85 కుపైగా |
| యూరపియన్ రోల్డ్తీగెకార్టెల్ | 1931 | 39 |
| సీసపు సమ్మేళనం | 1929 | 40 |
| తగరపు కార్టెల్ | 1932 | 83 |
| అంతర్జాతీయకృత్రిమనత్రజనిసిండికేట్ | 1932 | 67 |
| పొటాసియమ్ సిండికేట్ | 1932 | 91 |
| కృత్రిమసిల్కు కార్టెల్ | 1929 | 70 |
| ఎలక్ట్రిక్ బల్బుకార్టెల్ | 1934 | 90 |
| రబ్బర్ ఉత్పత్తిదారుల కన్వెన్షన్ | 1936 | 97 |

ఆర్థిక సంక్షోభదశలో వీటిలో చాలాభాగం (రాగికార్టెల్, సీసపు సమ్మేళనం మొదలైనవి) నాశనమయినయి. సంక్షోభకాలంలో తీవ్రమయిన పోటీలు, ప్రపంచమార్కెట్ దెబ్బతినటం, అనేకదేశాల్లో బయలుదేరిన ఇన్‌ఫ్లేషన్, ఇదివరకూ ఎన్నడూలేనంత ఎక్కువగా సరుకులు మార్కెట్‌లో పోర్లించబడుట, పెట్టుబడి విధానం సాఫీగా వృద్ధికాలేక ఎగుడుదిగుడుగా వృద్ధిఅగుట ఇవన్నీగూడా కార్టెల్స్ యొక్కపతనానికి దారితీసినయి. పరిస్థితులు ఈ విధంగా తారుమారైనప్పుడు అంతర్జాతీయ కార్టెల్ ఒడంబడికలకు తావు లేకుండాపోయింది. అంతర్జాతీయకార్టెల్ సంస్థలయొక్కసంఖ్య తాత్కాలికంగా పడిపోయినందువల్ల ప్రపంచఆర్థిక విభజనకేమీ లోపంరాలేదుసుమా. మొదటి విషయం- కొన్ని అంతర్జాతీయ కార్టెల్స్ నిర్మూలం కాగానే కొత్తవికొన్ని బయలుదేరినయి. అంతర్జాతీయ కార్టెల్స్‌లోని సభ్యులమధ్యగల సంబంధాలలో కల్గిన మార్పులఫలితంగా ఈవిధంగాకొన్ని కార్టెల్స్ నాశనమయి కొన్ని కొత్తవిబయలుదేరుట జరిగింది. మొత్తంమీద యుద్ధపూర్వం కంటె యుద్ధానంతరమే అంతర్జాతీయ కార్టెల్స్‌యొక్క సంఖ్యవృద్ధిఅయింది. రెండవ విషయం ప్రపంచమార్కెట్లను పంచుకునే బ్రహ్మాండ ప్రపంచగుత్తసంస్థలలో ఈ అంతర్జాతీయ కార్టెల్స్ ఒకభాగం మాత్రమేనని గుర్తించాలి. ప్రధాన పరిశ్రమలలో కొన్ని కార్టెల్స్ ముఖ్యభాగంగూడా కావచ్చును. అందువల్ల ప్రపంచ ఆర్థిక విభజనను పరిశీలించేటప్పుడు లెనిన్ తన దృష్టినంతా అంతర్జాతీయ కార్టెల్స్‌మీదగాక, ప్రపంచప్రాముఖ్యత కల్గిన జెనరల్ ఎలక్ట్రిక్ కంపెనీ, స్టాండర్డుఆయిల్ కంపెనీమొదలైన అంతర్జాతీయ గుత్త సంస్థలమీదనే ఎక్కువగా కేంద్రీకరించాడని మరిచిపోరాదు.

ఈ కార్టెల్స్ మొదలైన గుత్త సంస్థలలో కల్గిన మార్పులన్నీ, యుద్ధానంతర ప్రపంచ గుత్త దారులు ప్రపంచ మార్కెట్లను పంచుకొనుటలో చూపించిన అభివృద్ధిని స్పష్టంగా విశదపరుస్తాయి. కొన్ని ఉదాహరణలు చూడండి :— జెనరల్ ఎలక్ట్రిక్ కంపెనీయొక్క ఉత్పత్తి 1910 నాటికంటె 1929 కి సుమారు 6 రెట్లు పెరిగింది. 1907 నుంచి ప్రపంచ మార్కెట్టునంతా ఎ. యి. జి. కంపెనీతో కంట్రోల్‌చేస్తున్న ఈ జనరల్ ఎలక్ట్రిక్‌కంపెనీ ఎ. యి. జి. కంపెనీయొక్క షేర్లలో నూటికి 30 వంతులషేర్లను కొనుటవల్ల ప్రపంచ మార్కెట్టుమీద నాయకత్వం సంపాదించింది. ఎ. యి. జి కంపెనీగూడా లొంగిపోయి దానికి బద్ధురాలై పనిచేయవలసి వచ్చింది. ఇప్పుడు జెనరల్ ఎలక్ట్రిక్ కంపెనీయొక్క పలుకుబడి బ్రిటన్ ఫ్రాన్సు దేశాల్లోని పెద్ద ఎలక్ట్రిక్ సంస్థలమీదనేగాక ఇతర దేశాలకు గూడా వ్యాపించింది.

ప్రస్తుతం ప్రపంచంలోని పెద్ద ఎలక్ట్రికల్ వ్యాపార సంస్థలన్నిటిమధ్య ఒడంబడికలు ఏర్పడి, ఒకదానికి మరొకదానిలో షేర్లు ఉండుటద్వారా దగ్గర సంబంధాలు కల్గి ఉన్నాయి. అయినప్పటికి వాటిమధ్య భయంకరమైన పోటీలు గూడా జరుగుతూనే ఉన్నాయి. నూనె పరిశ్రమ విషయంచూస్తే సోవియట్ యూనియన్ మినహా మిగిలిన ప్రపంచంలోని

నూనె గనులు, నూనె మార్కెట్లు అన్నీ 3 పెద్ద ప్రపంచ ట్రస్టుల అధీనంలో ఉన్నాయి. పరస్పరంగా వీటిమధ్య తీవ్ర పోటీలు ఉన్నప్పటికి, కొన్ని నిర్దిష్ట ఆశయాలతో మూడిటి మధ్య ఒడంబడికలు గూడా జరిగినాయి. రసాయన పదార్థాల మార్కెట్లులో 3 పెద్ద గుత్త సంస్థల, కూటమిలు ప్రపంచ మార్కెట్టునంతా కంట్రోల్ చేస్తున్నాయి. వీటిమధ్యగూడా అనేకరకాలైన స్థానిక ఒడంబడికలు ఉన్నాయి. ఇటువంటి ఉదాహరణలు ఇంకా ఎన్నో ఉన్నాయి.

ప్రపంచ ఆర్థిక విభజన ధోరణితీసే బ్రహ్మాండమైన గుత్త సంస్థలయొక్క అధికారం అతీతంగా పెరుగుట ఒకటేకాదు కొత్త లక్షణం. పంచుకునే వస్తువుల సంఖ్య గూడా పెరిగింది. ముఖ్యంగా 'కొత్త' పరిశ్రమల విషయం చూడండి :— ఇప్పుడున్నంత బలమైన మోటార్, కృత్రిమనత్రజని, కృత్రిమసిల్కు మొదలైన పరిశ్రమలు యుద్ధానికి పూర్వంలేవు. 51 దేశాల్లో ఉన్న 400 కంపెనీలను సమ్మేళనంచేసే (ఈ 400 కంపెనీలలో 38 కంపెనీలయొక్క పెట్టుబడియే 20 కోట్ల పౌనులకుపైగా ఉంటుంది.) 'యూనిలీవర్' సంస్థ (మార్గరైన్‌ను ఉత్పత్తి చేసే సంస్థ) వంటి బ్రహ్మాండమైన సంస్థలు యుద్ధానికి పూర్వం లేవు. ఈమధ్యనే సంక్షోభకాలంలో పడిపోయిన క్రీగర్ అగ్గిపెట్టెల ట్రస్టుతో సమానమైన సంస్థ ఒకటి అయినా యుద్ధానికి పూర్వం లేదు. ఈ క్రీగర్ ట్రస్టుక్రింద 35 దేశాల్లో 150 అగ్గిపెట్టె ఫ్యాక్టరీలు ఉండేవి. 15 దేశాల్లోని అగ్గిపెట్టెల వ్యాపారమంతా దానిదే. ఇదిగాక ఇనుము, బంగారం, వెండి; రాగి, భాస్వరములను ఉత్పత్తిచేయు గనుల కంపెనీలలోనూ, కాగితం, ఎలక్ట్రికల్ ఇంజనీయరింగ్, రైల్వే మొదలైన ఇతర పరిశ్రమలలోగూడా దానికి భాగాలు ఉండేవి।

అయితే వీటితోపాటు గుర్తించవలసిన ముఖ్య విషయాలు ఏమిటంటే- (1) రష్యాలో బ్రహ్మాండమైన మార్కెట్టును కల్గిఉండి. దానిద్వారా రష్యాను పంచుకునే ప్రపంచ సామ్రాజ్యవాదుల ఆశయాలను అక్టోబర్ విప్లవం భగ్నంచేసింది. (2) స్వతంత్ర పాలిసీతో సోవియట్ యూనియన్ ప్రపంచ మార్కెట్టులో ప్రవేశించేసరికి ఏయే ప్రపంచ వ్యాపార రంగాలలో సోవియట్ యూనియన్ ప్రధాన పాత్ర వహిస్తున్నదో ఆయారంగాలన్నిటిని సామ్రాజ్యవాద గుత్తదారులు తమ మధ్యనే పంచుకొనుటకు వీలులేకపోయింది.

## 6. వివిధ సామ్రాజ్యవాద దేశాలమధ్య ప్రపంచ పంపకం

వివిధ పెద్దదేశాలమధ్య జరిగిన ప్రపంచ పంపకాన్నిగురించి లెనిన్ ఉదహరించిన లెక్కలను తరువాత కనిపెట్టబడిన నూతనఆధారాలతో పోల్చిచూస్తే లెనిన్ సామ్రాజ్యవాద సిద్ధాంతంయొక్క ప్రధాన లక్షణాలన్నీ చారిత్రిక పరీక్షకు నిలబడ్డవని, ఆలక్షణాలన్నీ ఇంకా అభివృద్ధి చెందినవనీ తెలుస్తుంది. అంతేగాక పెట్టుబడివిధానం అంతర్జాతీయంగా శాశ్వతసంక్షోభంలో చిక్కుకొనిపోయిన ప్రస్తుత ప్రపంచకార్మిక విప్లవదశయొక్క ముఖ్య

లక్షణాలన్నీ బహిర్గతమయినాయి. ప్రపంచ వలసవిషయంలో జరిగిన ముఖ్యమార్పులను పరిశీలిద్దాం :—

(1) సామ్రాజ్యవాదుల ముఠానుంచి జారిస్టురష్యా తొలగింది. "వివిధజాతుల బందిఖానా" అని పిలువబడిన జారుకాలంనాటి రష్యా, సమానహక్కుల ననుభవిస్తూ ఉత్పత్తిశక్తుల మహత్తర అభివృద్ధిని ఆధారంచేసుకొని సామ్యవాదసారంతోనిండిన, జాతీయ సంస్కృతులను అభివృద్ధిచేసుకుంటున్న వివిధజాతులయొక్క స్వేచ్ఛా సమ్మేళనంగా మారిపోయింది. దీనిఫలితంగా వలసదేశాల ప్రపంచంలో అనేకమార్పులు కల్గినాయి. లెనిన్ ఉదహరించిన లెక్కలప్రకారం 20 వ శతాబ్ద ప్రారంభంలో ఆసియా ఖండంలో నూటికి 56.6 వంతుల భూభాగం వలసభూమిగా ఉండేది. (అర్ధవలస రాజ్యాలను, కొరియాను మినహాయిస్తే). కాని 1932 నాటికి ఈ వలసదేశాల వైశాల్యం నూటికి 20.6 వంతులకు తగ్గిపోయింది (కొరియాతోసహా, కాని ఈమధ్య జపాన్ ఆక్రమించిన చైనారాష్ట్రాలను మినహాయించాలి). అనగా ఆసియాఖండంలోని వలసరాజ్యాల వైశాల్యం 20 వ శతాబ్ద ప్రారంభంనాటినుంచి 1932 కి నూటికి 64 వంతులు తగ్గిపోయింది. ఆసియా ఖండంలోని రష్యా—సైబీరియా, మధ్య ఆసియాలోని రష్యా (వీటినిగూడా లెనిన్ వలస దేశాలక్రిందనే లెక్కవేశాడు)— యివి విముక్తి చెందుటయే ఈ తగ్గుదలకు కారణం.

(2) లెనిన్ ఉదహరించిన లెక్కలలో చైనా అర్ధవలసదేశంగా పరిగణించబడింది. తరువాత చైనాలో జరిగినవిప్లవం, జపాన్ వ్యతిరేకంగా వృద్ధిఅయిన జాతీయ ఐక్యసంఘటనల ఫలితంగా గొప్పమార్పులు వచ్చినయి. ఈనాడు జపాన్ సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా నిలబడి చైనాదేశస్థులందరూ ధైర్యసాహసములతో పోరాడుతున్నారంటే తమ స్వదేశాన్ని పూర్తిగా విముక్తిగావించుటకే. మంగోలియన్ రిపబ్లిక్, టన్నూటువా రిపబ్లిక్కులుగూడా సామ్రాజ్యవాదుల సంకెళ్ళనుంచి విముక్తిచెంది స్వతంత్రదేశాలుగా మారినాయి.

(3) లెనిన్ లెఖ్ఖలలో టర్కీ, ఇరాన్, ఆఫ్గన్‌స్థాన్ దేశాలుగూడా అర్ధవలస దేశాలుగా పరిగణించబడినయి. కాని ఈ నాడుటర్కీ స్వతంత్ర దేశం. ఇరాన్ (పర్షియా) ఆఫ్గనిస్థాన్ దేశాలుగూడా స్వతంత్ర దేశాలుగా మారుతున్నయి.

ఈ మార్పులనన్నీ కలిపి చూచిన యెడల వలసరాజ్యాలమీద సామ్రాజ్యవాదుల పెత్తనం ఎలాక్షీణిస్తున్నదో స్పష్టమవుతుంది. జార్ సామ్రాజ్యాధిపతి క్రింద ఉన్నవలస దేశాలన్నీ నవంబర్ విప్లవ ఫలితంగా స్వతంత్రాన్ని సంపాదించినయి. కాని చైనావిప్లవం టర్కీ స్వాతంత్ర ఉద్యమంగూడా నవంబర్ విప్లవ ప్రభావం యొక్క ఫలితాలే. జాతీయ స్వాతంత్ర్య పోరాటాలనన్నిటిని అణిచివేసే విద్రోహశక్తి అయిన జార్ సామ్రాజ్య విధానాన్ని కూలద్రోసి, ఆపోరాటాలను ప్రోత్సహించి వృద్ధిచేసే ప్రధాన ఉత్తేజశక్తిగా సోవియట్ రష్యా తయారైనందువల్ల ఇతర విప్లవాలన్నీ సాధ్యపడినాయి. పూర్వం జారు

క్రింద బానిస దేశాలుగా ఉన్న భూభాగాల్లో ఈనాడు బ్రహ్మాండమైన పారిశ్రామిక సంస్థలు నిర్మించబడుటవల్ల, ఆదేశాల్లో పూర్వం హింసా, దోపిడీలకు గురియైనజాతులన్నీ మేల్కొని తలయెత్తి సోషలిస్టు నిర్మాణాన్ని జయప్రదంగా సాగిస్తూ జాతీయ విజ్ఞానాన్ని పెంపొందించు కొనుటవల్ల, తూర్పు దేశాల్లో సామ్రాజ్య వాదంతో అంతిమ పోరాటాన్ని సాగించే అసంఖ్యాకులైన కష్టజీవులందరూ సమీకరించబడుతున్నారు. ఈ బ్రహ్మాండమైన పోరాటానికి చైనాదేశం నాయకత్వం వహిస్తోంది

(4) కాని, మరొకవైపున అర్ధవలసరాజ్యాలు, అర్ధస్వాతంత్ర్యదేశాలు పూర్తిగా బానిసదేశాలుగా తయారగుటవల్ల, వలసదేశాలమీద పరిపాలనా పెత్తనం కొంతవరకు విస్తరించినదని గూడా 1932 లెక్కలను, లెనిన్ ఉదహరించిన లెక్కలతో పోల్చినప్పుడు తెలుస్తోంది. ఆధునికయుగంలో వలసదేశాలకై చేయబడిన పోరాటాలను గురించి ఇదివరకే చూశాం. అబిసీనియాను ఇటలీ ఆక్రమించుట; మంచూరియాను, చైనాలోని మధ్య ఉత్తర భాగాలను జపాను ఆక్రమించుట ఆధునిక సామ్రాజ్యవాదుల దాడులకు ఉదాహరణలు. లెనిన్ ఈవిషయాన్నిగురించి ముందే చెప్పాడు. భవిష్యత్తులో వలసదేశాలను ఎక్కువ చేసుకొనుటకు సామ్రాజ్యవాదం చేసే పోరాటం అంతా చైనాను పూర్తిగా వశం చేసుకొని పంచుకునే మార్గంలో నడుస్తుందని లెనిన్ చెప్పిన విషయం చక్కగా రుజువైంది. తన వలసదేశంగా చేసుకొనుటకై జపాన్, చైనా మీద దురాక్రమణ యుద్ధాన్ని సాగిస్తోంది. అయినప్పటికి జపాన్ యొక్క సామ్రాజ్యవాద ప్లానులన్నీ పూర్తిగా నాశనం కాగలవని చెప్పవచ్చును. చైనాప్రజలందరూ ఐక్యమయి సాగిస్తున్న వీరోచిత స్వాతంత్ర్యయుద్ధమే దీనికి కారణం.

(5) ప్రస్తుత పరిస్థితులను పరిశీలించినయెడల సామ్రాజ్యవాదులమధ్య జరిగిన వలసదేశాల పంపకంలో వచ్చినమార్పులు తెలుస్తాయి. యుద్ధకాలంలో వివిధదేశాలమధ్య ఏర్పడిన సంబంధాలకు అనుగుణ్యంగా జరిగిన ప్రపంచ పంపకంయొక్క ఫలితంగా జర్మనీక్రింద ఉండే వలసదేశాలన్నీపోయి, బ్రిటన్, ఫ్రాన్సు, ఇటలీ, జపాను దేశాలక్రింద వలసదేశాలు ఎక్కువయినాయి. తిరిగి ప్రపంచ పంపకం జరగాలనేమిషతో ఈనాడు ప్రపంచాన్నంతా ఇంకొకసారి యుద్ధంలోముంచుటకు ఫాసిస్టులు తయారవుతున్నారు. చైనా మీద జపాన్ ప్రారంభించినయుద్ధం, అబిసీనియాను ఇటలీ ఆక్రమించుట, స్పెయిన్‌లో ఇటలీ జర్మనీలుకలిసి యుద్ధంసాగించుట — ఇవన్నీ 2వ సామ్రాజ్యవాదయుద్ధానికి దారి తీస్తున్నాయి. ఫాసిస్టు ఏజెంట్లద్వారా జర్మనీలోని పెట్టుబడి కోటీశ్వరులందరూ ప్రతీకారం తీర్చుకొనుటకు యుద్ధానికి త్వరత్వరగా సన్నాహమవుతున్నారు. వలసదేశాల పంపకం యొక్క అసమానత్వం, దానితోపాటు వివిధదేశాల మిలిటరీశక్తుల మధ్య ఏర్పడినభేదాలు చూస్తే తిరిగి ప్రపంచ పంపకంకొరకు జరుగుతున్న పోరాటాలు 1914 లోకంటె ఎక్కువ తీవ్రంగా జరుగుతున్నవని బోధపడుతుంది. గత 20 సంవత్సరాల్లో ప్రపంచ ఆర్థిక

రంగంలో బ్రిటన్ అనేక ప్రధానస్థానాలను గోల్పోయినా ఈనాడు 1914 లోకంటే వలస దేశాలు బ్రిటన్‌కు ఎక్కువయినవంటే, యునైటెడ్‌స్టేట్స్‌యొక్క టెక్నికల్ అభివృద్ధితో గాని, ఇతర యూరపియన్ దేశాల టెక్నికల్ అభివృద్ధితోగాని పోల్చినయెడల ఎంతో హీనస్థానాన్ని ఆక్రమిస్తున్న జపాన్ మంచూరియాను ఉత్తరచైనాను ఆక్రమించుటద్వారా ప్రపంచ సామ్రాజ్యవాదశక్తులలో ఒక అగ్రస్థానంకొరకు ప్రయత్నిస్తున్నదంటే, ప్రపంచ పంపకంకొరకు ఎటువంటి తీవ్రసంఘర్షణ జరుగుతున్నదో విశదమవుతుంది. కాని ఈసారి రానున్న సామ్రాజ్యవాదయుద్ధం తప్పనిసరిగా ప్రపంచ సామ్రాజ్యవాదంయొక్క పునాదులను ఊగులాడిస్తున్న చైనావిప్లవానికి, ప్రపంచ విప్లవపోరాటాలకు పుట్టినిల్లయిన సోవియట్‌యూనియన్‌కు వ్యతిరేకంగా జరుగవలసియున్నది. స్వతంత్రచైనా, సోషలిస్టు సోవియట్‌యూనియన్ ఉన్నంతకాలం సామ్రాజ్యవాదుల ప్రపంచ పంపకపుప్లానులు ఎలా జయప్రదం అవుతాయి ? కరుడుగట్టిన బ్రిటిష్‌విద్రోహకవర్గాల ప్రోత్సాహంతో జపాన్ ఫాసిస్టులు, జర్మన్ ఫాసిస్టులు దారితీస్తున్నయుద్ధం దినదినాభివృద్ధి అవుతున్న సోవియట్ యూనియన్ శక్తివల్ల, సోవియట్ యూనియన్ అనుసరిస్తున్నశాంతి పంథావల్ల, వాయిదా వేయబడుతోంది. మొదటి ప్రపంచయుద్ధం, దానిలోనుంచి బయలుదేరిన అక్టోబర్ విప్లవం ప్రపంచ సామ్రాజ్యవాదుల వలస రాజ్యాల విధానానికి తీరనిదెబ్బ కొట్టినాయి. కానిరానున్న యుద్ధం ప్రపంచ సామ్రాజ్యవాదాన్ని సర్వనాశనం చేయకతప్పదు.

## 7. పెట్టుబడి విధానంయొక్క ఎగుడు దిగుడు అభివృద్ధి మరింత ప్రస్ఫుటమవుతోంది.

సామ్రాజ్యవాద దశలో పెట్టుబడి విధానంయొక్క ఎగుడు దిగుడు అభివృద్ధిని గురించి లెనిన్ - స్టాలిన్ల యొక్క సిద్ధాంతాలు సత్యమని చరిత్ర స్పష్టంగా చాటుతోంది. తక్షణం బయలుదేరనున్న కొత్త సామ్రాజ్యవాదయుద్ధంగూడా లెనిన్, స్టాలిన్ల సిద్ధాంతాన్ని బలపరుస్తోంది. పెట్టుబడి కోటీశ్వరుల పరిపాలన క్రింద, ఇదివరకే పంపకమయిన ప్రపంచాన్ని తిరిగి పంచుకొనుటకై తరచుగా మిలటరీ పోరాటాలు; మిలిటరీ సంక్షోభాలుతప్పనిసరిగా జరుగునని స్టాలిన్ చెప్పిన విషయంగూడా సత్యమని రుజువైంది. ఒకే ఒకదేశంలో సోషలిస్టు నిర్మాణం సాధ్యపడగలదనే సిద్ధాంతం సోవియట్ యూనియన్‌లో విజయం పొందిన సోషలిస్టు నిర్మాణంవల్ల రుజువైంది. లెనిన్ స్టాలిన్లు ఏసిద్ధాంతాలకు వ్యతిరేకంగా ఎడతెగని పోరాటం సాగించారో ఆ విద్రోహకర సిద్ధాంతాలన్నీ (కాట్స్కీ, ట్రాట్‌స్కీ, జినోవీవ్, కెమెనీవ్, బుఖారిన్ మొదలైనవారి సిద్ధాంతాలు) పూర్తిగా దివాలా అయినవని గూడా స్పష్టపడింది. కోటీశ్వరుల పరిపాలన క్రింద పెట్టుబడి విధానంయొక్క ఎగుడు దిగుడు అభివృద్ధియొక్క ప్రత్యేక స్వభావపాత్రలయందు తమదృష్టిని కేంద్రీకరించుట

ద్వారా లెనిన్ స్టాలిన్లు తమ సిద్ధాంతాలను అభివృద్ధిచేశారు. పెట్టుబడి విధానం సాఫీగాగాక ఎగుడు దిగుడుగా, అడ్డదిడ్డంగా అభివృద్ధి అయిందని చరిత్ర నిరూపించింది అన్నివివరాల్లో గూడా ఈ సిద్ధాంతంయొక్క సత్యం పూర్తిగా రుజువుచేయబడింది. గత 20 సంవత్సరాల్లో ముఖ్యపెట్టుబడి దేశాల్లో పెట్టుబడివిధాన అభివృద్ధియొక్క వేగాధిక్యతలమధ్యగల తేడాలు ఎక్కువగుటయేగాక వివిధ పరిశ్రమలయొక్క అభివృద్ధిలో గూడా భేదాలు విపరీతంగా వృద్ధి అయినాయి. ఈ భేదాలవల్ల వివిధ దేశాలమధ్య, వివిధ పరిశ్రమలమధ్యగల సంబంధాలలో ముఖ్యమైన మార్పులు కలిగినాయి. ఈ ఎగుడు దిగుడు అభివృద్ధివల్ల వివిధ దేశాల పరిశ్రమలయొక్క అభివృద్ధిలోగల భేదాలను నిర్మూలించి సమానత్వాన్ని సంపాదించుటకై జరిగిన తీవ్రపోరాట ఫలితంగా పెట్టుబడివిధానంయొక్క ఎగుడుదిగుడు అభివృద్ధి లక్షణం మరింత తీవ్రమగుటయేగాక వివిధ దేశాల పరిశ్రమలయొక్క అభివృద్ధిలో ఏర్పడిన తేడాలు మరింత హెచ్చినాయి. దీనిఫలితంగా వివిధదేశాలయొక్క రాజకీయ, ఆర్థిక, మిలిటరీ, వలసరాజ్య అధికారాల్లో భేదాలు హెచ్చి వైరుధ్యాలు తీవ్రంగా పెరిగినాయి. ఈకారణాలవల్ల యుద్ధానంతరం అంతర్జాతీయ సంబంధాలలో ఘర్షణ ఎక్కువయి కొత్త సామ్రాజ్యవాద యుద్ధానికి దారితీసే పరిస్థితులు త్వరగా ఏర్పడుతున్నాయి. చివరివిషయం-వివిధ పెట్టుబడిదారీ దేశాలయొక్క రాజకీయ అభివృద్ధిలో ఏర్పడిన తేడాలు యుద్ధానంతరం మరింత ప్రస్ఫుటమయి ఊహించలేనంతగా పెరిగి నూతన రూపాలు తీసుకున్నాయి. ఈ విషయాలను కొన్నిటివి పరిశీలిద్దాం :—

"వివిధదేశాల అభివృద్ధి యొక్క వేగాధిక్యత" (లెనిన్)లోగల భేదాలను మొదట తీసుకుందాం. ఈ క్రింద ఇవ్వబడిన పట్టికలో పెట్టుబడిదారీ విధానంయొక్క అభివృద్ధి 3 ప్రధాన దశలలో చూపించబడింది: (1) 1860-1880. స్వేచ్ఛావ్యాపారం ఆధిక్యత దశ (2) 1890—1913. ఈదశలో గుత్తవ్యాపారనికి ప్రధానస్థానం ఏర్పడింది. (మొదటి దశనుంచి ఈదశను స్పష్టంగా వేరుచేయుటకై 1880—1890 మధ్య 10 సంవత్సరాలు వదిలివేయబడినాయి. ఈ 10 సంవత్సరాల కాలంలో స్వేచ్ఛావ్యాపార స్థానాన్ని క్రమేణా గుత్తవ్యాపారంఆక్రమించింది. (3) 1914—1929; అనగా యుద్ధకాలం, పెట్టుబడి విధానం యొక్క శాశ్వత సంక్షోభం ప్రారంభమయినదశ.

పారిశ్రామిక ఉత్పత్తిలో పెరుగుదల లేక తగ్గుదల (నూటికి ఎన్ని వంతులు ?)

| దేశం | 1860—1880 | 1890—1913 | 1913—1929 |
|---|---|---|---|
| జపాన్ | — | — | +197 |
| కెనడా | — | 245 | +120 |
| బ్రిటిష్ ఇండియా | — | — | +81 |
| రష్యా | +113 | +270 | — |

| | | | |
|---|---|---|---|
| యునై టెడ్ స్టేట్స్ | +113 | +156 | +70 |
| ఇటలీ | — | +150 | +76 |
| జర్మనీ | +78 | +148 | +13 |
| ఫ్రాన్సు | +65 | +79 | +38 |
| బ్రిటన్ | +56 | +61 | —1 |
| పోలెండు | — | — | —10 |
| పెట్టుబడి ప్రపంచం | +88 | +133 | +47 |
| అతివేగంగా అతి నెమ్మదిగా వృద్ధిఅయిన దేశాల తారతమ్యవేగం | 113 : 56 = 2 : 1 | 270 : 61 = 4 : [illegible]·9 | 197 : —10 |
| బ్రిటన్, యునై టెడ్ స్టేట్స్‌యొక్క తార తమ్యవేగం | 56 : 113 = 1 : 2 | 61 : 156 = 1 : 2.5 | —1 : 70 |

పై పట్టికవల్ల ఏంతెలుస్తోంది? వివిధ చారిత్రికదశలలో వివిధదేశాల అభివృద్ధి యొక్క వేగాధిక్యతలమధ్య గలభేదం పెరుగుటయేగాక విశాలమయిందనిగూడా స్పష్ట మవుతోంది. ఈ పట్టికలో ఇవ్వబడిన సంఖ్యలన్నీ సుమారు సంఖ్యలయినప్పటికి మొత్తం మీద పెట్టుబడి పరిశ్రమాభివృద్ధియొక్క ప్రధానగతులను తెలియజేస్తున్నాయి. ఈప్రధాన గతులేమిటో చూద్దాం.

1860—1880, 1890--1913 దశలలోకల్గిన అభివృద్ధియొక్క వేగములను పోల్చిన యెడల అనగా స్వేచ్ఛావ్యాపారంయొక్క స్థానాన్ని గుత్తవ్యాపారం ఆక్రమించినతరువాత ప్రపంచఉత్పత్తి పెరుగుదలయొక్క వేగంగూడా హెచ్చింది. 1860—1880 మధ్య 20 సంవత్సరాల్లో ప్రపంచఉత్పత్తి నూటికి 86 వంతులు పెరిగింది. 1890—1913 మధ్య 23 సంవత్సరాల్లో నూటికి 133 వంతులవరకూ పెరిగింది. ఈ పెరుగుదలతోపాటు వివిధ దేశాల అభివృద్ధిలోగల తేడాలుగూడా పెరిగినాయి. అతివేగముగా జరిగిన అభివృద్ధికి, అతినెమ్మదిగా జరిగిన అభివృద్ధికి మధ్యగల తారతమ్యసంబంధాలు 1860—1880 మధ్య 2: 1; 1890—1913 మధ్య 4.4: 1. రెండుదశలలోగూడా బ్రిటన్‌లోనే అతినెమ్మదిగా అభివృద్ధి జరిగిందనిగూడా గుర్తించాలి. ఈలెక్కలన్నీ లెనిన్‌యొక్క సిద్ధాంతాన్ని చక్కగా బలపరుస్తున్నాయి. "మొత్తంమీద పెట్టుబడివిధానం లోగడకంటె ఎంతో ఎక్కువవేగంతో అభివృద్ధిఅవుతోంది. కాని ఈ అభివృద్ధియొక్క ఎగుడుదిగుడు లక్షణం గూడా రోజురోజుకూ పెరుగుతోంది. అమూల్యమైన పెట్టుబడిగల బ్రిటన్‌వంటిదేశాలు క్షీణిస్తున్నవంటే ఈ ఎగుడుదిగుడు లక్షణం ఎంతస్పష్టంగా ప్రస్ఫుటమవుతున్నదీ తెలు స్తుంది" అని లెనిన్ వ్రాశాడు

ప్రపంచ యుద్ధంవల్ల, తరువాత బయలుదేరిన ఆర్థికసంక్షోభంవల్ల పెట్టుబడిదారీ ప్రపంచంలోని పారిశ్రామిక అభివృద్ధిలో తీవ్రమైనమార్పులు వచ్చినాయి. మొత్తంమీద ప్రపంచ పారిశ్రామిక అభివృద్ధియొక్క వేగంతగ్గింది. 1913–1929 మధ్య 16 సంవత్సరాల్లో ప్రపంచ పారిశ్రామికఉత్పత్తి నూటికి 47 వంతులుమాత్రం హెచ్చింది. అనగా సంవత్సరానికి సగటున 2.4 వంతులు పెరిగిందన్నమాట. కాని 1890–1913 మధ్య సంవత్సరానికి సగటున నూటికి 3.7 వంతులు ఎక్కువయింది. కాని తరువాత 5 సంవత్సరాల్లో ఉత్పత్తి పడిపోయిందని అందరికీ తెలిసినవిషయమే. పెట్టుబడి పరిశ్రమలయొక్క అభివృద్ధి, మొత్తంమీద క్షీణిస్తున్న పరిస్థితులలో వివిధదేశాల అభివృద్ధిలోగల తేడాలు గూడా ఎక్కువయినాయి. ఈ క్రిందివిషయాలనుబట్టి ఈ సంగతి విశదమవుతుంది.

(1) సర్వసామాన్యంగా అభివృద్ధి అన్ని దేశాల్లో క్షీణిస్తున్నసమయంలో, ఏ పెట్టుబడి దేశాలు ఎప్పుడూ ఎరుగనటువంటి అభివృద్ధి జపాన్, కెనడావంటి కొన్ని దేశాల్లో వచ్చింది;

(2) యుద్ధానంతరం, యూరప్ఖండంలో కల్లా భాగ్యవంతమైన బ్రిటన్‌లో (పోలెండు విషయంలో గూడా) ఉత్పత్తి ఎగుడుదిగుడుగా అభివృద్ధి అయింది. ఈ అభివృద్ధి ఏ సంవత్సరంలోగూడా 1913 ఉత్పత్తికి మించలేదు. యుద్ధానంతరం పెట్టుబడి విధానంలో బయలుదేరిన తీవ్రసంక్షోభానికి ఇది ఒకసూచన. అయితే ఈ దేశాల్లో కొన్ని పరిశ్రమలు ఎక్కువ వేగంగా అభివృద్ధిఅయినమాట నిజమే. బ్రిటన్‌లోని అన్ని పరిశ్రమలలోనూ ఉత్పత్తి పరికరాల్లో చాలావరకూ అభివృద్ధివచ్చింది. కాని కొన్ని యూరపియన్ దేశాల పారిశ్రామిక ఉత్పత్తిలో బయలుదేరిన తారతమ్యక్షీణతవల్ల కొన్ని వ్యక్తిగతదేశాల్లోని అభివృద్ధియొక్క ఎగుడు దిగుడు స్వభావం ఉచ్చదశకు వెళ్ళిందని మాత్రం స్పష్టపడుతోంది. అతివేగంగా అభివృద్ధి అవుతున్న దేశాల్లోని పారిశ్రామిక ఉత్పత్తి క్షీణిస్తున్నప్పటికి, కొన్నిదేశాల్లో ఎంతమాత్రం లేనప్పుడు, వివిధ దేశాల అభివృద్ధియొక్క వేగముల మధ్య భేదం త్వరత్వరగా పెరిగిపోతున్నదని గూడా తెలుస్తోంది. యునైటెడ్ స్టేట్స్ విషయంచూస్తే యుద్ధానంతర అభివృద్ధియొక్కవేగం. యుద్ధపూర్వపు వేగంకంటె ఎంతో తక్కువగా ఉంది. కాని, యుద్ధానికిపూర్వం యునైటెడ్ స్టేట్స్ అభివృద్ధియొక్కవేగం జర్మనీతో సమానంగానూ బ్రిటన్‌కంటె 2½ రేట్లు ఎక్కువగానూ ఉండేది. యుద్ధానంతరం జర్మనీవేగంకంటె యునైటెడ్ స్టేట్స్ అభివృద్ధియొక్కవేగం 15 నుంచి 20 రెట్లవరకూ ఎక్కువైంది. యునైటెడ్ స్టేట్స్ యొక్క అభివృద్ధిని బ్రిటన్‌తో పోల్చిన యెడల (యుద్ధానంతరం) +70 :-1 తారతమ్య సంబంధం కన్పిస్తోంది. ఇక జపాన్ పోలెండు దేశాల అభివృద్ధిని పోల్చినయెడల అంతులేని ఎగుడుదిగుడు సంబంధాలు బహిర్గతమవుతున్నాయి.

(3) వివిధ దేశాలపారిశ్రామిక ఉత్పత్తియొక్క అభివృద్ధిలోగల ఎగుడు దిగుడు స్వభావం ఎలా పెరిగిందో ఈ క్రింది విషయాలు తెలియజేస్తాయి. 1890-1913 మధ్య

యునైటెడ్ స్టేట్స్, ఇటలీ, జర్మనీ దేశాల అభివృద్ధి దాదాపు సమానంగా ఉండేది. ఫ్రాన్సు బ్రిటన్ దేశాలు ఇతరదేశాలకంటె ఎంతో వెనుకబడియున్నా వాటిమధ్యమాత్రం కొద్దితేడా ఉండేది. 1913–1929 మధ్య యునైటెడ్ స్టేట్స్ ఇటలీ దేశాలుమాత్రం దాదాపుసమానంగా అభివృద్ధిఅయినాయి. దీన్నిబట్టి యుద్ధపూర్వంకంటె యుద్ధానంతరం వివిధదేశాల అభివృద్ధి పరిస్థితులలోగల భేదాలు బాగా వృద్ధిఅయినవని స్పష్టపడుతోంది.

(4) వివిధదేశాల అభివృద్ధియొక్క వేగాన్నిబట్టి అనేక ఆకస్మికమార్పులు కల్గి కొత్తకూటాలు ఏర్పడినాయి. ఉదాహరణకు 1919–29 మధ్య ఎక్కువత్వరగా పారిశ్రామిక అభివృద్ధి పొందుతున్న దేశాల కూటమినుంచి జర్మనీ తొలగిపోయి అతినెమ్మదిగా అభివృద్ధిఅవుతున్న దేశాలకూటమిలో చేరింది. సరిగ్గా దీనికివ్యతిరేకంగా ఫ్రాన్సు అతినెమ్మదిగా అభివృద్ధిఅవుతున్న దేశాల కూటమినుంచి తొలగి అతిత్వరగా అభివృద్ధి అవుతున్న దేశాలకూటమిలో కలిసింది.

యుద్ధానంతరం పరిశ్రమలోని వివిధశాఖలలోగూడా ఎగుడుదిగుడు అభివృద్ధి స్వభావం ప్రాధాన్యత వహించిందనే చెప్పాలి. 1913 తో పోల్చిచూసినప్పుడు వివిధపారిశ్రామిక శాఖలయొక్క ప్రపంచఉత్పత్తి 1929 లో ఎలాఉన్నదో ఈక్రింది సంఖ్యలు తెలియజేస్తాయి. 1913 ఉత్పత్తిలో 1929 ఉత్పత్తి నూటికి ఎన్నివంతులో ఈలెక్కలు తెలియజేస్తాయి.

| | |
|---|---|
| నౌకానిర్మాణం | 83 |
| ప్రత్తిమిల్లులు | 111 |
| బొగ్గు, లిగ్నైట్ | 116 |
| పిగ్ఇనుము | 126 |
| ఉక్కు | 160 |
| నత్రజని | 286 |
| నూనె | 411 |
| అల్యూమినియమ్ | 424 |
| మోటార్ | 892 |
| కృత్రిమసిల్కు | 1172 |

పిగ్ఇనుము, బొగ్గు, ప్రత్తిమొదలైన ముఖ్యపరిశ్రమల పరిస్థితి వివిధదేశాల్లో భేదించినప్పటికి, ఆ పరిశ్రమలన్నీ అన్నిదేశాల్లోగూడా అతినెమ్మదిగా అభివృద్ధిఅయినాయి. కాని కొత్తపరిశ్రమలు మాత్రం అతిత్వరగా వృద్ధిఅయినాయి. అందువల్ల 'నూతన' పరిశ్రమలకు పాతపరిశ్రమలకు మధ్య తీవ్రసంఘర్షణబయలుదేరి సమానత్వం సంపాదించుటకు పోటీ లెక్కువయినాయి. దీనివల్ల పెట్టుబడివిధానంయొక్క ఎగుడు

దిగుడు అభివృద్ధిస్వభావం మరొకసారి ప్రస్ఫుటమయింది. (బొగ్గును నూనెతోనూ, ప్రత్తినీ (బట్టలు) కృత్రిమసిల్కుతోనూ, నౌకా నిర్మాణాన్ని మోటార్‌పరిశ్రమతోనూ, పిగ్‌ఇను మును అల్యూమినియమ్‌తోనూ పోల్చిచూడండి.) ఇంతేగాక ఉత్పత్తిసాధనాలను ఉత్పత్తి చేసే ప్రధాన పరిశ్రమల అభివృద్ధికి జీవితావసరాలను ఉత్పత్తిచేసే పరిశ్రమల అభివృద్ధికి గుత్తపరిశ్రమలకు - గుత్తపరిశ్రమలుకాని వాటికిగల తేడాలుగూడా విపరీతంగా పెరిగి పోయినాయి.

వివిధ ఆర్థికరంగాల అభివృద్ధివిషయంలో రోజురోజుకు పెరుగుతున్న ఎగుడు దిగుడు స్వభావాన్నిసూచించే మరొకవిషయం — వ్యవసాయానికి పరిశ్రమలకు మధ్య ఏర్పడుతున్న గండిఅని చెప్పవచ్చును. యుద్ధానంతరం కొంతవరకైనా కొన్నిదేశాల్లో అయినప్పటికి పరిశ్రమలు పునరుద్ధరించబడితే, వ్యవసాయంమాత్రం 1921 నుంచి దీర్ఘ సంక్షోభంలో చిక్కుకొనిపోయింది. పెట్టుబడివిధానం స్థిరపడినదశలో (1924—1929) కొంతవరకు కోలుకున్నప్పటికి, తిరిగి ఆర్థికసంక్షోభం ప్రారంభంకాగానే వ్యవసాయం మళ్ళీ అంతులేని సంక్షోభ అఖాతంలో చిక్కుకొనిపోయింది.

గత 20 సంవత్సరాల్లో జరిగిన అభివృద్ధిలో రోజురోజుకూ పెరుగుతున్న ఎగుడు దిగుడు స్వభావానికి గల ముఖ్యకారణాలు ఈ క్రింద ఇవ్వబడినాయి.

(1) ప్రపంచ యుద్ధకాలంలో వివిధ దేశాల్లోని పరిస్థితులన్నీ ఆర్థిక అభివృద్ధికి నిరోధకములుగా తయారైనందువల్ల ఆయాదేశముల అభివృద్ధి రకరకాల ఎగుడు దిగుడు మార్గాల్లో నడిచింది. ఉదాహరణకు 1914—1918 మధ్య యునైటెడ్‌స్టేట్స్, జర్మనీ దేశాల అభివృద్ధిని చూడవచ్చును. యుద్ధానంతరం అమలులోకి వచ్చిన ఒడంబడికల విధానం ఫలితంగా కొన్నిదేశాలు బాగా వృద్ధి చెందినాయి. మరికొన్ని దేశాలు బాగా దెబ్బతిన్నాయి.

(2) గుత్త పరిశ్రమలు విపరీతంగా వృద్ధి అగుటవల్ల, దానిఫలితంగా టెక్నికల్ విషయాల్లో కల్గిన ఆకస్మిక ఆభివృద్ధిఫలితంగా పెట్టుబడివిధాన అభివృద్ధియొక్క ఎగుడు దిగుడు స్వభావంగూడా పెరిగిపోయింది.

(3) సోవియట్ యూనియన్ బయలుదేరి, ప్రపంచ పెట్టుబడివిధాన అభివృద్ధికి పెద్ద ఆటంకంగా తయారై సామ్రాజ్యవాదుల చేతుల్లోనుంచి గొప్పముడి సరుకుల సప్లయిని పెద్ద మార్కెట్టును, తప్పించుటవల్ల పెట్టుబడి దేశాలన్నీ ఎంతో కొంతవరకు దెబ్బ తిన్నాయి. ఇతర దేశాల రాజకీయ అభివృద్ధిమీద సోవియట్ యూనియన్ ప్రభావం మరింత ఎగుడు దిగుడుకల్గించింది.

(4) యుద్ధానంతరం పెట్టుబడివిధానంయొక్క ఎగుడు దిగుడు అభివృద్ధి లక్షణం పెరుగుటకు ప్రధాన కారణం పెట్టుబడివిధానం అంతర్జాతీయంగా గొప్పసంక్షోభంలో చిక్కుకొనిపోవుటయే. ఉత్పత్తి శక్తులు అభివృద్ధిఅగుటకు అవకాశాలన్నీ

క్షుంగిపోయిన పరిస్థితులలో ఈ అవకాశాలను కల్పించుకొనుటకై వివిధదేశాలమధ్య, పరిశ్రమల మధ్య తీవ్రమైన ఎడతెగనటువంటి పోటీ సంఘర్షణలు హెచ్చినాయి. ఈ పరిస్థితులలో ఒక రంగంలో అభివృద్ధి రావాలంటే మరొక రంగానికి దెబ్బతగలక తప్పదు. అందువల్ల వివిధ దేశాలమధ్య, వివిధ పారిశ్రామిక శాఖలమధ్యగల అభివృద్ధియొక్క భేదాలు హెచ్చిపోయినాయి.

ముఖ్య పెట్టుబడి దేశాల మధ్య ఏర్పడిన నూతన ఆర్థిక సంబంధాలు :—

అభివృద్ధిలో ఏర్పడిన ఎగుడు దిగుడు స్వభావంవల్ల వివిధ సామ్రాజ్యవాద దేశ శక్తుల మధ్య ఆకస్మిక మార్పులు కల్గినాయి. ఈ మార్పులలో ప్రధానమైనవి యునైటెడ్ స్టేట్స్ బ్రిటన్ దేశాల మధ్య వచ్చినాయి. ఈ మార్పులే ప్రస్తుత అంతర్జాతీయ సామ్రాజ్య వాద వైరుధ్యాలను నిర్ణయిస్తున్నాయి. ఈ మార్పులన్నీ ప్రక్కన ఇవ్వబడిన పట్టికలో సూచించబడినాయి.

క్రిందటి శతాబ్దం ఆఖరికే యునైటెడ్‌స్టేట్స్ బ్రిటన్ స్థానాన్ని ఆక్రమించి ప్రపంచంలో కల్లా పెద్ద పారిశ్రామిక దేశంగా తయారైంది. కాని గత శతాబ్దం ఆఖరికి, యునైటెడ్ స్టేట్స్ యొక్క పారిశ్రామిక ఆధిక్యత కొద్దిస్థాయిలోనే ఉండేది. దానివార, బ్రిటన్‌కు ప్రపంచ వ్యాపారరంగంలో అగ్రస్థానం, ప్రపంచ పరపతి, విదేశ పెట్టుబడులు, యుద్ధ నౌకలు, వలసరాజ్యాలు ఉండేవి. 1900—1913 మధ్య యునైటెడ్‌స్టేట్స్ ముందుకు పెద్ద గంతువేసింది. మొదటి సామ్రాజ్యవాద యుద్ధం బయలుదేరేసరికి బ్రిటన్‌కంటె 4 రెట్లు ఎక్కువ ఉక్కును, 3 రెట్లు ఎక్కువ పిగ్ ఇనుమును, 1.4 రెట్లు ఎక్కువ గుడ్డలను, 1.7 రెట్లు ఎక్కువ బొగ్గును ..యునైటెడ్‌స్టేట్స్ ఉత్పత్తి చేసేస్థితికి అభివృద్ధి చెందింది. యుద్ధ సమయానికి మొత్తం యునైటెడ్‌స్టేట్స్‌యొక్క పారిశ్రామిక ఉత్పత్తి బ్రిటన్‌కంటె 2½ రెట్లు ఎక్కువయింది. పరిశ్రమల పరిమితిగూడా బ్రిటన్‌కంటె దాటిపోయింది. కాని బ్రిటన్‌కు అప్పటికీ ప్రపంచ మార్కెట్టులోనూ, విదేశ పెట్టుబడుల విషయంలోనూ, డబ్బు మార్కెట్‌లోనూ ప్రధమస్థానం ఉండేది. బ్రిటన్‌యొక్క నౌకాదళంతో పోలిస్తే యునైటెడ్‌స్టేట్స్‌యొక్క నౌకాదళం చాలా చిన్నది. కాని యుద్ధకాలంలోనూ, యుద్ధానంతరం పరిస్థితులన్నీ తలక్రిందులయినాయి. ఇది ప్రపంచ ప్రాముఖ్యతగల ఒక ముఖ్య విషయం, యుద్ధానంతరం యునైటెడ్‌స్టేట్స్ విదేశ పెట్టుబడులు బ్రిటన్‌కంటె మించిపోయినాయి. ఈనాడు ప్రపంచ డబ్బు మార్కెట్టుకు లండన్ కేంద్రస్థానం కాదు. విదేశ వ్యాపారంలో యునైటెడ్‌స్టేట్స్‌కు ప్రధమస్థానం వచ్చింది. యుద్ధనౌకల విషయంలో యునైటెడ్‌స్టేట్స్ బ్రిటన్‌కు దాదాపు సమానంగా తయారైంది. వీటన్నిటితోపాటు యునైటెడ్‌స్టేట్స్ యొక్క పారిశ్రామిక ఆధిక్యతగూడ అతీతంగా పెరుగుటవల్ల బ్రిటన్‌కూ యునైటెడ్‌స్టేట్స్‌కూ పరిశ్రమాభివృద్ధిలో అసమానమైన భేదాలు ఏర్పడినాయి.

## బ్రిటన్‌కు యునైటెడ్‌స్టేట్స్‌కు మధ్యసంబంధాలను సూచించే పట్టిక.

| | కొలత పరిమాణం | 1880 | | 1913 | | 1929 | | 1936 | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| | | బ్రిటన్ | యునైటెడ్ స్టేట్స్ | బ్రిటన్ | యునైటెడ్ స్టేట్స్ | బ్రిటన్ | యునైటెడ్ స్టేట్స్ | బ్రిటన్ | యునైటెడ్ స్టేట్స్ |
| పరిశ్రమలనునడిపేయంత్రశక్తి | 10 లక్షల హార్స్‌పవర్ | — | 3.41 | 10.75 | 22.42 | 14.89 | 42.93 | — | — |
| ఉత్పత్తి విలువ (గనులు, ఇంజనీయరింగు) | లక్షకోట్ల డాలర్లు | 3.99 | 5.8 | 10.59 | 26.24 | 13.9 | 76.32 | — | — |
| ఉక్కు ఉత్పత్తి | 10 లక్షల టన్నులు | 1.3 | 1.2 | 7.7 | 31.3 | 9.8 | 57.3 | 11.9 | 47.7 |
| విదేశ వ్యాపారం | లక్షకోట్ల డాలర్లు | 2.78 | 2.56 | 5.76 | 4.21 | 8.94 | 9.47 | 3.62 | 48.4 |
| పారిశ్రామికసరుకుల ఎగుమతి | ,, | — | 0.09 | 2.00 | 0.78 | 2.79 | 2 53 | 1.00 | 0.68 |
| విదేశ సెక్యూరిటీలు | 10 లక్షల డాలర్లు | — | — | 781 | 44 (1914) | 424 | 671 | 75 | 13 |
| విదేశ పెట్టుబడుల మొత్తం | లక్షకోట్ల ఫ్రాంకులు | 22 (1882) | — | 75-100 (1914) | 9.9 (1912) | 94 (1930) | 81 (1930) | — | — |
| వ్యాపార నౌకలు | 10 లక్షల టన్నులు | 6.52 | 3.58 | 18.7 | 5.38 | 20.17 | 14.38 | 20.39 | 12.56 |
| నౌకాదళం | ,, | — | — | 2.22 | 0.84 | 1.32 | 1.28 | 1.2 | 1.07 |
| యుద్ధ నౌకలు | యూనిట్లు | — | — | 67 | 34 | 20 | 18 | 15 | 15 |
| క్రూయిజర్లు | ,, | — | — | 123 | 32 | 54 | 30 | 53 | 25 |
| సాయుధ దళాలపై ఖర్చు (ప్రభుత్వ లెక్కలు) | 10 లక్షల డాలర్లు | 137 | 63 | 375.3 | 335.3 | 352.0 | 838.2 | 1381 (1937-38) | 1221 |
| వలస దేశాల జనసంఖ్య | 10 లక్షలు | 267.9 | — | 393.5 (1914) | 9.7 (1914) | 440.6 | 13.9 | 466.5 (1932) | 14.6 (1932) |

బ్రిటన్‌కు ఆర్థికరంగంలో మునుపు ఉండే నాయకత్వస్థానం గతించినప్పటికి, నౌకా దళ ఆధిక్యతకుగూడా దెబ్బతగులుతున్నప్పటికి.

(1) తనవలస రాజ్యాలనన్నిటిని రక్షించుకుంది. ఇతరదేశాలతో పోల్చిన యెడల బ్రిటన్‌యొక్క వలస రాజ్యాల విస్తీర్ణం పెరిగింది.

(2) పూర్వం తన అధీనంలోఉండే మార్కెట్టులో అధికభాగాన్ని బ్రిటన్ కోల్పో యినప్పటికి, విశాలమయిన వలస రాజ్యాలలో తన దేశములో తయారైన సరుకులను అమ్ముకొనగల్గుతోంది. యునైటెడ్ స్టేట్స్‌తో పోల్చినయెడల విదేశమార్కెట్లలో అమ్మక మయే బ్రిటిష్ సరుకులు యునైటెడ్ స్టేట్స్‌కంటె 5 లేక 6 రేట్లు అధికంగా ఉంటాయి.

(3) ఆసియా, ఆఫ్రికా, ఆస్ట్రేలియా, అర్జెంటీనా, బ్రేజిల్. యూరాగ్వే దేశాలలోని బ్రిటిష్ పెట్టుబడి ఆదేశాలలోని యునైటెడ్ స్టేట్స్ పెట్టుబడికంటె ఎక్కువయే.

పై విషయాలనుబట్టి యునైటెడ్ స్టేట్స్, బ్రిటన్‌ల ఆర్థిక అధికారాల్లోగల భేధం ఎలా ఎక్కువగుతున్నదో, విదేశమార్కెట్లలోనూ వలసదేశాల్లోనూ వాటి దోపిడీ విషయం లో గూడ ఘర్షణ ఎలా ఎక్కువగుతున్నదో తెలుస్తుంది. ఈవిధంగా ఆంగ్లో - అమెరి కన్ దేశాలమధ్య తీవ్రమవుతున్న వైరుధ్యం, ఆధునిక సామ్రాజ్యవాదంయొక్క కేంద్ర వైరుధ్యంగా పరిణమించుటకు పరిస్థితులు ఏర్పడినాయి.

ఇక జపాన్ సామ్రాజ్యవాదం యొక్కవిపరీత ఆకస్మిక అభివృద్ధిగూడా వివిధ సామ్రాజ్యవాద దేశాలమధ్యగల సంబంధాల్లోగొప్ప మార్పుకల్గుటకు కారణమయింది

గత 20 సంవత్సరాల్లో యునైటెడ్ స్టేట్స్ బ్రిటన్లకంటె, ఇతర సామ్రాజ్యవాదదేశాల కంటె త్వరగా జపాన్ సామ్రాజ్యవాదం వృద్ధిఅయింది. ఈ కారణంవల్ల ఇతరసామ్రాజ్య వాదులతో పోల్చిన యెడల తారతమ్యంగా జపాన్ ఆర్థికంగా ఎక్కువగా బలపడుటవల్ల, సామ్రాజ్యవాద వైరుధ్యములు మరింత తీవ్రమగుటకు కారణమయింది. కాని యునైటెడ్ స్టేట్స్ బ్రిటన్లకంటె ఆర్థికస్థాయి విషయంలో జపాన్ ఇంకావెనుకబడి ఉందనే చెప్పాలి. జపాన్‌లోని ప్రధాన పరిశ్రమల పరిమితిని, ప్రపంచ ఉత్పత్తిలో జపాన్ యొక్క స్థాన మును, దాని ప్రపంచవ్యాపారాన్ని పరిశీలించిన యెడల ఈ విషయం స్పష్టమవుతుంది. అయినప్పటికి మంచూరియాను ఆక్రమించక పూర్వమే (1931) జపాన్‌కు యునైటెడ్ స్టేట్స్ కంటె 2 రెట్లు ఎక్కువగా వలసదేశాల్లో జానిసలు ఉన్నారు. ఈ 3 సామ్రాజ్య వాద దేశాల పరిస్థితిని ఈ క్రింది పట్టికతెలియజేస్తుంది.

జపాన్, యునైటెడ్‌స్టేట్స్, బ్రిటన్ దేశాల మధ్యగల సంబంధాలను తెలియజేయు లెక్కలు.

| అభివృద్ధి రేటు | సంవత్సరాలు | కొలత పరిమాణం | జపాన్ | యునైటెడ్ స్టేట్స్ | బ్రిటన్ |
|---|---|---|---|---|---|
| పారిశ్రామిక ఉత్పత్తి | 1913-29 | నూటికి | +197 | +70 | —1 |
| ఎలక్ట్రికల్ మోటార్లు (పరిశ్రమలో) | 1913-29 | .. | +1450 | +300 | +363 |
| ఎగుమతులు | 1913-29 | .. | +212 | +110 | +39 |
| ప్రపంచ పెట్టుబడి పరిశ్రమలలో భాగం | 1929 | .. | 2.5 | 47 | 9.8 |
| | 1935 | .. | 3.7 | 43.4 | 11.8 |
| ఉక్కు ఉత్పత్తి | 1929 | 10 లక్షల టన్నులు | 2.3 | 57.3 | 9.7 |
| | 1936 | .. | 5 | 47.7 | 11.9 |
| ప్రపంచవ్యాపారంలో భాగం | 1925-29 | నూటికి | 3 | 14 | 13.6 |
| | 1936 | .. | 3.9 | 12.1 | 15.4 |
| వ్యాపారనౌకలు | 1936 | 10 లక్షల టన్నులు | 4 2 | 12.6 | 20.4 |
| నౌకాదళం మొత్తంటన్నేజి | 1936 | వెయ్యి టన్నులు | 841 | 1072 | 1196 |
| యుద్ధనౌకలు | 1936 | .. | 9 | 15 | 15 |
| క్రూయిజర్లు | 1936 | .. | 41 | 25 | 53 |
| వలసదేశాల జనసంఖ్య మంచూరియా మినహాయించి | 1932 | 10 లక్షల ప్రజలు | 28 | 14.6 | 466.5 |
| మంచూరియాతోసహా | 1932 | .. | 60 | 14.6 | 466.5 |

"చైనా సంపర్కం ఇప్పుడే ప్రారంభమవుతోంది. దాన్నిగురించి జపాన్ యునైటెడ్ స్టేట్స్‌లమధ్య ప్రారంభమయిన ఎడతెగనిపోరాటం క్రమేణా తీవ్రమవుతోంది." అనిలెనిన్ 1916 లో వ్రాశాడు. ఈపోరాటం నేడు నూతనదశలో ప్రవేశించింది. జపాన్‌కంటె యునైటెడ్‌స్టేట్స్ ఆర్థికంగా ఎంతో బలపడింది. కాని చైనాకొరకు జరిపే దురాక్రమణదాడి విషయంలో జపానుకు యునైటెడ్‌స్టేట్స్‌కంటె మిలిటరీగా అనుకూలపరిస్థితులు ఎన్నో ఉన్నాయి. బ్రిటన్ యునైటెడ్‌స్టేట్స్‌లమధ్య పెరుగుతున్న వైరుధ్యంగూడా జపానుకు సహాయపడుతోంది. ఈ అనుకూల పరిస్థితులను ఉపయోగించుకుంటూ చైనానంతా తన వలసదేశంగా మార్చుకొని అక్కడనుండి బ్రిటన్ అమెరికా మొదలైన సామ్రాజ్యవాదులను పీకిపారవేయాలని జపాన్ ప్రయత్నిస్తోంది. ఈ కారణంవల్ల చైనామీద దాడిచేయుటకు జపాన్ ఉపయోగిస్తున్న పసిఫిక్ యుద్ధరంగం కొత్తగా బయలుదేరనున్న ప్రపంచ యుద్ధంలో ఒక ముఖ్యరంగంగా మారుతోంది.

ఫ్రాన్సు, జర్మనీలమధ్య వైరుధ్యం గూడా ఎక్కువ ప్రాముఖ్యత వహిస్తోంది. దాని ఫలితంగా యూరపియన్ దేశాలమధ్యగల సంబంధాలలోగూడా గొప్ప మార్పులు వచ్చినాయి. ఈ కారణాలవల్ల, ఇదివరకే వెర్సేల్స్ సంధిలోని వైరుధ్యాలన్నీ కేంద్రీకరించబడిన మధ్య యూరప్, రానున్న ప్రపంచ సామ్రాజ్యవాద యుద్ధంలో మరొక ముఖ్య యుద్ధరంగంగా తయారవుతోంది. ఫ్రాన్సు జర్మనీలమధ్యగల సంబంధాలలో వచ్చిన మార్పులు ప్రక్కనే పట్టికలో విశదీకరించబడినాయి.

జర్మనీకంటె ఫ్రాన్సు ఎన్నోరెట్లు ఎక్కువగా ఆర్థికంగా బలపడింది. 1914-18 యుద్ధ ఫలితంగా ఫ్రాన్సు దేశంలోని పరిశ్రమలు అభివృద్ధి చెందుటకు జర్మనీ కంటె ఎన్నో అనుకూల పరిస్థితులు కల్గినాయి. పారిశ్రామిక ఉత్పత్తి విషయంలో ఫ్రాన్సు జర్మనీ దేశాల అభివృద్ధి పెరుగుదలను ఈ క్రింది సంఖ్యలు తెలియజేస్తాయి :—

| 1890—1913 | 1913—1929 |
|---|---|
| 79 : 148 | 38 : 13 |
| = 1 : 1.9 | = 3 : 1 |

(1 ప్రస్తుత సరిహద్దుల ప్రకారం 1913 ఉత్పత్తి ఇవ్వబడింది)

యుద్ధపూర్వం జర్మనియొక్క పారిశ్రామిక ఉత్పత్తి ఫ్రాన్సుకంటె 3 రెట్లు ఎక్కువగా ఉండేది. యుద్ధానంతరం ఫ్రాన్సు అభివృద్ధి జర్మనీకంటె 3 రెట్లు ఎక్కువయింది. ఈ లెక్కలనుబట్టి ఫ్రాన్సు జర్మనీల పారిశ్రామిక అభివృద్ధి ఎంత ఎగుడు దిగుడుగా జరిగిందో స్పష్టపడగలదు. అయినప్పటికీ జర్మనీ ఈనాటికికూడా యూరప్‌ఖండంలో అన్ని దేశాలకంటె పెద్ద పారిశ్రామిక దేశమేనని చెప్పాలి. యూరప్‌లో అన్నిదేశాలకంటె ఎక్కువగా అభివృద్ధి అయిన టెక్నికల్ సాధనాలు, ఉత్పత్తి కేంద్రీకరణ, శక్తివంత మైన గుత్తసంస్థలు జర్మనీలోఉన్నాయి. పారిశ్రామిక ఉత్పత్తి సాధనాల్లోకల్గినమార్పులు

జర్మనీ ఫ్రాన్సుదేశాల మధ్యగల సంబంధాలను తెలియజేయు పట్టిక

| | కొలత పరిమాణం | 1913 | | 1929 | | 1936 | |
|---|---|---|---|---|---|---|---|
| | | జర్మనీ | ఫ్రాన్స్ | జర్మనీ | ఫ్రాన్సు | జర్మనీ | ఫ్రాన్స్ |
| జనసంఖ్య | లక్షలలో | 670 | 398 | 640 | 412 | 652 (1933) | 418 (1933) |
| పరిశ్రమలను నడిపే యంత్రశక్తి | 10 లక్షల హార్స్‌పవర్ | 8.64 (1907) | 3.55 (1906) | 18.09 (1925) | 11.72 (1926) | 23.8 (1933) | — |
| ప్రపంచ పెట్టుబడి పరిశ్రమలో భాగం | నూటికి | — | — | 12.6 | 7.6 | 13.2 | 6.2 |
| ఉక్కు ఉత్పత్తి | 10 లక్షల టన్నులు | 18.9 | 4.7 | 16.2 | 9.7 | 19.2 | 6.2 |
| పారిశ్రామిక సరుకుల ఎగుమతులు | లక్షకోట్ల డాలర్లు | 1.61 | 0.16 | 2.34 | 1.23 | 1.44 | 0.31 |
| విదేశ పెట్టుబడులు | లక్షకోట్ల ఫ్రాంకులు | 44 (1914) | 60 (1914) | 5 (1930) | 31.4 (1930) | — | — |
| వ్యాపారనౌకలు | 10 లక్షల టన్నులు | 5.08 | 2.2 | 4.09 | 3.38 | 3.72 | 3 |
| నౌకాదళం. | | | | | | | |
| మొత్తం టన్నేజి | వేలటన్నులు | 1033.7 | 689.2 | 99.6 | 522.3 | 124.9 | 502.0 |
| యుద్ధనౌకలు | యూనిట్లు | 47 | 24 | 6 | 9 | 6 | 7 |
| క్రూయిజర్లు | ,, | 50 | 29 | 5 | 15 | 6 | 14 |
| సైన్యం | వేలలో | 806.0 | 770.7 | 100.5 | 563.0 | 1000 | 624 |
| వలసదేశాల జనసంఖ్య | 10 లక్షల ప్రజలు | 12.3 (1914) | 55.5 (1914) | — | 65.1 (1932) | — | 65.1 (1932) |

ఫ్రాన్సుకు పారిశ్రామిక ఉత్పత్తిఅంత లాభదాయకంగాలేవు. జర్మనీకంటె ఎక్కువ విదేశమార్కెట్లు కల్గినా, జర్మనీకంటె ఎక్కువ వలసరాజ్యాలు, విదేశపెట్టుబడులుకల్గినా ప్రపంచ వ్యాపారవిషయంలో ఫ్రాన్సు జర్మనీకంటె ఇంకా వెనుకబడేఉంది. (దీనికి సంబంధించిన వివరం ముందుపేజీలో టేబిలు రూపంగా యివ్వబడింది) తన పూర్వ శత్రువులమధ్యగల వైరుధ్యాలను, తన అసమాన పారిశ్రామికశక్తిని ఉపయోగించి జర్మనీ, తన యుద్ధసామగ్రులమీద వెర్సేల్స్‌సంధి విధించిన నిషేధాన్ని ఎదిరించి గొప్ప మిలిటరీశక్తిగా తయారగుటకు తహతహలాడుతూ సన్నాహమవుతోంది. ఆస్ట్రియా జర్మన్ ఫాసిస్టుల వలసదేశమయింది. ఇటలీ ఫాసిజంతో చేతులుకలిపి స్పెయిన్ను కొల్లగొట్టే యుద్ధాన్నిసాగిస్తూ స్పెయిన్‌ప్రజలను బానిసలుగాచేసుకొనుటకు జర్మన్ ఫాసిస్టులు యుద్ధాన్ని సాగిస్తున్నారు. జకోస్లోవేకియామీద దురాక్రమణ సాగించుటకు సన్నాహపడుతోంది. సోవియట్ యూనియన్‌కు వ్యతిరేకంగా యుద్ధకుట్రలు సాగిస్తోంది. కొత్త ప్రపంచయుద్ధానికే కాలుత్రవ్వుతోంది. ఈ యుద్ధానికి సన్నాహంచేయుటయే తన ప్రధాన కర్తవ్యంగా జర్మన్ ఫాసిజమ్ పరిగణిస్తోంది.

యుద్ధానంతర పెట్టుబడివిధానంయొక్క ప్రధాన లక్షణం దాని ఎగుడు దిగుడు అభివృద్ధియేనని తెలుసుకున్నాం. కాని ఈ లక్షణంయొక్క రూపాలనన్నిటిని మనం పరిశీలించ లేదు. యుద్ధానంతరం ఏర్పడిన వివిధ ఆర్థిక దశలలో, సంక్షోభంవల్ల వివిధ పరిశ్రమలకు, దేశాలకు కల్గిన నష్టాలలో గల భేదాల్లో ఈలక్షణం ప్రత్యేకంగా స్పష్టమయింది. ఈ క్రింది పట్టిక ఈ విషయాన్ని సూటిగా కాకపోయినా పరోక్షంగానైనా విశదపరుస్తుంది. పెట్టుబడిదారీ ప్రపంచంయొక్క పారిశ్రామిక ఉత్పత్తిలోవచ్చిన పెరుగుదల, క్షీణత

(1922 నాటికి 1929 నాటికిగల వ్యత్యాసం)

వివిధ దేశాల ఉత్పత్తి

| దేశం | నూటికి |
|---|---|
| జపాన్ | —2.2 |
| బ్రిటన్ | —16.6 |
| స్వీడెన్ | —20.9 |
| ఫ్రాన్స్ | —30.9 |
| ఇటలీ | —33.2 |
| ఆస్ట్రియా | —35.7 |
| పోలెండు | —46.1 |
| యునైటెడ్‌స్టేట్స్ | —46.2 |
| జర్మనీ | —46.7 |

వివిధ పరిశ్రమలయొక్క ప్రపంచ ఉత్పత్తి

| పరిశ్రమ | నూటికి |
|---|---|
| కృత్రిమసిల్కు | +25.9 |
| ప్రత్తిమిల్లులు | —11.7 |
| కృత్రిమనత్రజని | —12.8 |
| నూనె | —20.4 |
| బొగ్గు, లిగ్‌నైట్ | —30.6 |
| అల్యూమినియమ్ | —43.9 |
| తుత్తునాగం | —56.9 |
| రాగి | —52.1 |
| ఉక్కు | —61.4 |
| పిగ్ ఇనుము | —64.6 |
| మోటార్లు | —69.1 |

ప్రత్యేకరకమైన మాంద్యం బయలుదేరిన పరిస్థితులలో ఆయాదేశములయొక్క ఆయా పరిశ్రమలయొక్క అభివృద్ధి స్థాయిలోగల తీవ్రభేదాలలోగూడ పెట్టుబడి విధాన అభివృద్ధియొక్క ఎగుడు దిగుడు లక్షణం ప్రస్ఫుటమవుతుంది. ఈవిషయాన్ని గురించి ప్రత్యేకంగా పరిశీలించవలసిన ఆవశ్యకత ఉన్నది. కానిప్రస్తుత వ్యాసంలో ఈవిష యాన్ని గురించి పరిశీలించుటకు అవకాశంలేదు. వివిధ దేశాల పారిశ్రామిక ఆర్థిక అభి వృద్ధిలోగల వ్యత్యాసం పెరుగుటవల్ల వివిధదేశాల రాజకీయ అభివృద్ధియొక్క ఎగుడుదిగుడు లక్షణం సంక్షోభకాలంలో మరింత ప్రస్ఫుటమయిందనే విషయాన్ని గురించి గూడా ప్రత్యేకపరిశీలన అవసరం. పెట్టుబడివిధానంయొక్క రాజకీయ ఆర్థిక అభివృద్ధియొక్క ఎగుడు దిగుడు లక్షణం ఈనాడు ప్రధానంగా— పెట్టుబడివిధానంయొక్క తీవ్రసంక్షోభంలో, విప్లవ ఉద్యమాల అభివృద్ధిలో, పెట్టుబదారీ గొలుసులో ఏర్పడిన అనేక బలహీనమైన లింకుల ఎగుడు దిగుడు స్వభావంలో ప్రస్ఫుటమయి ప్రాధాన్యత వహిస్తోంది.

## 8. పెట్టుబడివిధానంయొక్క పరాన్నభుక్కు స్వభావం, క్షీణత తీవ్రమవుతున్నాయి.

అంతర్జాతీయంగా గుత్తపరిశ్రమలు విపరీతంగా వృద్ధిఅగుటవల్ల పెట్టుబడివిధానం యొక్క క్షీణత హెచ్చి పరాన్నభుక్కు స్వభావం, దోపిడీలుగూడా ఎక్కువయినాయి. ప్రస్తుతదశలో పెట్టుబడివిధానం అంతర్జాతీయంగా మహాసంక్షోభంలో చిక్కుకుని ఉన్న ప్పుడు ఈ క్షీణతయొక్క క్రొత్తరూపాలనన్నిటినీ ఇక్కడ పరిశీలించుటకష్టం. శక్తికితగ్గి (ఎంతోతగ్గి) ఉత్పత్తిసాధనాలు పనిచేయుట, నిరుద్యోగులసంఖ్య ఎడతెగకుండా పెరిగి పోవుట, యుద్ధానంతరం కొన్నిదేశాల్లోనూ, కొన్ని పరిశ్రమలలోనూ, కొన్నిదశలలో పారిశ్రామిక అభివృద్ధి బొత్తిగా లేకపోవుట మొదలైన అనేకరూపాల్లో ఈక్షీణత కనపడు తోంది. పెట్టుబడివిధాన క్షీణతయొక్క ఈ నూతనరూపాలనుగురించి ఇదివరకే లెక్క లేనన్ని ఆధారాలు ఇవ్వబడినాయి. లెనిన్ తన 'సామ్రాజ్యవాదం' గ్రంథంలో 'పెట్టుబడి విధానంయొక్క పరాన్నభుక్కు స్వభావం, క్షీణత' అను శీర్షికక్రింద పరిశీలించిన లక్షణా లను గురించి మాత్రమే ఇప్పుడుచూద్దాం.

టెక్నికల్ అభివృద్ధిలో ఏర్పడిన క్షీణత :— టెక్నికల్ అభివృద్ధి బుద్ధిపూర్వ కంగా ఎలా నిరోధించబడుతున్నదో నిరూపించుటకు లెనిన్ 'ఓయన్స్' (సీసాలు తయారు చేసే) యంత్రం మార్కెట్టులో ప్రవేశించకుండా ఎలా చేయబడిందో ఉదహరించాడు. ప్రస్తుత గుత్త పారిశ్రామికసంస్థలలో ఏ ఒకసంస్థనుతీసుకున్నా అది టెక్నికల్అభివృద్ధిని ఎలా నిరోధిస్తోందో అనేక ఉదాహరణలు తెలియజేయగలవు. కృత్రిమ గాసోలైన్, కృత్రిమరబ్బర్, బ్లాస్ట్‌ఫర్నేసుల సహాయంలేకుండా ఇనుమును ఉత్పత్తిచేయుటకై జరిగిన

పరిశోధనలను — ఈ విషయాలను గురించి యునైటెడ్ స్టేట్స్. ఇతరదేశాలకు సంబంధించిన గుత్తసంస్థల నిరోధకచర్యలను పరిశీలిద్దాం. (ఈ సందర్భంలో కృత్రిమరబ్బర్ సమస్యను ఆచరణలో జయప్రదంగా పరిష్కరించగల్గింది ఒక్క సోవియట్‌యూనియన్ మాత్రమే అని గుర్తించవలసియున్నది.) కృత్రిమ గాసొలైన్ ఉత్పత్తినిగురించి గత యుద్ధకాలంలో జరిగిన యుద్ధసన్నాహాల సందర్భంలో ఎక్కువ ఉత్సాహం చూపించబడింది. తరువాత 1934 లో మళ్ళీ యుద్ధసన్నాహాలు జరుగుతున్నసందర్భంలో జర్మనీలో బొగ్గును నూనెరూపంలోకి మార్చుటకు వినియోగించబడే యంత్రాల అభివృద్ధినిగురించి, ఇంగ్లండు, జపాన్ దేశాల్లో కృత్రిమ గాసొలైన్‌ను ఉత్పత్తిచేయు యంత్రాల స్థాపనను గురించి వార్తలు బయలుదేరినాయి. యుద్ధకాలంలోనే టెక్నికల్ అభివృద్ధికి అవకాశాలున్నవనేవిషయం పెట్టుబడివిధానం చిటికి క్షీణించిపోతున్నదనే సంగతిని బలపరుస్తుంది. ఆర్థిక సంక్షోభదశలోగూడా టెక్నికల్ అభివృద్ధికి ప్రధాన ప్రాముఖ్యత వచ్చిందని మరిచిపోగూడదు!

టెక్నికల్ అభివృద్ధిని నిరోధించుటకు యుద్ధానంతర పరిస్థితులన్నీ గుత్తసంస్థలకు అనేక అవకాశాలు కల్గించినాయి. మొదటివిషయం — గుత్తసంస్థలే బాగా వృద్ధిఅయి ఎన్ని 'పేటెంట్స్' (నమూనాలు)నైనా కొనివేయుటకు కావలసినంత డబ్బును సంపాదించినాయి. రెండవ సంగతి — ప్రధాన లాబరేటరీలు, పరిశోధనాగారాలన్నీ గుత్తపారిశ్రామికసంస్థల కంట్రోల్‌లో ఉన్నాయి. ఈ కారణంవల్ల ఎట్టి పరిశోధననైనా దానిపుట్టుకలోనే నరికివేసి, దాన్ని ఉపయోగపడకుండా చేయుటకుగాని, ఫలానా పరిశోధన జరిగిందని ప్రపంచానికి వెల్లడికాకుండా అణిచివేయుటకుగాని ఈ గుత్తసంస్థలకు అధికారం ఉంది. ఈవిధంగా నూతన పరిశోధనలనన్నిటినీ రహస్యంగా దాచిఉంచుటలో అర్థంఏమిటి? పరిశోధనల ఫలితంగా నూతన యంత్రాలు, నూతన ఉత్పత్తిపద్ధతులు బయలుదేరినయెడల, యంత్రాల ఉత్పత్తిశక్తి విపరీతంగాపెరిగి, ప్రత్యక్షంగా, అయే ఉత్పత్తికి, మూల ఉత్పత్తిశక్తికి వ్యత్యాసం పెరిగిపోగలదని ఈ గుత్తదారుల భయం! ఈవిధంగా టెక్నికల్ అభివృద్ధిని బుద్ధిపూర్వకంగా నిరోధించుటకంటె విశేషమయినది టెక్నికల్ అభివృద్ధిలో క్షీణత. ఆధునిక పెట్టుబడిదారీ విధానంక్రింద ఈ టెక్నికల్‌క్షీణత వివిధరూపాలను తీసుకుంటోంది. శాశ్వతపెట్టుబడిని (యంత్రాలు మొదలైనవి) అతినెమ్మదిగావృద్ధిచేయుట. (ఆర్థిక సంక్షోభకాలంలో బొత్తిగా అభివృద్ధి ఆగిపోవుట); టెక్నికల్ అభివృద్ధితోపాటు ముందంజవేయగల పెద్దపరిశ్రమల సంఖ్య క్షీణించుట; బ్లాస్ట్‌ఫర్నేసులు ఎలక్ట్రిక్ టర్బైనులు మొదలైన యంత్రాల ఉత్పత్తిశక్తిని (లాభదాయకంగానే) తగ్గించుటకు ఉపయోగపడే టెక్నికల్‌మార్గాలకొరకు దృష్టినంతా కేంద్రీకరించుట (ముఖ్యంగా ఆర్థిక సంక్షోభకాలంలో); ఆధునిక ఉత్పత్తిపద్ధతులు ఎన్నోఉంటే వాటికిబదులు పాతకాలంనాటి పద్ధతులను అనుకరించుట (ముఖ్యంగా సంక్షోభకాలంలో) — ఇవన్నీ టెక్ని

కల్ క్షీణతకు ఉదాహరణలే. పాతపద్ధతులను అనుకరించుట ఎక్కువగా వ్యవసాయ విషయంలో కనిపిస్తుంది. యుద్ధానంతరం ఎక్కువైన టెక్నికల్ క్షీణతకు పెట్టుబడిదారీ ఉత్పత్తియొక్క వేగాధిక్యత పడిపోవుటయే ప్రధానకారణం. మార్కెట్లసమస్య క్లిష్టమయి నందువల్ల గుత్తదారులు నిర్ణయించే ధరలవిధానంగూడా టెక్నికల్ అభివృద్ధి క్షీణించుటకు సహాయపడింది. ఇదిగాకుండా ప్రపంచ ఆర్థిక సంక్షోభదశలో ఉత్పత్తిశక్తులే నాశనం చేయబడినాయి. టెక్నికల్ క్షీణతగూడా ఎగుడుదిగుడుగానే నడిచింది. అదేసమయంలో కొన్ని ఉత్పత్తిరంగాల్లో టెక్నికల్ అభివృద్ధిమార్పులు గూడా ముఖ్యమైనవి కొంతవరకు జరిగినాయి. చివరికి ఆర్థిక సంక్షోభకాలంలోగూడా (సర్వసామాన్యంగా టెక్నికల్ క్షీణత ఎక్కువగా ప్రస్ఫుటమైన సమయంలో) కొన్ని ఉత్పత్తి రంగాల్లో టెక్నికల్ అభివృద్ధి అతివేగంగా జరిగింది.

పారిశ్రామిక సంస్థలు శక్తికి తగ్గి ఉత్పత్తి చేస్తుంటే ఆ పరిశ్రమలలో ముందుకు వచ్చి కొత్త పెట్టుబడులను పెట్టుటకు ఉత్సాహం నశిస్తుంది. యుద్ధానంతరం ఇదేజరిగింది. ఈ కారణంవల్లగూడా టెక్నికల్ అభివృద్ధిలో క్షీణత బయలుదేరింది. యుద్ధానంతర పరిశ్రమల యొక్క వేగాధిక్యత విపరీతంగా వృద్ధి అగుటకు గూడా కారణం ఇదే. దీన్నే 'రేషనలైజేషన్' అంటున్నాం. ఉత్పత్తి వేగాధిక్యతను ఎన్నోరెట్లు వృద్ధిచేసి, అనగా కొద్దిపాటి నూతన పెట్టుబడులతో పరిశ్రమను సాగిస్తూ కార్మికులచే ఎక్కువ తీవ్రంగా ఎక్కువకాలం పనిచేయించుటవల్ల అతి హీనపుధరలకు సరుకులు ఉత్పత్తి అగునట్లు ప్రయత్నిస్తారు. ప్రధాన పరిశ్రమలలో పెట్టుబడి పెట్టుటకు తగినంత ప్రోత్సాహంలేనప్పుడు పెట్టుబడి కూడబెట్టబడి ఊహావ్యాపారం (స్పెక్యులేషన్) వైపుకు మరల్చబడుతుంది. ఉదాహరణానికి 1928—1929 మధ్య అనేక దేశాలనుంచి పెట్టుబడి ప్రవాహం యునైటెడ్‌స్టేట్స్‌లో న్యూయార్కు స్టాక్‌ఎక్స్‌ఛేంజి వైపుకు మరల్చబడిన సంగతి అందరికీ తెలిసిన విషయమే. అదేసమయంలో రెండవరకం పరిశ్రమలలోనూ ఉత్పత్తికి సంబంధించని రంగాల్లోనూ పెట్టుబడి పెట్టుట హెచ్చుతుంది. బ్రిటన్ ఉదాహరణ ఈవిషయాన్ని స్పష్టపరుస్తుంది ;—

## బ్రిటన్‌లో నూతన పెట్టుబడులు

(వేల పౌనులలో)

| | 10 సం॥రాలు 1904—13 | 10 సం॥రాలు 1924—33 | 5 సం॥రాలు 1924—28 | 5 సం॥రాలు 1929—33 |
|---|---|---|---|---|
| ప్రధాన పరిశ్రమలు(ఇనుము, ఉక్కు, లోహాలు బొగ్గుగనులు, మెకానికల్ ఇంజనీయరింగ్.) | 41761 | 27806 | 21405 | 6401 |

| | | | | |
|---|---|---|---|---|
| సారాయి, ద్రాక్షరస బట్టీలు | 6029 | 26495 | 14979 | 11516 |
| హోటళ్ళు, నాటకశాలలు మొదలైనవి | 7189 | 28616 | 20424 | 8192 |

పై లెక్కలన్నీ 'ఎకనామిస్ట్' పత్రిక నుంచి ఉదహరించబడినాయి. అసంపూర్ణమైన లెక్కలైనా ప్రధానమార్పులను సరిగానే విశదపరుస్తున్నాయి. ఈలెక్కలు ఏం తెలియజేస్తున్నాయి? యుద్ధానికి పూర్వం 1904–1913 మధ్య ప్రధాన పరిశ్రమలలో పెట్టబడిన కొత్త పెట్టుబడులు సారాబట్టీల పెట్టుబడికంటె 7 రెట్లు, నాటకశాలలు, హోటళ్ళు మొదలైన ఉత్పత్తికి సంబంధంలేని పరిశ్రమలలోని పెట్టుబడులకంటె 6 రెట్లు అధికంగా ఉన్నట్లు తెలుస్తుంది. కాని 1924–33 మధ్య, పరిస్థితి తల్లక్రిందులైంది. సారాబట్టీలు, హోటళ్ళు, నాటకశాలలు మొదలైన పరిశ్రమలలోని కొత్త పెట్టుబడులకంటె ప్రధాన పరిశ్రమలలోని కొత్త పెట్టుబడి తగ్గిపోయింది. ఆర్థిక సంక్షోభకాలంలో ఈ విషయం ఎక్కువగా బహిర్గతమయింది. ఈ లెక్కలనుబట్టి బ్రిటిష్ పెట్టుబడివిధానం ఎంత వేగంగా క్షీణిస్తుందో తెలుస్తుంది.

ఇదే వైఖరి యునైటెడ్‌స్టేట్స్‌లోగూడా కన్పిస్తుంది. భవన నిర్మాణ కాంట్రాక్టులను చూస్తే ఈ క్రింది లెక్కలు వెల్లడి అయినాయి:—

యునైటెడ్‌స్టేట్స్‌లో బిల్డింగ్ కాంట్రాక్టులవిలువ.

(10 లక్షల డాలర్లలో)

| | 1925–1929 | 1930–1934 |
|---|---|---|
| పారిశ్రామిక భవననిర్మాణం | 2228 | 660 |
| వ్యాపారభవనాలు, హోటళ్ళు మొదలైనవి | 4540 | 1300 |
| మతసంస్థలకు చెందిన భవనాలు, స్మారక చిహ్నాలు | 692 | 209 |

1925–1929 మధ్య (ఈ 6 సంవత్సరాల్లో పరిశ్రమాభివృద్ధి 'అత్యున్నత' దశకు వచ్చిందని పరిగణించబడింది) పారిశ్రామిక నిర్మాణం యుద్ధం తరువాత అత్యుచ్చదశకు వెళ్ళింది. కాని ఈ నిర్మాణంయొక్క విలువచూస్తే వ్యాపార పరిశ్రమలు, హోటళ్ళు మొదలైన వాటి నిర్మాణ విలువలో సగమేనని పై సంఖ్యలవల్ల తెలుస్తుంది. పోతే మతభవనాలు స్మారక చిహ్నాలయొక్క విలువ పారిశ్రామిక నిర్మాణ విలువలో దాదాపు 3 వ వంతుకు వచ్చింది! ఆర్థిక సంక్షోభదశలో (1929–1933) పారిశ్రామిక నిర్మాణంయొక్క విలువ ఇంకా పడిపోయింది.

గుత్త సంస్థలు సర్వసామాన్యంగా వృద్ధి అవుతూ స్వదేశ పరిశ్రమలు, వ్యాపారం క్షీణిస్తున్న పరిస్థితులలో పెట్టుబడుల ఎగుమతితోపాటు పరాన్నభుక్కు లక్షణంగూడా సహ

టంగానే వృద్ధిఅయింది। 1899 లోనే బ్రిటనుకు విదేశపెట్టుబడుల (10 కోట్ల పౌనులు) మీద వచ్చిన ఆదాయం విదేశవ్యాపారంమీద కంటె 8 కోట్ల పౌనులు లేక 5 రెట్లు ఎక్కువ వచ్చిందని ఉదహరిస్తూ లెనిన్ బ్రిటిష్ పెట్టుబడి విధానంయొక్క పరాన్నభుక్కు లక్షణాన్ని గురించి చెప్పాడు. 1929 లో విదేశ పెట్టుబడులనుంచి బ్రిటన్‌కు వచ్చిన ఆదాయం 25 కోట్ల పౌనులకు పెరిగింది. బ్యాంకర్ల కమిషన్లను, సూక్ష్మకాల పెట్టుబడుల మీద ఆదాయాన్ని మొదలైన వాటిని మినహాయిస్తే తేలిన ఆదాయం ఇది. అవిగూడా కలిపితే విదేశ పెట్టుబడుల నుంచి 1929 లో వచ్చిన మొత్తం ఆదాయం సుమారు 37½ కోట్ల పౌనులు ఉంటుంది. అనగా విదేశ వ్యాపారంమీద వచ్చిన ఆదాయంకంటె 30 కోట్ల పౌనులు లేక 7 రెట్లు ఎక్కువఅన్నమాట। సంక్షోభకాలంలో ఈ ఆదాయం కొంతవరకు పడిపోయింది. 1924—1929 మధ్య బ్రిటన్‌యొక్క మొత్తం జాతీయ ఆదాయం నూటికి 11 వంతులు పెరిగింది. కాని అదే కాలంలో విదేశ పెట్టుబడులనుంచి వచ్చే ఆదాయం నూటికి 55 వంతులు పెరిగింది। దీన్నిబట్టి దేశంలోని పరిశ్రమ వ్యాపారాలమీద వచ్చే ఆదాయంకంటె వలసదేశాల దోపిడి నుంచి వచ్చేఆదాయం ఎన్నోరెట్లు ఎక్కువని సులభంగా బోధపడగలదు. అనగా బ్రిటిష్ పెట్టుబడి విధానంయొక్క పరాన్నభుక్కు లక్షణం అపరిమితంగా పెరిగిపోయింది.

యుద్ధానంతరదశలో గుత్తదారీదేశంగా యునైటెడ్‌స్టేట్స్ బ్రిటన్‌నుమించిపోయింది. యుద్ధానంతరదశయొక్క ప్రధానలక్షణం యిది. యుద్ధానికిపూర్వం యునైటెడ్‌స్టేట్స్‌కు ఇతరదేశాలనుంచివచ్చే ఆదాయ కంటె ఇతరదేశాలకు ఇచ్చుకోవలసిన చెల్లుబడుల మొత్తమే అధికంగా ఉండేది. కాని యుద్ధంవల్ల పరిస్థితిలో తీవ్రమైన మార్పువచ్చింది. 1922 లో విదేశపెట్టుబడుల నుంచిగాని వడ్డీలక్రిందగాని యుద్ధఅప్పుల క్రిందవచ్చిన చెల్లుబడులుగాని మొత్తం విదేశాలనుంచి యునైటెడ్‌స్టేట్స్‌కువచ్చిన రాబడి 50 కోట్ల డాలర్లకుపైగా ఉండేది. 1929 లో ఈరాబడి 118 కోట్ల 60 లక్షలకు పెరిగింది. అనగా నూటికి 134 వంతులు హెచ్చిందన్నమాట। 1929 లో జాతీయ ఆదాయంచూస్తే నూటికి 41 వంతులు మాత్రమే పెరిగింది. సంక్షోభకాలంలో మాత్రం యునైటెడ్‌స్టేట్స్‌కు విదేశాలనుంచి వచ్చేరాబడి చాలావరకుపడిపోయింది. 1922—1932 మధ్య 11 సంవత్సరాల్లో విదేశపెట్టుబడులమీదగాని, యుద్ధఅప్పుల క్రిందగాని యునైటెడ్‌స్టేట్స్‌కుచేరిన మొత్తం 922 కోట్ల 30 లక్షల డాలర్లు.

గుత్తదారుల ఆదాయం జనరల్‌గా అభివృద్ధిఅయింది. విదేశపెట్టుబడులమీదవచ్చే ఆదాయం పరాన్నభుక్కులైన గుత్తదారుల ఆదాయంలో ఒకభాగం మాత్రమే. యుద్ధానంతరం నూతన పెట్టుబడులు. సెక్యూరిటీలు (స్వదేశంలోనే) ఎంత ఎక్కువయినదీ ఇదివరకే నిరూపించబడింది. ప్రభుత్వ లెక్కలప్రకారం యునైటెడ్‌స్టేట్స్‌లో షేరు

హోల్డర్ల డివిడెండ్లక్రింద, వడ్డీక్రింద చెల్లించబడిన మొత్తం 1913 కంటె 1930 లో 4½ రెట్లు పెరిగింది. (180 కోట్ల డాలర్లనుంచి 820 కోట్ల డాలర్లకు పెరిగింది). 1931 లో ఈ మొత్తం 810 కోట్లకు హెచ్చింది. అనగా యునైటెడ్‌స్టేట్స్‌లోని 3 కోట్ల రైతుల యొక్క అసలురాబడి (ఖర్చులు మినహాయించకుండా) కంటె నూటికి 40 వంతులు, మొత్తం వ్యవసాయిక పంటలమీదవచ్చే ఆదాయం (270 కోట్ల డాలర్లు) కంటె 3 రెట్లు అధికంగా ఈ గుత్తదారులకు డివిడెండ్లక్రింద, వడ్డీలక్రింద వస్తోందన్నమాట! 1930, 1931 సంవత్సరాలకు డివిడెండ్లక్రింద, వడ్డీక్రింద గుత్తదారులకువచ్చిన రాబడిమొత్తం 1600 కోట్ల డాలర్లు! ఈవిధంగా సమాజాన్ని పీక్కుతింటోంది గుత్తదారులముఠా. 1930, 1931 సంవత్సరాలలో గుత్తదారులకు ఎప్పుడూరానంత ఆదాయం వచ్చిందని గుర్తించాలి. గుత్తదారుల ఆదాయాన్ని, కూలిక్రింద, జీతాలక్రింద కార్మికులకు వచ్చే ఆదాయాన్ని పోలిస్తే ఈక్రింది లెక్కలు తయారైనాయి:

| | 1927 | 1928 | 1929 | 1930 | 1931 | 1932 |
|---|---|---|---|---|---|---|
| | | | (1923–1925 = 100) | | | |
| డివిడెండ్లక్రింద, వడ్డీలక్రింద | 145 | 154 | 180 | 214 | 211 | 182 |
| కూలిక్రింద, జీతాలుక్రింద | 102 | 102 | 109 | 89 | 68 | 46 |

పై లెక్కలనుబట్టి 1923 – 1930 మధ్య గుత్తదారుల ఆదాయం నిలకడగా పెరిగిందనితెలుస్తుంది. ముఖ్యంగా 1930 లో వీరిఆదాయం బాగా పెరిగిపోవుటకుకారణం– 1929 లో జోరుగా జరిగిన వ్యాపారంమీద అపరిమిత లాభాలు వచ్చుటయే. 1931 లో వీరి ఆదాయానికి 1930 లో వీరి ఆదాయానికి పెద్దతేడాలేదు. లాభాలు కొద్దిగా తగ్గినప్పటికి అదనంగా కూడ బెట్టబడిన మొత్తాలు ఉండుటవల్ల డివిడెండ్లు 1931 లోగూడా నిలకడగానే ఉన్నాయి. పోతే 1931 లో వడ్డీక్రింద వచ్చిన ఆదాయం కొద్దిగా పెరిగింది. 1932 లో డివిడెండ్లక్రింద వడ్డీక్రింద చెల్లించబడిన మొత్తం బాగాపడిపోయింది. కాని 1932 లోగూడా గుత్తదారుల ఆదాయం 1923–25 మధ్యకంటె నూటికి 80 వంతులు ఎక్కువగానేఉంది. 1932 లో కార్మికులస్థితియేమి? 1923-25 కంటె నూటికి 54 వంతులుకూలి పడిపోయింది!

కార్మికుల పరిస్థితి రోజురోజుకు విషమిస్తుంటే ప్రక్కనే గుత్తదారుల ఆదాయం విపరీతంగా పెరిగిపోతోంది!– పెట్టుబడివిధానంయొక్క పరాన్నభుక్కులక్షణంయొక్క వృద్ధికి ఇంతకంటె రుజువు, ఏంకావాలి?

యుద్ధఫలితంగానూ, నూతన యుద్ధ సన్నాహాల ఫలితంగానూ పరాన్నభుక్కుల ఆదాయంలో కలిగిన అభివృద్ధి:— యుద్ధానంతరం గుత్తదారుల ఆదాయం పెరుగుటకు యుద్ధ అప్పులు ఒక ముఖ్యకారణం. (ఈ అప్పులను స్వదేశంలోనేగాక విదేశాల్లోగూడా కొనిపించుట జరిగింది.) "ప్రతిచోట యుద్ధ ఖర్చును భరింపచేయాలి. చివరికి 'విజయం' పొందిన దేశాలుగూడా యుద్ధ అప్పులమీద వడ్డీలను చెల్లించుటద్వారా యుద్ధ ఖర్చును భరించ

వలసియున్నది. వడ్డీ అంటే ఏమిటి? పెట్టుబడిదారులు లాభాలను ఎలా పంచుకోవాలో నిర్ణయించుటకు చేయబడిన యుద్ధంలో లక్షలాదిగా కూలీరైతులు ఒకరి నొకరు చంపుకొనుటకు కోటీశ్వరులు దయతో అనుమతి ఇచ్చినందుకుగాను ప్రజాసామాన్యం కోటీశ్వరులకు చెల్లించవలసిన కోట్ల విలువగల కప్పమే 'వడ్డీ' అని పిలువబడుతోంది" అని లెనిన్ వ్రాశాడు. ఫ్రాన్సుయొక్క జాతీయ అప్పు(స్వదేశ, విదేశ, అప్పులు కలిసి) యుద్ధ పూర్వంకంటె 1929 లో 3 రెట్లు పెరిగింది. ('ఫ్రాంకు' నాణెంయొక్క విలువ పతనాన్ని లెక్కలోకి తీసుకొనకపోతే, 14 రెట్లు) బ్రిటన్‌యొక్క జాతీయ అప్పు 9 రెట్లు, యునైటెడ్‌స్టేట్స్ అప్పు 16 లేక 17 రెట్లు పెరిగినాయి. ప్రపంచ ఆర్థిక సంక్షోభదశలో యునైటెడ్‌స్టేట్స్ ప్రభుత్వం బ్యాంకులకు, పరిశ్రమలకు, రైతులకు సహాయం చేయవలసి వచ్చినందువల్ల ఈ అప్పు ఇంకా పెరిగింది. 1937 జనవరి నాటికి యునైటెడ్ స్టేట్స్‌యొక్క మొత్తం అప్పు 3450 కోట్ల డాలర్లని తేలింది. (1929 జూన్‌లో 1690 కోట్లు మాత్రమే ఉండేది). సంక్షోభకాలంలో పెరిగిన జాతీయ అప్పు గూడా గుత్తదారుల ఆదాయం ఎక్కువగుటకు కారణమయింది. ప్రభుత్వ అప్పులమీద ఇవ్వవలసిన వడ్డీ క్రింద చెల్లించబడిన మొత్తాలు, మొత్తం బడ్జెట్‌లో నూటికిఎన్నివంతులో ఈ క్రింది పట్టిక తెలియజేస్తుంది.

| | | |
|---|---|---|
| బ్రిటన్ | 1914—12.5 | 1929—44.4 |
| ఫ్రాన్సు | 1913—19. | 1928—36.5 |
| యునైటెడ్‌స్టేట్స్ | 1912—3.3 | 1929—35.1 |

అనగా సామ్రాజ్యవాద దేశాలయొక్క మొత్తం బడ్జెట్ ఖర్చులలో $\frac{1}{3}$ నుంచి $\frac{1}{3}$ వరకూ ప్రభుత్వ బాండ్లను కొన్న గుత్తదారుల చెల్లుబడుల క్రింద పోతోంది! అనగా యుద్ధకాలానికిపూర్వం యునైటెడ్‌స్టేట్స్ బడ్జెట్ వ్యయంలో గుత్త దారుల భాగంకంటె యుద్ధానంతరం వారిభాగం 10 రెట్లు పెరిగింది! ప్రపంచంలో కంతకీ ఎక్కువ భాగ్యవంతమైన యునైటెడ్‌స్టేట్స్ జాతీయ బడ్జెట్‌లోనే అక్కడి గుత్తదారులు ఇంత పెద్ద భాగాన్ని స్వాహాచేస్తున్నారని ఆ దేశ ప్రభుత్వ లెక్కలవల్లనే రుజువయిందంటే ఆధునిక గుత్త ప్రభుత్వాల పరాన్నభుక్కులక్షణం ఎంత వృద్ధి అయిందో ఊహించుకొనవచ్చును. ఆర్థిక సంక్షోభం బయలుదేరే సమయంలో జాతీయ అప్పు క్రింద బ్రిటిష్ ట్రెజరీ సంవత్సరానికి 36 కోట్ల 80 లక్షల పౌనులు చెల్లించింది. 1932లో ఆదాయంచాలక చాలాస్కూళ్ళు మూసివేయబడిన యునైటెడ్‌స్టేట్స్‌లో జాతీయ అప్పు క్రింద ప్రభుత్వం 1 లక్ష కోట్ల డాలర్లకుపైగా చెల్లించింది. ఇదిగూడా కేంద్ర బడ్జెట్‌లో నిరుద్యోగ నివారణకై కాస్త గూడా స్థానంలేని పరిస్థితులలో!

ఈనాడు జాతీయ అప్పుక్రింద చేయబడే చెల్లుబడులలో అధికభాగం యుద్ధ ఖర్చుల తాలూకేనని గుర్తించాలి. అయితే గత యుద్ధఖర్చులకు ప్రస్తుత యుద్ధాలఖర్చు

లను, యుద్ధసన్నాహాల ఖర్చులనుగూడా కలపాల్సిఉంది. యుద్ధపూర్వంకంటె బ్రిటన్ యొక్క యుద్ధపరికరాల ఖర్చు 4 రెట్లు, యునైటెడ్ స్టేట్స్ ఖర్చు 3 రెట్లు, జపాన్ ఖర్చు 6 రెట్లు పెరిగింది. జర్మనీ విషయంలో ఎన్నిరెట్లు పెరిగిందో ఆఫాసిస్టు ప్రభుత్వం బడ్జెట్టును ప్రకటించుటగూడా మానివేసినందువల్ల, తెలియుటలేదు. ఫాసిస్టుదేశాల్లో బడ్జెట్టులో ఎక్కువభాగం యుద్ధసన్నాహాల క్రిందనే ఖర్చుఅవుతోంది. కాని వాస్తవంగా ఆయుధసామగ్రులమీద అయేఖర్చు బడ్జెట్టులో నిర్ణయించబడిన దానికంటె చాలా ఎక్కువగానే ఉంటుంది. గత యుద్ధానికి అయినఖర్చు, రానున్న యుద్ధంయొక్క ఖర్చు కలిసి మొత్తం పెట్టుబడిదేశాల బడ్జెట్లన్నీ కలిపితే దానిలో నూటికి 60 నుంచి 80 వంతుల వరకూ ఉంటుంది. మిగిలినదానిలో ఎక్కువభాగం అధికార పోలీసు యంత్రాలక్రింద వినియోగించబడుతుంది. గుత్తదారులయొక్క ఆయుధసామగ్రుల నిర్మాతలయొక్క జేబుల్లోకి విపరీతమైన అధికమొత్తాల ప్రవాహాన్ని ప్రవహింపచేసే పరాన్నభుక్కు యంత్రంగా ప్రభుత్వయంత్రాలు ఉపయోగపడు తున్నవన్నమాట! ఈవిధంగా ఆధునిక పెట్టుబడి ప్రభుత్వాల బడ్జెట్లన్నీ పరాన్నభుక్కు స్వభావం కల్గియుండుటవల్ల జాతీయ ఆదాయానికి, బడ్జెట్ ఖర్చుకుగల సంబంధాన్ని (నిష్పత్తిని) పరిశీలించుట అవసరమవుతోంది. ఈ క్రింది పట్టికవల్ల ఈ నిష్పత్తి సంబంధం తెలుస్తుంది.

| | 1913 | 1929 | 1932 | 1935 |
|---|---|---|---|---|
| యునైటెడ్ స్టేట్స్ | 2.1 | 4.7 | 11.7 | 14 |
| బ్రిటన్ | 8.8 | 21.6 | 22.4 | 18.5 |
| ఫ్రాన్సు | 14.1 | 21.1 | 25.5 | 32.3 |
| జర్మనీ | 7 | 10.6 | (1931) 13 | — |

పై పట్టికలో జాతీయబడ్జెట్లు మాత్రమే లెక్కలోకి తీసుకొనబడినాయి. అందువల్ల పైపట్టికలోని సంఖ్యలకు స్థానికప్రభుత్వ (రాష్ట్ర) బడ్జెట్లనుగూడాకలిపితే మొత్తం జాతీయ ఆదాయంలో బడ్జెట్ ఖర్చుయొక్క భాగం ఇంకా ఎన్నోరెట్లు ఎక్కువగుతుంది. ఉదాహరణకు 1929 సంవత్సరానికి జర్మనీలో నూటికి 10.6 నుంచి 28.5 వంతులవరకు బడ్జెట్ ఖర్చు పెరుగుతుంది. అదేవిధంగా యునైటెడ్ స్టేట్స్ బడ్జెట్ ఖర్చు నూటికి 4.7 నుంచి 11.4 వంతులవరకూ పెరుగుతుంది. ఈ లెక్కలలో 30000 కంటె తక్కువ జనాభాగల పట్టణాలు మినహాయించబడినాయి. ఇవిగూడా లెక్కలోకివస్తే బడ్జెట్ ఖర్చు ఇంకా పెరిగి పన్నులభారం (ముఖ్యంగా వ్యవసాయంమీద) మరింత హెచ్చుతుంది.

పరాన్నభుక్కు తత్వంయొక్కవృద్ధి, వ్యవసాయంయొక్క క్షీణత :— లెనిన్ ఉద్దేశ్యంలో పరాన్నభుక్కుతత్వం హెచ్చినకొలదీ వ్యవసాయవిధానం ఎక్కువగాక్షీణించి పరిశ్రమలకంటె ఎంతో వెనుకబడుతుంది. ప్రపంచ పెట్టుబడిదారీ వ్యవసాయరంగంలో

కొంతవరకు టెక్నికల్ అభివృద్ధి వచ్చినప్పటికి, పరిశ్రమలకంటె వ్యవసాయవిధానం ఎంతో వెనుకబడుట వ్యవసాయంలో తీవ్రమగుతున్న క్షీణతలనుచూస్తే యుద్ధానంతరదశ అంతా వ్యవసాయ సంక్షోభదశగా పరిగణించవలసి వచ్చింది. పన్నులభారం హెచ్చినందు వల్ల, యుద్ధఅప్పులక్రింద జాతీయ అప్పులక్రింద, వడ్డీలక్రింద పెట్టుబడి కోటీశ్వరులు వసూలు చేసుకుంటున్న కప్పం ఎక్కువయినందువల్ల వ్యవసాయ విధానం ఎంత దుస్థితిలో పడిపోయిందో ఈక్రింది పట్టిక తెలియజేస్తుంది :—

## యునైటెడ్ స్టేట్సులో వ్యవసాయ ఆదాయంయొక్క విభజన

(మొత్తం డబ్బు ఆదాయంలో నూటికి)

| | 1923 | 1929 | 1931 | 1932 |
|---|---|---|---|---|
| ఆస్తిపన్ను | 8.5 | 7 | 11.8 | 14.7 |
| అప్పులమీద వడ్డీ | 10.3 | 7.5 | 12.7 | 17.1 |
| మొత్తం పన్నులు వడ్డీ | 18.8 | 14.5 | 24.5 | 31.8 |
| మెషినరీ | 4.9 | 6 | 4 | 3.4 |
| ఎరువులు | 2.7 | 3 | 3.6 | 3.8 |
| అభివృద్ధి మార్పులు | 6.3 | 4.7 | 37 | 2.9 |

యీలెక్కలనుబట్టి ఆస్తిపన్ను (పరోక్షపన్నులనుమినహాయిస్తే) వడ్డీలక్రిందచెల్లించే మొత్తం, మెషినరీ ఖర్చుకంటె ఎన్నోరెట్లు ఎక్కువని (1931 లో 6 రెట్లు 1932 లో 9 రెట్లు) తెలుస్తుంది. కొద్దిమార్పులతో ఈ యునైటెడ్ స్టేట్స్ సంఖ్యలు ఇతర దేశాలకు గూడా వర్తిస్తాయి. వ్యవసాయవిధానంలో పెట్టుబడికోటీశ్వరులు అవలంబించే దోపిడి పద్ధతులు, పూర్వ భూస్వామ్యసంబంధములతో కలిసిపోయిన జపాన్‌లో, పన్నులభారం అప్పులమీద చెల్లించవలసిన వడ్డీ ఇంకా ఎక్కువగా ఉంటాయి. ఇక వలసదేశాల్లో వ్యవసాయ పరిస్థితిని గురించి వేరుగా చెప్పనక్కరలేదు. యుద్ధానంతరం వ్యవసాయ సంక్షోభం తీవ్రమగుటకు ఒక ముఖ్యకారణం—వ్యవసాయరంగంలో పెట్టుబడి కోటీశ్వరులయొక్క అపరిమితదోపిడీయే అని చెప్పవచ్చును.

జనసంఖ్య స్వభావంమీద పరాన్నభుక్కు లక్షణ అభివృద్ధియొక్క ప్రభావం :-నిరుద్యోగుల సంఖ్య పెరిగిపోయినకొలదీ యుద్ధానంతర జనసంఖ్యలో ఉత్పత్తిచేసేభాగం క్రిమేణా క్షీణిస్తోందని లెనిన్ చెప్పాడు. అదేకాలంలో పంపకరంగములో పనిచేసేవారి సంఖ్య పెరిగినందువల్లఉత్పత్తిరంగంలో పనిచేసే కార్మికులసంఖ్య క్షీణించింది. బ్రిటన్‌కు సంబంధించిన ఈ లెక్కలు చూడండి :—1923—1929 మధ్య పరిశ్రమలలో నిమగ్నులై ఇన్‌స్యూర్ చేయబడినవారి సంఖ్య స్థిరంగా ఉండిపోయింది. (1923—7208000; 1929—7234000;) వ్యాపారరంగంలోనూ బ్యాంకుస్, 'ఇన్‌స్యూరెన్సు, ధనసంస్థలు మొదలైన

సంస్థలలో పనిచేసేవారిసంఖ్య మాత్రం నూటికి 26.6 వంతులు పెరిగింది. దీనివల్ల ఉత్పత్తిరంగంలో పనిచేసేవారి సంఖ్య కొంతవరకు తగ్గిందని ఉత్పత్తికి సంబంధంలేని రంగాలలో పనిచేసేవారి సంఖ్య కొంతవరకూ హెచ్చిందనీ స్పష్టమవుతోంది. సంక్షోభకాలంలో ఈ ప్రవృత్తులే తీవ్రమయినాయి. పరిశ్రమలలో పనిచేసేవారి సంఖ్య 1929 కంటె 1932 లో 10 లక్షలకుపైగా తగ్గారు. వ్యాపారరంగం, బ్యాంకులు మొదలైన వాటిలో పనిచేసేవారు అదే కాలంలో 2 లక్షల మంది హెచ్చారు. మొత్తం జన సంఖ్యలో పారిశ్రామిక కార్మికులయొక్క తగ్గుదల పరాన్నభుక్కులక్షణంయొక్క అభివృద్ధిని సూచిస్తుందని లెనిన్ చెప్పాడు. ఈ తగ్గుదల వివిధ దేశాల్లో వివిధ దశలలో వేరువేరుగా ఉంటుంది. 1850–1900 మధ్యనే బ్రిటన్‌లో ఈ తగ్గుదల ప్రస్ఫుటమయింది. కాని జర్మనీ, యునైటెడ్ స్టేట్స్ దేశాల్లో యుద్ధానంతరమే ఈ తగ్గుదల కనపడింది. కాని యుద్ధానంతర దశలో ఈ తగ్గుదలకు ఒక నూతన స్వభావం ఏర్పడింది. అనగా తారతమ్యంగా మొత్తం జన సంఖ్యతో పోల్చిన యెడల పారిశ్రామికుల సంఖ్య తగ్గుటయేగాక, స్వతంత్రంగా చూసినా (నిరుద్యోగులను మినహాయించి పనిచేసే కార్మికులనుమాత్రం లెక్కలోకి తీసుకున్నప్పటికి) ఈ తగ్గుదల ప్రస్ఫుటమయింది.

జర్మనీ విషయంచూస్తే 1895 లో పారిశ్రామిక కార్మికుల సంఖ్య మొత్తం జన సంఖ్యలో నూటికి 10.6 వంతులు ఉండేవారు. 1925 లో ఈ సంఖ్య 15.1 కు పెరిగింది. కాని 1925–1928 మధ్య పారిశ్రామిక కార్మికుల సంఖ్య మొత్తం జన సంఖ్యలో నూటికి 15.1 నుంచి 13.5 కు పడిపోయింది. ఆర్థిక సంక్షోభకాలంలో ఈ సంఖ్య మరింత పడిపోయింది. (1928 లో 13.5 నుంచి 1932 నాటికి 8 వంతులవరకూ). దీనికి కారణం సంక్షోభకాలంలో తీవ్రమయిన నిరుద్యోగ సమస్యయే.

పంపక రంగంలోని సంఖ్య పెరుగుతున్నప్పుడు పరిశ్రమలలో పని చేసేవారి సంఖ్య ఎలా పడిపోయిందో ఈ క్రింది పట్టిక తెలియజేస్తుంది :—

జర్మనీలో పనిలోఉన్న వారి సంఖ్య.

| | పరిశ్రమలలోఉన్నవారు | | వ్యాపారంగంలో ఉన్నవారు | |
|---|---|---|---|---|
| | వేలు | నూటికి పెరుగుదల లేక తగ్గుదల | వేలలో | నూటికి పెరుగుదల లేక తగ్గుదల |
| 1907 | 9839 | — | 2776 | — |
| 1925 | 12693 | +29 | 4032 | +45.2 |
| 1933 | 8999 | —29.1 | 4205 | +4.3 |

ఆర్థిక సంక్షోభకాలంలో ఈ లక్షణాలన్నీ మరింత తీవ్రమయినాయి. జర్మనీ ఫాక్టరీ ఇన్స్పెక్టర్ల తనిఖీక్రింద పనిచేసే సంస్థలలో (అనగా 5 గురు లేక 5 గురికిపైగా పనిచేసే

సంస్థలలో) 1928–32 మధ్య పరిశ్రమలలో పనిచేసేవారిసంఖ్య నూటికి 40.5 వంతులు క్షీణిస్తే అదేకాలంలో వ్యాపారరంగంలో పనిచేసే వారిసంఖ్య నూటికి 12.4 వంతులు హెచ్చింది. యునైటెడ్ స్టేట్స్‌లో గూడా ఈవైఖరే కన్పిస్తుంది. పరిశ్రమలలో పనిచేసే వారిసంఖ్య మొత్తం జనసంఖ్యలో 1000 కి

1889 లో 63
1914 లో 70
1919 లో 73
1931 లో 52
1932 లో 48 ఉన్నారు.

ఇక సంక్షోభకాలంలో యునైటెడ్ స్టేట్స్‌లో పారిశ్రామిక జనసంఖ్య మరీ పడిపోయింది. 1929 లో 1000 కి 73 గురుఉంటే 1933 లో 1000 కి 48 మాత్రమే ఉన్నారు. ఈవిధంగా ఉత్పత్తిరంగంలో పనివారిసంఖ్య క్షీణిస్తుంటే పంపకరంగాల్లోని వారిసంఖ్య హెచ్చింది. ఈవిధంగా గనులలోనూ పరిశ్రమలలోనూ పనిచేసేవారి సంఖ్యను స్వయం పోషకుల సంఖ్యతో పోల్చిచూస్తే 1920 లో నూటికి 30.9 వంతులు, 1930 లో నూటికి 30.9 వంతులు తగ్గారని తెలుస్తోంది. అదేకాలంలో వాణిజ్యం, సివిల్ ఉద్యోగాలు, వాణిజ్యఆఫీసులు ఇంటిపనులు మొదలైన వృత్తులలో నిమగ్నులైన వారిసంఖ్య నూటికి 32.8 నుంచి 39.3 కు పెరిగింది.

ఇంతవరకూ ఆధునిక పెట్టుబడివిధానంయొక్క పరాన్నభుక్కు లక్షణం, క్షీణతల యొక్క కొన్నిరూపాలను మాత్రమే పరిశీలించాం. కాని ఇంతవరకూ ఇచ్చిన ఆధారాలు, లెక్కలు ఈ లక్షణాలు తీవ్రమవుతున్నవని నిరూపించుటకు సరిపోతాయి. సోవియట్ యూనియన్‌లో సోషలిస్టు నిర్మాణం అఖండవిజయాలను పొందుతున్న సమయంలో, పెట్టుబడిదారీ విధానంయొక్క క్షీణత, పరాన్నభుక్కు లక్షణాలు వృద్ధిఅవుతున్నవని మరిచిపోగూడదు. ఈవిధంగా పెట్టుబడి, సోషలిస్టు విధానాలు పరిణామం చెందుతున్నప్పుడు రెంటికీమధ్య పెరుగుతున్న వైరుధ్యం రోజురోజుకూ ప్రాధాన్యతవహించి ఆశను కల్పిస్తోంది.

